# మల్లాది రామకృష్ణశాస్త్రి
# నవలలు-నాటికలు

## నవలలు

* కృష్ణాతీరం
* తేజోమూర్తులు
* క్షేత్రయ్య

(అసంపూర్తి నవల)

## నాటికలు

* గోపిదేవి * కేళీగోపాలమ్
* బాల * అఇఉణ్
* సేఫ్టీరేజర్

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

MALLADI RAMA KRISHNA SASTRY NOVELS - PLARLETS

ప్రచురణ నెం. : 2301

ప్రతులు : 1,000

ప్రథమ ముద్రణ : జనవరి, 2002



ముఖచిత్రం : రాజా

**వెల: రూ.120-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాదు - 500 001
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం,
కాకినాడ.



ముద్రణ: **కళాంజలీ గ్రాఫిక్స్,** హైదరాబాదు-29. **ఫోన్:** 3224831

# అంకితం

అమెరికాలో అస్తమించి -

విజయవాడ కృష్ణాతీరం

వినీల తరంగాలలో విలీనమైన -



డాక్టర్ బులుసు సర్వలక్ష్మి

దివ్య స్మృతికి చిహ్నంగా

(27.7.1927 ❁ 8.5.2001)

# ప్రస్తావన

తెలుగువారు సగౌరవంగా, సగర్వంగా చెప్పుకునే రచయిత మల్లాది రామ కృష్ణశాస్త్రిగారు. అబ్బూరి వారికి అత్యంత ఆత్మీయులైన రామకృష్ణశాస్త్రిగారి గురించీ, వారి రచనల గురించీ ప్రస్తావిస్తూ ఈ సంపుటానికి ముందుమాట రాసే సదవకాశం కలగడం నా అదృష్టం. వరద రాజేశ్వరరావుగారి ద్వారానే రామకృష్ణ శాస్త్రిగారి పరిచయ భాగ్యం కలిగింది నాకు.

'వరద' ని చిన్నతనంలో బందరులో రామకృష్ణ శాస్త్రిగారు ఎత్తుకు ఆడించేవారుట. రామకృష్ణ శాస్త్రిగారి మామగారు పురాణం సూరి శాస్త్రిగారు స్థాపించిన విద్యానిలయంలో ఆనాటి కవి పండితులు చాలామంది కలుసుకుని సాహితీ చర్చలు జరుపుతూండేవారు. ఆ వాతావరణంలో రామకృష్ణశాస్త్రిగారికి అబ్బూరి రామకృష్ణరావుగారితో అత్యంత సాన్నిహిత్యం ఏర్పడింది. అబ్బూరి పిల్లలు ముగ్గురికీ ఒక్కసారి జబ్బుచేసినప్పుడు రాత్రిళ్ళు అబ్బూరితోపాటు మల్లాది కూడా మేల్కొని ఉండేవారు. ఆ సమయంలోనే అబ్బూరి చెబుతూంటే మల్లాది రాసిపెట్టిన నవల 'మంగళసూత్రము' అనే అపరాధ పరిశోధక నవల.

బందరులో ఉన్నప్పుడే శాస్త్రిగారు 'నా కవి మిత్రులు' అనే శీర్షికకింద కృష్ణాపత్రికలో రాసిన వ్యాసాలలో ఒకటి రామకృష్ణరావుగారి గురించి. (అది, తరవాత 1988లో 'అబ్బూరి సంస్మరణ' గ్రంథంలో చేర్చబడింది). రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో శాస్త్రిగారు బెజవాడలోనూ గుంటూరులోనూ ఉంటూ సాహిత్య వ్యాసంగాన్ని కొనసాగిస్తున్న రోజుల్లోనే 'వరద'కి శాస్త్రిగారితో ప్రగాఢ అనుబంధం, శాస్త్రిగారంటే ఆరాధనా భావం ఏర్పడింది. శాస్త్రిగారితో కలిసి తిరగడం, ప్రతి సాయంత్రం మరికొందరితోపాటు ఆయనతో వాహ్యాళికి పోతూండటం వరద రాజేశ్వరరావుగారికి ఒక 'ఎద్యుకేషన్' అయింది. ఆ తరవాత ఆయన ఒక, ఆంగ్ల నాటకాన్ని అనుసరించి రాసిన 'ప్రతిమాసుందరి' అనే నాటకాన్ని 1942లో కొన్ని అసాధారణ పరిస్థితుల్లో రాత్రికి రాత్రి శాస్త్రిగారు ఒక మిత్రునిద్వారా అచ్చువేయించి పెట్టడం, ఆ నాటకానికి స్వయంగా ముందుమాట రాయడం, శాస్త్రిగారిపట్ల వరద రాజేశ్వరరావుగారి ఆరాధనకి మరికొంత కారణం. శాస్త్రిగారు వేశ్యల గురించి రాసిన కథలూ, శాస్త్రిగారి చతుర సంభాషణలూ వరద రాజేశ్వరరావుగారి ఆలోచనలపైనా, కవితలపైనా, కొంత ప్రభావం కలిగించకపోలేదు. ముఖ్యంగా 'చెరకాలం' కావ్యంలో "ఆటవెలది"కి అని వరద రాజేశ్వరరావుగారు రాసిన పద్యాలు చదివితే అలా అనిపిస్తుంది నాకు.

మా వివాహం అయిన రెండేళ్ళకి ఆవడిలో జరిగిన కాంగ్రెసు మహాసభ సందర్భంగా మద్రాసు వెడుతూ నన్నుకూడా తీసుకువెళ్ళారు వరద రాజేశ్వరరావుగారు. అప్పుడే ఆయన సాహితీ మిత్రులకీ, గురువులకీ అందరికీ పరిచయం చేశారు నన్ను- శ్రీ శ్రీ, ఆరుద్ర, మల్లాది రామకృష్ణశాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, గోరాశాస్త్రి, చంద్దూర్ దంపతులు, రామలక్ష్మి ప్రభృతులకు. పెద్దలందరికీ గౌరవ పూర్వకంగా నమస్కరించడం తప్ప వారితో మాట్లాడగల ధైర్యం లేదు నాకు. ఇంకా అప్పుడప్పుడే

రచనా రంగంలో అడుగుపెట్టిన దాన్ని, మల్లాది వారి వద్దకు, నన్ను తీసుకువెళ్ళిన వైనాన్ని ఎందుకో ఆయన 'కవన కుతూహలం'లో ప్రస్తావించలేదు. శాస్త్రిగారిని నేను మళ్ళీ కలుసుకోలేదు. ఆ తరవాత నేను ఆయన కథలూ నవలలూ చదవడం, ఆయన సంభాషణలతోనూ పాటలతోనూ వచ్చిన సినిమాలు చూడటం జరిగింది.

ఒక విధమైన హుందాతనం, చిలిపితనం, పాండిత్యం, లాలిత్యం కలగలిసిన వ్యక్తిత్వం మల్లాది రామకృష్ణశాస్త్రిగారిది. ఒకవైపు ఆధునిక శ్రీనాథుడులా, మరోవైపు ఆత్మీయమైన తాతయ్యలా కనిపిస్తారు. కథనంలో వర్ణనలూ, ముచ్చట్లూ విరివిగా ఉండటం ఆయన ప్రత్యేకత. ఆ ముచ్చట్లతో కూడిన కథనానికి మూలం ఆయన సంభాషణా చతురత. ఆయన రచనల్ని తాంబూలం నములుతూ రసాస్వాదన చేసినట్లు చెయ్యాలి. ఆయన నవలలు గొలుసులా సాగుతాయి. తాపీగా ఒక పాత్ర చిత్రణలోంచి మరో పాత్ర చిత్రణకి, ఒక పాత్ర కథలోంచి మరో పాత్ర కథకి– చంద్రహారంలో లాగ బిళ్ళలోంచి బిళ్ళ అతుకుతూ అలంకారయుతంగా సాగుతుంది కథనం. శాస్త్రిగారి దస్తూరి ముత్యాల కోవ అయితే, ఆయన శైలి ముత్యాల ముగ్గులా ఉంటుంది.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారి సమగ్ర సాహిత్యంలో మూడవ సంపుటం అయిన ఈ సంపుటంలో రెండు సంపూర్ణ నవలలూ, ఒక అసంపూర్ణ నవలా, అయిదు నాటికలూ ఉన్నాయి. ఇందులో చేర్చిన నవలల్లో అత్యంత సుప్రసిద్ధమైనది 'కృష్ణాతీరం'. దీన్ని ఇందులో చేర్చకముందు దీనికి సంబంధించిన ఒక అపూర్వ సంఘటన– ఆనంద విషాదాలతో కూడుకున్నది సంభవించడం విశేషం. శాస్త్రిగారి సుపుత్రిక అమెరికాలో చాలా కాలంగా వైద్య రంగంలో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న డా.శ్రీమతి బులుసు సర్వలక్ష్మిగారు 'కృష్ణాతీరం' నవలని కళాత్మకంగా, కన్నుల పండుగగా 'బాపు'గారి ప్రత్యేక ముఖ చిత్రంతో అసాధారణ శైలిలో ప్రచురించారు ఈ సంవత్సరారంభంలోనే. కానీ ప్రచురించిన పుస్తకాన్ని అందరికీ అందించే లోపునే హఠాత్తుగా అమెరికాలో కాలం చేశారు. 'కృష్ణాతీరం' పుస్తకాన్ని చూసిన వారెవరైనా ఆమె అభిరుచినీ, తండ్రిపట్ల ఆమెకున్న ఆరాధనా భావాన్నీ అభినందించకుండా ఉండలేరు.

'కృష్ణాతీరం' నవల ఈ సంపుటంలో తక్కిన కొన్ని రచనలతోపాటు చేరినా, అన్నిటికన్నా విశిష్టంగా కనిపిస్తుంది– కథావస్తువు దృష్ట్యా, కథనం దృష్ట్యా. ఈ నవలలోని ముఖ్యపాత్ర అన్నప్పలో మల్లాది రామకృష్ణశాస్త్రిగారి వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. ఆయన సహృదయత, సౌమ్యత, నిరాడంబరత, సమన్వయశీలత, హాస్యప్రియత్వం, వ్యంగ్యం, పాండిత్యం, భోజన ప్రియత్వం, సంభాషణా చాతుర్యం, అన్యోన్య దాంపత్యం పట్ల ఆరాధన, స్త్రీల స్వాభిమానంపట్ల గౌరవం, కులమత వివక్షా రాహిత్యం, అభ్యుదయ ధోరణి, ఆచరణశీలత మొదలైన లక్షణాలన్నీ కనిపిస్తాయి అన్నప్పలో. అందరికీ అత్యంత ప్రీతిపాత్రుడైన వ్యక్తి. మంచివాడుగా మెలగడం, చుట్టూఉన్న సంసారాల్లో ఏర్పడే కలతల్ని సామరస్యంతో పరిష్కరించడం ఎంత సునాయాసంగా చేయవచ్చునో అన్నప్పద్వారా చూపిస్తారు రచయిత. సమ వయస్కులకీ, యువతరం వారికీ, స్త్రీలకీ. పురుషులకీ అందరికీ మార్గదర్శకుడవుతాడు. ప్రతి ఒక్కరిలోని మంచినీ తాను గ్రహించి, చెడుని ఎవరికి వారు నివారించుకునేలా స్నేహపూర్వకంగా అవగాహన కలిగిస్తాడు. 'కృష్ణాతీరం' ఒక వచన కావ్యం అంటే అతిశయోక్తికాదు.

'కృష్ణాతీరం' నవల కేవలం శైలినీ శిల్పాన్నీ ప్రదర్శించడానికి మాత్రమే చేసిన రచనకాదు. దీనికి ఒక విశిష్ట సామాజిక ప్రయోజనం స్పష్టంగా కనిపిస్తుంది- అది మానవ సంబంధాలను మెరుగుపరచుకోవడం. పెళ్ళి సంబంధాలు కుదుర్చుకోవడంలో మూఢ విశ్వాసాలను తొలగించుకోవడం, భార్యాభర్తలూ, తల్లిదండ్రులూ పిల్లలూ తమ తమ అహంకారాలూ దురభిప్రాయాలూ వదులుకుని తమ అనుబంధాలను అన్యోన్యంగా మలచుకోవడం, కుల మత వివక్ష పాటించకుండా మానవ సంబంధాలను ప్రేమపూర్వకంగా పెంపొందించుకోవడం ఎంత అవసరమో చూపిస్తారు ఈ నవలలో. అనేక ఉపకథలతో కూడిన ఈ నవలలో అన్నప్పచేత ' సీతమ్మ' కథ పురాణ కాలక్షేపంగానైనా, హృదయ రంజకంగా చెప్పిస్తారు రచయిత. 'సీతమ్మ' అంటే శాస్త్రిగారికి తగని భక్తి.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గోదావరీ తీరపు వ్యావహారిక భాషలోని నుడికారాలనూ, ఉచ్చారణా వైచిత్రినీ ప్రదర్శిస్తే, మల్లాది రామకృష్ణశాస్త్రిగారు తమ రచనల్లో కృష్ణాతీరపు వ్యావహారిక భాషలోని వైవిధ్యాన్నీ, విలక్షణతనీ, కవితాత్మకత జోడించి ప్రదర్శించారు. అందుకు 'కృష్ణాతీరం' నవల ఒక ప్రతీక.

ఈ సంపుటంలోని రెండవ నవల 'తేజోమూర్తులు'. శాస్త్రిగారికి సీతమ్మ అంటే భక్తేకాదు, జాలికూడా- ఆవిడపడిన కష్టాలకి. 'తేజోమూర్తులు' నవలలో కథానాయకుడి తల్లిపేరు సీతమ్మ. ఒక పురుషుడి వలలో పడి మోసపోయిన స్త్రీ ఆమె. "ఛీఁ-చెడబుట్టింది! పెట్టిన పేరు చెడగొట్టింది! అన్నారుట అందరూ! వెర్రివాళ్ళు కాకపోతే, - ఆ పేరెట్టినందుకు- సీతమ్మవారి కష్టాలన్నీ పడ్డది" అనుకుంటాడు ఆమె కొడుకు. అతను బాగా భాగ్యవంతుడయాక, స్వగ్రామం వెళ్ళి, తండ్రిని- తన తల్లిని మోసం చేసిన వాడిని- ఎలా ఉన్నాడో చూడాలని బయలుదేరుతాడు. 'తవిశిపూడి' గ్రామంలో అతనికి ఆప్తులతో పరిచయాలవడం, కొన్ని అపోహలూ భ్రమలూ తొలగిపోవడం ఈ నవలలోని ఇతివృత్తం.

కథని సాదాసీదాగా నడిపించడం మల్లాది వారి పద్ధతికాదు. పురాణ కథనం లాగ చిలవలు పలవలతో, పిట్టకథలతో, ఉపకథలతో, పరిచయం చేసిన ప్రతి పాత్ర జీవితకథనీ ఆవిష్కరించడం జరుగుతుంది. కదంబంలో దారంలాగ అసలు కథ పైకి కనిపించనట్లుగా ఉంటుంది. హారానికి రెండు కొసలూ ముడివేసి ఒక అకృతినివ్వడానికి ప్రయత్నించరు. కట్టవలసినంత మేరకు మాలకట్టి వదిలేస్తారు! "కథలో ఆడా, మగా, పశుపక్ష్యాదులు సైతం మన చెప్పు చేతల్లో ఉండకపోవడమే కాకుండా, మనల్ని ఎప్పటికి వదలిపెడతారో మనకే తెలియదు. వారి వెంట మనమూ అలాపడి పోవలసిందే.... మన ఊహాపోహలతో పగ్గాలేసి వాళ్ళను పట్టకుండా ఉంటే, మన కథల్లో కనబడే మనుషులు, వాళ్ళ పలుకు వాళ్ళు పలికి, వారి కథ వారు నడుపుకుపోతారు!" అంటూ 'నేను-నా కతలు' అనే వ్యాసంలో తమ కథన పద్ధతిని సూచించారు శాస్త్రిగారు. అంతేకాదు." "దస్తావేజులకు నా కథలతో సామ్యం ఏమిటి? వాటికి ఓ తలా, ఓ తోకా ఉండక తప్పదు- వాటికి అలా ఉండటం ఒప్పదు! ఉంటే ఒకటికి పది తలలుండవచ్చును. కాని ఏ సందర్భములోనూ తోక అనేది లేకపోవచ్చును... జీవితాన్ని అంటే ఎదుటివాడి జీవితాన్ని వలసినంత తల్లక్రిందుగా అర్థం చేసుకుంటూ వాడు ఇరుకునపడే ఘట్టాలు కలిపిస్తూ అలాటి స్థితిలో అనవసరంగా నానార్థాలు కలిపిస్తూ ముణగనీయకుండా

తెలనీయకుండా ముప్పుతిప్పలు పెట్టడమే శిల్పం. పర్యవసానం ఒక కళాఖండం అని కాచి వడబోసిన వారు అంటారు. అది ఎంతవరకు నిజం అంటే, నా మటుకు నిజం!" అని శాస్త్రిగారు చెప్పుకున్నారు. కథలకే కాకుండా ఈ శిల్పం, శైలీ ఆయన నవలలకూ వర్తిస్తాయని 'తేజోమూర్తులు' నిరూపిస్తుంది. ఇందులోని సీతారామయ్య పాత్రలో మళ్ళీ శాస్త్రిగారి సహృదయతా, అభ్యుదయ ధోరణీ ద్యోతకమవుతాయి. దేవతామూర్తుల్లోని తేజోమూర్తిమత్వం ఆయనిది. 'అఖిలాండమ్మ'లాంటి మరో తేజోమూర్తి ఈ నవలకి పట్టుకొమ్మ. సమాజం దృష్టిలో ఆమె కానిపని చేసినా, మనిషిగా ఔన్నత్యాన్ని ప్రదర్శించిన దేవతామూర్తి. అనాథ కావల్సిన కోనయ్యని పెంచి ప్రయోజకుణ్ణి చేసిన పుణ్యమూర్తి. కన్నతండ్రి ఎంత నీచంగా ప్రవర్తించినా, అర్థం చేసుకుని ఆదరించిన రాజగోపాలం వంటి తేజోమూర్తి–కోనయ్య సోదరుడు కనిపిస్తాడు. సాయిబులూ, బ్రాహ్మణులూ సహవాసం చేసే స్నేహపూరిత వాతావరణాన్ని చిత్రించే శాస్త్రిగారి నవలల్లో మనుషులు ముఖ్యం. కథకాదు–కథనం ప్రాణం.

ఈ సంపుటంలోని మరో నవల 'క్షేత్రయ్య'. ప్రప్రథమంగా అచ్చులోకొచ్చిన అసంపూర్ణ నవల. సంగీత సాహిత్యాల్లో పండితులూ, భక్తి ప్రపూర్ణులు, శృంగారశాస్త్రంలో నిష్ణాతులూ అయిన శాస్త్రిగారు అన్నమయ్య గురించి 'వనమాల' రచించినట్లుగానే 'క్షేత్రయ్య' జీవిత చిత్రణ చెయ్యాలనుకోవడం సహజమే. ఎందువల్లనో పూర్తి చెయ్యలేకపోయారు. 'వరదయ్య' బాల్యం గడిచి యౌవనారంభంలో ఉండగానే కథనం ఆగిపోయింది.

మూడు నవలలతోపాటూ, అయిదు నాటికలు కూడా ఉన్నాయి ఈ సంపుటంలో. నాటకానికి సంభాషణ ప్రాణం. సంభాషణా చాతుర్యం శాస్త్రిగారికి సహజంగా అబ్బిన విద్య.

> "సాహితికి పరమసీమ, రూపక నిర్మాణం!
> నాటక శిల్పి, భావ చైతన్యలోకంలో మహా
> మహామహుల రూపక కల్పనలు నిష్ఠతో అవగాహన
> చేసుకోవాలి. ఇప్పుడైనా, రచనా విన్యాసానికి
> వరవడి దిగ్గంతులైన రూపక నిర్మాతలు తీర్చే
> త్రోవే! సంభాషణల పోహణికి మటుకు
> తనకు గురువు తానే!" అని రాశారు

శాస్త్రిగారు వరద రాజేశ్వరరావుగారి 'ప్రతిమాసుందరి' నాటికకి 'పరిచయం'లో.

ఆ 'సంభాషణల పోహణి'కి మచ్చుతునకలు ఈ సంపుటంలో చేర్చిన 'గోపీదేవి', 'కేళీగోపాలమ్', 'బాల', 'అ ఇ ఉ ణ్', 'సేఫ్టీరేజర్' అనే అయిదు నాటికలూ. వీటిలో మూడు పౌరాణిక ఇతివృత్తాలకు సంబంధించినవి, రెండు సాంఘిక ఇతివృత్తాలతో కూడినవి. రెండు రకాల నాటికల్లోనూ ప్రయోగాత్మకమైనవికూడా ఉన్నాయి.

'గోపీదేవి' నాటిక చైతన్యమత ప్రచారకులైన శ్రీ రూప గోస్వామీ, మధురదాసూ రాసిన నాటకాలూ, ఇతర శిష్యుల రచనలూ చదివిన స్ఫూర్తితో గోప గోపీ ప్రేమతత్వాన్ని ప్రదర్శించిన నాటిక.

'కేళీ గోపాలమ్' ఒక యక్షగాన ప్రబంధాన్ని ఆధారంగా చేసుకుని రాసిన గేయనాటిక.

'బాల' ఒక చిన్న సాంఘిక వ్యంగ్య నాటిక. దొరసానుల పట్ల, ఇంగ్లీషు చదువుకున్న స్త్రీలపట్ల పురుషులు ఆకర్షితులు కావడంపైన వ్యంగ్యంగా రాసినది.

'అ ఇ ఉ ణ్' అనే ప్రయోగాత్మక సాంఘిక నాటిక మర్మగర్భితంగా తాత్త్విక ధోరణిలో రాసిన నాటిక.

ఆఖరి నాటిక 'సేఫ్టీరేజర్' పౌరాణిక ఇతివృత్తంలో ఆధునిక అంశాన్ని ప్రవేశపెట్టి హాస్యస్ఫోరకంగా రాసిన ప్రయోగాత్మక నాటిక. మేనకా విశ్వామిత్రుల్నీ, శకుంతలా దుష్యంతుల్నీ, కణ్వుణ్ణీ, దుర్వాసుణ్ణీ 'సేఫ్టీరేజర్' ఎలా ప్రభావితం చేసిందో, వారి మనస్తత్వాల్ని ఎలా మార్చిందో చూపిస్తూ సరదాగా రాసిన నాటిక.

సాంప్రదాయక సమాజంలో ఆధునికత ప్రవేశిస్తున్న సంధికాలంలో ఈ నాటికలు ఆనాటి పాఠకులను బాగా ఆకట్టుకుని ఉంటాయి.

ఈ సంపుటంలోని నాటికలు కొంతవరకు వినోద ప్రధానమైనవి కాగా, నవలలు కళాత్మకంగా ఉండటంతోపాటు ఆలోచనాత్మకంగా ఉండి పాఠకుల మనసుల్లో కలకాలం నిలిచిపోతాయి.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారి రచనల్ని చదవడం కృష్ణలో స్నానం చేసినంత పవిత్రకార్యం అనిపిస్తుంది. చదివాక మనస్సు స్వచ్ఛమవుతుంది.

ఈ అవకాశాన్ని ఆత్మీయంగా నాకు కలుగజేసిన సోదరులు మల్లాది నరసింహశాస్త్రిగారికి నా కృతజ్ఞతలు.

6.8.2001 –అబ్బూరి ఛాయాదేవి

# ఇందులో...

## నవలలు



## నాటికలు

# కృష్ణాతీరం

దివి సీమలో ఎండలు ముదిరినాయి; ఎండవలసిన చెట్టూ చేమా ఎండుకొచ్చినాయి. ఎండు పట్టడం ప్రాకుల్లోనేకాదు, మనుషుల్లోనూ ఉంది.

అలాంటి వారిలో ఒకడు బుచ్చన్న-

అవనిగడ్డ గ్రామంలో వున్న బ్రాహ్మణ్యంలో యించుమించు అందరూ ఓపాటి మోతుబరులే - చెదురువాటుగా ఓ పదో పాతికో, చాలీ చాలని సంసారాలు ఉన్నాయి; పువ్వులతో బాటు పత్రిలాగా.

ఆ బహు కొద్దిమందిలోనూ, ఓ విధంగా చూస్తే ప్రథమ గణనీయుడు- యితగాడు!

తిండికి బొటాబొటిగా సరిపోయే గింజలురాలే చేనుంది. పప్పూ, ఉప్పు వగైరాలంటె - వున్నది నాళ్ళ నడుమ కనుక, ఏదో నోటి మంచితనాన ఎలాగో సర్దుకుపోవడం పరిపాటి అయింది. అది యీ తరంలో పుట్టింది కాదు; తండ్రి నాటినుంచి వస్తున్న ఆనవాయత.

అయితే, తండ్రి హయాములో - కొంత మెరుగు! ఆయనకు పిత్రార్జితం మూడెకరాలన్నర పైచిలుకుండేది. ఆయన స్వంతంగా చేసుకునేవాడు. తీరువా అని, శిస్తనీ, యీ అమాంబాపతులూ పోను యింటికో నలభై బస్తా చేరేది. అది వారికి ఎక్కీదక్కీ - అదీ గాకుండా, ఆయనకు రకరకాల వ్యాపకాలు ఉండేవి. నిత్యమూ రాత్రిపూట పురాణము జెప్పేవాడు, సంపన్న గృహస్థుల యింట్లో - అంతేగాకుండా, స్మార్తం క్షుణ్ణంగా చెప్పుకున్నవాడేమో- పౌరోహిత్యంలోకి దిగలేదన్న మాటేకాని, కాస్త ముక్కూ మొగం ఎరుగున్న వాళ్ళింట్లో ఏ పూజో, పుణ్యాహ వాచనమో అంటూ ఏదన్నా తలపెడితే - అందుకు ముందీ అన్నప్ప సిద్ధం! అల్లాగని దాన్నే నమ్ముకున్న వాళ్ల నోళ్లు కొట్టేవాడనా - ఎబ్బే! ఇచ్చుకునే సత్తువలేక పొడి తాంబూలం చేతిలో పెట్టి ఒక్క దణ్ణం పెట్టే అలాటి వాళ్ల విషయంలోనూ నేనున్నాననేవాడు. అంతేకాని, సదస్యాలకూ, సంభావనలకూ పోవడం అలవాటు లేదు. అయినా, ఆయనకు ముట్టవలసినదేదో మరో పద్ధతిలో ముడుతూనే వుండేది. ఎలా?-

మాట వరసకు-

ఫలానావారి లోగిలిలో, శ్రీమద్రామాయణం పురాణం జెప్పాలనుకుందాం! అది ఒక ఏడాదిపాటు నడుస్తుంది కదా - ఉత్తరకాండకూడా కలుపుకుంటే...

అందులో రాములవారు పుట్టుకురావడం, సీతమ్మ వారిని చేపట్టడం - నరజన్మ ఎత్తిన కారణంగా పడవలసిన అగచాట్లన్నీ పడి, మళ్లా వచ్చి, అప్పుడు బెడిసిపోయిన పట్టాభిషేకం సలక్షణంగా జరిపించుకోవడం-

ఆపై-

సరే, నడవాల్సిన గ్రంథమంతా నడచిన తరువాత, అక్కడ ఆశ్రమంలో మగపిల్లలు కలుగడం, చివరకు అందరూ సుఖంగా ఉండటం- ఇలాటివి ఓ నాలుగైదు ఘట్టాలు వున్నాయి కద- దేనికి తగిన ముచ్చట దానికి ఉండనే వుంది గనుక!

ఆయా తరుణాల్లో ఆనందంగా ఉత్సవం జేయకపోతే, ఆలకించిన సుకృతం పరిపూర్ణం కాదనే నమ్మకంకొద్దీ, గృహస్థులు అప్పట్లో చేయి విడిచి ఖర్చు చేసేవారు -

ఏవో పానకం బిందెలని, ప్రధానపు వుంగరమనీ, జామార్లనీ, చదివింపులనీ- ఇలా పై పై సరంజామాతోబాటు పదో పరకో కాసులూ, ఆయన ఎంత వద్దనుకున్నా ముడుతూ వుండడంతో, గంప సంసారం కాకపోవడంతో రాజెవరి బిడ్డరా అన్నట్టు ఆయన వాహినీగానే వెళ్ళమార్చుకుంటూ వచ్చాడు.

ఒక్కతే ఒక్క ఆడపిల్ల - అది తల్లి కడుపున పడ్డప్పటినుంచీ, మరీ కలసి రావడం మొదలుపెట్టింది.

అన్నప్పా, ఆయన యిల్లాలు అనంతలక్ష్మి-చెప్పుకోదగ్గ రూపసులు కారు. కాని, యీ పిల్ల ముత్యమల్లె వుంటుంది. పిల్లదానికి ఎనిమిదోయేడు వచ్చింది; ఆ యేటి కాయేడు మరీ నేవళం దేరుకుంటూ వచ్చింది. అలాటి పిల్ల యింట్లో మెలుగుతూంటే, అది సామాన్యపు కొంపగాదు, జమీందార్ల దేవిడి అనిపించేది ఆ బ్రాహ్మడి కంటికి. పిల్లదాని వివాహము విషయంలో భారీ ఎత్తున ఆలోచించాడు. మన గ్రామం మొత్తానికి రామావధాన్లు సంపన్న గృహస్థు - నలభై ఎకరాల బంగారం పండే ఏక ఖండం ఖాతా, ఓ అర్ధలకారం ఉండొచ్చు. ఆయనకు ఒక్కడే కొడుకూ, ఒక్క ఆడపిల్లాను. ఈ రెండు కుటుంబాలకు మధ్య రాకపోకలెక్కువ. పైగా ఆ యింట్లో పిల్లలు తన కళ్ళముందు పుట్టినవాళ్లు కావడంతో పిల్లవాడి గుణగణాలెట్టివో అన్నప్పకు రూఢిగా తెలుసును.

పిల్లవాడు చురుకైనవాడు. పెద్దరిగితే కరుకుతేలి తండ్రి లాగానే ప్రయోజకు డవుతాడు. దిప్పకాయితనం ఏ కోశానా లేదు. పిల్లను సుఖపెడతాడు. కనుక పిల్లదాన్ని ఎలాగైనా వాళ్ళ యింట్లో పడవేయాలని నిశ్చయించుకున్నాడు.

రామావధాన్లుగారు పిల్లదాని వివాహ ప్రయత్నంలో వున్నారు కనుక, ఇప్పుడప్పుడే యీ ప్రస్తావన తీసుకురావడమెందుకు? యీ హడావుడేదో అయిన తరువాత మంచిరోజు చూచి వారి చెవిని వేయవచ్చుననుకుని నిదానించాడు.

బందరులో ఓ సంబంధం - రమారమి నిశ్చయమైనట్టే. పెళ్లికొడుకువారు, లాంఛనప్రాయంగా పిల్లను చూచి ఫలానా అప్పుడు తాంబూలాలు పుచ్చుకునేందుకు వస్తున్నారు. వారు, వీరికన్న పైమెట్టువారే!

అనుకున్న నాటికి, పిల్లవాడి తల్లీదండ్రి బండి కట్టించుకు బయలుదేరారు. రెండు ఝాములకు లోపుగానే ఏటి ఒడ్డుకు చేరుకోవలసింది. కాని, యింకో క్రోశెడుందనగా, అవాంతరం జరిగింది. ఎదురుగుండా దివాణంవారి జోడు గుర్రాల సారటు వస్తూంది. కళ్ళకు ఎండ కొట్టడం మూలానో, ఏమో, అది వరకెన్నడూ లేనిది, యెడ్లను జూసి గుర్రాలూ, వీటిని జూసి అవీ బెదరడంతో, సారటయితే నిలువ దొక్కుకుని ముందుకు ఉరక వేసింది కాని, యీ బండీ మట్టుకు దారితప్పి, పుంతపట్టి, గతుకుల్లో పడిపోయి పోయి, పిల్లబోదెలో ఒడ్డిగిలింది. యెవరికీ యేమి దెబ్బాగిబ్బా తగలకపోయినా, కాస్త సుకుమార ప్రాణేమో, ఆ కుదుపులకు ఆ యిల్లాలు హైరానైపోయింది. ఎలాగో ఆ బండిలోంచి, యివతల పడి, ఆ యిల్లాలినో చెట్టునీడను కూర్చోబెట్టి, మగవాళ్లిద్దరూ నడుం కట్టుకుని బండి నెక్కించి, యెడ్లను కూడగట్టుకునేటప్పటికి ఓ పక్కా ఝాము పట్టింది-

యిహ, అప్పుడూ,

యెగువకు వెళ్ళడమా – మానడమా అనే లకలుకలో పడ్డారు.

ఇలాటి శకునం యెదురొస్తే యెలా వెళ్ళడం? అని, ఆవిడె!

వెళ్ళకపోతే మాట తఫావతు వస్తుంది – తాంబూలాల ప్రమేయం యివాళే పెట్టుకోకుండా నిదానం మీద చూసుకుందాం – పిల్లను మట్టుకు చూచి వచ్చేద్దాం – అలా అయితే నీ మాట చెల్లుతుంది, నా మాటా దక్కుతుంది – అంటాడు ఆయన!

వస్తుతః ఆవిడ ససేమిరా మనిషి –

అప్పటికే ప్రొద్దుపోయింది.

వారుభయులూ యిలా గుంజాటన పడుతూండగా చివరికిహ బండిదోలే సుబ్బయ్య కలిపించుకున్నాడు.

'గుఱ్ఱాల్ని చూసి బెదిరినాయిగాని కుందేల్ని చూసి బెదిరినాయా?' –

'అవేం సత్తార్ సాయెబు కుంటి గుఱ్ఱాలా? సంస్థానం వారివి!'

'మల్లెపూవులల్లే ఉన్నాయి. మనకు యెదురొచ్చినాయ్ – కనుకనే ఎలాంటి పాయిబడ్డా – ఎప్పటల్లేనే ఉన్నాం! యింతకన్న మంచి శకునం తెస్తామా?'

' ఏదో పీడ యిలా కొట్టుకుపోయింది' –

'యిది ముందు మంచికే – లెగవండి!' – యిలా అన్నా, వాళ్లు వినిపించుకోకపోవడం జూసి–

'లచ్చమ్మగారూ, మనం ఓ పూట పస్తున్నా ఫరవాలేదు, గాని, డొక్క మాడేస్తే గిత్తలు ఎత్తు బడువూ? బిడ్డల్ని చూసుకున్నట్టు చూసుకుంటారు గదా, మనకేం లోటొచ్చిందని వాటిని మాడేస్తారు? ముందుకు పోదాం అంటే, వేగిపోదాం! లేదా, బండిటే తిప్పుతా! మనం యింతకు ముందు దాటొచ్చిన ఊరు చేరుకుంటాం. ఈ పొద్దుకు బండి దింపుకుందాం। అక్కడ ఆసాములు పస్తుండనిస్తారా?'

'అమ్మగారు, మీ అంత మా రాజులు పొట్టచేత పట్టుకుని పొరుగూళ్ళో ఓ పొద్దు గడపటం యిచిత్రంగానే ఉంటుంది. ఎన్నడన్నా కథల్లే చెప్పుకోవచ్చు!'

'కోడికూసే తలికి నొగలెత్తుతాను. ఋవ్వదినేయాళ కింటికి బోవచ్చు ! యెంత సెడ్డా శకునం శకునమే. దాని బలిమి సూపిందని సరెట్టుకోవచ్చు.'

'నేను తవురికి సెప్పేవోణ్ణి కాకపోయినా, మీరు యినుకుంటే తప్పొద్దా?'

వాడు, బండి కట్టాడు–

'నీ వాగుడుకో దరీ – అంతూ లేదేంరా – సరే, యింత దూరం వచ్చి వెనక్కు తిరగడం ఎందుకూ – ఏం కానుంటే అదే అవుతుంది – మధ్య అయ్యగారి మాట పొల్లోవడ మెందుకు, నీ గిత్తలెండట మెందుకు – నేనేదో అడ్డం గొట్టానని నిష్ఠూర్య మెందుకు, ఎగువకే పోనీ!–' అంటూ ఆవిడ మట్టుకు బండిలో యెక్కి కూర్చుంది.

అంతలో ఉన్నట్టుండి – ఎండ ఛప్పున చల్లబడ్డది – 'చూశావా శకునం! సూర్య భగవాన్లు సైతం శుభమా అంటూ మనం చల్లగా సాగిపోయేందుకు సదుపాయం జేశాడు' అలా పలుకుతూ ఆయనా లోపలికి జేరుకుని, 'ఒరే సుబ్బయ్యా, ఒక్క చిటికెలో పోవాలిరా!' అన్నాడు – అలాగే ఏటి ఒడ్డుకొచ్చేశారు.

అక్కడ ఆయన, మాధ్యాహ్నికం దీర్చుకుని మళ్ళీ పొడిబట్టలు కట్టుకుని, యిక

గ్రామంలోకి కాలి నడకనే బయలుదేరారు!

మొగదల యిల్లే, అన్నప్పది – వారి యింట్లోనే, వీరికి ఏర్పాటు చేశారు. అక్కడ రామావధాన్లుగారి యింట్లో – తాంబూలాలు పుచ్చుకునేందుకు వలసిన సహాల ఏర్పాట్లున్నూ చేశారు. వేళ మరీ మించడంతో, యివాళిటికి వీరు రానట్టే, అని రూఢి చేసుకుని, వచ్చినవారు ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోయినారు. అవధాన్లుగారు – 'యీ బస్తీవాళ్ళ నైజం యింతే' – అని చిరచిరలాడి, హాయిగా భోంజేసి పడుకుని గుర్రుతీస్తున్నాడు.

బందరువారి పురోహితుడు, జోస్యుల యెగ్గెన – అంతకు ముందు రోజున, ప్రక్కనున్న గ్రామంలో బంధువులింట శుభకార్యానికి వచ్చి, ఉదయమే యీ గ్రామం జేరుకున్నాడు. అనుకున్న పని, అనుకున్న వేళకు జరక్కపోతే – అందరికీ చిరాకు యెత్తుకురావడం సహజమే – కాని, అనొచ్చిన మాటా వుంటుంది అనగూడని మాటా వుంటుంది గదా – యీ గ్రామంలో గృహస్థులు, సంపదతోబాటు వాక్స్వాతంత్ర్యము కూడా వృద్ధిజేసుకుంటూ వస్తూన్నవారు కావడంతో మెదలకుండా కూర్చోలేదు. అవతలి తరపు మనిషి యిక్కడున్నాడే అనికూడా అంచాయించలేదు. పైగా, ఆడపిల్లను యిచ్చుకోదలచిన గృహస్థే – నోరు సంబాళించుకోకుండా ఫెడీలుమని, 'యీ బస్తీ వాళ్ళ నైజం యింతే,' అనడమూ, అందుకు తక్కువగల గృహస్థులు, వంతపాటగా మూతులూ ముక్కులూ విరవడమూ, అంతటితో వదలకుండా, 'మిమ్మల్ని కాదండోయ్!' అని ప్రత్యేకం తన వంక జూసి అనేయడమూ, దానా దీనా, ఆ బ్రాహ్మడికీ అక్కడ ఉండటం ముళ్ళమీద ఉన్నట్టుగానే ఉన్నా–

చివాల్న – నలుగురిలోంచీ లేచి, యివతలకు చక్కా వచ్చి, అంగవస్త్రం ఝాడించి తలకు జుట్టుకొని, అదే పోతపోదాం – అనిపించినా, కాచి వడబోసిన ఘటం గనుక, మరికాస్త ఓపిక పట్టాడు. నలుగురితో కలసి తానూ ఓ నవ్వు నవ్వేశాడు. కాని అంతటితో అది సముసుకు పోలేం–

తీరా, వారు, భోజనానికి లేవబోతూ – తన వంక జూసి, 'యెగ్గెన్న బాబూ! యెంత సేపలా గోడ అరగదీస్తావు కాని, యిఖ లేం. యెవరో రాకపోతే ఏకాశి ప్రొద్దులుంటామా? కతికితే అతకదనే పట్టింపు నాకు లేదు. లోక రివాజంటావా అది నీ విషయంలో వర్తించదు. నీవు ఆ మూడు ముళ్ళూ వేయించే వాడివే కాని, అప్పగింతల జాబితాలో వాడివి కాదుగా! అన్నప్పగారి యింటికి కబురు చేస్తాను. మాట నిలకడలేని వారికోసం, మధ్య – ఆయన మాట పడటం యెందుకూ? చేసిన యత్నమంటావా? పారుబోదు. బస్తీవారికని చేసిన పప్పూ, ధప్పళం పాలేరాళ్ళ పరమౌతుంది– అంతే! యెవరికెక్కడ ప్రాప్తమో...? మడిగట్టుకుందాం, లేవండి' అంటూ హస్తచాలనంతో రెట్టించగా, యీ బ్రాహ్మడు, ఇక శ్రుతిమించనీయరాదనుకొని, అతి వినయంతో, 'అహం! మీ అంతవారు లెమ్మనడం, నేనింకా కూర్చోవడమూనా? లేచినట్లుగానే భావించండి! యిదుగో లేచాను!'

'నిజానికి, మా లాటివాళ్ళు కూచుంటే యెంత, లేస్తేయెంత! మీరేదో, ఓ వాసి పెద్దరికం యిస్తున్నారు గనుక మా పబ్బం గడుస్తూంది. బాబుగారూ! భోజనానికి లేవయ్యా అంటే– నేను లేవనయ్యా అంటే – నా కిహ అన్నం పుడుతుందా?

'ఆయా లోకాల్లో అన్నానికి మొగం వాచేగా మే మీ భూమ్మీద పుట్టింది. ఈ

జన్మకుగాని, మరో జన్మకుగాని మా నోటివెంట ఆ మాట రాదనుకోండి.'

'పోతే, చాదస్తం అంతా తీర్చుకు వచ్చేదాకా మిమ్మల్ని వుండమనడం భావ్యమా! ఇప్పుడు మొదలెడితే నేను తెమిలేసరికి ఓ పక్కా ఝాం పడుతుంది. మీరో కునుకు తీసి లేచి, లఘువుగా ఫలహారం జేసేవేళ – మాకు భోజనపు వేళ – మీకూ మాకూ అదీ అంతరం!'

'వేళ మించకుండా – మీరు అమృతమస్తు అనండి!'

'మరి! నా సంగతేమిటంటారా?'

'అలా ఏటిదాకా పోయి, ఆ రవంత అనుష్ఠానం అక్కడ తీర్చుకుంటాను. దొడ్లో భావి వుందికదా అంటారా? –ఉంది!'

'భావిలేని లోగిలి వుంటుందా? – పసుపు పూసుకోని ఇల్లుంటుందా? కాని – కృష్ణాస్నానం అంటే మాకు జన్మానికి శివరాత్రి! ఆ పుణ్యం నిత్యమూ లభ్యమయేదా?'

'అలా పోతూ పోతూ అన్నప్పగారింట్లో ఓ కేకేసీ పోతాను: 'బందరు వియ్యాలవారికి బదులు, మీ పాలేర్లు వస్తారు. తోడు, ఈ సత్రకాయ ఒహడు.' ఈ ముక్క ఆయన చెవిని వేస్తాను. పంక్తికి ఒకడన్నా బ్రాహ్మణుడున్నాడు కదా, అని ఆ బ్రాహ్మణుడు సంతోషిస్తాడు. మీరు భుక్తాయాసం దీర్చుకుని, మళ్ళీ కచేరీ సావడిలోకి దయచేసేసరికి నేనూ హాజరుగా ఉంటాను.'

ఇలా అంటూనే యివతలకు చక్కా వచ్చాడు. సందు దాటి, వీధి మీదకు వచ్చాడు.

అదే గ్రామానికి రాజవీధి – యకాయకిని ఏటి దగ్గరకు పోతుంది. మహా వుంటే కోటవారి తుళ్ళదగ్గరనుంచి చల్లరస్తా అంత దూరం వుంటుంది.

అయితే, అటు పోవడానికి మనస్కరించలేదు.

అయిన వాడూ, కాని వాడూ. నిలవేసి అక్కరమాలిన ప్రశ్నలు వేస్తారు. అందుకని, దారి తప్పించి, అటు పిశిపాటి వారి సందుగుండా పోయి, వంక మామిడివారి తోటకు అడ్డం పడితే రహదారి రేవుకు కాస్త ఎగువకు జేరుకోవచ్చును అనుకుని, అలా పోతూండేసరికి–

అక్కడో అవాంతరం!...

ఓ యింట్లోంచి ఓ బ్రాహ్మడు పరుగు పరుగువచ్చి యీయన మొగం వంక చూచి 'అమ్మయ్య, బ్రతికించారు' అంటూ రెండు చేతులూ పట్టుకుని గబ గబ సొద వెళ్ళబోశాడు. వారి తండ్రిగారి ఆబ్దికం – భోక్తల్లో ఒకరింట్లో, అంతకు ముందే పురుడొచ్చింది. వేళ దాటిపోయింది. గ్రామంలో మరో మనిషి దొరకడు – వెర్రెత్తి వీధినబడ్డాడు. దేవుడల్లే ఈయన కనిపించాడు! ఆ గృహస్థు చటుక్కున రెండు చేతులూ విడిచి, రెండు కాళ్ళూ పట్టుకొని 'బాబూ! మాట దక్కించు' అనడంతో, ఎగ్గెన్న – సరే అనక తప్పలేదు. తానిక్కడ యిలా వుండిపోవలసి వచ్చినట్లు అన్నప్పగారి యింటికి కబురు చేయించి, అక్కడ ఆ పనిలో వుండిపోయినాడు.

ఇహ అన్నప్పగారి ఇంటి దగ్గిర

ఇంట్లో సందడంతా, వాళ్ళ అమ్మాయి కామాక్షిది!

ఝాం ప్రొద్దెక్కినప్పటినుంచీ, ఆ పిల్లకు యింట్లో కాలు నిలువందే!

తెలతెలవారు తూందనగానే గబ గబ తల దువ్వించుకొని, నీళ్ళు పోసుకుని,

బొట్టూ కాటుక పెట్టించుకుని, ఆదరా బాదరా చల్దివణ్ణం దినేసింది. పెట్టెలోంచి దాపుడు మడతలు దీసి కట్టేసుకుని, పక్కింటి వెంకటలక్ష్మమ్మగారి యింటికి పరుగెత్తి, ఆవిడను బెల్లించి, కాసిని గన్నేరు మొగ్గలూ, మరి కాసిని మల్లెమొగ్గలూ తెచ్చుకుని చెండు కట్టి తలలో పెట్టుకుని, అద్దం ముందు నిలుచుని, బుల్లి బిల్లేరి అద్దం వెనుక వారగా పట్టుకొని చెండు సరిదిద్దుకుని, వాళ్ళమ్మ నడిగి చేరెడు వేపుడు బియ్యం - కాసిని ఖజ్జూరాలు పెట్టించుకొని, బొమ్మ సామాను చుట్టూతా పరచుకుని, వంటింట్లో వాళ్ళమ్మ కూరలు తరుక్కుంటూంటే అక్కడ జేరి, తాటాకు బొమ్మను పెళ్ళికూతుర్ని జేస్తూ, వీధిలో గంటలు చప్పుడైనప్పుడల్లా 'పెళ్ళివారే! మన పెళ్ళివారే!' అంటూ చెంగున వీధి గుమ్మంలోకి ఓ గంతేస్తూ పిల్ల సంబరంతో సతమతమౌతుంది! తల్లికీ యిదంతా చూడగా మహా మురిపెం వేసింది. 'ఏమే మా తల్లీ? ఎవరింటికో పెళ్ళి వారొస్తున్నారంటేనే యిలా యెగిరి గంతేస్తున్నావ్. రేపో మాపో దైవం రక్షించి, కల్యాణము ఘడియలొచ్చి ఆ కాబోయే వారొస్తే, యెంత కలకలలాడతావోనే? ఆసి నీ ఇల్లు ఇంద్రభవనంగానూ, నీకు యింట్లో కాలు నిలిచేట్లు లేదుగాని, పోయి కాస్సేపు అలా అల్లా తిరిగిరా! వచ్చేవాళ్ళు నీకు కనబడకుండా పోరులే! పంక్తిని నెయ్యి వడ్డించడం, వాళ్ళకు తమలపాకులు చీల్చి ఇవ్వడం నీవంతే ! ఆ కాస్సేపూ బుద్ధిమంతంగా వుంటివో, వాళ్ల బస్తీలోనే నీకూ ఓ మంచి సంబంధం చూసి ముడెట్టేస్తారు. చక్కగా జటకాబళ్లెక్కి పేరంటాలకు పోవచ్చు...' తల్లి యిలా బులిబుచ్చికాలు అంటూంటే - కాముడికి చెప్పరాని సంతోషమూ, వల్లమాలిన సిగ్గూ వచ్చి, వయసుకు తగ్గ ఆరిందాతనం వచ్చి 'ఫోవే అమ్మా! నన్ను బస్తీకి పంపేసి, యింట్లో పాలమీగడంతా నువ్వు ఒక్కత్తెవే మెక్కేద్దామనుకుంటున్నావా - ?' అంటూ గునిసింది. 'అదా అమ్మ నీ దుగ్ధ! మెక్కేవాళ్లు, రేపీపాటికి పుట్టుకు రారూ! మా కళ్లు చల్లగా, వెంటనో పిల్లనూ, చంకనో పిల్లనూ వేసుకుని, పండక్కీ పబ్బానికి రావా! ఒకర్ని మీ నాన్న బుజానా, ఒకర్ని నా బుజానా యెక్కించి నీ మానాన నీవు గచ్చకాయలాడుకునేందుకు పోతే, ఆ రాలుగాయల్ని సముదాయించేందుకు మనింట్లో మీగడా, వెన్న ఏం చాలతాయమ్మా! రాజావారి వెల్లావుల్ని తెచ్చి మన దొడ్లో కట్టేసుకోవాలి!..' కాముడు, ఇక వినిపించుకోకుండా అక్కడ నుంచి పరుగెత్తుకు పోయింది.

ఏటి వారను ఎంతోసేపు తచ్చాడింది.

నుంచున్నుంచుని కాళ్లు నెప్పులు పుట్టుకు వస్తున్నాయ్.

దూరాన ఎక్కడో పిల్లవాళ్లు గోడేబిళ్ళ ఆడుతున్నారు. అక్కడికి పరుగెత్తింది. నన్నూ ఆడనీయమంది. ఆడపిల్లవ్ - మాతో నీవేం ఆడతావ్! అన్నారు వాళ్ళు. పరికిణీ వెనక్కు విరిచికట్టి, చెంగు రొంటిన దోపుకుని, సైఁ! నాతో మీరేం ఆడతారు? యిదిగో పది లాల్‌కు కూత ! బిళ్ల మార్ అయితే, మా దొడ్లో దానిమ్మ పండిచ్చేస్తాను. మీరేమిస్తారు? యిదిగో బుల్లాడా, నేను గెలిస్తే బిళ్లా కఱ్ఱా ఊడలాక్కుంటా, సైఁయే - అని వాళ్లని కవ్వించి ఒకడు చెల్లగా ఒకడిని ఓడగొట్టి, కోపు కొట్టుకొంటూ, మళ్ళీ రేవుదాకా పరుగెత్తుకుంటూ వచ్చింది.వెనకాల్తే పిల్లలందరూ కూత పెట్టుకుంటూ వచ్చారు. వాళ్ళవి గిరవాటువేసి, పాయలోకిపోయి మొగం కడుక్కుని, రొప్పుదీర్చుకుంటూ అద్దరికి జూస్తుంది. అప్పటికి బండి జాడా లేదు. ఆడుకుంటున్నంతసేపూ, అటుకేసి ఓ కన్నేసి ఉంచింది. కనుక, వాళ్ళు రాలేదు అనుకుంటూ ఇంటికి వచ్చేసింది.

గుమ్మంలో తండ్రి కనిపించాడు.

'చూశావ్ నాన్నా, వాళ్ళింకా రాలేదు!' అంది.

'యింకేం వస్తారు, వేళ మించింది.'

'మరి రాకపోతే యెట్లా నాన్నా! వాళ్ళకోసం అప్పచ్చులూ అవీ వండుకున్నాం గదా! వాళ్ళకు వడ్డించకుండా మనం తింటామా?'

'మధ్య నీకూ నాకూ యీ తాపత్రయం?'

'అసలు వారికిలేదు. అవధాన్లుగారు, హాయిగా భోంచేసి బబ్బున్నాడట! ఆయనకేం మహారాజు.'

'ఒకవేళ బయలుదేరి దారిలో ఎక్కడన్నా చిక్కడ్డారేమో! అంతేగాక, పెద్దమనుషులు మాట తప్పుతారా? రాదలచుకోలేకపోతే వర్తమానం చేసి ఉండరూ?'

'మనకు యీ పూట భోజన ప్రాప్తివుంటే వార్లు వస్తారు. లేదాయెనా, కాస్సేపు కళ్ళుమూసుక్కూచుంటె అదే ప్రొద్దుగుంకుతుంది.'

'అమ్మేంజేస్తుందీ?'

'ఏం జేస్తుంది? వంటయింట్లో చెంగు పరచుకుని పడుకుంది. పాపం – ప్రొద్దున్నుంచీ సతమతమవుతూంది, అలా కాస్సేపు పడుకోనీ? మనం దాడి ఆడుకుందాం, యిలా కూచో...'

ఆట మంచి పట్టులో వుండగా, బందరు వారు రానే వచ్చారు. ఆ దంపతులని, అంత దూరాన చూడటంతోనే కాముదు పరిగెత్తుకుంటూ వెళ్ళి, 'బందరు నుంచి వస్తున్నారు కాదూ –' అనేసి – ఆవిడ సమాధానం చెప్పేలోపుగానే చెయ్యిపట్టుకొని, 'అదే మా ఇల్లు! మా యింటికే ముందు వస్తున్నారు. భోంచేసి పెళ్ళివారింటికెళదాం! నేనూ వస్తాను...' అంటూ ఇంటివేపు తీసుకువచ్చింది.

ఆయనకు – అంటే లచ్చమ్మగారి పెనిమిటి రమణయ్యగారికి, అన్నప్ప ప్రత్యుత్థానం జేశాడు.

జరిపే తీరున మర్యాదలు అన్నీ జరిపారు. ఆ పిల్ల సంబరం, ఆ తెలివి తేటలూ, ఆ చురుకుదనం, ఆ చక్కదనం, చూచేసరికి, లచ్చమ్మగారికి. – తాము వచ్చిన సంగతే మరచిపోయింది.

ఏదో పని గట్టుకుని, యింత దూరం వచ్చినందుకు – వెళ్ళకపోతే నలుగురూ ఏమనుకుని పోతారో అని, అవధాన్లుగారి యింటికి వెళ్ళడం రావడం జరిగింది. ఆ రాత్రికి వీరింటే వుండి, వారి దోవను వారు వెళ్ళిపోయినారు.

వచ్చినవారు ముక్తసరిగా మాట్లాడటం, ఆ వున్న కాస్సేపైనా కలిమిడిగా లేకుండా ముళ్ళమీదున్నట్టుండటం, కాబోయే అత్తగారయ్యుండీ కూడా ఆ యిల్లాలు పిల్లదాన్ని చేరదీసుకుని దగ్గర కూర్చోబెట్టుకోకుండా ఓ మారు చూసి ఊరుకోవడం, తరువాయి ఫలానా అప్పుడు తీర్చుకుందామని, తామై చెప్పవలసిన విధాయకం కాగా – ఆ మాట ఎత్తకపోవడం, ఇహ తానే అడిగేసరికి వెనకనుంచి కబురు చేస్తాం అని చెప్పి తప్పించుకోవడం వీటన్నింటినీబట్టి అవధానులు గారికి ఎక్కడో బెడిసినట్టుంది, అని అనిపించినా, గుంభనంగా ఊరుకున్నారు.

వారం అయింది, పక్షం అయింది. బందరు వారు పలకలేదు.

ఇప్పుడేమి చేయడం?

తన మొగం ముందు అనకపోయినా, ఊరిలోవారు ఎవరికి తోచిన విధంగా వారు అనుకోవడం మానుతారా...!

ఆడపిల్లను కన్నతండ్రి కనుక, అహం జంపుకుని, – తానే వెళ్ళి, వారిని కదలేశాడు! రమణయ్యగారైతే నీళ్ళు నమిలాడు గాని, లచ్చమ్మగారు మట్టుకు, మాటకు తడుముకోకుండా, – 'చూపులకని వస్తూంటే దుశ్శకునమైంది – యీ యేటికి మా పిల్లవాడికి పెళ్ళిచెయ్యం.' అని కుండ పగలేసినట్టు చెప్పింది –

మారు మాటాడకుండా తిరిగి వచ్చేశాడు!

వచ్చీ రావడంతోనే, అన్నప్ప మీద విరుచుకుపడ్డాడు! 'పప్పూ అన్నంలో ఏం కలిపి పెట్టావు బాబూ, ఆ బందరు వారికి. చక్రం యిట్టే తిప్పేశావ్–' అన్నాడు. అన్నప్ప తెల్లబోయి – 'అయ్యో! యిదేం పాపం!' అని, – ఆయన విపులంగా, దులపడంతో – విషయం అర్థం చేసుకుని, – ఆ పూటే బందరు పరుగెత్తాడు! ఇక్కడ జరిగినది యావత్తున్నూ ఏకరువుబెట్టి, – 'అయ్యా రమణయ్యగారూ, నేను యీ రోజు వరకూ ఏదో ఆ రాముణ్ణి నమ్ముకుని కాలక్షేపం జేస్తున్నాను. కాస్త తీరిక ఉన్నప్పుడు, – ఏ భాగవతమో, భారతమో చేతబట్టుకుని, – మా పెద్దల వల్ల నాకు అబ్బిన విద్యాలేశంతో పిచ్చాపాటిగా నలుగురూ వినేట్టుగా వాగుతూ పోవడమే కాని, మరో ఊహ నాకు ఉండదు! ఏదో, వాళ్ళ నడుమ, మంచిగా బ్రతుకుతున్నాను.'

'ఉన్నట్టుండి, – యిలా మిన్ను విరిగి మీద పడ్డది. నేను పేదవాణ్ణే అయినా నా పిల్ల కలిగిన యింట పడి సుఖపడాలని ఉండటం 'అలా అనుకోవడం దోషం కాదు గద!'

'నేను రామావధాన్లుగారి ఆశ్రితవర్గంలో వాడిని; వారు, మా గ్రామానికి, రాజావారెంతో, వీరూ అంతే. వారి పిల్లదానికి సంబంధం నిశ్చయమైనప్పుడు, – అది తిరగదోడి, నా పిల్లను కట్టబెట్టాలనే మహాపాపం నేను కలలో అన్నా జేస్తానంటారా?'

'అవధాన్లుగారు అలా అభిప్రాయపడినందుకు ఆ బాధ సరే! – కాని, అదో బాధ కాదు! ప్రారబ్ధం!'

'ఇంతకూ నేను మనవి జేసేదేమంటే – లోకం తీరు, మీకు తెలియనిది కాదు! పిల్లకు ఏదో అవకరం ఉండటం చేతనే మీరు, మేలుకుని వెనకడుగు వేశారని నలుగురూ అనుకోవచ్చు! యిక మరో సంబంధం ఎక్కి వస్తుందా? అయ్యా! అవధాన్లుగారి అమ్మాయి బహు లక్షణవతి, యోగ్యురాలు. జాతకాలు చూచుకున్నారు గదా! మీకు తెలియందేముంది? మీ కోడల్ని చేసుకోకతప్పదు!'

యిలా ప్రాధేయపడగా, దైవం అతని పాలిట ఉన్నాడో యేమో, లచ్చమ్మగారు, మెత్తబడింది! అప్పుడు అసలు విషయం బయట పెట్టింది.

వీళ్ల కాముణ్ణి చూసి, ఆవిడ ముచ్చటపడిన మాట వాస్తవం! అందుకే, అవధాన్లుగారి సంబంధం వద్దన్నది.

అప్పుడు అప్పన్నగారు అన్నాడు కదా, 'అమ్మా! నా పిల్ల ఎలుకోరి, ఆ పిల్లకు ద్రోహం జేస్తానా? యింతకు పూర్వం నేనూ పేరాశకు బోయినాను. అవధాన్లుగారి పిల్లవాడికి మా అమ్మాయిని చేసుకుంటారేమో, అనుకున్నాను. ఇంత జరిగిన మీద యిహ అడిగేందుకు నాకు నోరు రాదు. మా కాముడి మీద మీకు వాత్సల్యం కలిగింది

గనుక, మీ యెరికనే ఎక్కడన్నా, ఓ సంబంధం చూసి మీ కళ్ళ ఎదుట ఉంచుకోండి!'

వెంటనే లచ్చమ్మగారు అందుకుని, 'నిక్షేపంలాంటి సంబంధం సిద్ధంగా వుంది. నాకు ఓ ఆడపిల్ల లేకపోయెగాని, ఉంటే పారుబోసిచ్చేవాళ్ళమా! పిల్లవాడు మీ అమ్మాయికి యీడుజోడూ, ఎదిగిన కొద్దీ మాంచి యెత్తరి అవుతాడు. మీ పిల్లకన్నా ఇంకా ఓ చాయ ఉంటాడు! మీరు మెచ్చే తెలివి తేటలున్నాయి.

పెద్దల చెప్పుచేతల్లో ఉంటాడు. శాస్త్రం జదువుతున్నాడు. ఇంకేం కావాలి! మీరు సరేనంటే, తరలివస్తారు.'

ఇతగాడు వెంటనే సరేనన్నాడు.

అన్నప్పగారి మంచితనాన అయితేనేం, అవధాన్లుగారి పుణ్యం బాగుండబట్టి అయితేనేం, బందరువారు మొదట అనుకున్న ప్రకారం అవధానులుగారి పిల్లదాన్నే చేసికోవడం జరిగింది.

అన్నప్పగారితో బాటు, బందరువారూ బయలుదేరి అవనిగడ్డ వచ్చారు. యకాయకీని, అవధాన్లుగారి ఇంటికే వెళ్ళి, 'నిశ్చయం జేసికుందాం' అన్నారు. అవధానులుగారు కాదంటాడా? అసలు ఇంతదూరం వచ్చినాకా సంబంధం యిట్లా అయిందేమా అని, ఆయనకు మనసులో ఓ చెంపను పీకుతూనే వుంది. కాని కబురన్నా చేయకుండా వీరిలా ఊడిపడడంతో 'వీళ్ళేం తలతిక్క మనుషులా' అని మొదట అనుకున్నా, మంచికే వచ్చింది గనుక, పొంగిపోయినాడు. తనను చూసి బెదిరిపోయి వాళ్ళు దారికి వచ్చారనుకున్నాడు. బాగుంది దానికేం. ఆయన మనిషికాని, దేవుడు కాడుగా!

కాని అన్నప్పమీద ఆయనకు గుర్రుగానే వుంది. ముభావంగానే ఉంటూ వచ్చాడు. పెళ్ళి అయిదు రోజులపాటూ అయినా, అన్నప్పమీద వెనకటి ఆప్యాయత కనబరచకపోవడం అటుండగా యితగాడు మామూలు ప్రకారం యెంత పూసుకు తిరుగుతున్నా, ఆయన దూర దూరంగానే ఉంటూ రావడంతో, రమణయ్యగారి వంటి సాత్త్వికుడికే వళ్ళు మండుకొచ్చి, పట్టుకు కడిగేద్దా మనుకున్నాడు. కాని, అందుకూ మళ్ళీ అన్నప్పగారే అడ్డం వెళ్ళారు.

'నా విషయంలో పొరబాటు బడ్డామని యెన్నటికైనా, యిప్పటి తామసాలుడిగి యోచిస్తే, వారికే తెలిసి రావచ్చును. నా మీద యెప్పటి దయ రావచ్చును. అంతేకాని, అంత మనిషిని పట్టుకుని, నీవీ తప్పు చేసేవయ్యా! అని మీరు నిలవదీస్తే వారికి, చిన్నతనం కాదూ! వీడి మూలానకదా, మనకి తలవంపులు జరిగినవని, ఎల్లకాలం నా మీద కచ్చగా ఉండదూ? అయ్యా! మేము ఒక గడ్డమీద ఉండవలసిన వాళ్ళం. యెవరి తీరున వారిని ఉండనీయండి! వారు అన్నారని నాకు కించలేదు. శుభకార్యం శుభంగా నెరవేరేందుకు, యిలాటి నిష్ఠురాలు రాక మానవు. ఎవరో ఒకరు మాట పడకా తప్పదు. కనుక జరిగింది మరచిపోయి, మీ వియ్యాలవారి మీద ఎప్పటి అనుగ్రహమే ఉంచండి!...'

అంతటితో రమణయ్యగారు, ఊరుకున్నారు.

అవధానులుగారి ఇంటి వివాహం జరిగిన మరో ఆరు మాసాలకే – కాముడికీ పెండ్లి అయింది. వరుడు ఆనాడు అనుకున్నదే కదా – ఎగ్గెన్నగారి కుమారుడు సదాశివుడు. ఒక్క కూతురు కావడంతో, అన్నప్పగారు దేవదుందుభులు మ్రోగినంత వైభవంగా యింట శుభకార్యం చేశాడు. పిల్లదానికి పుట్టింటి పసుపూ కుంకం క్రింద తనకున్న మూడెకరాలన్నర

భూమిలోనూ, చెరువు క్రింద చేను, రెండున్నర పైచిలుకుది దఖలు పరచాడు.

ఆ సందర్భంలో అవధాన్లుగారే అన్నారు.

'అన్నప్పా, నీ పిల్లదానికి నీ విచ్చుకుంటూంటే ఎవరు కాదంటారు? కాని, కాస్త వెనకా ముందూ పారజూసుకో! మీది ఇంకా కనీపెంచే యీడు! ఒకరో అరో పుట్టుకొచ్చారే అనుకో! అప్పుడు పస్తాయించవలసి వస్తుందేమో...'

అందుకు అన్నప్పగారు, ఏమన్నారంటే-

'పస్తాయించను! - పస్తులుంచను! మాకు సంతానం ఇచ్చేవాడు అన్నోదకాలకు లోపం చేస్తాడా? చేశాడే అనుకుందాం! అప్పుడు మట్టుకు? మీ వంటివారు, యాకను ఒక్కపూట పరిహరించే దాంతో, మా వంటి వాళ్ళం పదిమందిమి బ్రతకవచ్చు. అంటే నా బిడ్డలు ఊరి వారి ఎంగిలాకుల మీదకి ఎగబడతారనికాదు. పరువుగా బ్రతికితే చాలు, పరగడుపైతేనేం!'

అవధాన్లుగారు, 'ఓహోఁ! వీడు నాకు సమాధానం జెప్పే స్థితికి వచ్చాడుగా' అన్న చూపు చూసి పైకి మటుకు అది గద్దింపూ, గణ్యతా కాకుండా 'ఆహాఁ!' అని ఊరుకున్నారు.

అన్నప్పగారికి మరుసటి సంవత్సరమే మగపిల్లవాడు కలిగాడు, యీ బుచ్చన్న! అది, తల్లి వంక వారి పేరు; అనంతలక్ష్మి తాతగారు బుచ్చన్నగారని, యజ్ఞ యాగాదికములు చేసినవాడు, మరొకరి ఎదుట చేజాచకుండా నూటొక్క కన్యాదానం చేయించినవాడు. దానా దీనా పిత్రార్జితం హరించుకుపోయినా, ఏ మాత్రమూ తొణక్కుండా అప్పటికి అరవయ్యేళ్ళు దాటినా, ఉపాదానం చేసి ఏ రోజు గ్రాసం ఆరోజు సమకూర్చుకుంటూ నూరేళ్ళూ బ్రతికాడు. ఎన్ని వందలమందో ఆయన దగ్గిర సంత చెప్పుకున్న విద్యార్థులు పెద్దరిగి, 'వేదపండు'లైనారు. ఆయన కొడుకు లక్ష్మణ చైనులు తండ్రి వద్దనే విద్యాబుద్ధులు నేర్చి, ఆయన ఆజ్ఞ ప్రకారం కలవారి యింటికి ఇల్లరికం వెళ్ళాడు. ఒక్కడే కొడుకు, అలా సిరిసంపదలతో వున్నా బుచ్చన్నగారు అవతలవారి పెట్టుపోతలకు ఆశించకపోవడమే గాకుండా, ముందుకు అలా ఖరారు చేసుకునే ఆ వియ్యానికి అంగీకరించాడు. ఆ కాలం వేరూ - ఆ మనుషులే వేరు.

లేక లేక మగపిల్లవాడంటూ కలగడం, చౌగండాలన్నీ గడిచి వాడు బాగుండటం కన్నవారికే కాదు, కంట జూసినవారికల్లా ముచ్చటే కదా!

పిల్లవాడు కళకళలాడుతూ వుంటాడు. తెలివితేటలు వెంట తెచ్చుకునే పుట్టాడు.

బుచ్చన్నకు అయిదోయేడు వచ్చింది. కాముడు కాపురానికి వెళ్ళింది. అప్పటికప్పుడే రెండేళ్ళాయె అవధానులుగారి కూతురు అత్తవారింటికి వెళ్ళి. పిల్లలిద్దరూ బందరులో సుఖంగా కాపురాలు చేస్తున్నారు.

అని, ఇక్కడివారు అనుకున్నారు. అంటే కాముడు సంసారంలో వచ్చిన లోటేమీ లేదు. కాని అవధానులుగారి కూతురి కాపురమే - అస్తావిస్తమైంది. అదెక్కడి ప్రారబ్ధమో కాని, పిల్లవాడి కా పిల్లది సరిపడలేదు. మొదటినుంచి అంతే - కాని, ఉంచగలిగినంత కాలం గుంభనంగా ఉంచారు. ఇహ, అతగాడు మరీ బరిమీరిపోయి, బాహాటంగా మరో కాపురం పెట్టడంతో యీ పిల్ల ఇక్కడ ఒక్కక్షణం ఉండలేక అత్తమామలతో చెప్పేసి, పుట్టింటికి వచ్చేసింది. అవధానులుగారు మొదట కత్తులు దూశాడు. కాళ్ళూ గడ్డం

పట్టుకుని చూశాడు. ఎటూ లాభం లేకపోవడంతో గుండె రాయి చేసుకున్నాడు.

కూతురి కాపురం ఆ తీరైనందుకే ఆ బ్రాహ్మడు యిదౌతూంటె - కొడుకిక్కడ నిక్షేపరాయుడుగా తయారయినాడు. అక్కడ అల్లుడు చేసిన నిర్వాకమే, ఇక్కడ వీడూ జేశాడు. దాంతో అవధానులుగారు మరింత దిగదీశారు.

తనకు సిరి-సంపదా అన్నీ వుండి, కుటుంబము యీ తీరు గావాలా? సాలుకు చేరెడు గింజలొచ్చే యీ అన్నప్ప తానూ ఓ మనిషినే అంటూ తలయెత్తుకు తిరగడమా! వీడి కొడుకు ఆ పిదప కాలాన బుట్టినవాడు పన్నెండేళ్ళు నిండాయో లేదో తండ్రి సరసన కూర్చుని పురాణం చదువుతూ, నలుగురిచేత 'ఆహాఁ!' అనిపించుకోవడమా! అక్కడ వీడి కూతురు అల్లుడూ ఊరి మెప్పుగా కాపురం జేయడమా! ఆ యెగ్గెన్న కొడుకు తండ్రిలాగా దర్భపోచలు చంక నెట్టుకుని యిల్లిల్లు తిరగకుండా, నాలుగు సంస్కృతం ముక్కలు చెప్పుకుని, అంతతోబోక, పెద్ద పండితుడని పేరు దెచ్చుకుని, తిరుపతి మహంతువారి పాఠశాలలో ప్రధానాచార్యుడు కావడమా! ఈ అన్నప్ప కూతురు అక్కడ అందలాలెక్కి తిరగడమా?

ఇదీ ఆయన బాధ!

అది ఆనాటికానాడు వృద్ధిపొందేదే కాని, సన్నగిలేది కాదు. ఇలా మరో అయిదారేళ్ళు గడిచినయ్. అవధాన్లుగారికి లోకరివాజు ప్రకారమైతే, ఇంచుమించు ఓపాటి నడివయస్సే. అందులోనూ జమిలి యెముక మనిషి - కాని, ముసలి వాలకం ముంచుకు వచ్చేసింది.

ఈ స్థితిలో ఆయనకు వున్న బాధలకు తోడు, ఆ కుమారరత్నం ఆస్తిపంచమంటూ కూచున్నాడు.

ఏడు తరాలనుంచీ ఏకబిగివిని వస్తూన్న ఆస్తి - యీనాడు పంపకమా? అవధానులుగారు ఒప్పుకోలేదు. ఆయన కుమారుడు నోరూ చెయ్యీ ఆచుకోలేదు.

ఊరికి ఊరూ ముక్కుమీద వేలేసుకుంది. కాని, తండ్రి బిడ్డల తగాయిదాలో యెవరు తలదూర్చుతారు?

అయితే, యెవరికీ లేని జోక్యం, బుచ్చన్న కలిగించుకున్నాడు. కుర్రవాడు మాంచి రెక్కకట్టి - పిక్కకట్టి జవమీదున్నాడేమో - అవధాన్లుగారి కొడుకుని పట్టుకుని, ఊరంతా పొర్లు దణ్ణాలు పెట్టించి పొలిమేర మీదికి గొడ్డును తరిమినట్టు తరిమేశాడు.

అందుకు అందరూ లోలోపల సంతోషించారు. కాని, అవధాన్లుగారు ఏమనుకునిపోతాడో అని ఇంకా రవంత బెరుకో, లక్ష్యమో వుండటంచేత, యెరగనట్టు ఊరుకున్నారు.

కాని, అన్నప్పకు, యీ సంగతి తెలిసీ తెలియడం తోటే ఉగ్రరూపం దాల్చాడు. కొడుకును ఒంటరిగా పిలిచి, -

'ఒరే బుచ్చి - నీకు యింకా చిన్నతనం! కాని, బుద్ధులు దొడ్డవి! నీవు యీ గ్రామానికి జమీందారువా, తప్పు చేసినవాడిని దండించడానికి?-'

'కొడుకు యెలాటివాడు కాని, తండ్రికి వాడిమీద మమకారం పోదు నాయనా!-'

'అవధాన్లుగారు ఒకరిచేత వేలు వంపించుకోవలసిన వారు కారే! వారు సజీవులుగా ఉండగానే, వారి కుర్రాణ్ణి మరొకడు కుక్కను బాదినట్లు, బాదాడంటే ఆ

తండ్రి మనసు ఎంతో క్షోభిస్తుంది?

'మన గ్రామంలో నీవు ఒక్కడవే బలవంతుడివా? వాడు, యీ కచ్చ మనసులో పెట్టుకొని, పదిమంది పాలేరాళ్ళని నీ మీదకి ఉసిగొలిపాడనుకో, అప్పుడు నీవు యేమౌతావ్? నా స్థితి ఏమౌతుంది? యిది ఆలోచించావా? నీకు నా మీద భక్తిశ్రద్ధలు! మనలాగే అందరూ అన్యోన్యంగా ఉండాలని ఆశించడం, మంచిదే. కాని, ధర్మం నాలుగు పాదాలమీద నడుస్తుందా?'

'మనకు చేతనైతే, ఆ తగాయిదా మాపుచేసి, వాళ్ళ సంసారం చల్లగా ఉండేట్టు చూడాలి. కుమార్తె కాపురం ఆ తీరై, కొడుకు యీతీరైనందుకే, ఆయన పాతాళానికి కుంగిపోయి ఉన్నాడే. యిలాటి అఘాయిత్యాలు జరిగితే, మరిక ప్రజల మొగం చూడగలడా నాయనా! మన యిరుగూ పొరుగూ బాగుంటేనే మన బాగూను. యిప్పటికి అయిందేదో అయింది! నీకు అభిమానం యెక్కువ! – నిన్నుపోయి వాడి కాళ్ళుబట్టుకోమంటే – పోవు! నీవు చేసిన పొరబాటు సరిదిద్దడానికి నేను ప్రయత్నం జేసి చూస్తాను.'

'మరోమాట!'

'మనలో మాట! యింతకూ వాడు చేసిన మహాపరాధం ఏమిటి? తన మనసుకు నచ్చిన పిల్లతో కాపురం చేస్తున్నాడు. అనుకూల దాంపత్యం – పిల్లాపాపా కలిగారు.

'ఇహ బ్రాహ్మణీకం అంటావా!'

'చిత్తశుద్ధి – సదాచారం, వినయం, వివేకం – యివి బ్రాహ్మణ లక్షణాలు. అంతే కాని, ఫలానా యింట్లో పుట్టటం కాదు. యిప్పటి మన సంకుచిత దృష్టితోనే చూస్తే – మన లెక్క ప్రకారం, మంత్రద్రష్టలైన ఋషుల్లో, యెంతమంది బ్రాహ్మణులున్నారు? ఒక్కడో అరో మినహాయిస్తే – తతిమ్మా వారందరూ, అనులోమ ప్రతిలోమముల ఫలితాలే కద! –

'ఈ అవధానులుగారు మట్టుకు తక్కువవాడని మనం యెందుకు అనుకోవాలి! ఏవో పుల్లవిరుపు మాటలని, రెచ్చగొట్టకపోతే, వాడు తండ్రిమీద చెయిచేసుకుంటాడా? వాడి పెంపకం అలాటిదా?'

'వాడు చెడ్డవాడని వాదు రానే వచ్చింది!'

'కాదు. వాడూ సద్ధర్ముడే అని, రుజువు చేయగల్గితే మనం ధన్యులమే! మనం పాలెంపోయి వద్దాము రా! సాహసమంటే చేతికి చిక్కిన అభాగ్యుణ్ని పట్టుకు చెండాడటం కాదు, చేసిన తప్పు తెలుసుకుని చేతులు జోడించడం!'

బుచ్చన్న మారుమాటాడకుండా తండ్రి వెంట బయలుదేరాడు.

పాలెం అక్కడికి క్రోసున్నర వుంటుంది. పెళ్ళి నడకలు నడిచినా, సంధ్యావందనం చేసినంత సేపు పట్టదు.

దారి వెంట, కాలు సాగేందుకూ, కాలక్షేపముగానూ–

రామకథలో స్వారస్యాలు ఏకరువు బెడుతున్నాడు అన్నప్ప.

శ్రీరామచంద్రుడంటే ఆయనకు గౌరవమే! కాని, ఆ సీతమ్మ తల్లంటే తగని భక్తి. శ్రీమద్రామాయణము యెన్ని విడతలు పురాణం జెప్పినా – అది సీతమ్మ కథగానే చెప్పాల్సిందే

అన్నగారి ఆజ్ఞ ప్రకారం సీతమ్మను రథం మీద తీసుకువెడుతున్నాడు లక్ష్మణ

స్వామి. ఆ తరుణంలో రాముడు కనిపిస్తున్నాడా అతనికి.

ఉహుం! కళకళలాడుతూ, పరిపూర్ణ బింబంవలెనున్న ఆ తల్లి మొగమే!

ఎందుకా కలకల?

మళ్ళీ యింత కాలానికి – తన మనసు, మమత మన్నించి, తన మనోనాధుడు అనుమతి శాయంగా, ఆశ్రమ వాటికలలో ముని కన్యలతో కలసి వెనకటి ముచ్చటలు తలపోసుకుంటూ ఆనందంగా కాలం గడపేను గదా అనే భావనలో!

ఆ తల్లి, అమాయకంగా, అలా పలుకుతూంటే లక్ష్మణుడి మొగంలో కళలు దిగజారుతున్నాయి. దుఃఖము ఆపుకోలేకపోతున్నాడు.

లక్ష్మణుడి స్థితి గమనించిందాయెను సీతమ్మ తల్లి!–

'ఏం నాయనా! – ఆ విన్నదనం ఎందుకు?–'

'నీ మోమున ప్రస్ఫుటమౌతున్న విషాదానికి హేతువేమిటి?–'

'మన అయోధ్యానగరము ఎప్పటివలెనే సూర్యకాంతిలో తేజరిలుతూంది కద! – మన ప్రజల ఆనందమునకు ఎట్టి అభ్యంతరమూ కలుగలేదు కద! రఘువంశ తిలకుని పెదవుల నిత్య మందహాస రేఖ మాయలేదు కద! నేను అనుదినమూ పాదములొత్తి సేవించుకొనే, మీ తల్లులందరూ సుఖులేకదా?' ఆ తల్లి యిలా అడుగుతూ పోతూంటే లక్ష్మణుడి మనసు ఎలా ఆక్రోశించింది? 'అమ్మా, ఎవరికేమి అనర్థం వాటిల్లిందో అని అల్లాడిపోతున్నావే గాని, ఆపద నీకే రానున్నదనే భావనే లేదు గదమ్మా తల్లీ!'

'బుచ్చీ! అది ఉత్తముల లక్షణం.'

'వారికి, తమ బాగోగులమీద ధ్యాస ఉండదు!'

'కావలసింది – ఎదుటివారి క్షేమమే!–'

'కాలమది కాకపోయినా – నేటికైనా! మనకూ ధర్మమదే!'

'మరో విశేషం!–'

'శ్రీరాముడు, అశ్వమేధయాగం తలపెట్టినాడా? అది సలక్షణంగా, సానుకూలం కావాలంటే, – సహధర్మచారిణీ, ఏదో ఓ రూపాన సరసను ఉండాలి కద!'

'కనుక, అయోధ్యలో వారికి అవసరం కనక జానకి!–'

'వారు స్వయంభువులు కదా!'

'ఆ తల్లి రూపురేఖలు బ్రహ్మతీర్చిదిద్దినవి కావుగదా?–'

'యిక, మరి, యే శిల్పికి సాధ్యమౌతుంది?–'

'ప్రతిమ లేనిదే – యాగం జరుగదు!'

'ఆ శ్రీరాముడికి భార్యా వియోగంతోబాటు – యిదో బాధ!–'

'అప్పుడేం జరిగింది? వాల్మీకుల వారి ఆశ్రమంలో ఉన్న ఆ తల్లికి, యీ వర్తమానం తెలియంగానే, మహర్షికి విన్నవించి, వారు అనుమతించిన మీదట, తన మూర్తిని తానే రూపొందించి, అయోధ్యకు పంపింది!'

'ఈ రూపేణా అయినా, స్వామివారి సరసను నిలిచేందుకు నోచుకున్నాను కదా' అనుకున్నదిట ఆ ఆనందమూర్తి!

'ఆ ప్రతిమను; చూసీ చూడటంతోనే, ఆ మహానుభావుడికి మతిపోయింది!'

'తాను నిర్దయుడై పరిత్యజించాడు!'

'కాని, ఆ సాధ్వి చిరునవ్వుతో, తనను వెదుక్కుంటూ వచ్చింది!'

'జీవకళ లుట్టిపడుతూన్న ఆ మూర్తిని చూసి, ఆ ప్రసన్నత జూసి, –'

'ఈ రూపాన వచ్చి, నన్ను మన్నించానని మౌనాన పలుకుతున్నావా' అనుకుంటూ, ఆ సరసను స్వస్థచిత్తుడై, యాగం కొనసాగించినాడు కాదూ?'

'చూశావూ బుచ్చీ!'

'అపవాదుకు విలువ యిచ్చి – అడవి పాల్జేసినాడు.'

'తానిక లేనట్టే భావించి ప్రతిమను చేయించ తలపెట్టినాడు!'

'అందుకా యిల్లాలికి కోపమూ?–'

'ఎబ్బే! వారి ధర్మ నిర్వహణలో, యవ్విధమైన లోపమూ రాకుండా చూడటం తన ధర్మం కనుక అలా చేసింది!'

'ఉత్తమ జన్మంటే – అదిరా!–'

–యిలా, పలుకాడుకుంటూ పాలెం జేరుకున్నారు!

ఆ ప్రాంతమంతా యీ ఉభయులకూ, కొట్టినపిండే! ఫలానా వాళ్ళు ఎక్కడ ఉంటున్నారని ఎవరినీ అడగవలసిన పనిలేదు!

ఈ సుబ్బరామయ్య, అంటే అవధానులుగారి కొడుకు, చేపట్టిన పిల్లదాని పుట్టు పూర్వోత్తరాలూ తెలుసు!

దాని పేరు, లచ్చి, యిప్పుడు లచ్చమ్మ! చెడ్డదేం కాదు–

మన కులం కాదన్న మాటే కాని, వేరు కులం అయినా ఏ కులంలో గాని, శ్రోత్రియులంటూ ఉంటూనే ఉంటారు.

వాళ్ళ లెక్కలో, యిది బ్రాహ్మణ్ణే కట్టుకున్నా, చేసింది కులం తక్కువ పనే!

దానికేం!

లచ్చి – తల్లిదండ్రులు లేక, మేనత్త పోషణలో పెరిగింది.

ఆ మేనత్తకూ, అటూ యిటూ ఎవ్వరూ లేరు!

ఓ కుంటభూమి, ఉండటానికో జానెడు కొంపా.

మేనత్త కత్తిలాంటి మనిషి! ఆ పెంపకం అలాంటిదే!

కనుక, లచ్చి, చేను గట్టున చెంగు ఎగరేసే రకం కాదు!

పెద్ద ఖామందు కొడుకని జడిసిపోలేదు!

వగలు పోలేదు!

పిల్ల కనుముక్కు తీరు బావుంటుంది!

పదాలు పాడటంలోనేమీ, పాడుతూ చిందెయ్యటంలోనేమి–

రంభా ఊర్వశీ దాని ముందు ధూపానికి రారు!–

అదేం ఘోషామనిషి కాదుగా, – అందరి కంటా పడ్డట్టుగానే వీడి కంటా పడ్డది! మరి, వీడు ఒకడివంటివాడు కాదుగా,–

ఒకరికొకరు ఎలా మచ్చిక అయినారో, – దైవానికి తెలియాలి!

వీళ్లిద్దరూ వెళ్లి, – ఆ మేనత్తను ఎలా ఒప్పించారో, ఒప్పించారు! గుళ్ళో ప్రమాణాలు జేసుకున్నారు! అక్కడ యిల్లరికమున్నాడు!–

పాలెంలో మనుషులు, –వ్యవహారం యిలా ముదిరితే, – కలిపించుకోకుండా

ఊరుకున్నారా? –

ఆదిలోనే, – ఒకరిద్దరు, మరీ చనువున్నవాళ్లు, – సుబ్బరామయ్యను – తగుపాటిగా మందలించారు!

'అది, – పెళ్ళీపేరంటం కావలసిన పిల్ల! –' అని చూశారు! –

'ఆ మాత్రం నాకు తెలియదా?' – అన్నాడు సుబ్బరామయ్య! –

కొన్నాళ్ళకు,

'దానికేదో మతోయినట్లుంది! కళ్ళన్నీ నీ మీదనే ఉంటాయి! కాలుజారితే దాని బతుకు గంగపాలేగంద' – అన్నాడు, వీళ్ళ యోగక్షేమం కోరే, మరొకడు.

'గట్టుమీద ఉన్నదానికి కాలెందుకు జారుతుంది!'

'నీవు – దిగలాగితే, –'

'నాకా సత్తువ లేదు!'

'సత్తువ లేకపోతే ఏం – సంబరం ఉండచ్చుగా –'

'నేను సంసారుల కడుపున పుట్టాను కాని, – సాని కడుపున పుట్టలేదు –'

'అంత మాటెందుకు లెగుండి! –సాఁయితె జెప్పినట్టు – చెట్టునున్న పండు చేతి కందితే,'

'నీతిలేనివాడు, –నెమరేశాడు! ఉన్నవాడు, –ఖామందును అడిగి, – హాయిగా అనుభవించాడు. అర్థమైందా? నేనేం దొంగ మేతకు రాలేదు. మీ అందరూ ఒప్పుకుంటే లచ్చమ్మను పెళ్ళిచేసుకుంటాను.'

'ఆఁ అదయ్యేపనా? మీరేమో బ్యామ్మర్లుగందా?'

'మరో తిట్టు నీ నోటికి రాదా?'

'తెలిసి కూశావా? తెలియక అన్నావా?'

'బామ్మడంటే ఎవడు? తాళికట్టిన యిల్లాలి బతుకు దగబోలు చేసి తానో మనిషినే అని తల ఎత్తుకు తిరిగేవాడు!...'

'బామ్మడంటే మా బావ!'

'వాడితో నన్ను జమేస్తావా?'

'నేను బ్యామ్మడినీ కాను, బట్టునూ కాను.'

'సాదా మనిషిని.'

'ఏదో పెళ్ళీ పేరంటం జేసుకుని పది కాలాలపాటు బాగుందామనుకుంటున్నాను, కాదంటారా?'

'ఇది యిద్దారమే! మీ బాక్కు మేం అడ్డం రాం లెగుండి. అరుదు మెచ్చితే నరుడూ మెచ్చాడని, ఆ పిల్లకాయ సమ్మతమంటే మాకూ సమ్మతమే.'

'కనుక్కోరాదూ?'

'కదిలిస్తే కరవరాదూ? అయినా, మేమేం కళ్ళు మూసుకుని లేం లెగుండి!'

'మరి –'

'దాని మేనత్త రత్తమ్ముందే! దాందో గొడవ! మోటు మనిషి. దాందంతా అదో చాదస్తం. కులం మాటకొచ్చి యీ మనువు సాసాయించ దంటుందేమోననే బయ్యం!'

'అందాకా వస్తే మంత్రం వెయ్యనే.'

'మంత్రించండి, మాయజేయండి! మా మరేద మటుకు దక్కించండి.'

సరాసరి సుబ్బరామయ్య, రత్తమ్మ యింటికి వెళ్ళాడు.

ఇంటి ముందర వేపచెట్టుకు పాడి బర్రె కట్టేసి వుంది.

పెయ్య దూడ ఉండుండి మిడిసిపడుతూ, అందినంత మేర పులు కొరుకుతూ కలేదిరుగుతూంది.

రత్తమ్మ ఎవరినో బాడించుకుంటూ కోడెదూడను కట్టుకొయ్య దగ్గరకు లాక్కుని వస్తూంది. లచ్చి, జాజి పందిరి పక్కను చపటా మీద కూర్చుని, కోళ్ళకు చిట్టుండలు విసురుతూంది.

ఇతగాడిని అల్లంత దూరాన చూడంగానే వల్లమాలిన సంబరమేసి వొంటికి వయారమొచ్చి కంటికి చిలిపితనం వచ్చి కోళ్ళను యిటుకేసి తరిమికొట్టి తాను మేనత్తచాటుకు పరుగెత్తింది.

రత్తమ్మ వచ్చిన మనిషిని నిలవేసి జూసింది.

'ఏం పిన్నమ్మా!' అన్నాడు.

'ఆఁఆఁ'– అంది.

'బాగున్నావా?'

'లేకుంటె ఎల్లునయ్యా! నేనే లేకపోతే పెంచుతూన్న పెట్టను బైరు తన్నుకుపోవె! ఏవయ్యోయ్ అవధానులుగారి కొమారుడా, మాలాటోళ్ళచేత ఛస్ అనిపించుకుంటావా?'

'సెబాస్ అనిపించుకుంటనులే!'

'ఏంజేసి?'

'నీవు పెట్టిన భోజనం భోంచేసి!'

'మమ్మన్నిట్టా బతకనియ్యవా?'

'ఊహుఁ, ఇంతకన్నా బాగా బతకాలి! చూడు రత్తమ్మా! పిన్నీ అని పలకరిస్తే గుర్రమన్నావ్! నేను యీ జన్మంతా ఆ మాట మీదనే ఉండటం ఖాయం! కనకుండా కొడుకు దొరికితే ఔర బిడ్డా! అనవేం! ఈ పొద్దునుంచీ నువ్ పెట్టింది తింటా! యీ నీడనే వుంటా! కాదంటావా? నా సొత్తును ఎగరేసుకుపోయి ఏ సాయిబ్బుల్లోనో, కిరస్తానీల్లోనో కలుస్తా! నేనొక్కడ్నే కాదు! కొంగూ కొంగూ ముడేసుకుని–'

రత్తమ్మ పకపక నవ్వుతూ, 'అయే బాపనబుద్ధులంటే! అలుసుందికదా అని అదలగొట్టడం! యెనకటికి ఓ రాజు కూతుర్ని ఎవరో శాపం బెట్టినారంట గాదూ! నీవు, బాపనయ్యను కట్టుకుంటవ్‌పో! అని. మన అన్నప్పగారు సదివితే విన్నానులే! నా యెర్రిగూలా, మా లచ్చికిగాని అసుమంటి గాచారం బట్టిందో, సాయ్‌రంగ! పిల్లకీ నాకు, ముక్కలేందే ముద్దదిగదే, బతికిన నూరేళ్ళూ పప్పూ బువ్వ తినేతలికి దీని తిక్క యింకేడిది? గుళ్ళో కూకుండి అనుకుంటినేమో సాంవోరు, నా నెత్తడిశారు! యింతకూ యిది మనిషిచేసింది కాదులే, దేవుడు రాసిందే' అనేసి సుబ్బరాముణ్ణి ఆ యింటివాణ్ణి చేసింది.

రత్తమ్మకు, ఓ కుంటభూమి ఉంది!

పది మామిళ్ళూ, పది కొబ్బరిళ్ళూ, వాటిమీద ఎంతలేదన్నా, సాలుకో పది పరకలు తేలచ్చు! అదీ గాకుండా, అంతో యింతో, నాళ్ళ నడుమనే పావలా వడ్డీకి తిరుగుతూంది. ఓ పది తులాలు బంగారం; చిన్నం–చితుకా చేరిస్తే, ఓ ఇన్నూరు తులాల వెండీ తేలకపోదు.

అదీ, ఆ కుటుంబానికి ఉన్న నికరం.

ఇంతకు ముందంటే, ఆడకూతుళ్ళు, యిద్దరే, ఒకరో అరో మనిషిని జీతానికి పెట్టుకుని, తెక్కలు విరుచుకునేవారు! యిప్పుడు, మగదక్షత ఏర్పడటంతో గిద్దెడు రాలే చేను తవ్వెడు రాలడం మొదలుపెట్టింది. అదీ గాకుండా, నా అన్నమనిషి, ఒకడు అమరడంతో, అతగాడు డబ్బు విలువ తెలిసిన మనిషి కావడంతోబాటు, తిమ్మిని బ్రహ్మిని చేయడంలో ఆ తండ్రి నోట్లోంచి ఊడిపడ్డవాడు అవడంచేతనూ, తానేదో, తనమానాన ఉండకుండా అందరికీ తల్లో నాలుకగా మెలుగుతూ, ఉన్నంతలోనే మంచి అనిపించు కుంటున్నాడు.

పాలెంలో చీమ చిటుకుమంటే, గ్రామంలో చప్పుడౌతుంది!

అక్కడ భోగట్టా యెప్పటికప్పుడు ఇక్కడివారికి తెలుస్తూనే ఉంది.

ఆ పెళ్ళి వరకూ గుట్టుచప్పుడు కాకుండా జరిగిపోయిందంటే అందుకు సుబ్బరామయ్య మోరకింపే కారణం! 'బ్రాహ్మడు, మంత్రాలు చదివి, అక్షింతలు వేస్తే, మా యింట ఆ పెళ్ళి అచ్చి రాలేదు. దేవుడిదే పెద్దరికం అయినప్పుడు మరో దేవిరింపు యెందుకు?' అని ఆ తంతు తప్పించేశాడు. మేళాల్ తాళాల ప్రసక్తి వస్తే - 'మా పిల్లకాయల పెళ్ళి, భూమ్యాకాశాలు దద్దరిల్లేట్టుచేద్దాం! యిప్పటికి మటుకు లఘువుగానే పోనీయండి' అన్నాడు.

ఆ యింటి విషయం అతి గుంభన గనుక, ఆదిలో తబిసీళ్ళు తెలియక వీడే యింత ఉడకేసి వాళ్ళకు పెట్టి, తాను తింటూ అతి గడుసుగా బండి నడుపుకొస్తున్నా డనుకునేవారు. అది కాకపోయినా అబద్ధమున్నూ కాదు. వీడికి తిండిపుష్టి ఉంది. మాంచి భోజనప్రియుడు. వాళ్ళకేమో శాకపాకాలు వీడికి రుచించేట్టు తయారుచేయడం చేతకాదు. కాకపోవడంతో కొన్నాళ్ళపాటు స్వయంగా మడిగట్టుకుని చేసి చూపించక తప్పిందికాదు. లచ్చి, చూపిస్తే అందుకుపోయింది! యిహనేం? -

అదీ, లోగడ కమామీషు-

అన్నప్పా, బుచ్చన్నా అక్కడికి జేరుకునేసరికి యింట్లో లచ్చి ఒక్కర్తే ఉంది. తొట్టిలో పిల్లవాడు సరే, తొలిచూరు ఆడపిల్ల ఏణ్ణర్ధపుది - గుమ్మం ముందు, తువ్వాయితోబాటు గంతులేస్తూంది.

అది మునుపటి యిల్లుకాదు!

కళగా ఉంది!

గుమ్మం దగ్గిరగా వెళ్ళి, 'ఇంట్లో ఎవర్రా!' అని అన్నప్ప కేకవేశాడు. లచ్చి లోపలి నుంచి వచ్చింది. దాని ముందు బ్రాహ్మణ పిల్ల ఎందుకు? -

వీళ్ళ యిద్దరినీ చూసి ముందుకేసిన అడుగు వెనక్కు వేయబోయి, అంతలో ఆగింది, యీాయనవంక జూసి తలవంచుకోబోయింది.

'ఒసే అమ్మాయ్' అంటూ అన్నప్ప దగ్గిరగా వెళ్ళి, 'పిల్లవాడు, వాడి పోలికా, నీ పోలికా?' యిలా, నయాన పలుకరించే సరికి, లచ్చికి జంకు తీరి, 'మీరే చెప్పండి!' అంది.

'ఆఁహాఁ - కాని, ముందోమాట చెప్పాలి! అందికే పనివేళా వచ్చాను.'

'ఒకానొక సమయంలో యీ సుబ్బారాముడు, నా అల్లుడైతే బాగుండు

నను కున్నాను.'

'అనుకున్నట్టు జరగలేదు కాని,'

'వరుసమట్టుకు మారలేదు.'

'వాడెప్పటికి నా అల్లుడే – అంటే, నీవు – నా కూతురివి!'

'యిది, బులిబుచ్చికంగా అంటూన్నది కాదేవ్!' –

'సయాం – మా రెండో పిల్లవు!' అన్నమాట!

'పద! మీ చిన్నభడవాను చూపించు' – అంటూ అడుగు లోపలికి వేశాడు. ఈ చెంపను తొట్టిలో పిల్లవాడు ఉన్నాడు. 'వీడికిప్పుడు ఎన్నోనెలే! అర్నెల్లు వెళ్ళినాయ్ కాదూ?' అన్నాడు. లచ్చి తడుముకోకుండా, 'యీ బహుళ పంచమికి యెనిమిదో నెల వస్తుంది' అనడమేమిటి అన్నప్ప పకాలుమని 'వీడెక్కడ దాపురించాడే నీకు? నీ బతుకు బ్రాహ్మణకూడు చేశాడు...' అంటూ పిల్లవాడి బుగ్గమీద వేలితో మీటేసరికి తొట్టిలోవాడు విద్దెంచేయడం ఆరంభించగా 'ఒరే ఒరే! నేను అబ్బవంక చుట్టాన్ని కానురా, అమ్మవంక చుట్టాన్నిరా' అని, పిల్లవాడిని చేతుల్లోకి తీసుకుని, 'యిలాటి నిక్షేపం యిక్కడ ఉంటూండగా, తానక్కడ జంఝూలు సాగదీసుకుంటూ, అలా అఘోరించడం దేనికో, ఎందుకైనా ప్రాప్తం అంటూ ఉండాలి!' అని సంతోషాన ధుమధుమలాడి – 'యింతకూ అసలు కథానాయకుడేడి? చేని దగ్గరకు వెళ్ళాడా. ఒరే బుచ్చీ నీవు అలా పోయిరారా! తంతే పడు! అంటే – మింగు! యివాళ మీ యింట్లో వారం జెప్పుకున్నాం అంటే వాడు పరుగెత్తుకు వస్తాడు! నీవు, నింపాదిగా రా!' యిలా అని, బుచ్చన్నను అక్కడనుంచి పంపించివేసి,–

'అమ్మాయ్! నీవు అడక్కపోయినా, నీ మనసులో ఏమనుకుంటున్నావో నాకు చూచాయగా అయినా తెలియదా?'

'చెపుతా విను–'

'మన గ్రామంలో, ఏ దౌర్భాగ్యుడో తప్ప తతిమ్మా గృహస్థులందరికీ, మీరు ఇక్కడ యిలా సుఖంగా ఉండటం యిష్టమే!'

'అయితే, యీ మాట చెప్పడానికి, యిన్నాళ్ళు పట్టిందేం అని నీవు అడగవచ్చు.'

'ఆ మనిషికి వెరచికాదు.'

'ఏనాటికైనా, దారికి రాకపోతాడా, అని తాత్సారమ్ చేశామ్.'

'దాంతో మునిగింది!–'

'వీడు, అక్కడికి అందుకోసమని రావడం; ఓ తప్పు.'

'ఆయబో, ఆ రగడ మరో తప్పు!'

'వీటన్నింటికన్నా – మా బుచ్చిగాడు, వెర్రిచేష్ట చేయడం శుద్ధ తప్పు.'

'అవునమ్మా! యీ సుబ్బరాముడి నైజం నాకు తెలియదా, నీ మంచి తెలియదా? వాడికి ఏవేవో నూరిపోసి, తండ్రిమీదికి దండు పంపించావని యెవడనుకుంటాడు?'

'అప్పుడు అన్నీ వదులుకునే యిక్కడికి చేరాడు.'

'కాని, మనమేం సన్యాసులమా? పిల్లాపాపా అంటూ కలగడంతో, ఓ అచ్చటా ముచ్చటా అంటూ ఉంటుంది కదా!'

'అక్కడ కట్టుకుబోయేంత ఉంది.'

'అది, ఎవరు తినను? ఇప్పుడిన్ని మల్లాగుల్లాలు పడ్డా ఉత్తరత్ర, వీళ్ళకు కావలసిందే

కదా.'

'వీళ్ళ తగాయిదా ముదరడానికి, డబ్బే అయుండదు.'

'ఆయన మోరకిస్తేనేం, వీడూ మొండికేస్తే, మూడు కోరట్లూ లేవా? జడజీలు ముసలాయన పిలకట్టుకోరా?'

'అసలు, అదికాదు.'

'ఆయనేదో పొల్లుమాట అనుంటాడు.'

'వాడిని నొప్పించాలని, నిన్నూ నీ పిల్లల్నీ అనుంటాడు. అలాటి స్థితిలో, వీడికి ఒళ్ళు తెలుస్తుందా, చెయి విసరక ఏం జేస్తాడు,? ఉప్పూ పులుసూ తినేవాడు.'

'ఎదుట ఉన్నవాడు, తన గర్భవాసాన పుట్టినవాడే, వంశానికి ఒక్కడే, అనే ఇంగితం అన్నేళ్ళొచ్చి, పధ్నాలుగు శాస్త్రాలూ పారజదివిన, ఆ మనిషికే లేకపోతే, బొడ్డూడని వెధవాయ్, వీడికెందుకుండాలి?'

'యింతకూ అన్నిందాలా ఆ తల్లికి వచ్చింది!'

'ఆయనకు యెదురుచెప్పలేదు.'

'వీడిని కంట జూసికోలేదు.'

'దైవం ఆవిడపాలిట ఉంటే, యిప్పుడింత ఎండ మండినా, చప్పున చల్ల బడుతుంది...' అని పిచ్చాపాటిగా చెప్పుకుపోతున్నాడు. లచ్చి వెక్కి వెక్కి ఏడుస్తూ, 'అంతకూ కారణం నేను, తల్లికీ బిడ్డకీ ఎడబాటు చేశాను. తండ్రినీ బిడ్డనూ పరాయివాళ్ళను చేశాను. యిప్పుడు, నేనేం జేసేది? యీ పాపం యెలాపోతుంది?...' అంటే-

'అమ్మాయ్-నిండినింట కూర్చుని యీ రాగాలెందుకే!'

'నవ్వుతూ ఉండు! నాపచేను అదే పండుతుంది!'

'పిచ్చిదానా! నీవు చేసిన పాపం అల్లా, ఒక్కటే!'

'పిల్లాపాపతో, యిల్లా పచ్చగా ఉండటం.'

'యిలాటి పాపానికి ఒడిగట్టేందుకైనా, ఎంత పుణ్యం జేసుకోవాలే! యీ స్వస్తికేంగాని, పెందరాడే కాస్త పప్పూ అన్నం బెడుదూ. చుట్టాలొచ్చారని, నవకాయ పిండివంటలూ జేసేవ్. వంకాయ నాలుగు పచ్చాలు చేసి పోపులో వేసి, ఆనపకాయ మీద యింత నువ్వుపప్పు చల్లి, అరటిదూట మొఖాన యింత ఆవెట్టి, తోటకూర కాడల్లో యింత పిండి బెల్లం పారెయ్. కొబ్బరీ, మామిడీ, అల్లం యీ పచ్చళ్ళు చాల్లే - పెరుగులో తిరగబోత పెట్టి, దాన్లో పది గారెముక్కలు పడెయ్. రవంత శనగపిండి కలిపి, మిరపకాయలు ముంచి చమురులో వెయ్. సరే క్షీరాన్న మంటావా, అదో వంటా? ములక్కాయలు మరి కాసినివేసి, పులుసో పొయిమీద పడేయ్, యీ పూటకు యిల్లా లఘువుగానే పోనీయ్. ఇదిగో! నేనూ స్నానం జేసి వస్తున్నాగాని, ఈలోగా, ఓ అరతవ్వెడు గోధుం పిండి తడి ప్పెట్టూ, రత్తమ్మొస్తే నాలుగు వత్తి అలా పడేస్తుంది... మధ్యాహ్నాం పంటి క్రిందకు వుంటాయ్!-'

లచ్చి నవ్వడం మొదలెట్టింది.

-వంట, రసకందాయంలో ఉండగా, రత్తమ్మ ఇంత బచ్చలకూరా, ఇన్ని వామనగాయలూ, పట్టుకుని వచ్చింది. అవి చూడగానే, అన్నప్ప 'రత్తమ్మప్పా! నాకు బచ్చలకూరంటే ప్రాణమేననుకో, నాలుగు వెల్లుల్లి రెబ్బలందులో రాల్చి, దిమ్మ తిరిగేట్టూ,

తిరగబోతెడితే, ఆహాఁ! యింకా పంచభక్ష్య పరమాన్నాలెందుకు? ముఖ్యంగా బొబ్బట్లలో నంజుకునేందుకు! మాంచి వసరు! యింకా అలా నుంచుంటావేం! మడిగట్టుకో! నీవు కూడా చెయిచేసుకోకపోతే, మా యిద్దరి వల్లా అయేట్టు లేదు.'

రత్తమ్మ యీ మనిషి ఇక్కడ ఉన్నట్టుండి, ఊడి పడటం, యీ వాలకం, యీ మాటలధోరణీ చూసి, ఏమనుకుందోగాని అన్నప్పగారంటే, సకల మంచివాడని, అందరూ యెరుగున్నదే గనుక, ఆయన వచ్చింది, మన మంచికేగాని, మతిబోయికాదు అని రూఢి చేసుకుంది.

ఆ మాటా ఈ మాటా మీద ఆయన ఆంతర్యం తేలడంతో, ఆ మనిషి ఆనందం చెప్పనా!

సరే, వీరిక్కడ యిలా ఉంటుండగా-

ఇంతలో, బుచ్చిగాడు, ఏంజేశాడు చెపుమా! వెళుతూ - వెళుతూ, సుబ్బరాముడి కూతుర్ని చంకనేసుకుని మరీ వెళ్ళాడు.

దారిలో ఒకరిద్దరు ఆసాములు - వీడివంక చోద్యంగా చూశారు. కొందరు చూసి చూడనట్టూరుకున్నారు.

-పొలాలకి అడ్డంబడి సుబ్బరాముడు వస్తున్నాడు.

దూరాన్నుంచి, వీడిని చూసి ఓ పొల్లుకేక పెట్టి, ఉరుక్కుంటూ వచ్చాడు. చేత కఱ్ఱ ధాటిగా పుచ్చుకుని, 'దించరా, నా కూతుర్ని దించు!...'

'మామ చంక నెక్కింది' మరి దిగుతుందా?'

'ఈ బంధుత్వాలు యెప్పటి నుంచి?'

'మాకు బుద్ధొచ్చినప్పటి నుంచి.'

'ఆహాఁ మీ నాయనకూడా, అఘోరించాట్టగా'-

'ఆఁ - పురాణం జెప్పుకుని బతికేవాళ్ళం - పూట గడిచినా గడిచినట్టేగా, పైగా, మీ యింటిని పడి మేయడం, మాకు మామూలేగా!'

'ఇంత సిగ్గులేని ఘటానివేంరా? అవాళ నన్ను పట్టుకుతన్ని, యివాళ నా నెత్తినెక్కడాని కొచ్చావ్? ఇప్పుడు నీ కాళ్ళు విరగేస్తే యెవరు దిక్కు?'

'నువ్వే! చంకనేసుకుని, ఇంటికి జేరయ్యాలి. బావా! లోకం గుడ్డిదైనంత మాత్రం చేత గుఱ్ఱం గాడిదా ఒకటవుతాయా? రెండూ గడ్డితినే జాతిలోవే అయినా, దానికి దాణా అధికం కనుకనే, అవాళ నేనలా ఓండ్రించినా, నీవో సకిలింపు సకిలించేసి ఊరుకున్నావ్, బ్రహ్మసమాజంలో చెప్పినట్లు, దేవా నీవు ఉత్తముండవు - నేను పాతకుండను...'

అనేసరికి - సుబ్బరాముడు, మొగమంత జేసుకుని, వీడినీ, ఓ చరుపు చరిచి, 'చెల్లేశావు? పోఁ - మీ నాన్న మొగంజూసి ఊరుకున్నాను గాని, యీపాటికి నీ పిలక ఉత్తరించి వుండనే'-

'ఉందువే!-'

'నా పిలక ఉన్నా, ఊడినా, ఒకటే! బావా!'

'నీ పిలకంటావా, బహుభద్రంగా వుండాలి సుమా!'

'ఆ వచ్చే అల్లుడికి, అందియ్యద్దూ-'

'ఒరేయ్! అప్పుడైనా నాది పై చేయేరా!'

'ఆ వచ్చే ఏబ్రాసి యెవడో, వెదుక్కుంటూ మా కాళ్ళ దగ్గిరకు రావలసిందే–'

'నీవు పాలెం వచ్చినట్లు–'

'పళ్ళు రాలేను!'

'మనం రాలుగాయలమే!'

'ఏరోయ్! మీ నాన్న చెప్పాడా, ఈ స్వస్తి?'

'స్వబుద్ధే! ఒకళ్ళు చెపితే వినేరకమా మనం!–'

'వినక, మనం – చెడ్డదేమిషోయ్!–'

'సరేలే, ఒరే బుచ్చీ, మనం ఇక్కడ, ఇలా చెడుగుడాడుతూంటే, వీడు ఏమైనాడో అని, మీ నాన్న బెంగెట్టుకునేను; ఊఁ – అడుగటెయ్!'

'ఓయబ్బ ! అల్లుణ్ణనుకున్నావా? ఆజ్ఞ పెడుతున్నావ్?–'

'కావా ఏమిటి? నను పాణిగ్రహణం బొనర్చికదా, నా నాధుడవ్ నీవ, వగయిరా వగయిరా భాగోతంలో లేదూ? అయ్యో పాపం కదా అని, చెయి చాపితే వెంటనే ఒడిసి పట్టుకుని అహో ప్రాణనాధ అంటే! కావాలని చంకనేసుకున్నావ్! మా గడుగ్గాయి నిన్ను వదిలిపెడుతుందా? శాశ్వత బ్రహ్మతల్పంగా నీకీ సవారీ మోత తప్పదు.'

'తమ దయ. ఓ పదేళ్ళపాటు పాలూ మీగడా వేసి పండల్లే పెంచు. ఏదో పండక్కు వచ్చినట్టే వచ్చి బావుకుపోతాను.'

'ఈ లోపుగా–'

'కాశీ వెళ్ళి, కాసిని శాస్త్రాలు నోటబట్టి'–

'గడ్డం మీసం పెంచుకుని, కావడి వేసుకొస్తావా? నిన్ను చూసి బూచాడనుకుంటే?'

'మన పుణ్యం బాగుందని ఒడ్డున పడతాను.'

–ఇద్దరూ నవ్వుతూ, త్రుళ్ళుతూ ఇంటికి జేరుకున్నారు.

ముందు సావడిలో రత్తమ్మ పిల్లవాడిని ఒళ్ళో కూర్చోబెట్టుకుని వుంది. అన్నప్ప భామ వేషగాడల్లే తిప్పుకుంటూ, తారంగం పడుతూన్నాడు. వీళ్ళను చూడంగానే–

'ఏమయ్యా, సుబ్బరాముడూ, ఏ వేళనగా వెళ్లావ్' ఇప్పుడా రావడం? ఇంటికి అతిథీ అభ్యాగతీ అంటూ వస్తే, నీవు దయచేసేదాకా నోట్లో వేలేసుక్కూర్చోవలసిందేనా? అవునులే,'

'పెద్దలు ఊరికే అన్నారా? 'కారుణ్య వార్తాక్యహిరణ్య హర్తుః' అంటే ఏమిటో తెలుసునా రత్తప్పా, 'బంగారం దొంగిలించువాడు పరులమీద జాలి దలుచునా?' అని.'

'తేరగా దొరికింది వీడికీ బంగారు తల్లి.'

'ఆకలి దప్పిక లుంటాయా?'

'ఈ అన్నప్పలాంటి లాకాయి లూకాయిగాళ్ళు కంటి కానతారా? ఇహనైనా వేగిరం తెమిలి వచ్చి, ఇంత ఆపోశనం వడ్డించు'–

అందరి భోజనాలూ అయినాయి.

'ఒరే బుచ్చీ, నీవిహ ఇంటికి నడు, నేను తెల్లవారేసరికి వస్తానని అమ్మతో చెప్పు!' అని పంపించివేసి, ఇంట వున్న వారందరూ పిచ్చాపాటి అనుకుంటూండగా, ఆసాములు ఒకొక్కళ్ళే, అన్నప్పగారిని చూడటానికి వస్తూండటంతో, యీ సభకు ఇల్లు చాలదని, అందరూ కలసిపోయి నిమ్మతోట మలుపులో మెరాబాలో చదికిలబడ్డారు.

కాస్సేపట్లో ఊరు మొత్తం అక్కడుంది. 'అయ్యా, నాలుగు మంచి ముక్కలు మా చెవిని వేయం'డన్నారు. అంతకంటేనా అంటూ అన్నప్పగారు అందుకుని, సీతమ్మవారిని స్మరించుకుని–

'జనక మహారాజులవారు యజ్ఞంచేయ తలపెట్టి, అందుకుగాను ఏటి ఒడ్డున భూమి దున్నించుతూండగా, యజ్ఞం చేయకముందే యజ్ఞఫలం దక్కినట్లు, ఆయనకు సీతామహాదేవి లభించడమున్నూ–'

అంతకు కొన్ని సంవత్సరాలకు క్రితం, దశరథ మహారాజు ఎవరో అయ్యను బ్రతిమాలుకుని తీసుకుని వచ్చి, పుత్రకామేష్టి అంటూ ఒకటి చేసి, సతమతమైన మీదటకాని, ప్రసాదమంటూ లభించకపోవడం, ఆ లభించినపుడైనా ఇంట ఒకరికి ముగ్గురు ఆడంగులు కావడంతో యెవరి మనసూ నొప్పించకుండా యెలా పంచి పెట్టడమో తెలియక, కొంత గజిబిజి కావడమూ, తరువాత వాళ్ళలో వాళ్ళు సర్దుకుపోవడం, సంతానవతులు కావడమున్నూ జరిగిందికదా!

దశరథుడంటే ఆడంబరం కోసం భుజకీర్తులు కట్టుకుని అవలంబనంగా, అంటే, చేతి కర్ర మోస్తరుగా, ఖడ్గాన్ని వాడుకునే మనిషా? దేవతలకి, అసురులకీ, అక్కడ మాటా మాటా ముదిరే సరికల్లా, వెంటనే ధనుర్బాణంబులతో తాము వేగిరం వచ్చి, యీ ముప్పు దాటించవలసినదని, వీరికి వర్తమానం రావలసినదే కదా!

అలాంటి వాడికి, కడుపున ఓ నాలుక్కాయలు కాయడానికి, యీ ఒక్క ప్రత్యుపకారం, యీ రవంత వరం, ఆ దేవతలు చేయగలిగారా, ఇవ్వగలిగారా? ఊహు – వీరు ఆ యజ్ఞ పురుషుడైన ఆదినారాయణమూర్తికి అర్జీ దాఖలు చేసుకోవడమూ, వారు మంజూరు చేసిన మీదటనే, ఫలసాయం చేతికి అందడమున్నూ జరిగింది కదా!

ఈ దేవతలున్నారే, వీరిలో ఒక్కరికి సంతానం వుందా?

కనుక మరొకరిని, అలా దీవించేందుకు తగిన యోగ్యతా లేదన్నమాటేగా! అవునయ్యా, మనకే లేనిది, ఇంకొకరికి ఏం బెడతాము!

వీళ్లు అన్నందినే మనుషులా? అమృతం త్రావినవాళ్లు!

ఇరవై అయిదేళ్ళకు మించి పైకి యెదగనివాళ్ళు !

కన్ను మూయడమన్నదే లేనివాళ్లు, కల్పవృక్షచ్ఛాయను కలకాలం వుండవలసినటువంటివాళ్ళు, –

కాని, వీళ్ళకు ఈ సంతానం లోపం ఏమిటంటారా? చెట్టును పెంచేవాడికి, యెన్నటికన్నా కాయంటూ కంటికి కనిపిస్తుంది, కాని, యెదిగిన మొక్కను తెగేసేవాడికి ఫలమేమిటి, దొరికేది పొయిలోకి వంటసరుకేగా? యీ దేవతలున్నారే, వీళ్లు యుద్ధ కాములు. మాట్లాడితే ఆ అసురుల మీదకి ఒంటి కాలిమీద లేవడం, భంగపడి, ఏ కొండల్లోనో దాక్కోవడం, వాళ్ళకు పరిపాటైపోయింది. ఆ దేవరాజున్నాడే, దేవేంద్రుడు ఒకనాడు ఇంటిపట్టున వుండి, వేళపట్టున ఇంత అమృతం పుచ్చుకొన్నపుణ్యాన పోయినాడా? ఇల్లూ వాకిలీ పెళ్ళాం బిడ్డల్నీ వదలిపెట్టీ, తన చిరునామా పగవాళ్ళకు తెలియరాకూడదా, యెక్కడో తల దాచుకోవడమే కాని !

తెలిసిందా బాబు ? అందరినీ చల్లగా చూడాలి అనే అభిప్రాయం మీద వున్న ఆదివిష్ణుమూర్తివారు హాయిగా పాలసముద్రం మీద పవ్వళించి, వున్నాడు!

యెదుటివాడు, నోరెత్తితే, మూడో కన్ను తెరుస్తానని అట్టహాసం చేసేటటువంటి సదాశివుడు కొండల్లో కోనల్లో వుంటున్నాడు.

అయితే, ఇద్దరికీ పిల్లా పాపా అంటూ యెందుకు లేకుండా పోవాలీ అని అడగొచ్చు. వీరుభయులూ కూడా, అప్పుడప్పుడు చేతికి పొరపాటున అందినటువంటి అసురులను శుంభంతాం చేయడమే కాకుండా, వారి తాలూకు మహానగరాలను మూడింటిని భస్మీపటలం చేయలేదూ, అది ఊరికేపోతుందా?

యత్కించిత్ పుణ్యాన – ఇల్లు పాలసముద్రము అయింది. కాని, పిల్లా పాపా లేకపోయినాక, ఆ పాలెవ్వరు త్రాగను?

సరే సదాశివుని విషయం అందామా, –

వీరూ, ఆ కుబేరుడూ, ముప్పొద్దులూ భుజాలు రాచుకుంటూ తిరిగేవారయినా ఈ గృహస్థుకు సదా గోచిపాతకైనా కొరతే!

ఇదంతా యేమిటంటారు?

చేసిందానికి చక్రవడ్డీయే కదా!

అది అలా వుంచు, జన్మంతా తీన్‌తార్‌గా వున్న ఆ దేవేంద్రుడికి పిల్లలున్నారు గదా అనరేం?

లేకేం, నిక్షేపంగా వున్నారు.

ఒక్కడే మొగపిల్లవాడు జయంతుడు. అతగాడు మన్మథుడంతవాణ్ణి అంద చందాలలో 'అలా ఆగరా బుల్లోడా!' అనగలిగిన ధీమా ఉన్నటువంటివాడు. పైగా అది దేవ రహస్యం కనుక మనకు సిసలుగా వైనం దెలియదు కాని, రంభ వున్నదే, అంటే యెవరు? ఆ అప్సర స్త్రీలకు అందరికీ నాయికసాని. ఆవిడ మనవాడి విషయంలో అమిత కుతూహలం కనబరుస్తుందట! అదెలా? వాళ్ళకి మనలాగా మాటిమాటికీ రెప్పవాల్చే అగత్యం లేదుకనుక యెంతసేపైనా నిలకడగా చూస్తూనే వుండచ్చు. కానీ వున్నవి రెండు కళ్లేగదా! వాటి వల్ల నేమౌతుంది! కాబట్టి దేవరాజును నాట్యంజేసి మెప్పించి కొన్ని యుగాలపాటు ఆయన ధరించేటటువంటి ఆ వెయ్యి నేత్రములున్నూ యెరువు తీసుకుని చూసిందై, అప్పటికి గాని కొంతవరకు తృప్తి చెందినది కాదట!

అలాటివాడు మంచి హోదాలో వచ్చినట్లు కాని వారసత్వంగా అన్నా ఆ ఉన్న ఒక్క లోకాన్నే పరిపాలించినట్లుగాని వినమే!

యిహ పిల్లదాని విషయం.

పేరు మట్టుకు జయంతి అని తెలుసును కాని, పెళ్లైందా? అయితే ఎవరి కిచ్చారు? ఏమన్నా కులగోత్రాభివృద్ధి కలిగిందా? ఏమీ తెలియకపాయె! అంతవాడి కడుపున పుట్టడమేమిటి; అలా నామరూపాలు లేకుండా, సదరు జనాభాలో కలిసిపోవడం ఏమిటి?

ఏమిటిదంతా? –

తండ్రులు ఏవో అవకరపు పనులు చేయడం – అది, పిల్లలనెత్తి అడచడం తప్పుతుందా?

మరో సంగతి చూడండి! మన్మథుడు, శ్రీ మహావిష్ణువుకు పుత్రుడువంటి వాడు కదా! వంటివాడు కదా ఏమిటి – ఆ తలిదండ్రుల యొక్క అనంత ప్రాణాలు వాడిమీదనే కదా! కన్న మమకారం కన్న, పెంచిన మమకారం మరింత పట్టిపీడించేది కదా? అతి

గారాబంగా, దివ్యాతిదివ్యంగా, వాడిని పెంచడంచేత, వాడో కొరకరాని కొయ్యగా తయారై కాస్త లేత హృదయమంటూ కనపడితే, అందులోకి అమాంతం జొరబడి అక్కడే తిష్ఠ వేస్తూ - కంటికి నదరైన ఆడకూతురుగాని, బుద్ధి రెపరెపలాడే మగపిల్లవాడు కాని, కనపడ్డారో, ఉన్న బాణాలన్నీ వాళ్ళమీద ద్రిమ్మరించి, కుయ్యోమొర్రో మనిపించడం - యిలా ఆతతాయితనం చెలాయిస్తూ వచ్చాడా లేదా ? అది విష్ణుమూర్తి వారిమీద ఉండే భక్తి గౌరవాలచేత నైతేనేం, చేతగానితనాన అయితేనేం, ముల్లోకాలవారూ ఆ బాధలు సహిస్తూనే వచ్చారు కదా!

–కాని, సదాశివుడి మీద, యీ చిలిపితనం చేయబోయేటప్పటికి వాడేమైనాడు?

భస్మమైనాడు. అదేం పాపం అంటారా?

అంతేమరి.

మన్మథుడంటే సాంబశివుడికేమన్నా పరాయివాడా?

విష్ణుమూర్తికీ తనకూ మమేకం గదా!

పైగా, త్రిపురములను దహించే సందర్భం వచ్చేటప్పటికి అప్పటికి వారి కుండుకున్న మందుగుండు సామగ్రి చాలకపోవడంతో, విష్ణుమూర్తి - బాణమైతేనే కాని, అది సాంగం కాలేదు కదా!

అల్లా తనకు, అవసరానికి అక్కరకు వచ్చినవాడి పిల్లవాడే అని జాలి దలచాడా? మీదికి ఒక బాణం వేశాడో లేదో మూడో కన్ను తెరిచాడు!

యిదంతా ఏమిటంటారు?

చేసింది తండ్రి! చెడింది కొడుకు!

కనుక, దేవాదిదేవులే కాని, మామూలు దేశవాళీ మనుషులే కాని, ఎదుటివారి మేలెంచకబోతే, తమ పిల్లాపాపలతో, చల్లగా ఉండటమనేది కల్ల! ఎక్కడోకొడితే, ఎప్పుడో ఒకప్పుడు అది ఎక్కడో తగులుతుంది సుమా!

ఆఁ - బండీ డొంక పట్టింది! రాదారి మళ్ళిద్దాం!

ఈ దేవేంద్రుడికి, పిల్లలెందుకు ఉన్నారూ - అనే మీమాంస వచ్చింది! అనుకూలవతియైన భార్య యింట్లో మెలుగుతూంటే, మరే యితర వ్యాపకాలూ లేని మగవాడైతే, పిల్లలు కలుగక ఏం జేస్తారు? యింద్రుడు మొదట్లో బుద్ధిమంతుడే, కాని, యీ యుద్ధాల రగడలో పడిన తరువాత, యింకా యింటి మీద ధ్యాస ఉంటుందా?

నేడో రేపో అక్కరకు రావలసిన పిల్లలున్నారని జ్ఞాపకం ఉంటుందా–?

తన పరిస్థితి అట్టిట్టయితే, వాళ్ళ భవిష్యత్ ఏం కాను, అనే జ్ఞానం ఉంటుందా? లేదు కనుకనే, ఒకసారికి పదిసార్లు ఓడిపోవడం సంభవించిన మీదటనైనా, వివేకం తెచ్చుకోకపోగా, తనంతవాడు లేడనే ధీమా కొద్దీ గౌతములవారి ఆశ్రమ ప్రాంతంలో, ఏదో కోడికొక్కిరింపు చేయడంతో, అటు దేవతలలోనూ, యిటు మనుష్యులలోనూ కూడా తల ఎత్తుకు తిరగడానికి వీలులేని స్థితికి రావడం మనమందరం వింటూన్నదే కదా!

కనుక, మనిషికిగాని, దేవుడికి గాని, ధర్మం అనేది ఒక్కటే–

బాగోగులు కూడా సరిసమానమే!

సరేనయ్యా, దేవతల మీద పెట్టి మనుషులకు బుద్ధిచెప్పాలా? మొఖాన అనేస్తే పోదా? అంటారా?

మాట వరుసకు ఎల్లయ్యా నీవు, ఫలానా పుల్లయ్యని చూసి నేర్చుకోరాదా? వాడి పాటు చూసి బుద్ధి తెచ్చుకోరాదా అంటే వింటాడా?

అలా చెప్పిన వాడిని మన్నిస్తాడా?

ఎదుటివాడికన్న నేను గొప్పవాడిని! నా కొకడు చెప్పవచ్చేవాడా అనే సర్వజ్ఞత్వం, అంటే ఒక విధమైన గోరోజనం – హక్కు – భుక్తం చేసుకున్న మనుషులు అన్ని కాలాల్లోనూ ఉంటారని తెలుసును గనుక, ఏనాడో ఆ మహాపురుషులు, దేవతల మీద పెట్టి, మనకిలా బుద్ధి చెప్పారు! రుషులు చెప్పినదానికి విలువ ఉన్నదని నమ్మకం ఉన్నవాళ్ళు బాగుపడుతూనే ఉన్నారు.

వయస్సు చిన్నదైనా, తన మంచి తాను తెలుసుకోవడమే కాకుండా, నలుగురితోనూ మంచిగా ఉండటం మన మంచికే అనే గ్రాయకం ఉన్నవాడు, హాయిగా తల ఎత్తుకుని తిరుగుతున్నాడు.

తమకు తోచక – యింకొకరు చెప్పితే వినే నేర్పు లేక, ఎవరి దోవను వారు బాగుండటం సహించే ఓర్పులేక, విస్సన్న చెప్పిందే వేదం అనే మొండి పట్టుమీద ఉండేవాళ్ళు – ఎంత వయస్సు వస్తే ఏం లాభం, ఎన్ని సంపదలుండి ఏం ప్రయోజనం, – కన్న బిడ్డలను దూరం జేసుకుని, యిహానికి పరానికీ దూరమైపోతున్నారు.

మనుషుల పేర్లతో మనకు నిమిత్తం లేదు.

ఇది మన కళ్ళ ఎదుట జరుగుతున్నదే.

నాగేటి చాలులో పుట్టి, మిథిలానగరం అనేటటువంటి రుషి వాటికలో పెరిగి, తన అత్తవారి వంగడమైన ఆ రఘువంశానికే, ఆ సూర్యభగవానుని యొక్క కులానికే, శాశ్వత కీర్తి ప్రతిష్టలు చేకూర్చినటువంటి, ఆ సీతా మహాదేవి, ఆజన్మ పరిపూత, ఆ జనక రాజర్షి కుమార్తె, విశాలమైన నేత్రములు కలిగి చల్లని చూపులు చూసే తల్లి ఆ మైథిలి ఆ వైదేహి – మన యీ దంపతులను, వారి సంతానమునూ, నిత్యదీవెనలిచ్చి రక్షించును గాక – శ్రీ జానకీ వల్లభ స్మరణం...

యిలా కాలక్షేపం జరిగింది.

అప్పటికి – ఏమంత ప్రొద్దు పోలేదు.

భోజనం వేళే కాలేదు.

అయితే మట్టుకు – తనకా ప్రమేయం లేదాయె?

రెండు అరటిపళ్లు తుంచి నోట్లోవేసికోవడం.

ఒక్క క్షణం ఆగి, యింత మజ్జిగ పుచ్చుకోవడం! – అంతే! నాలుగు అడుగులు నడిచారో లేదో – ఉన్నట్టుండి 'నాయనా! యిటు యింటికి నడుస్తాను–' అన్నాడు అన్నప్ప!–

'అదేం, ఒక్కపూటతోనే మొహం మొత్తిందా?'

'అదేం మాట! యింత రాజాంగంగా యింటి దగ్గిర మాకు సాగుతుందా! గాలి అటు మళ్ళింది! కాలూ అటే సాగుతూంది!'

'ఔను, బాల కుమారుడి వాయెను!'

'కానుషోయ్! – వయస్సంటే వంటిమీదికి వచ్చింది కాని మనస్సింకా మనుగుడుపుల్లోనే ఉందన్నాట్ట వెనకటికి నా వంటి వాడెవడో! – నాయనా, యిది యివాళ్టి ముచ్చటా? యీ శుద్ధ తదియకు, సరిగ్గా, మా అన్యోన్యానికి అర్ధషష్టిపూర్తి. దాంపత్యం

అనేది, తమలపాకు లాటిది. ఆదిలో, – లేతలౌజు, – ఆపై కవటాకు, పైపై పండుటాకు! దాంపత్యమంటే, తాంబూలమంటే, ఆద్యంతం రసవంతమే కాదుషోయ్!'

'ఆహాఁ! నిన్ను ఆపనుగాని, అటో అడుగేస్తే – మన వాళ్ళతో చెప్పి వెళ్ళవచ్చునుగా!'

'వెళుతున్నది కాశీయాత్రకా! యిహనుంచి వారానికి ఓ విడతో రెండు విడతలో, వస్తూండేవాడినే కద?'

'యీసారి ఒక్కడవే వస్తావా? అత్తయ్యను కూడా వెంటబెట్టుకు వస్తావా?'

'వచ్చేరోజు వస్తే ఒక అత్తయ్యన్న మాటేమిటి అందరూ పెళ్ళగిలి వస్తారు.'

'ఒరేయ్ – నీ వూహ నాకు తెలియదనుకున్నావా? నీవిల్లా పచ్చగా ఉండటం, మీ అమ్మవచ్చి చూడకపోయెనే – వల్లగాక పాయెనే అని, నీ బాధ! ఉండదూ! అది సహజం;

'ఆ యిల్లాలికి మటుకు ఉండదూ?'

'కాని, యీ మ్లేచ్ఛుడు, కలిసొస్తేనా?'

'కాని, యీ ఆగడం ఎంతకాలమో, అదీ చూద్దాంగా!'

'అబ్బాయి, అందరూ నీ మేలుకోరేవారే.'

'అది మరచిపోకు!'

'అటు నుంచి నరుక్కొచ్చేందుకు, నేనున్నాను.'

'యిహ, నన్ను పోనీ,' –

సుబ్బరాముడికి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

'మామా! నా మూలంగా మా నాన్న నలుగురి నోళ్ళలోనూ పడాల్సి వచ్చింది. సంతానం కలిగితే ఉత్తమ గతులు కలగడం మాటేమోకాని, బతికుండగానే యిలా అధోగతి పాలుకావడం, యిది వారి పాపమా, మా పాపమా! కావాలని కాళ్ళు గడిగి పిల్లనిస్తే, ఆ దౌర్భాగ్యుడు అట్లా చేశాడు: వాడంటే పరాయివాడు; కడుపున పుట్టిన నేను చేసిన నిర్వాకమేమిటి? ఎవరి కుదురులో వారుండటమనేది తరతరాల నుంచి వస్తూందే, దాన్ని తలక్రిందులు చేయడానికి, అది మన మంచికేగానీ, నేనేం మంత్రద్రష్టనా, మహర్షినా? అదీగాక ఆదిశంకరుడంటే విషం బుచ్చుకున్నా నిభాయించుకున్నాడు కాని, అది అందరికి సాధ్యమౌతుందా? మా నాన్న అట్లా అయిపోవడానికి నిజం చెప్పాలంటే నేను కారణం కాదా? మా మట్టుకు మేము లక్షణంగా ఉన్నాం, కాని, మా వాళ్ళను తలచుకుంటే, నాకు నిద్ర పట్టదనుకో, మొన్న యీ రగడ జరిగినప్పటి నుంచీ మరీ అయోమయంగా ఉంది. దీనికి విమోచన ఏమిటి? ఎన్నటికీ? లేక, యీ జన్మకు యింతేనా?'

'యిహ ఆపు! పై గ్రంథం నాకు అర్థమయింది.

'దా యిలా కూర్చుందాం! – నిలవేసి అడిగావ్ నిజమే. యిది నిలుచున్న పాళాన తేలేదా? ఎదుటవారికి లేకపోతే మనకన్నా నిదానం ఉండాలి కద?'

'అఁ' ఏమన్నావ్? యీ జన్మకు యింతేనా అని కాఁవూ, అదేమిట్రాబ్బాయ్! హిమాలయ పర్వతం మీద విరుచుకు పడ్డట్లు అలా యిదౌతావ్! నీ చేతిలో పని! అనుకుంటే క్షణం పట్టదు! యీ కామాటం దులిపేసుకుని పోయి ఆయన కాళ్ళట్టుకుని, "బుద్ధొచ్చింది నాన్నా" అంటివట్టాయెనా వేంటనే కావిలించేసికుని, దర్భ కాల్చిపెట్టి మళ్ళీ తమలో

కలుపుకుంటారు.'

'ఆరాధనాయ లోకానాం - వగైరాలు ఏకరువు పెట్టి - ఆనాడు శ్రీరామ చంద్రులవారు అలా చేయగా లేంది - ఆ పేరే పెట్టుకున్నందుకు, - నీవు తక్కువ తింటే ఎట్లారా?'

'నీకు నీ తండ్రే లోకం - వారి శ్రీచరణ సన్నిధిని కూర్చుని భజన చేస్తూ, ఆ ఆస్తికి వంగి వంగి సలాములు చేస్తూ, జన్మంతా మైనారిటీ వెళ్ళనట్టుగానే, కాలం వెళ్ళమార్చుకునేందుకు పుట్టావు గాని, పిల్లాజెల్లాతో ఉండి, 'నేనూ ఓ మనిషినే అనిపించుకునేందుకా?'

'మామయ్యా! ఏడ్చేవాడిని పట్టుకుని యద్దేవా చేస్తావెందుకూ?'

'చెంప వాయగొట్టేందుకు చెయిరాక! ఒరే నాయనా! ఏడ్చే మగవాడిని నమ్మ రాదని పెద్దలు అంటారు రా! అందరూ ఈ అన్నప్ప లాటివాళ్ళే ఉంటారా - నీ మంచి అర్థం చేసుకుంటారా? ఇలాగే మరో ఆసామి ముందు బిగలా పడ్డావనుకో! అప్పుడు చటుక్కున వాడు ఏమనుకుంటాడు?'

'వీడికి యింటి దగ్గర లప్ప పడేడుస్తూంది, దాన్ని సాముకోకుండా, యీ బలుసాకు బతుకేమిటని, - ముందున్న మోజు కాస్తా తీరిపోవడంతో అయ్య మీద సాకుబెట్టి ఈ ఎత్తువేశాడు. ఎప్పుడో దాని పుట్టే ముంచుతాడు. అసలు వెలనాటి వాడంటేనే వేయిళ్ళ పూజారి. అందులోనూ నల్ల బ్రాహ్మడు!...'

'రామ రామ!'

'అనుకోగానే వాడు దిగి వచ్చి నీ పక్షాన సాక్ష్యం యివ్వడు. ఇది వెంకయ్యతో, పుల్లయ్యతో కూర్చినపని. దమ్మిడీ చెయ్యని వాడల్లా ఆడిపోసుకుంటాడు. ఎందరి నోళ్ళని మూస్తావ్? అయినవాడూ కానివాడూ కోడై కూస్తూంటే నీకు అన్నం సయిస్తుందా? నీ నిజాయితీ యేమిటో నీ మనసుకు తెలుసు. నీ లచ్చుమ్మకు తెలుసు. బయట వాళ్ళకి నీ ఆంతర్యంలోకి జొరబడాల్సిన అవసరం ఏముందిరా! మన నోటి వెంట ఒక్క ముక్క రావడం తరువాయి; దాని సంగతేమిటి - సందర్భమేమిటని నిదానంగా ఆరా తీసి ఆపేక్షపడేవాళ్ళు ఎంతమంది వుంటారు?... సందు చిక్కితే చాలు; పట్టుకుని దూదేకినట్టు ఏకడానికి ప్రతివాడూ సిద్ధమే! అదీ గాకుండా కాస్త పచ్చగా వున్నవాళ్ళు కాలు జారితేనో, నోరు జారితేనో వెక్కిరించని వాడు - అంటూ నూటికీ, కోటికీ ఒక్కడుండేనేమో! ఇది గుర్తుంచుకో!'

'నీ మానాన నీవు యిల్లు విడిచి వచ్చావ్!'

'ఈ నిర్వాకం జేశావ్! ఇంతవరకూ బాగానే వుంది.'

'ఇహ ముందైనా నీవూ, నీ పిల్లలూ లక్షణంగా ఉండాలి అంటే - ముందు నీ మంచి నీవు చూసుకో! అవతలి వాళ్ళ కోసం అఘోరించడం మానెయ్!'

'అవునురా! తనకు కానినాడు తండ్రి పినతండ్రితో సమానం!'

'ఆవేశం మీద అంటూన్నది కాదు; ఖచ్చితం!'

'వారి పుణ్యం బాగుంటే మనుమల్నీ, మనుమరాళ్ళనీ ఎత్తుకునే యోగమంటూ ఉంటే, ఇప్పుడు బిర్రబిగిసినవారే దారికి వస్తారు.'

'రారో - ఎక్కడి వారక్కడు గుప్-చుప్, మరో ఆలోచనే వద్దూ అంటా!'

'ఏం?–'

'అలాగే మామయ్యా?'

సుబ్బరామయ్య యింటి దారి పట్టాడు. అన్నప్పగారు వాడి వంక ఓ క్షణం పరకాయించి – ఫ్చ్! గండభేరుండం కడుపున గంగిగోవు పుట్టింది! – అనుకుంటూ నడక సాగించాడు.

మధ్యమధ్యలో మనిషికి నవ్వొస్తూంది. ఉన్నట్టుండి ఆశ్చర్యం వేస్తుంది. తాను ఎందుకలా చేసినట్లు? అవధానులు గారి కొడుకును వెనకేసుకు రావడం, ఆయన మీద కసి దీర్చుకునేందుకా?–

కసి ఎందుకుండాలి?

ఆయన కుమార్తె వివాహం సందర్భంలో తన మీద అకారణంగా అభాండం వేశాడని – ఆ రోజుల్లో తాను పైకి అనకపోయినా కొంత మంటగా ఉన్నమాట నిజమే! కాని, అది యిందాకా కూచో వచ్చిందా; ఎబ్బే! అదేంకాదు.

అయితే అవధానులుగారి కుటుంబ వ్యవహారాల్లో తాను యిన్నాళ్ళూ లేనిది ఇప్పుడు జోక్యం కలిగించుకోవలసిన అగత్యం ఏం వచ్చింది? బుచ్చిగాడి దుండగీతనం పరిసిపోయేందుకు సుబ్బరాముణ్ణి దువ్వాడా?

లేదు అని అట్టె తీసిపారెయ్యడానికి వీలులేదు.

ఏ మాటకు ఆమాటే చెప్పుకోవాలి. అవధానులుగారు కొండ విరిగి మీద పడినప్పుడల్లా తన గోడు ఇంకోడి దగ్గర మొరట్టుకున్నాడో! కుంగుతున్నాడో, కుములుతున్నాడో ఆయన బాధ ఆయన పడుతున్నాడు కాని, దండోరా వేయిస్తూన్నాడా?

ఇంకొకళ్ళ పెట్టుపోతలకేమన్నా ఆశిస్తున్నాడా?

దైవం తన కింత యిచ్చినందుకు ఎంత మందిని ఎన్ని విధాల కనిపెట్టలేదూ! ఎవరిమాటో ఎందుకు... తానూ వారివల్ల ఏదో పేరు మీద కాసో వీసమో ఉపకారం పొందినవాడే కదా?–

వాళ్ళ చిట్టెమ్మ కాపురం అస్తావిస్తం అయినప్పుడు లోకరివాజు ప్రకారం నలుగురితో బాటూ తానూ – అయ్యో పాపం అని ఊరుకున్నాడే కాని; కత్తో, గండ్రగొడ్డలో చేతపట్టి బందరు పరుగెత్తాడా?

అధమం అవధాన్లగారితోబాటు తానూ రాత్రిళ్ళు అభోజనం ఉంటున్నాడా?

ఈ సుబ్బరాముణ్ణి మట్టుకు చిన్నప్పటినుంచీ తానేం మహా ఎత్తి ముద్దు చేశాడా? ఇవాళ ఇంత ఆపేక్ష అమాంతం పుట్టుకు రావడానికి హేతువేమిటి? ఎన్నేళ్ళబట్టో పరిచయం ఉండుగాక! ఎదుటి వాళ్ళంటే తనకు ఎంతో గురి వుండుగాక! ఎవరి హద్దుల్లో వారు ఉంటూనే కాలక్షేపం జేయడం జరుగుతూన్నది. కాని, ఇలా ఒకరి యింట్లో ఒకరు జొరబడి వరుస కలిపి, బ్రాహ్మణార్థం చేసి వాళ్ళ కూనాగుడ్డునూ నెత్తికెక్కించుకుని – ఈ ఆర్భాటాలు ఎన్నడయినా ఉన్నాయా? వాళ్ళ ఇంట్లో తిష్ఠవేసి తిండి తింటేకాని, తనమాట నమ్మరేమోననీ, తన మంచితనం రుజువు కాదేమోననీ తాపత్రయంకొద్దీ గాకపోతే–

తానేం వీరికి అమ్మవంక చుట్టమా, అబ్బవంక చుట్టమా? బుచ్చిగాడు యీ లొగ్గిడి చేయకపోతే, రేపీ పాటికి మళ్ళీ తండ్రీ కొడుకూ ఏకమైతే పట్టుకుని ఒక్క ఊపు ఊపుతారేమో అనే భయం లేకపోతే తానిలా ముందుకు దుమికేవాడా!

యదార్థానికి ఇది తన పుచ్చె కాచుకునేందుకు చేసిన లౌక్యం కాక మరేమిటి!

అయితే యిలా ఊబిలో దిగడం లౌక్యమౌతుందా?

ఊళ్ళో వాళ్ళకి ఏమని సంజాయిషీ చెప్పడం?

కులం మాటేమిటి? వెలేశామని మొగం మీద అనకపోయినా, అందరూ ముభావంగా వుంటే? యీ పై తాను ఊళ్ళో ఉండడమా? కాలికి బుద్ధి చెప్పడమా? మరెక్కడికన్నా పోతేమటుకు వాళ్ళ నడుమ ఎలా ఉంటాడు?

ఛస్! ఏమిటీ వెర్రి ఆలోచనలు?

ఎవడు నన్ను వెలేసేది? ఒకరి దయాధర్మబిచ్చాన బతుకుతున్నానా? బలాబలాలు తేల్చుకోడం దాకా వస్తే ఒక పట్టు పట్టనా?

మంచికి పోతాం! మనకి చింతేమిటి...?

అనుకుని జుట్టు ఝాడించినట్టు తల విదిలించి యిలాటి ఊహాలన్నీ దులిపేసుకున్నాడో లేదో ఊరి మొగదలకు వచ్చేశాడు. అంతవరకూ గమనించలేదు. కాలికి అలవాటైన దారి గనుక గతుకుల బడకుండా వచ్చేస్తున్నాడు.

చీకటి చిక్కబడ్డది–

ఎదురుగుండా రెండు లాంతర్లు ఊగుతూ హడావుడిగా వస్తున్నాయి. ఏమా అని తానూ అంగ భారీగా వేశాడు.

మొహాలు కనిపించాయి. ఏమిట(్రా అన్నాడు.

'నీ కోసమే మామా!'

'మా బుల్లక్కయ్యకు నెప్పులొస్తున్నాయ్.'

పొద్దున్నుంచీ–

మరీ మూగతీతగా ఉంది;

కాస్త తీర్థం యియ్యి.

అన్నప్ప 'ఆc! ఆc! నిమిషంలో వస్తా' అంటూ పరుగు పరుగున యింటికి వెళ్ళి నూతెడు నీళ్ళు స్నానం చేస్తూ జపం కానిచ్చి తీర్థం చేతబట్టుకుని బుచ్చిగాడ్ని లాంతరు పట్టుకోమని, వెంకటపతిగారి యింటికి వెళ్ళాడు. ఇంటి ముందరే ఆయన వెర్రెత్తినట్టు తిరుగుతున్నాడు. అన్నప్పను చూడగానే 'బావా! నీ కడుపు చల్లగా మమ్మల్ని ఒడ్డున పడెయ్ తండ్రీ! సంజెవేళ నుంచీ అక్షులూ పక్షులూ ఆలకిస్తున్నాయ్. వినలేక పోతున్నాం!' అంటూ వెనువెంట లోపలికి వచ్చాడు; నడవలో, ముందు సావడిలో క్రిక్కిరిసి ఉన్నవాళ్ళు దారి ఇచ్చారు. వసారా గది గుమ్మంముందు వెంకటపతి అప్పగారు, జానకమ్మ అప్పుడే స్నానం చేసినట్టుంది. ద్వారబందానికి చేతులు జాపి, మా తల్లే మా అమ్మే భయం లేదమ్మా! లేదమ్మా! ఇహ ఎంత సేపో కాదమ్మా అంటూంది. అన్నప్ప చేతిలో తీర్థం పంచపాత్ర అందుకుని లోపలకు ఒక్క గంతు వేసింది. ఒక్క నిముషం నిశ్శబ్దము – పిల్లది దద్దరిల్లేట్టు మూల్గింది. కొండలపెట్టు కెవ్వుమంది. వెంకటపతి ఏడుకొండలవాడా! తండ్రీ! అన్నాడు. ఒరే! నీకు మనవడుట్టాడురా! అని జానకమ్మ కేక పెట్టింది. ఇహ మీరందరూ పొండవతలికి! అంటూ విసవిస యివతలికి వచ్చింది. వెంకటపతి గుణకారం మనిషి కావడంతో, వేళ్ళు లెక్కపెడుతూ పిల్లవాడి జాతకం ధ్యాసలో పడిపోయినాడు. అన్నప్పకు అది తెలుసును గనుక పలుకరించకుండా చక్కా వచ్చేశాడు.

బుచ్చిగాడికి అప్పటికప్పుడే నిద్ర తూలుతూంది. వాళ్ళమ్మను చూసి 'మగపిల్లాడు' అని కేకేసి, ఇంట్లోకి వెళ్ళి నిద్రకు పడ్డాడు. అనంతలక్ష్మి పొడి ధోవతి తెచ్చి యిచ్చింది. పింజ పట్టుకు దులిపి కట్టుకుని, తల ఒక్కసారి తుడుచుకుని ఇద్దరూ ఒక్కచోట చతికిలబడ్డారు.

'ఫోన్లేండి పాపం! రాకరాక కానుపొచ్చినందుకు దానమ్మ కడుపు చల్లగా – నేను రెండు మాట్లెళ్ళి చూసొచ్చాను. ఎందరుండి ఏం చేస్తాం – దాని బాధ అది తీయాల్సిందే! ఆడపుటక మరి! ఆ నారాయణమూర్తి తిన్నగా చూడబట్టి'–

అన్నప్ప ఫెళఫెళా నవ్వాడు; 'ఆసి నీ అన్నగారిల్లు బంగారంగాను – మాటలో మాంచి చమత్కారం చేశావ్‌లే!' అన్నాడు.

ఆ పిల్లదానిని పెనిమిటి పేరు నారాయణమూర్తి. మనిషివి అన్నీ మంచి లక్షణాలే. కాని రవంత మొరికవుంది. ఎప్పుడూ జపాలూ, తపాలూ, ఏకభుక్తాలూ, ఏకాదశులూ, చాతుర్మాస్యలూ – అంటూ అదే ధ్యాసలో ఎప్పుడూ ఏ కొండమీదో ముక్కు మూసుకుని రావడంతో ఎరక్కపోయి వీడికి పెళ్ళి చేశామని తలిదండ్రులే వాపోవడం దాకా వచ్చింది. అలాటివాడు ఉన్నట్టుండి ఆ తతంగం యావత్తూ కట్టిపెట్టి ఇంటిపట్టున అంటి పెట్టుకుని ఉంటూండటంతో పిల్లది కాపురానికి వెళ్ళిన పుష్కరానికి పుట్టింటివారు సూడిదెలు చేయడం అంటూ రావడం...

'మంచి రోజు చూసి ఓ పావు సవరపెట్టి, రెండు ఒత్తులు, వేలికో చుట్టూ చేయించి మీ చేతిమీదుగా యిస్తే బావుంటుందేమో!' అని అందుకుంది అనంతలక్ష్మి.

'లక్షణంగా ఉంటుంది. కాని పసిగుడ్డు. ఇప్పటి నుంచీ వాడికి ఇవన్నీ దిగేస్తే వామనమూర్తి కాడుటే! ఎదగనీయాలి. యింతకన్న రెండు కాసులు మనవి కావనుకుంటే ఓ గొలుసొస్తుంది. సీతారామ పతకం వుండనే వుందికదా! అది దాంటో వేయించి ఇస్తే రక్షగానూ ఉంటుంది; బహురమ్యంగానూ ఉంటుంది. పిల్లవాడిని రొమ్ము నెట్టు కున్నప్పుడల్లా ఆ తల్లి దీవెన వాడిని సోకుతూ ఉంటుంది, అవునా కాదా?'

'ఆహాఁ! ఈ ఉంగరం చూడండి – ఆరోజు కారోజు తగని వదులౌతూంది. వాళ్ళ బుల్లెమ్మకు సరిగ్గా సరిపోతుంది. అలాటి ఛాయ ఉన్నవాళ్ళ చేతినుంటే మంచి రాణింపు – దాని కిద్దామని వుంది?'

'తప్పకుండా! మొత్తానికి సొరెట్టినట్టు పెట్టేట్టున్నావ్!'

'తప్పుటండీ! నేను కాపురానికి వచ్చిన కొత్తలోనే కదూ వాళ్ళమ్మ దాన్ని ఎత్తుకు వచ్చిందీ. పట్టి బలవంతాన వాళ్ళమ్మ లాక్కుంటె వెళ్ళడమే కాని, దానికి మాలిమంతా నా దగ్గిరేగా! మన కాముడ్ని ఎలా ఆడించేది – దాన్ని పెళ్ళికూతుర్ని చేసింది మనం కాదుటండీ! కడుపున పుట్టకపోతే మటుకు అది మనపిల్లే! కాముడికి ఓ కార్డుముక్క రాసేయండి! సంబర పడుతుంది; అక్కడ నుంచి ఇంత తీర్థం, ప్రసాదం పంపిస్తుంది.'

'అది పంపించాలా? పిల్లాడికి ఏ అయిదోనెలలో రాగానే తీసికెళ్ళి వెంకన్న ముందు పడేయకుండా వీళ్ళూరుకుంటారా? వాళ్ళ అత్తా మామా, ఇప్పటికి ఎందరి దేవుళ్ళకు మొక్కుకున్నారో?'

'తీరిక చేసుకుని బయలుదేరి పోయి, సక్రమంగా అన్ని మొక్కులూ తీర్చుకుంటూ వస్తే – మళ్ళీ యింటికి వచ్చేలోపుగా ఏ దేవుడు తిన్నగా చూసినా మళ్ళీ వేవిళ్ళు తప్పవ్!

అవును మరి – వాళ్ళకు బుద్ధి కుదిరి వరాలివ్వడమంటూ మొదలు పెట్టాలే గాని, ఇహ ఓ పట్టాన వదలరు. సాలు తిరిగేప్పటికల్లా ఫలసాయం కంటపడవలసిందే...'

'అలాగే! అలాగే! మీ నోటి వాక్యాన – ఒక యిల్లు పదిళ్ళయితే, వల్లమాలిన సిరీసంపదా ఉన్నందుకు–'

'యీ తరానికి బువ్వకు లోటుండదు; యింట పుట్టిన వాళ్ళందరూ, వీళ్ళలాగానే కాలుమీద కాలు వేసుకు కూర్చోవడం మరిగితే, పరువుకూ లోటుండదు! ఆపై మాటంటావా, గచ్చకాయలు చిమ్ముకున్నట్లు, – తలోకడూ, తలోదారీ! జానే! 'అమ్మకన్న నలుగురూ సంగీత పాటకులే అవుతారా?' అన్నట్లు, పుట్టింది రాజుల యింటనే అయినా, పూటకూళ్ళు పెడుతూ, కాలక్షేపం చేస్తున్న, మనుషులని మనం చూడటంలా? కారణం ఏమంటావ్! చేతకానితనం: ఓ ఆసామీ ఆవాలు ముద్దచేసి, పదిమంది కొడుకులకే హస్తార్పితంగా, యిచ్చాడనుకో, ఒక్కొక్కడికి ఏం వస్తుంది? తలొకపన అక్కడే తరుగు ప్రారంభం, పరక పడుతూంటే, మరో సందెడు కావచ్చును. కాని ఆ ఉన్న రవంతా నెమరేస్తే?'

'మన బ్రహ్మిగాళ్ళ పని అలాగే ఉంది; వేళకో తవ్వెడు గింజలు ఏరి తెచ్చుకుని, దంచుకుని బొక్కినన్నాళ్ళూ – అర్ధాకలి మీద ఉండటంతో, ఆర్షవిద్యలు ఒంటపట్టుకుని ఉన్నాయి: యీ జమీందారులూ ప్రభువులూ, మడులూ మాన్యాలూ అంటూ యిచ్చి, సగం చెడగొట్టారు. దాంతో రాజసాలకుపోయి, మరోసగం మనవాళ్ళు చెడ్డారు. యిది యిలాగంటిదీ అని తెలిసిన వేత్తగనుకనే మా తాతగారు జన్మంతా ఒక్క తీరుగా వెళ్ళబుచ్చుకున్నాడు; కాని ఆ బుద్ధి నూటికి ఒక్కరికుందా?'

'కళ్ళ ఎదుట చూస్తోనే ఉన్నాంగా! మన అవధానులుగారి తాతగారు – ఘనాజటా చెప్పి రెండు చేతులా ప్రోగుచేశాడు; తరానికి ఒక్కొక్కరే కావడంతో యింతవరకూ కూచొని తింటున్నా ముద్ద, ముద్దగానే వుంది. మరి, యీ తరంలో అల్లాకాదుగా, మూడు నిద్దర్లకే ముగ్గురు పిల్లలున్నట్లు, ఆకు దూసిన మల్లెపందిరికి మల్లే, మొగ్గమీద మొగ్గ తొడుగుతూంది! కనుక తండ్రిలాగా కాకుండా సుబ్బరాముడు జాగ్రత్తపడాలి!...'

'అందుకే నన్నమాట మీరు పనిగట్టుకుని వెళ్లింది. నిలుచున్న పళాన యీ ఒక్క ముక్క అతగాడి చెవిని వేసి చక్కావచ్చారా! లేక అక్కడ చిద్విలాసంజూసి ఒళ్ళు మరచిపోయినారా?'–

'అలాగేవుంది వాళ్ళ అన్యోన్యం – బుచ్చిగాడు చెప్పలా?'

'వచ్చినప్పటి నుంచీ ఒకటే పాట! ఆ వంటను వర్ణించడమే, నాన్న చెయి చేసికోవడం, అది నలభీమపాకం కాకపోవడమూ నాయనా, అంటేగాని వాడు ఊరుకోందే! – చూశారూ వాళ్ళింట్లో తినివచ్చాడని నేనేమనిపోతానో అని హడులుకుంటూ వచ్చాడు.'

'నేనెందుకు కంటానండీ! ఆనాడు అక్బరుసాయిబు సూర్యనమస్కారాలు జేయగాలేంది, అన్నీ తెలిసిన మావారు శూద్రులయింట ఆపోసనం పుచ్చుకుంటే ఏం దోషమా అంట!'

'ఆసి నీ యిల్లు ఉన్నచోటే ఉండ! నన్ను మ్లేచ్ఛుడంటావుటే!'–

'ఏమన్నా, – మీకు చెల్లుతుంది. కాని – నాకు అంత తెలివి తేటలుంటే యింకా ఏం! ఆ వాల్మీకులవారే, మీరు చెప్పిన మాట వింటూ, – రామాయణమంటే సీతమ్మవారి

చరిత్ర అని ఒప్పుకుంటున్నారే, - మీకు చెప్పగలవారెవరండీ!'-

'అంటే నావన్నీ తప్పుడు కూతలంటావా?-'

'రామ రామ! నాకేమన్నా యీ రెండు కళ్ళూ ఉండాలా, అక్కరలేదా? - భారత, రామాయణాలు, - తరచి తరచి చదివినవారు కనుక - ఎదుటివారి తప్పులెన్నడం, - మీకు అవలీల...'

'యిన్నాళ్ళూ కాపురం చేసి, - యిదా నీవు కనిపెట్టింది?'

'వెయ్యేళ్ళు కాపురం చేసినా. - మీ అంతదాన్ని నేనెలా అవుతానండీ! - ఏదో ఎరక్కపోయి అన్నాను!-'

'ఓయబ్బ; - ఏమీ ఎరుగనట్టే ఉండి, ఎక్కడో అంటపొడుస్తావు! - నీ ముసిముసి నవ్వులు చూసే, ఆనాడు - ముద్దరాలి వనుకుని,'-

'మోసపోయినారా?'-

మురిసిపోయినాను, ఆ మురిపం, - ఆనాటికానాడు, - అతిశయిస్తూందే కాని, - ముదిమిరావడం లేదు సుమీ: మనం ఆదికాలంనాడు, ఎంత ఒకరికొకరంగా ఉండేవారమో, - ఆ సుబ్బరాముడూ అదీ కూడాను అంత అన్యోన్యంగానూ ఉన్నారు! - అది చూసే ఒక పట్టాన వదలిరాలేకపోయినాను! - నిజానికి, యీ పూట కూడా, అక్కడే ఉండేవాడినే కాని, యివాళ నీ పుట్టిన రోజు కాదూ, జ్ఞాపకం రావడమేమిటీ! - తెక్కలు కట్టుకురావడమేమిటీ! అవునుగాని, తలంటోసికుని కొత్తచీరె కట్టుకున్నావా లేదా? ఆఁ ఆఁ - నేను చూడనే లేదు సుమా! - బుగ్గను చుక్క లేకపోతేనేం, యిప్పటికీ, చంద్రబింబమే! ఏదీ, ఆ విదిలించి కొట్టిన ఆ చేతి మీదుగనే, రెండు ఆకులు చీల్చి యిద్దూ!'

'ఫలహారం మాట?'

'మరచేపోయినాను సుమా? ధ్యాసంతా తాంబూలం మీదే ఉండటంతో; ఆకలిదప్పిక లనేవి, అనవసరంగా, మన జోలికి రాకూడ దనుకున్నాయి... నిద్రకూడా ఓ ఝాముస్నర సేపన్నా మన దరిదాపులకు రాకుండా ఉండేందుకు దారిలోనే ఖరారు చేసుకున్నాం కనుక, వేగిరం కడుపులో చల్లబడేస్తివా, కాస్సేపు కృష్ణారామా అనుకుంటో కూర్చోవచ్చు.'

అనంతలక్ష్మి - నవ్వు మొగం, అటు తిప్పుకుని లేచి యింట్లో కెళ్ళింది. పాలూ పళ్ళూ చక్కబట్టుకుని వస్తూండగా, బుచ్చిగాడు లేచి కూర్చుని - 'అమ్మా, తెల్లవారిందిటే!' - అన్నాడు. ఆవిడ నవ్వుతూ, - 'కలొచ్చిందా బుచ్చి! - యింకా మీ నాన్న ఫలహారమే కాందే! కాస్త దాహం తాగి పడుకో, - నాన్నా, -!'

'ఉహు - నా నిద్దరయిపోయింది, కాస్సేపు నాన్న దగ్గిర కూర్చుని చదువు కుంటాను!' అంటూ లేచి యివతలకు చక్కావచ్చాడు బుచ్చిగాడు. వాడి వెనకాతలే, - అనంతలక్ష్మి, - వచ్చి - అన్నప్ప వంక చూడకుండా, - పాలూ పళ్ళూ అక్కడ ఉంచి, - లోపలికి వెళ్ళిపోయింది. అన్నప్ప కొంచెం చిరాకుగా, - రవంత బద్ధకంగా, - 'ఏదీగాని వేళ యిప్పుడు - చదువేవిఁట్రా వాజమ్మా - ఒక్కపూట పాఠంపోతే, - మునిగిపోదులే! - పవలంతా నడిచి నడిచి ఉన్నావు - మలికునుకు తీయకపోతే, రేపంతా బద్ధకంగా ఉంటుంది.'

'ఉంటే ఉంటుంది లేస్తూ - యీ నిద్దర అప్పుడు పోవచ్చు. పోన్లే... నీకు

నిద్దరగా ఉంటే నీవు పోయి పడుకో! –నేను కూచుని చింతన చేసికుంటాను.'

అన్నప్ప వాడి వంక చూసి, – పకపక నవ్వి 'ఒరేవ్, – నీకున్న ఓపిక, నాకూ ఉందిలేరా! చిన్నప్పుడు నేనూ యింతేలే! అంచేతే యీనాటికీ, అడుగూ బొడుగూ నాలుగు ముక్కలు ఒంటపట్టి ఉన్నాయి – ఊఁ కానీ...'

యిద్దరూ ఓ పొద్దు వేళకి, తెలియకుండానే నిద్ర – పోయినారు...

మరునాడు మధ్యాహ్నం.–

గంటయ్య అన్నప్పను వెదుక్కుంటూ వచ్చాడు.

గంటయ్య అంటే అవధాన్లుగారి మనిషి! వాళ్ళ కుదురుకల్లా మోతుబరి – పెద్దవాడు! తన దోవను తాను పోవడమే కాని, ఎందులోనూ జోక్యం కలిగించుకునే మనిషి కాడు. లచ్చికి, ఓ వేలు విడిచిన మేనమామ! ఐతే రెండు కుటుంబాలకూ అంత సయోధ్య మొదటినుంచీ కూడా లేదు. ఆయన పాలెంలోనే పుట్టి పెరిగినా, పక్క ఊరికి ఇల్లరికం వెళ్ళాడు. అన్నమాటే కాని, తెల్లవారి లేస్తే యిక్కడే వుంటాడు. అన్నప్పతో ఆయనకు మంచి విహితం. ప్రత్యేకం వాళ్ళ ఊరు తీసుకువెళ్ళి యీయనచేత రామాయణం చెప్పించాడు. ఘనంగా ఉత్సవం జేశాడు...

'ఏం మామా! ఏం జేస్తున్నావ్?' అంటూ వచ్చి దగ్గిర చతికిలబడ్డాడు. అన్నప్ప ఆయన వంక ఓరగా చూసి, 'నేను అనుకుంటూనే ఉన్నాలే, నీవు యెప్పుడో యిలా ఊడిపడతావని – ఇంటిదగ్గర నుంచేనా?' అన్నాడు.

'కాక'

'కాకో – నిక్కాకో! నీకు తెలియాలి! మీ అవధాన్లుగారికి తెలియాలి!'

'ఏం మీ అవధాన్లుగారు కాదా?'

'అవునని ఆయన్న నమను!'

'కాదని నీమీద కత్తులు దూశాడా?'

'వేరే దూయాలా? కన్న కొడుకునే వదులుకోంగా లేంది యీ అన్నప్పను నెత్తినెట్టుకుంటాడా?'

'నిన్న మొన్నటివరకూ అంతేగా!'

'అది అప్పటి సంగతి. ఇప్పటి కథ యింతేగా!'

'అది యెవరి నిర్వాకం? నీలాటి వాళ్ళు ఊళ్ళో వుంటూన్నది యెందుకు?'

'పురాణం జెప్పుకునేందుకు!'

'అది నువ్వు చేసుకున్న పుణ్యమనుకో! అంతటితో ఊరుకున్నావా?'

'నీ మానాన నీవూ ఊరుకుని, నా మట్టుకు నేనూ ఊరుకుంటే ఊరు బాగుపడ్డట్టే!'

"బాగుచేసేవాడవు కనుకనే, అక్కడికెళ్ళి అల్లా ఎగసన దోసొచ్చావ్!"

'ఎవరు చెప్పారో?'

'ఒకరు చెప్పాలా? పాలెం – పాలెం కోడై కూస్తూంటే.'

'పాలెంలో కోడి కూసినా, బ్రాహ్మణవాడ నిద్రలోనే ఉంది!'

'నీవు మేలుకున్నావ్ చాలదూ!'

'గుడ్డికన్ను మూస్తే ఎంత – తెరిస్తే ఎంత! అసలుకు మూలం ఆ ఫాలాక్షుడున్నాడు కదా!'

'ఆయన ఫాలాక్షుడూ బ్రహ్మదేవుడూ అయితే, యెవారమిందాకా వచ్చేదా? పాపం, ఆయనేం జేశాడని?'

'ఏం చెయ్యలేదులే - చెయ్యలేదూలే!'

'అవునులే - అవతల వారికి నీ వత్తాసుందిగా!... మ్మామా! నీ లౌక్యమేమిటో నాకు అంతుబట్టకుండా వుంది.పాలెం పోయి భజనచేసి వచ్చావ్! ఊరంతా ఒక కట్టుమీదుంది. భూమి పుట్టినప్పటి నుంచీ అందరం ఒక తల్లిబిడ్డలమల్లే వుంటున్నాం కాని, యీ గడ్డ మీద అలాంటి తగాయిదా అంటూ లేదు. ముందేం కానుందో?'

'ఏమి కాదు, పడితే బాగుపడుతుంది : లేదా ఇంతకన్నా చెడేది లేదు, అందరూ ఒక తల్లి బిడ్డలే అయినప్పుడు, ఒకచోట విస్తరి వేస్తే తప్పొచ్చిందా? విక్రమార్క చక్రవర్తి తండ్రి బ్రాహ్మడు! నాలుగు వర్ణాల పిల్లల్నీ చేసుకున్నాడు. ఎవరూ వంక బెట్టలేదేం!'

'నాలుగు కులాలు అంటే - అది లెక్క వరుస కాని, ఒక దానికి ఒకటి తీసికట్టని కాదు. తల్లి కడుపున తొలిచూలు బిడ్డ బ్రాహ్మడూ, నాలుగోవాడు శూద్రుడూ అవుతాడా? మన వెర్రి కాని...'

'చూడు గంటయ్య మామా! చేను గట్టునో, చెట్టు చాటునో చేతి కందిన మనిషిని షికస్తు చేసే శిష్టాచార సంపన్నుల జోలికి యెవడూ పోడేం! ఒక మనిషి నిజాయితీన పోతే, హర్షించలేకపోతే, అదీ ఒక బ్రాహ్మణీకమేనా? సుబ్బరాముడు బ్రాహ్మడు కాకపోతే, లోకంలో బ్రాహ్మడే లేడు! ఇది నా తలతిక్క అనుకోమోకు - అన్నందినే వాడెవడయినా ఆ మాటే అంటాడు.'

'కడుపున పుట్టిన బిడ్డకి - తన తాతో, ముత్తాతో సంపాయించి పడేసిన ఆస్తిలో రవంత ముట్టజెప్పేందుకు, మా అవధాన్లు బావకు చేతులు రాలేదు.'

'పోన్లెస్తూ - ఆస్తికి తాను ప్రస్తుతం కర్త కావచ్చు! వాడి అదృష్టానికి తాను కర్తా!'

'అంతేలే!'

'ఈ ఒక్క ముక్క చెప్పడానికేనా ఇంత దూరం వచ్చింది?'

'కాదు - నేనూ మీ మనిషినే అని అనిపోదామనివచ్చా!'

'మొన్నటిదాకా నేనూ మారుతోవనే ఉన్నాననుకో!'

'నాకు ఈ సుబ్బరామయ్య యిల్లా చేయడము గిట్టని మాట నిజమే! కాని, మా-మా సయోధ్యలు నీకు తెలిసినవే కదా! అది ఎట్లాపోతే యేం అనుకున్నాం!'

'అది తప్పే అనుకో!'

'ఇదేదో చితుకుల మంటలాటి దనుకున్నాగాని, అది కలకాలం ఉండే దీపమని కలగనొచ్చానా? కాని, వాళ్ళు సుఖంగా ఉంటూ వుండడంతో - పోన్లే పాపం అనుకున్నాం.'

'నీవు పాలెం వచ్చావని తెలియడంతో కళ్ళు తెరిచాను.'

'ఇన్నేళ్ళకు నీ పుణ్యమా అంటూ ఆ గుమ్మం తొక్కాను.'

'వాళ్ళను చూస్తే ముచ్చటేసిందనుకో!'-

'ఇన్నాళ్ళూ నాకు బుద్ధిలేకపోబట్టి కాని, లచ్చి నాకు పరాయిదా? పెద్దవాళ్ళం - పెద్దవాళ్ళం ఏనాడో కీచులాడుకున్నామే అనుకో! మా లచ్చి అప్పటికి పుట్టనన్నా లేదే - దీని మీదెందుకూ కచ్చ? నీలాటివాడు పట్టుకుని యింత గడ్డి పెట్టకపోబట్టి, మా బతుకులకీ గాచార మొచ్చింది! ఆ రత్తమ్ముందే దాన్ని దిగదియ్యా - అందరి వారడీ తూర్పార బట్టిందిలే!

దాన్నోరు మంచిది కాదనుకో గాని, కాని మాటేమంది? పడాల్సినంతసేపు పడ్డాను. నాకుమటుకు రోసముట్టుకురాదూ! – 'ఆసి పోయే!– నీకు మేనకోడలు కాంగా లేంది, నాకు కాకపోయిందా! నా పెట్టుపోతలింక సూసుకో' అని, సీతమ్మ వారిమీద సత్తెం జేశాను. మామా! మాకున్నదెవరు తినను? వాళ్ళే!'–

'నువ్వు ఏమన్నా అను! బ్రాహ్మడంటే దేవుడే అన్నవాడు వెర్రినాయాల కాదు. నీలాటివోణ్ణి జూసే అనుంటాడు!'

'అవును మామా!'

'మా లచ్చి చెప్పడమే కాదు. లోగ్గయ్యాళి రత్తమ్మంటిది నీ పేరు తలవడం చేయెత్తి మొక్కడం!'–

'నన్ను ఉబ్బేయడం చాలుగాని, ఎండను పడొచ్చావ్ కాసేపు నడుం వాలుస్తావా? ఓ కునుకు తీసి, కాసిని పేలగింజలు నోట్లో వేసుకుని, ఆనక మీ అవధాన్లుగారిని సేవించబోదువుగాని!–'

'మళ్ళీ అదే మాటా? కొడుకూ – కోడలూ యింటికొచ్చిననాడే ఆ గుమ్మం తొక్కడం!–'

'నువ్వు కూడా ఇలా శత్రుపక్షంలో జేరితే అవధాన్లుగారు మరీ ఒంటరి వాడైపోడూ?'

'అందుకని అయిందానికీ, కానిదానికి పక్క తాళం వేయమన్నావా? నా వల్ల కాదు!–'

గంటయ్య ఓ కునుకు తీశాడు.

చల్లబాటు వేళకు ఇద్దరూ, అలా చేలకేసి వెళుతున్నారు. అంత దూరాన్నుంచి అవధాన్లుగారి కంటపడ్డారు. అది ఉభయులూ గమనించి ఒకరి మొఖాలొకరు చూచుకుని నవ్వుకున్నారు. గంటయ్య అటు వెళ్ళిపోయినాడు. అన్నప్ప తిరుగు ముఖమై వస్తూ, ఆలయంలోకి వెళ్ళాడు.

మనుష్యులలో నిన్న మొన్నటి కలుపుగోలుతనం కనిపించలేదు. కొందరు మామూలుగానే పలుకరించారు కాని, తతిమ్మావాళ్ళు చూడనట్టు తప్పించుకుపోయినారు. అర్చకుడు ముఖం ముడుచుకుని తీర్థం యిచ్చాడు.

అన్నప్ప, ఆహా అనుకున్నాడు. ఊళ్ళో చీలికలు ప్రారంభమైనాయా అనుకున్నాడు.

రెండు రోజులైంది –

వారం అయింది –

మబ్బు చాటున యెండ ముందుకు పోతున్నట్లు – ఊరంతా యేదో కానరాని చుర – చుర!

ఉన్నట్టుండి అవధాన్లుగారు – తానొక్కడూ రామేశ్వరం వెళ్ళాడని తెలిసింది. అదివరకు ఆయనకు అలాటి అలవాటులు లేవు. ఆయన అలా బయలుదేరి వెళ్ళిన మూడోనాటికి అన్నప్పకు వారి యింటి వద్ద నుంచి వర్తమానం వచ్చింది. తానూ, అనంతలక్ష్మి యిద్దరూ వెళ్ళారు.

ఇల్లు, తాననుకున్నట్లుగానే చాలా చిన్నబోయి వుంది. ఇంట్లో మనుషులు బూరుగు మానుల్లాగా అవుపించారు.

ఎన్నడూ లేనిది పట్టపవలు – వీధి వాకిలి తలుపు దగ్గిరగా వేసివుంది. అన్నప్ప మనసు చివుక్కుమంది. గుమ్మానికి వున్న తోరణము, మామిడి మండలు ఎండి ఏరింపులై వున్నాయి. అనంతలక్ష్మికి కంట నీరు తిరిగింది. మండిగానికి, ద్వారబందానికి పసుపూ, కుంఖం పెట్టి యెన్నాళ్ళయిందో?

అన్నప్ప తలుపులు బార్లాగా తీసి, 'అక్కయ్యా! శాంతమ్మక్కయ్యా!' అంటూ నెమ్మదిగానే పిలిచాడు. లోపల నుంచి మాట వినబడలేదు. సరాసరి యిద్దరూ పటమటింట్లోకి వెళ్ళారు. ఎదురు వారను గోడకు రామపట్టాభిషేకం పటం – నిత్యమూ శాంతమ్మ పూజ చేస్తుంది.

దీపారాధన కునికిపాట్లు పడుతూంది.

శాంతమ్మ కళ్లు తుడుచుకుని, ఇటు తిరిగింది. అన్నప్పకు యెవరో చెంపపెట్టు పెట్టినట్లనిపించింది. ఈ తల్లి ఇలా ఐపోయిందని ఊహించనేలేదు.

మొగవాడు కనుక – మొగం చిట్లించుకుని మనసు ఉగ్గబట్టుకున్నాడు. అనంతలక్ష్మి 'వదినా!' అంటూ బావురుమంది.

'ఛస్ ఊరుకో! ఏమిటిది – నిండినింట్లో కూర్చుని. మా అక్కయ్యకేం – లక్షణంగా మనుమడూ, మనవరాలూ...! ఇదిగో నీక్కాదూ చెప్పేది?' అంటూ అనంతలక్ష్మిని గదమాయించడంతో ఆవిడ సంబాళించుకుంది. శాంతమ్మగారు అనంతలక్ష్మి వెన్నుచరచి. 'ఎందుకే పిచ్చిదానా! తమ్ముడు చెప్పినట్టు నాకేం లోటే?' అంటూ అన్నప్పతో 'నాయనా! నాకు తోడుబుట్టిన వాడంటూ లేనికొరత ఏనాడో తీర్చావు. మామీద నీకు యెప్పుడూ ఒకే తీరు – ఆపేక్ష. సొంత మేనమామ వుంటేమటుకు పిల్లవాణ్ణి ఇలా ఆదుకునేవాడా; నీకన్న ఎక్కువగా ఆదరించేవాడా? వాడి విషయంలో నాకు ఎలాంటి చింతా లేదు.'

'మరి, అమ్మడి సంగతే?'–

'దాంది యెటూగాని బతుకైంది...'

'ఈయన తామసం జూద్దామా అంటే – ఎక్కు మీదుందే కాని, తగ్గుమొఖం లేదు. నీవలా వెళ్లివచ్చావని తెలియడంతో, వారి ధోరణి నీకు తెలిసిందే కదా! ఆయన యెన్ని అన్నా నేను కాని, పిల్లది కాని కిమ్మనలేదు.'

'ఆయన వెళ్ళడం బందరు వెళ్ళారు.'

'ఆస్తి దేవుడు పేర వ్రాసి, యిల్లు పాడేస్తారుట!'

'రామేశ్వరం వెళ్ళి అటునుంచి కాశీ వెళతారట.'

'మరి, తిరిగి రారట! ఇదీ శపథం...'

'మమ్మల్ని, వస్తే కాశీ రమ్మన్నారు; లేదా కృష్ణలో కలవమన్నారు. మా ఇల్లు ఈ స్థితికి వచ్చిందయ్యా!'

'నేను గాని, అదిగాని వాళ్ళ మొగం చూడరాదని పితృపితామహుల మీద ఒట్టేసి మరీ వెళ్ళారు.'

'ఒట్టేయకపోతే మటుకు వారి మాట యీ జన్మకు కాదనడమే!...'

'సరే, మా కాలం ఎలాగో వెళ్ళబుచ్చుకుంటాం!'

'మరి, దీని విషయం యేమిటి?'

'అప్పట్లో కాపురం అలా కావడంతో రోషమనుకో, అభిమానమే అనుకో!

చిన్నతనం కావడంతో అక్కడ వుండలేకపోయింది.'

'అంతేకాని, అత్తమామలేం తన్ని తగిలేయలేదు.'

'అల్లుడయినా గ్రహచారం కొద్దీ ఈ లోపం చేశాడు కాని, దాన్ని పల్లెత్తుమాట అని ఎరుగడట!...'

'ఏది యేమైనా ఆడపిల్లకు అత్తింట లేని సుఖం పుట్టింట వుంటుందా తండ్రీ! అదీ – రాత!'

'వీళ్ళ నాన్న పిల్లవాడి విషయంలో యిలా ముఖ బంధాలు తెంచుకోవడంతో, దాని మనసుకు ఏమనిపించిందో 'అమ్మా! ఎవరు వద్దన్నా, యెవరు కాదన్నా నా కాశీ రామేశ్వరాలు బందరులో వున్నాయి. మా అత్త మామలు యే అగచాట్లు పడ్డా, ఆపేక్ష అంతఃకరణలు వదులుకోలేదు. కొడుకుతో సంబంధము తెగ్గోసుకోలేదు. ఇప్పటికీ వారు తల యెత్తుకునే తిరుగుతున్నారు. ఈ పట్టెడన్నం వారు పెట్టకపోరు. నేనిహ అక్కడే పడుంటా' అంది.

'అదీ నిజమే! ఒకందుకు మంచిదే...'

'నువ్వేమంటావ్ తమ్ముడూ!' అన్నది.

అన్నప్ప నవ్వు మొగం జేసుకొని, 'అనదలచుకుంది యేనాడో అనేసి వుండేవాడిని. కాని నీ మొగం చూసి ఊరుకున్నాను. ఇహ వెనకాడేది లేదు – ఇదిగో అనేస్తున్నాను. బిడ్డలకున్న యింగితం మా బావగారికి లేదు. ఇంతకూ అమ్మడేదీ – ఇంట్లో లేదా?...'

'యింటోనే ఉన్నాను! వింటూనే ఉన్నాను మామయ్యా!' – అంటూ, వాళ్ళ అమ్మడు, – అంతసేపూ తలుపు చాటున కూచున్నదల్లా లేచి, – యివతలకి చక్కా వచ్చింది. ఆ పిల్లదాన్ని చూడగానే అన్నప్పకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది – 'మహాశ్వేతల్లే ఉన్నావే మా తల్లి!' అనుకున్నాడు.

'అన్నప్పమామా! అప్పుడు మించి పోయిందనుకున్న సంబంధం సానుకూలం చేసింది నీవు! నీ దగ్గిర దాపరికం ఎందుకు?'

యింతవరకూ, వీళ్ళెవరికీ చెప్పలేదు.

తప్పేదన్నా ఉంటే, నాది! వారిది కాదు!

నాకు, పిల్లలంటే అసహ్యం–

ఆయనకు – ప్రాణం! యిరుగు వారి పిల్లలనూ, పొరుగు వారి పిల్లలనూ ఎప్పుడూ చంక నేసికునే ఉండేవారు! నేను చీదరించుకునేదాన్ని, ఆయన నవ్వి ఊరుకునేవారు.

అన్నాళ్ళాయె కాపురానికి వచ్చి, అలా ఏ పోణిమి లేకుండా ఉంటే, యింట్లో వారూరుకున్నా, యిరుగమ్మ లూరుకుంటారా? చీటికి మాటికి వారు కవ్వించా, నేను కజ్జాలాడా! మాకిదే కాలక్షేపమనుకో!

ఒకనాడు ఒక మనిషి గుమ్మం ముందుకొచ్చింది. నిండు నెలలది. పైగా వెంటో పిల్లా! చెయి జూస్తా సకినెం జెపుతానంది, – పొమ్మన్నాను ! బిడ్డ అంకిలి మీదుంది. గుప్పెడు గింజలేయి తల్లీ! అంది – యిహ నోరు జేసికున్నా – ఏమన్నానో, నాకే తెలియదు! అన్నీ పడి అదేం తొణకలా!

ఉండుండి, 'యీ యింట బిచ్చ ముట్టదీయవ్వకు బిడ్డ లుట్టరు' అనేసింది! నా

కేకలకునూ మా అత్తగారు యివతలికి రావడంతో దాని మాట ఆగి, 'అఁ, అఁ ఎంత మాటన్నావే!' అని ఒకటే విలవిల! ఒక్క అంగలో యింట్లోకి వెళ్లి, చాటలో బియ్యం దెచ్చింది. 'అమ్మీ! అమ్మీ! అన్న మాట తిప్పుకోవే! నీ కడుపు చల్లగా, నీ యిల్లు చల్లగా నీ బిడ్డకు బువ్వెడతా, నీక్కోకెడతా, మంచి మాట చెప్పవే! అనవే!' అంటూ దాని వెంటపడ్డది. ఎలాగయితేనేం చెయి పట్టుకుని, తీసికొచ్చి అరుగుమీద కూర్చోబెట్టింది.

అది, ఆ చాట అక్కడ బెట్టింది, చేత్తో కోరాడుతూ, దాని దేవతల్ని తలుచుకుని, తలుచుకుని, యిహ చెప్పుకొచ్చింది చూసికో-

నేను ఏణ్ణర్థం దాన్నై ఉన్నప్పుడు, నిద్దర్లో పందిరి మంచం మీద నుంచి దొర్లిపడితే, మోకాలు మోరు కట్టడం, తొలిచూలు మొగపిల్లవాడు కాకపోయెనని నాన్న ధుమ ధుమలాడటం, నాకు మూడో ఏట, జ్వరం కాస్తే – నాన్న కళ్ళ నీళ్ళ పర్యంతమై, అందరు దేవుళ్ళకీ మొక్కుకోవడం, ఆనాటి నుంచీ నన్ను అతి గారాబం చేస్తూ క్రింద దించకపోవడం, అవుతుందన్న సంబంధం, బెసిగిపోయినట్లనిపించి, మళ్ళా కలిసిరావడం, యిలా ఒకటేమిటి, అన్న ప్రాశన నాటి నుంచి, ఆపోసెనం దాకా అన్నీ ఏకరువు పెట్టింది - దానికి ఎలా తెలుసు యివన్నీ? ఏదో మహిమో, మంత్రమో లేకపోతే!

యిలా అన్నీ చెప్పుకొచ్చింది కాని, అన్నమాట తిప్పలేదు, రక్ష కడతాననడం కాని, రాగి దమ్మిడీ పుచ్చుకోవడం కాని లేదు! చేటలో బియ్యం, తలో గుప్పెడు కనక దుర్గమ్మ తల్లిని తలచుకుని, అందరికి వెయ్యమంది!

'నీవు చేసిన పాపం లేదు – కాని, యీ జలమాన నీకు పుణ్యం లేదు! ఆ యమ్మనే నమ్ముకుంటే, పువ్వల్లె బతుకుతవ్! మళ్ళీ పై వేసంగి కొస్తా, ఏడనున్నా, పచ్చగా ఉండు!' అంది దాని దోవను అది వెళ్ళిపోయింది –

'దాని మాటలు విన్న మీదట, మా అత్తగారికి, మతిపోయినట్లు కాదూ? అయితే, ఆవిడ కాని, మా మామగారు కాని, నన్ను గాని, మన వంగసాన్ని కాని, ఒక్క పొల్లుమాట అనలేదు! అనకపోగా, ఎప్పటికన్నా మరింత ఆపేక్షగా చూచుకునేవారు!'

'కాని, నాది ఊరుకునే స్వభావం కాదుగా! నేను గొడ్రాలిని కావడం అనేది, అదో గొప్పగా తోచింది! మాటి మాటికి మావారిని ఉడికిలించేదానిని, 'ఎల్లకాలం మీరు ఎవరి పిల్లల్నో ఎత్తుకు మోయాల్సిందే – యింట్లో ఆ పోణెం లేదుగా' అంటూ వెంటాడి వేపుకు తినేదాన్ని కాని, నావన్నీ పసిపిల్ల చేష్టల క్రింద కట్టి, నవ్వి ఊరుకునేవారు. యింట్లో నువ్వుంటే చాలదూ? వేయిమంది పిల్లల పెట్టు – నీవు గొడ్రాలివైనా, కొండముచ్చువైనా, యింటి కోడలివి కనుక, యింట్లోవారు కాని, బయటివారు కాని, నిన్ను పల్లెత్తుమాట అనరు! దేశంలో అందరూ పిల్లలు కనాలని సర్కారు శాసనం లేదుగా! నిజం మాటకొస్తే నేనిలా అయితినే అని నీకు తెలియకుండానే, మనసులో ఏదో మూల వేదన ఉంది! అదే యీ రాలుగాయతనానికి కారణం!'

'కాని, అలా మంచిగా చెప్పిన కొద్దీ మరీ అలుసయినారు! ఆయన మాటలు ఆయనకే తిప్పికొట్టేదాన్ని – 'పిల్లాపాపా లేకపోయారని బెంగ, మీకు గాని నాకు లేదు. కాని యింటికైన మగవాడికి ఏదో లోపం ఉండబట్టే, అది కప్పిపుచ్చుకునేందుకు, ఆడకూతురి మీద యీ నెపం వేసి యిదో నాటకం ఆడుతున్నారు అని అందరూ ఎక్కడ అనుకుని పోతారో అనే భయం కొద్దీ నన్నిలా యాగి చేస్తున్నారు, మీ వేషాలు నాకు

తెలియక పోలేదు! మీకు అంత దెత్తిగా ఉంటే ఊరిమీద పడి కనండి, నేను కాదనను'- యిలా గొండాడేదాన్ని. ఆయన సహించినంత కాలం సహించారు, చివరకు ఆ రవంతముక్కా, అనేశారు!'

'నీవు యిలాగే రాపాడుతూ ఉంటే, ఎప్పుడో అంత పనీ చేస్తా! చూస్తూ ఉండు!'

'అబ్బో! ఈ ఉత్తరకుమార ప్రజ్ఞలకేం- పరాయి మనిషి యెదుట పడితే, పెళ్ళి కూతురుకన్న యెక్కువగా సిగ్గుపడతారే! మీరింత నిర్వాహకం చేయకేం నేను చూడబోను!'

'అలాగేఁ?' అని ఆయన నవ్వేసి ఊరుకున్నారు.

'కాని, నేను ఊరుకుంటేనా? ఆయన ఒంటరిగా కనుపించడం తరువాయి, ఇహ రగడ మొదలూ! నా నోట శని వుంది - అలా అనిపించేది.'

'నే నంటూండటం ఆయన పడి ఊరుకుండటం - ఇలా కొంతకాలం జరిగింది. లక్ష్మాయి మనుమరాలు ఊళ్ళో దిగింది.'

'లక్ష్మాయ్ అంటే, మాకు పాలూ, పెరుగూ పోసే మనిషి. అది యేనాటి నుంచో వస్తూన్న వాడిక! దాని మనుమరాలంటే కూతురిబిడ్డ. తండ్రి పటాలంలో పనిచేసి పింఛ నుచ్చుకున్నాడు. దానికి వయసు రాగానే, అందులోనే పనిచేసే కులంవాడికే యిచ్చి చేశాడు. కాని రాత బాగుండకపోబట్టి, ఇది కాపురానికి వెళ్ళకుండానే యెక్కడో మందుసామాను ప్రేలి, ఆ పిల్లవాడు ఆహుతైపోయినాడని పైకి అనే కబురు. కాని లోపాయికారీన మట్టుకు వాడేదో నేరం చేశాడనీ, దాంతో వాడు మునగడమే కాకుండా పిల్లనిచ్చిన మామనుకూడా ముంచాడనీ, అంతటితో యీ మనిషి - అంటే రోశెయ్యనాయుడు యీ గత్తరలో వాడి పేరు కూడా రాయించి, మళ్ళీ కలలో కన్నా రావద్దుసుమీ అని, ఆ శాల్తీని అక్కడ నుంచి మాయం చేశాడనీ అలా కొందరు చెప్పుకుంటారు. మొత్తానికి వాడు వాళ్ళలోనే జమ! ఈ రంగదుందే చిన్నతనం నుంచీ ఆ దేశాల్లోనే ఉండటంతో, మాటా మనిషి అంతా అక్కడవాళ్ళ పద్ధతే. ఏమాట కామాటే చెప్పాలి. అందచందాలెంచడమంటూ వస్తే, దానిముందు నేనెంత!'

'చిన్నప్పటి నుంచీ కూడా దానికి మా ఇంట్లో తగని మాలిమట! మూడేళ్ళకో నాలుగేళ్ళకో ఒకసారి సెలవు మీద వస్తూ వుండటంతో, అది అందరికీ పాతకాపే! నేను మట్టుకు అదే తొలిసారిగా చూడటమేమో-బహు అబ్బురమేసింది.'

'అందరితో మల్లేనే, నాతోనూ అంత చనువుగానూ వుండేది. ఆయన సంగతి సరే, చెప్పనే అక్కరలేదు. ఒకరానొకరు చెవులు పట్టుకుని ఆడించడమే! అయినా, దాని నడతలో ఏమీ యెబ్బెట్టులేదు.'

'అది యెప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ వుంటుంది. ఆ బతుకు అలా అయిపోయిందే అని, ఏ కోశానా విచారమేలేదు. ఒకవేళ ఉన్నా పైకి కనబడేది కాదు.'

'అలా తుళ్ళుతూ - మిళ్ళుతూ తిరుగుతూంటే, నాకు ఒకొక్కప్పుడు ఒళ్ళు మండుకువచ్చేది. ఒక లక్ష్మాయి మనమరాలు కాదు, రావణాసురుడి చెల్లెలు! అనిపించేది.

కాని, దానిది చప్పనాతి బుద్ధికాదు.

'ఎప్పుడూ కేరింతలాడుతూ వున్నా-నీతి-నిజాయితీ వున్నదే కాని, హద్దుమీరే మనిషి కాదు; వగలమారి అసలే కాదు.'

'దాన్ని, నేనే కవ్వించాను.'

'ఏమే రంగా! నీ ముద్దులూ – మురిపాలూ యెల్లకాలం మాకు చూపిస్తే యేం లాభమే? ఓ ఇంటిదానివైతే ఆడపుటక పుట్టినందుకు అదీ ఫలం పాటు, ఏమంటావ్?'

అది విరగబడి నవ్వింది.

'అయ్యో రాతా! అక్కయ్యమ్మా! చిన్నప్పటి నుంచీ నేను ఈ ఇంటిదాన్నే, మీరంటే నిన్న మొన్నొచ్చారు కాని!' అన్నది. అంతలో ఆ నవ్వు ఆపి నా వంక తేరిపార చూసి, మళ్ళీ ఒక్క నవ్వు నవ్వి, ఎదటి మనిషి బాగుండాలని కోరుకుంటావ్ నీదేం పుటకమ్మా! ఇంటికైన మొగాయనతో ఇలా ఇచ్చాకాలాడుతూంటే, మరో ఆడకూతురైతే సిగట్టుకీడ్చేది కాదూ! నీ బుద్ధి మంచిది కనుక నా పుణ్యం మంచిదైంది. నీ ఇంట తిరగనిస్తున్నావ్! లేకపోతే నేనేమౌతాను...!'

'వెనకటి కథంటావా?'

'అదేదో కలొచ్చినట్టుంది కాని, నాకు దుఃఖం లేదు; విచారం లేదు.'

'దోవెంబడి పోతూంటే, ముక్కూ మొగం యెరగనోళ్ళు ఎందరో ఎదురొస్తారు, అందరూ యాదుంటారా?'

'మరి, ఆ మనిషి తీరుగా వుంటే అప్పుడిట్లా అనేదానవేనా అంటావా? ఏమో ఆ కథెట్లా వుండేదో!...'

'అలా మద్దెంతరగా ఎవరో – ఎందుకో వచ్చారు. నాకు ఎరిక లేకుండానే తన దారి తాను జూసుకున్నాడు.'

'ఆ మొగంకేసన్నా తిన్నగా చూడందే...'

'అంటే, నీకు ఇష్టం లేకుండా మీవాళ్ళు జేశారా అనొచ్చు. ఇష్టంలా – అనిష్టంలా! నాకు అప్పటికి వయసొచ్చి వంటిమీద వొళ్ళొచ్చింది. కాని, ఇలాటి ఊహ లుట్టుకు రాలా! ఇప్పుడిప్పుడు మీరు సుఖంగా ఉండటం చూసినాక పండగ బువ్వ దిన్నట్టుంది...'

ఇంకా యేమో అనబోతూండగా దానిమాట అందుకుని, 'ఉందిగా! నీ వాలకం చూస్తే యెప్పుడో మా ఆయన్ను యెగరేసుకు పోయేట్టున్నావ్!' అనడమయితే నవ్వుతూనే అన్నాను కాని, ఆ మాటలో కొంచెం విషముంది. వినీ వినడంతోనే దాని ముఖంలో కళ మారింది. కాని ఏమనలా!

'నీవు – నాకు వెరచి దూర దూరంగానే వుందామనుకున్నా, ఆయన ఊరుకోడులే! ఊరుకునే మనిషి కాదులే!' అని తాళం వేశాను. వినీ విననట్లు 'ఊఁహూ!' అంది.

'నేను అంతటితోనన్నా ఊరుకుంటేనా?'–

'పిల్లల కోసం మొగం వాచిపోతున్నారు. సరిగ్గా సమయానికి అందుకున్నావ్. మంచిరోజు చూసి, ఇంటినిండా కనిపడెయ్యండి! తలారి రాముడి సంతానమల్లే!' ఇలా ఎగసనదోశాను.

'అది మళ్ళీ మరో విడత నవ్వింది.'

'తలారి రాముడంటే – బాలనాగమ్మ కోటకాపలా మనిషి కాదూ! వాడికి ఇద్దరు పెళ్ళాలు! ఇది ఈచుకు పోయిందని దాన్ని కట్టుకుంటే అది చూపుల గొడ్డే అయింది. ఆ మాయదారివాడు మంత్రం బెట్టినా – తలుపుకీ, దర్వాజాకీ బిడ్డలుట్టారు కాని, ఇద్దరాడకూతుళ్ళూ నీళ్ళోసుకున్నారా! ఇక్కడా అదే లెక్కయితే, మరో పెయ్యను తోలి పెడతావా?' అంది. అందులో యెత్తిపొడుపు నాకు అర్థమయితేనా?...

'అదేమిటే - గొడ్డూ గోదా! వారికెందుకే!' అలా అనడం అదో శాణాతన మనుకున్నాను. అది ఫెఢీలుమని-

'ఎందుకేమిటి? రాత! ఇప్పుడో గొడ్డుతో వేగడంలా?...'

అప్పుటికి నాకు అర్థమయింది- 'నన్ను గొడ్డనంటావా?' అని ముఖం కండలు చించుకున్నా.

'అక్కయ్యమా! నేను గొడ్ల మధ్య పుట్టాను. గొడ్లలో పెరిగాను. కాని గొడ్డులాగా పెరగలా! అదే నాకు - నీకూ తేడా!'

'నీవూ నెయ్యీ అన్నం తిన్నా, మనిషివి కాలేదు.'

'మనిషల్లే మాట్లాడటం లేదు!'

'అని, చివాలున లేచి వెళ్ళిపోయింది.'

'నేను - అంతతో అన్నా బుద్ధి తెచ్చుకోవచ్చా? ఉహూ౦...'

'అది అవాళ నుంచీ మా ఇంటికి రాలేదు.'

రెండు మూడు రోజులంటే, ఇంటో లేదేమో అనుకున్నారు. ఆ తరువాత? లక్ష్మాయిని అడిగితే, అదేం చెప్పింది కాదు. 'దానివన్నీ అవో కళాకళలు!' అన్నది, చివరకు మా ఆయన దాన్ని వెదుక్కుంటూ వెళ్ళారు. అక్కడేం జరిగిందో, అదేం చెప్పిందో తెలియదు.

'ధుమ ధుమ లాడుతూ వస్తారు. నన్ను నానా మాటలూ అంటారు అని - అందుకు ఒడికట్టుకునే ఉన్నా!'

కాని మామూలుగానే వచ్చారు. మామూలుకన్న అమిత శాంతంగా వున్నారు. అదివరకెన్నడూ లేని ముచ్చట - నన్ను చూసి కన్నెగర వేసి, చేరువకు పిలిచారు. నాకు ఉన్నట్టుండి భయం వేసింది. తల వంచుకుని ఆయన వెంటనే నడిచాను. ఇద్దరం తోటలో చివ్వరగా వున్న బాదం చెట్టు క్రిందకు పోయి నిలుచున్నాం. నా కవళిక గమనించి ఆయన నవ్వారు. నవ్వుతూనే అన్నారు. 'భార్య గయ్యాళైన - ప్రాణనాధుని తప్పు; కూతురు చెడుగైన మాత తప్పు!' అని వెనుకటికి యెవరో పద్యం కట్టారు. మీ తల్లిని అంటే మా తల్లిని అన్నట్టు కాదా! కనుక లెక్క ప్రకారం తప్పు నాది! అది ఖాయం...

'కాని అది యెలా దిద్దుకోవాలో నాకు తెలియడంలేదు. నీవు నవ్వులాటకే అన్నావనుకో! కాని రంగడు చాలా నొచ్చుకుంది. అది నీ తప్పు అని నేననడంలేదు.'

'అది సహజంగా అభిమానవంతురాలు!'

'ఇంకోరిని అనదు! తాను పడదు.'

'మాట పట్టింపు వచ్చిందా - మళ్ళీ మొగం చూడదు.'

'ఇప్పుడే కాదు- చిన్నప్పటి నుంచీ అంతే! దానిది మరో కులం అయితేనేం - మనింట్లో పిల్ల - మన పిల్ల! అది నిన్నుగాని, ఇంత జరిగినా పల్లెత్తుమాట అనలేదు. నేను యెంత బ్రతిమాలినా అసలు యేం జరిగిందో ఓ పట్టాన చెప్పిందా? చివరికి నేను మొండికేసి - చెప్పకపోతివో - అన్నం నీళ్ళూ మానేసి ఇక్కడే పడుంటాను అనేసరికి, నా తత్త్వం దానికి తెలుసు కనుక అప్పుడిహ బయట పెట్టింది. ఎలా? ఒక్కొక్క మాట చెప్పడం వలవలా యేడవటం! అది కంటనీరు పెడితే మన ఇంటికీ మనకూ క్షేమం కాదు. కనుక!'

'నిన్నుపోయి దాని కాళ్ళు పట్టుకోమనడం లేదు. గడ్డం పట్టుకుంటే చాలు -

కరిగిపోతుంది.'

'అది కరిగితే యెంత; అరిగితే యెంత? నేను పెద్ద అవధానులుగారి కూతుర్ని! ఎవత్తో అలగా దాన్ని బతిమాలాల్సిన అవసరం నాకేం? అని అజ్ఞానం కొద్దీ అనిపించవచ్చును.'

'వెనుకటికి చదువుకునే రోజుల్లో మాకో పద్యం చెప్పారులే! మహాభాష్యం చదవకపోతే పదమంజరి చదవడం దండుగ! భాష్యం చదివాక పదమంజరి చేతపట్టడం దండుగ! దీనికి నీవు పెడర్థం తీయచ్చు. అది లేనప్పుడు నీ వుండటం దండుగ! అది మళ్ళీ మన ఇంటికొస్తే నీవు అప్పుడు శుష్కదండుగ! అని నా ఊహ అని నీవు అనుకోవచ్చు.'

'అదేమీ కాదు. కాని'–

'ఒక్కటి మటుకు నిజం!'

'అంటే నా బుద్ధికి అలా తోస్తుందనుకో! ఏ యింట దీపం ఉండదో – ఆ ఇంట వుండేది మనుషులు కాదు; గబ్బిలాలు. పరిస్థితులు ఇలాగే వుంటే, నాకీ ఇంట్లో వుండేందుకు ఎలా మనస్కరిస్తుంది? నాకే కాదు. మా వాళ్ళకు మట్టుకు? ఎప్పుడో అప్పుడు జాః పరమేశ్వరా అంటారు. అవును వాళ్ళ సుఖం వాళ్ళు చూసుకోవద్దా? ఈ ఇంట్లో వాళ్ళకు ఏం తోస్తుంది! కోరి తెచ్చుకున్న కోడల్ని పొమ్మంటారా? వారే మంచి రోజు చూసి తప్పుకుంటారు.'

'ఎవరి దారిన వారు పోయినా, మిగిలిన ఒక్కరికీ, అన్నోదకాలకు గాని, ఆస్తిపాస్తులకు గాని, ఏమీ లోపం జరుగదు! పిలిస్తే పలికేవాళ్ళు మటుకు ఉండరు!'

'ఉండకపోతే మటుకేం! మనకు మరో మనిషి పొడగిట్టదుగా!'

'ఆయన యిలా అంటూంటే – నేనూ మనిషినే కాని, మందలో గొడ్డును కానుగా! గొడ్డంటిది, చిరాకెత్తితే, కొమ్ము విసురుతుంది. మొగం పగిలేట్లు తన్నుతుంది! నాకు మటుకు రోషం రాదూ?'

'నేను చేసింది – బుద్ధి తక్కువ పనే కావచ్చు; కాని, కాకి పొడిచినట్లల్లా పొడవాలా? తనేం మొగవాడు కాదూ – చేతికొద్దీ ఆ చెంపా యీ చెంపా వాయిస్తే, తన అక్కసూ తీరేది, యీ రగడా చల్లారేది! అంతేకాని, యీ కూసుచిప్పిళ్ళేమిటి?'

'అవును అన్నప్ప మామా! ఆయన అల్లా సన్నాయి నొక్కులు నొక్కడంతో, నాకు ఆ తీరు చూసి అసహ్యం వేసుకొచ్చింది! అప్పుడు యెదుటి మనిషి మీద ఏం లక్ష్యం వుంటుంది?'

'కానీండి! యెలా కావాల్సివుంటే అలా అవుతుంది! ఇది లక్షణంగా కాపురం చేసే, సంసారి కొంప అనుకున్నాను కాని జంగాల మఠం అనుకోలేదు.'

'నన్నీ బెదిరింపులెందుకు?'

'మీ యింట దీపం పెట్టి – యిల్లు దిద్దుకునేందుకు, మీకూ, మీ పెద్దలకూ చేతనైన సేవచేసి, నలుగురిచేత ఔననిపించుకునేందుకూ, వచ్చానుగాని, ఎవరిదారిని వారుపోతే, యింటి కాపలాకు కాదు! నా కన్న ఆ రంగడు ఎక్కువైతే – దాంతోనే ఊరేగచ్చు! నెపం నా మీద వెయ్యక్కర్లేదు అన్నాను! యిందులో తప్పేముంది?'

'ఆహా! అదా కథ!' అన్నాడు అన్నప్ప!

'కథ యిదే కాని, తరువాత కమామీషు నీవు అనుకుంటూన్నది కాదు! ఆయన

దానింట కాపురం పెట్టలేదు! మీరందరూ కలసి – ఒక తగిన సంబంధం చూసి, దానికి పెళ్ళి చేశారు. పిల్లా పాపా కలిగారు లక్షణంగా వుంది.'

'అని ఆ నోటా ఆ నోటా వినడమే. మళ్ళీ నాటికి నేటికి అది నా కంట పడలేదు.'

మా ఆయనిది, కాల్చుకు తినే శత్రుత్వం! పైకి మంచిగానే కనబడుతారు. పలుకరిస్తే మామూలుగానే మాట్లాడుతారు. కాని, తనకైన మనిషి యింట్లో వున్నది, అన్న ధ్యాసే పోయింది. దాంతో, నా సణుగుడు నేను ప్రారంభించాను; ఆయన నా కన్న మొండి. యిన్నేళ్ళొచ్చి, బడిపంతులు ఉద్యోగంలో చేరారు. పవలంతా అక్కడ! చీకటితో వెళ్ళడం, యింటికొచ్చి రెండు మెతుకులు ఆదరాబాదరా నోట కొట్టుకుని, పోయి రంగడింటో దాని పిల్లల్ని ఆడిస్తూ కూర్చోడం, ఏ రాత్రికో యిల్లు చేరడం, నేను అంతసేపటిదాకా కళ్ళల్లో వత్తులు వేసుకుని కూర్చుని, పలకరించబోతే గుర్రు తీయడం – కొన్నాళ్ళు ఆ ముచ్చట.

కాని, అదెంతకాలం?

తెల్లవారితే సంవత్సరాదనగా, ఆవాళ, నిసి రాత్రి వేళకు వచ్చారు. రావడం నిద్రమత్తు మీద కాదు, యెన్నాళ్ళుగానో లేంది, తమంతట తాము పలుకరించారు.

'యివాళ్ళకి సరిగ్గా మూడేళ్ళు! యీ ముచ్చట ప్రారంభమై! యిహ యెల్లకాలమూ యింతేనా, మార్పంటూ రావడం వుందా?' అన్నారు.

'మార్పంటే – మీలోనా, నాలోనా?' అన్నాను. ఆ, అనడం కొంచెం నిర్లక్ష్యంగానే అన్నాను, చెప్పొద్దూ! అయినా ఆయన లక్ష్యపెట్టలేదు–

'సయోధ్య అనేది – ఒక్కరితో కూడిన పని కాదు – యీ సంగతి నీవు, యికనైనా గమనించడం మంచిది!'

'గమనించి ఏం చేయమన్నారు? దాని కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకోమన్నారా? యెవత్తో పరాయిదాని కోసమేనా, యీ తపనంతా? మీరన్నట్టు, అది మనింటో పిల్లే. మన పిల్లే – నేను కాదనడం లేదు, కాని ఆ యింగితం కాని, మన యింట తిన్న విశ్వాసం కాని, దాని కుండద్దూ? నేను, దాని కంత విషమైతే, నా మొగం చూడద్దు, నాతో మాట్లాడద్దు! అంతేకాని, అలిగిపోయి, సీమ రాణీకి మల్లే రేవిణీ వేసుకుని తానక్కడ కూర్చుంటే, నిత్యమూ అక్కడికి పోయి స్వస్తి చెప్పి రావలసిన అవసరం మీకేముందీ అంట! మీరందరూ యిచ్చిన అలుసు చూసుకుని, అదిలా వెరపించుకుని తింటూంది! యిది బస్తీ కనుక, ఒకళ్ళ జోలి ఒకరికి అక్కరలేదు కనుక – పైగా, శ్రీమంతులు కనుక మీరే ఆట ఆడినా చెల్లుతూంది! యిదే, మా ఊళ్ళో అయితేనా – యిలాంటి వేషాలకు పోతే మంచినీళ్ళు పుట్టవు! మీ చేతనైతే, ఆవిడను – ఆ గద్దెదించి తీసికురండి! నేనూ మీ అమ్మగారూ అరతి పళ్ళెం పుచ్చుకుని యెదురు వస్తాం! అంతేకాని, నన్నుపోయి, అక్కడ ప్రాణాచారం పడమంటే, నాచేత కాదు. మీరు నాకు పరువియ్యక పోయినా, మీ గౌరవం నేను కాపాడాలి! ఫలానా వారి కోడలినైయుండి, ఆ పాలమ్ముకునేదాన్ని పోయి బతిమాలుకోనా? యిదా, మీరు చెప్పేది?'

అని అనుకోకుండానే నోరు చేసికున్నా! ఆయన అప్పటికీ నిదానించారు!

నీ వంటున్నవన్నీ నిజమే! మీ గ్రామంలో వారైతే, పాలోసేదాని మనమరాలి

మీద జాలిదలచి ఓ పాత పరికిణి యిస్తారు; పండుగనాడింత పప్పు అన్నం పెడతారు, అది అంతవరకే!

మేం బస్తీవాళ్ళం.

మీ పల్లెటి దిక్కు మర్యాదలూ తెలియవు! ఆ పట్టింపులూ మాకులేవు. మా అమ్మకు ఆడపిల్లలంటే మహా ముద్దు! యెన్ని నోములు నోచిందో! కాని యీ నిక్షేపరాయనికి వెన్ను చలవ లేకపోయె! అందుచేత రంగడంటే మాకందరికి అంత యిది! యిప్పటికన్నా అర్థం చేసికుంటే బాగుంటుంది అన్నారు. నేనన్నాను కదా! 'మీ తత్త్వం యెప్పుడో అర్థం చేసికున్నాను! మనలాటి వాళ్ళు ఒకచోట వనగూడబట్టే, ధర్మం ఒంటి కాలు మీద నడుస్తూంది! నన్నింకా నవ్వులపాలు చేయదలచుకుంటే చెప్పండి!'

దానికి ఆయనేం సమాధానం చెప్పలేదు. పండగ ఆ ఒక్కనాడూ యింట్లో మటుకు వున్నారు. మరో వారం రోజులు, ఊళ్ళో వున్నారు! అంతే, ఆపైన-

అక్కడికి పది కోసుల్లో ఊరూ పల్లెకాని ఓ అద్దాన్నపడవిలో, నౌకరీట!

ఒంటి కట్టుగా తరలిపోయినారు! నీవు కూడా రమ్మని మాట మాత్రానికైనా అన్న పుణ్యానపోతేనా? యిక్కడ అన్నీ వేళకు అమర్చిపెడుతూంటే, అయ్యగారి ఆటలు సాగినాయి. నాలుగు రోజులపాటు, చెయి కాల్చుకుంటే, అప్పుడుగాని తెలిసిరాదు అనుకుని, నేను చూస్తూ ఊరుకున్నాను! పెద్దవాళ్ళు కదా, వారైనా యిదే మనకపోగా, కొడుకుతో షరీకు! అదంతా ప్రారబ్ధం కాకపోతే, మరేమిటి అన్నప్ప మామా!

ఒళ్ళు తుడుచుకునేందుకు అంగవస్త్ర మంటిది, ఒకరు అందియ్యాల్సుండె - మర చెంబులో నీళ్ళు పంచపాత్రలో పోసుకోవడం, యీ నాటికి చేతకాదాయె! తల్లి, యెదురు గుండా కూర్చుని 'అది కలుపుకో, యిది నంచుకో' అని పసిపిల్లవాడికి చెప్పినట్టు చెప్పాల్సుండె! యిలాటి మనిషి అక్కడ యెలా వండుకు తింటారు? నాకు తలచుకుంటే బాధగా వుండదూ? కాని వాళ్ళకు అదేం అనిపించినట్లు లేదు! అదెక్కడి పుటకో కాని!

మా మామగారు చూడబోదామా అంటే, యిప్పటికీ, పెళ్ళాం వెంటవెంట తిరుగుతూ ఆవిడ భేషంటే భేషూ, ఛస్ అంటే ఛస్సూ అనడమే కాని, తాను ఇంటికైన యజమానినే అనే యింగితమే లేకపోయె. ఆవిడ సరేసరి! గారాల కూచి! నిత్య పెళ్ళికూతురు! నిండు ముస్తాబు మీద వుంటుంది! మడిగట్టుకున్నంత సేపూ అయినా ఘుమఘుమలాడుతూ వుండవలసిందే! అంతే కాని పెద్ద తరహా ఏకోశానాలేదు. పిల్లవాడు అలా రాకవడం మేమా అనే దిగులూ - చింత లేనే లేకపోయె.

లేకపోగా, అక్కడేదో పెద్దతోట కొన్నారనీ, అందులో చిన్న ఇల్లు వేయిస్తున్నారనీ, చేరువలో ఓ పదెకరాల చేను, చవకగా వస్తే పుచ్చుకున్నారనీ, అందులో భారీగా కూరగాయలు పండిస్తాడుట అనీ, నింపాది మీద రంగడూ దాని సంసారమూ, అక్కడికే జేరుకుంటుందిట అనీ, గోడకు చెప్పినట్లో, తలుపులకు చెప్పినట్లో, వల్లన వేస్తూండేవారు! ఇదంతా నన్ను సాధించడం కాదూ! ఇంటిలో పెళ్ళాన్ని ఇలా యేడిపిస్తూ, ఆయన ఊళ్ళో వుద్ధరిస్తాడుట! నేను ఎన్నడన్నా పొరబాటున అక్కడికి వచ్చిపోతానేమోనని ముందుకాళ్ళకు బంధంగా దాన్నీ, దాని కామాటాన్నీ అక్కడికి తరలించుకుపోవడమా?

ఇహ నేనూరుకోలేదు. మా అత్తగారిని కదలేశాను. ఏమండీ! నేను - కూడా అక్కడికే వెళ్ళదామనుకుంటున్నాను - అన్నాను. ఆమె అర్థంకానట్టు 'ఎక్కడికమ్మా!' అంది.

నాకు మందుకొచ్చిందనుకో – ఫలానా చోటికి అన్నాను. ఆవిడ అతి చురుగ్గా – అలాగా! అంది. చూశావా ఆ గడుసుదనం! అలాగే – అంటే తన పుట్టేం మునిగిపోయిందో? ఆ పళాన పట్టుకుని పప్పు ఎనిపినట్టు ఎనిపేశాను. అది పొరపాటయితే కావచ్చు! పోనీ, అప్పుడయినా ఆవిడ నామీద జాలి దలచిందా? నేనలాగ గొంతుచించుకుంటే ఆవిడకు చీమ కుట్టినట్టయినా లేకపోగా – పైగా అధ్యాత్మ రామాయణం కీర్తన పాడినట్లు, బాసిపట్టేసుకుని – 'అమ్మాయ్! ఇప్పటి కాలంవాళ్ళ మాటలు నాకు అర్థం కావే అమ్మా! ఇంతసేపూ నీవేదో చెప్పావ్, అంతా చెవిని పట్టాను కాని, బుర్ర కెక్కందే! మీ యిద్దరూ బుద్ధి తెలిసిన వాళ్ళు : నలుగురిలో వున్నప్పుడు బుద్ధిగా పెద్దమనిషి తరహాగానే వుంటారు. అంతవరకే మాకు కావలసింది. ఆలూమగలైన తరువాత చిన్నెలూ చిద్విలాసాలూ లక్ష వుంటాయి. అది మీ మీ ముచ్చట కాని – యెదుటి వాళ్ళకు యేం తెలుస్తుంది? అసలు యెందుకు తెలియాలి?'

ఇలా యేడుపాయల జడల్లడం మొదలుపెట్టింది. రంగు తేలిపోలా? ఆయన ఆ తీరూ, వీళ్ళు ఈ తీరూ అయితే నేనక్కడెందుకూ? పాత్ర సామానుతోబాటు పడుండానికి నాకేం? వచ్చేశాను. రావడం మంచిగానే వచ్చాను. వెళ్ళొస్తాను అత్తయ్యా – అన్నప్పుడు కూడా పోనీ, మాట వరసకన్నా – 'వేగిరం రావే అమ్మా! నీవు లేకపోతే యిల్లు చిన్నబోదుటే!' అనుంటే యెలా వుండేది! నవ్వేసి ఊరుకుంది – వాళ్ళ నైజం అంతేగా! సరే, మా నాన్న అక్కడికీ లుసుకు – లుసుకూ పోయిరావడం... అదే రాద్ధాంతం అంతా అందరికి తెలిసిందేగా ! ఈ రాత ఎందుకొచ్చిందో – యెంతకాలమో! గుట్టు చప్పుడు కాకుండా పడుందాం అనుకుంటే మా సుబ్బిగాడు ఇలా చేయనా? అది చాలనట్లు మా నాన్నకు ఇలా శివమెత్తనా? ఇక్కడ యిన్ని భరించగాలేంది, అక్కడకుబోతే ఎవరేమనుకుంటారో అని జంకు కాదు, మామయ్యా! ఇన్నాళ్ళూ మా నాన్నంటే మాకో మేరుపర్వతంగా వుండేవారు. ఇప్పుడిలా చేశాడంటే నాకు వాళ్ళ యెదుట పడేందుకు మొగం చెల్లడం లేదు. కాని ఇక్కడ యింకొక్క క్షణం వుండటానికి మనస్కరించడం లేదు – నన్నేం జేయమంటావ్?' అంది.

అన్నప్ప వచ్చే నవ్వు ఆపుకుని – 'అమ్మడూ! నీవే గనుక మొగపిల్లవాడవై వుండి పురాణం చెప్పడం మొదలుపెడితే, నాకు ఈ ఊళ్ళో ఉప్పూ పత్రీ పుట్టేవి కావనుకో! నీవు చెప్పిన దాన్నిబట్టి చూస్తే పాండవులూ మంచివాళ్ళే! కౌరవులూ మంచివాళ్ళే! కాని భారత యుద్ధం వచ్చింది. అలాగే మీ ఇద్దరు మంచివాళ్ళే! ఎటొచ్చీ ఏ లోపమూ లేకపోవడమే మీకున్న లోపం – కాలక్షేపం కోసం గాలితో కజ్జాలాడేవాళ్ళు లేరూ? దానికేం, నిన్ను వెంటబెట్టుకుని నేను తీసుకువెళతాను. చెప్పకుండా చేయకుండా ఉన్నట్టుండి ఊడిపడటం కన్నా, నేను ముందుగా వెళ్ళి ఆ మర్నాడో – మూడోనాడో నీవు బయల్దేరి రావడం మంచిదంటావా? అలాగే చేద్దాం. నీకు తోడుగా మన బుచ్చిగాడు వస్తాడు. శాంతమ్మక్కయ్యా! అమ్మడు విషయంలో మనకిక నిర్విచారం! ఇన్నాళ్ళ నుంచీ ఒంటరిగా వుండటంతో ఆనూ – పానూ ఆలోచించుకుంది. పరిస్థితులకు మనం లొంగిపోకుండా వాటిని మనం లొంగదీసుకుంటేనే సుఖం వుంది; దానికి తెలిసి వచ్చినట్లుంది. ఇహ దాని కాపురం అది చేసుకుంటుంది. నేను తెల్లారేసరికల్లా బందరులో వుంటాను. శనృషస్సులో పిల్లదాన్ని ప్రయాణం జేసి పంపించు, ఆ సాయంకాలానికల్లా నేను

ఇంటికొచ్చేస్తాను; వచ్చి అక్కడ ముచ్చట్లన్నీ చెబుతాను. కాస్త స్థిమితం జూసుకుని బావగారి విషయం ఆలోచిద్దాం! ఆయనకు గంగా స్నానం చేస్తేనే కాని కళ్ళు తెరిపిని పడేట్టులేవు.' శాంతమ్మగారు అనంతలక్ష్మికి నుదుట కుంకుమ ఉంచి ఫలతాంబూలం ఇచ్చింది. ఇద్దరూ యింటికి తిరిగి వచ్చారు.

బస్తీకి ధాన్యం తోలించే రోజులు! అన్నప్ప ఓ బండీ మీద పడి, తెలవారుతూండగా మచ్చుల సావడిదగ్గిర దిగి, కాలవకు వచ్చి స్నానం జేసి, పుట్టలమ్మ తోట పక్కనుంచి అడ్డదోవను వచ్చి, కస్తూరివారి సందు తిరిగాడు. కాస్త పదడుగులేస్తే – అదిగో ఆ రావిచెట్టు దగ్గిరే పిశిపాటి వారి ఇల్లు! చిదంబరమూ, తానూ చిన్ననాడు, ఒకచోటే ఓనమాలు దిద్దుకున్నారు. వాళ్ళది కావడం నడుపూరు! వీళ్ళ తండ్రి హయాంలో బందరులో స్థిర పడ్డారు. ఆయన అద్దేపల్లి సోమనాథశాస్త్రులగారంతటి వాడు! కాని, కుటుంబం పెద్దది కావడంతో సంపాదన నిమిత్తమై, సాధారణంగా అనంతశయనం ఆ ప్రాంతంలోనే తరుచు సంచారం చేస్తూ, రెండు మూడేళ్ళకోసారి ఇంటిమొగం చూస్తూండేవాడు. బందరులో వైశ్యులందరూ ఆయన శిష్యులు కావడంతో, వాళ్ళ ప్రార్థనమీద కొంతకాలానికి దేశాటనం కట్టిపెట్టి, ఊళ్ళోనే వుండిపోయినాడు. ఆయన అత్తవారి ఊరు అవనిగడ్డ. అలా దేశం మీదికి వెళ్ళినప్పుడల్లా ఆవిడ పుట్టింట ఉంటూండేది. అన్నప్పకీ, చిదంబరానికి అదీ సావాసం! కొన్నేళ్ళు పోయినాక ఇద్దరూ మళ్ళీ కొల్లూరులో ఉండి వారాలు చేసుకున్నారు. అన్నప్పకా చదువు అంతంత మాత్రమే అంటింది. కాని, చిదంబరం మట్టుకు ఘనాపాఠీ అయినాడు. అంతేగాకుండా, ఏడు తరాలుగా వస్తూన్న మంత్రశాస్త్రంలో మళ్ళీ తండ్రంతటివాడనిపించుకున్నాడు.

వీళ్ళ నాయనగారున్నారే బుచ్చంభొట్లు, బాల ఉపాసకుడు. ఆ తల్లి ఆయన పిలిస్తే పలికేదని ప్రతీతి! అవును – అలాంటి నిదర్శనాలున్నాయి. నవరాత్రములలో ఆయన ఏకదీక్ష మీద ఉండేవాడు. సంధ్యావందనం చేసుకునేప్పుడు తప్ప, మళ్ళీ పచ్చి మంచినీళ్ళు అయినా ముట్టుకునేవాడు కాదు. రాత్రి పూజ ముగిసేసరికి బాగా ప్రొద్దుపోయేది. అప్పుడూ అక్కడ ఉన్నవారి భోజనాలు!

ఒకనాడు, బహుశ సప్తమినాడు కాబోలు – మామూలుగా పూజకని కూర్చున్నాడు. ఝూం ప్రొద్దుపోయింది. కాని, యీయన నోరు మెదపందే! కూర్చున్న వాళ్ళకు కునికిపాట్లొస్తున్నాయి. కాని, ఎవరూ నోరెత్తవల్లనా? చివరకు ఆయన దగ్గర అంతో యింతో చనువున్న శివరామావధాన్లు చల్లగా దగ్గిరకు జరిగి, 'మావయ్యా! ఇక ఉపక్రమించుదామా?' అనగా – 'ఆవిడ యెక్కడికో వేంచేసిందిరా! ఇంకా మనం గుర్తు రాలేదేమో! ఎవరి వేళకు వారొస్తారు రానీ' అనడంతో, అందరూ కళ్ళు మూసుకుని అలాగే కూర్చునిపోయినారు. మరెంతసేపటికో ఘల్లు – ఘల్లుమని అందెల మ్రోత వినిపించింది. అంతటా ఘుమ ఘుమ లాడింది! పూజ ప్రారంభమయింది! అంత పుణ్యం చేసుకున్నదా ఇల్లు!...

ఆయన ఎత్తరివాళ్ళలోకి యెత్తరి! అందుకు తగినంత బందోబస్తుగానూ వుండేవాడు. అత్తరువూ, పన్నీరు యెప్పుడూ వంటినుండాల్సిందే! కంటికి సురమా, బుగ్గను తాంబూలము! వెంట అటూ యిటూ రెండు జాగిలాలూ! ఆ మనిషి వీధిని నడుస్తూంటే, దేవుడూరేగుతూ వస్తున్నట్టుండేది! వారంటే బహుమందికి భక్తి! కొద్దిమందికి

భయం!...

భయం ఎవరికి? బ్రాహ్మలనే లౌక్యులకు! తతిమ్మా వైదికపు వాళ్ళలాగా తమర్ని ఈయన అనుసరించడమే అని, గుర్రు – ఏమనుకుంటే ఏం చేసిపోతాడో అని భయం! ఈ విషయం ఈయనకు తెలియకుండా వుంటుందా? కాని తెలియనట్టే వుండేవాడు...

ఒక పర్యాయం, ఈ పట్టణానికి స్వాములవారు దయచేశారు. పీఠాధిపతులు కావడంతో యేనుగులూ, లొట్టిపిట్టలూ ఇలాటి హంగామాతో వచ్చారు. లౌక్యులందరూ నడుం కట్టుకున్నారు. నిత్యమూ పాదపూజలు మహావైభవంగా జరుగుతున్నాయి. ఊళ్ళో బ్రాహ్మణ్యం అంతా అక్కడే వుంటూంది. కాని, వీరు ఆ చాయలకు వెళ్ళలేదు. ఎందుచేత అని ఎవ్వరడగ్గలరు?

అలా వారం అయింది : పక్షం అయింది. అక్కడ చేరినవారు యేం చెవులు కొరికారో – ఇక్కడ వీరికి శ్రీముఖం అందింది. ఆ అందటం యెలా అందిందని! సాధారణంగా సంప్రదాయం యేమంటే, స్వాములవారు ఫలానా గ్రామానికి వేంచేస్తారనగా, కొంచెం కద్దనగానే అక్కడి శిష్యులకు శ్రీముఖాలు అందుతాయి. స్వామివారి సన్నిధానవర్తి వాటిని పట్టుకొస్తాడు. చేత్తోకాదు; పాలకీలో ఉంచి! వెంట కొంత సిబ్బందీ ఉంటుంది. ఆ పాలకీ యకాయకిని వచ్చి, ఏదో ఆలయం దగ్గిర ఆగుతుంది. అక్కడికి నలుగురు పెద్దలూ చేరుకున్న మీదట, ఆ వచ్చిన మనిషి ఆ పత్రికను చదివి వినిపిస్తాడు. అందరూ శిరసావహించిన మీదట, వచ్చిన వారందరికీ కుంకుమ, మంత్రాక్షతలు ఇవ్వడం జరుగుతూంది. ఆపై, ఆ తరుణానికి తగు మనుషులు ఇక్కడ నుంచి బయలుదేరి వెళ్ళి, స్వాములవారిని దయచేయవలసిందిగా ఆహ్వానించి, వారి వెంట తిరిగి వచ్చి, అంతకు ముందుగానే యేర్పాటు చేసిన విడిదిలో వారినీ, వారి సిబ్బందినీ ప్రవేశపెడతారు. స్వామివారు కటాక్షించే పత్రిక ఒక్కటే అయినా, గౌరవంగా బహువచనంలో శ్రీముఖములు అని వ్యవహరించడం అలవాటు. వారు గ్రామానికి దయచేసిన మీదట, పొరుగూరి పండితులెవరైనా ఆ ప్రాంతాలకు వచ్చి వున్నారని వినికిడి అయితే మర్యాద కోసం వారికిగాను ప్రత్యేకంగా శ్రీముఖం పంపడం జరుగుతుంది. ఊళ్ళో ఏ గృహస్థు అయినా భ్రష్టుడైన సందర్భమేదన్నా వుంటే, సభాపతి తనకుగా తాను చేయిచేసుకునేందుకు జంకిన పక్షంలో స్వాములవారికి విషయం మనవిచేసి, అక్కడ నుంచి ఆంక్ష పత్రిక పుట్టించడము కూడా అప్పుడప్పుడు జరుగుతుంది. అయితే అది బహు అరుదు! అది అలాంటిది!

కాని, వీరి విషయంలో ఏం జరిగిందంటే – వీధి వెంట పోతూండగా, ఎరుగున్న పెద్దమనిషి ఎదురుపడి 'మీరు దర్శనానికి రావలసిందిగా స్వాములవారి ఆజ్ఞ అయింది!' అన్నాడు. వీరు వెంటనే 'వెర్రినాగన్న! వారు యెన్నటికి అలా అని ఉండరు; పూజవేళకు వచ్చి, అందరితోబాటు ప్రసాదం తీసుకో అని వాడితో చెప్పి రారా! అనుంటారు. నీకు అర్థంకాక ఇలా అఘోరించావు. సరే – నీ దారిని నీవు పో!' అని నడిచిపోతూనే వున్నారు. కబురు తెచ్చిన మనిషి వెంటాడి, 'ఏమని మనవి చెయ్యమన్నారు?' అంటూ సణగడంతో, వీరు హుంకరించగా – వెంటనున్న జాగిలాలు అతగాడిని తరిమేశాయి!

ఈయన సరాసరి అక్కడికే వెళ్ళాడు. అప్పటికి ఉండవలసిన వారందరూ వున్నారు. స్వాములవారు మటుకు ఇంకా లోపల నుంచి దయచేయలేదు! అందరూ ఒక్క మాటుగా దయచేయండి – దయచేయండన్నారు. వీరు ముందుకు అడుగువేయలేదు, ఒక్క జాగిలం

అమాంతం ముందుకు దూకి, స్వాములవారు కూచునే ఆసనం మీద కూచుంది - జనమంతా లబో దిబో! కాని, అదిలించబోతే మీద పడుతుందేమోనని భయం! వీరు 'హ్ఁయ్' అనే సరికల్లా అది తోకముడుచుకుపోయింది. ఇంతలో స్వాములవారు దయచేయడం, ఆసనం అలంకరించడం జరిగింది. ఉన్న జనం వుండబట్టలేక, ఇలా అయిందని మొరబెట్టుకున్నారు. వారు గంభీరంగా వీరి వంక చూసి, సమీపించవలసిందిగా తల వూపారు. పూజ ప్రారంభించారు. ఇక నీరాజనం - ఉన్న కర్పూరం యావత్తూ తెప్పించారు. తాము గంట చేత అందుకున్నారు. 'అంబా!' అని గర్జించారు. బుచ్చంభొట్లు, రెండు చేతులా కర్పూరం ముద్దపట్టుకుని, వెలిగించి హరించి పోయేవరకూ అలాగే నిశ్చలంగా వున్నాడు. అంతటా పొగ దట్టంగా కమ్ముకోవడంతో, అక్కడి వాళ్ళకు యేమీ కనిపించడంలేదు. రెండు చేతులా తలో ముద్దా తీసుకుని వెలిగించి గిరగిరా తిప్పుతూంటే, అగ్నిచక్రాలు తిరుగుతూన్నట్టయింది. అంతలో చెయి విడవంగానే ఆ ముద్దలు, జాగిలాలు ఎగిరి అందుకుని, మ్రింగివేసి సింహాల్లాగ గర్జించాయి. అందరికి అయోమయం. వీరు గొంతెత్తి దేవీ స్తోత్రం పఠించారు. అందరూ తేరుకున్నారు తేరుకుంటూండగానే వీరి త్రోవను వీరు వచ్చేశారు. ఇక మంత్ర పుష్పం!

స్వాములవారు వెన్నెల్లో మల్లెపూవల్లే వున్నారు. ఆ మౌనం మరి వీడలేదు, ఆ చిరునవ్వు వాడలేదు.

అక్కడనే వుండిపోయినారు.

కాని; మునుపటి తీరున భిక్షావందనం స్వీకరించలేదు. ఎవరికీ దర్శనమీయలేదు. ఏకాంతనిష్ఠ - ఏడాదికి సిద్ధించింది.

బుచ్చెంబొట్లుగారు స్వాములవారి మీద ఏదో ప్రయోగం చేశారనీ, అందువల్ల ఆయన అలా అయిపోయినారనీ గ్రామంలో గుసగుసలు బయలుదేరినాయి. అదీ బ్రహ్మణ్యంలోనే! కాని, వీరు పట్టించుకుంటేగా - ఇలాటి కథలు అనేకం ఉన్నాయి ఆయన్ను గురించి. ఆ తరం అలా వెళ్ళిపోయింది.

పోతే, యీ చిదంబరం ఉన్నాడే - వీడు ఇంత చదువూ చదివినా, ఇన్ని ప్రజ్ఞలున్నా సంగీతం అంటే మహా వెర్రి. అంతేకాకుండా, భజనపాళీలో మొనగాడు. మరో వ్యావృత్తీ వ్యాసంగం లేదు. తండ్రి ఇచ్చిందే పైతరందాకా చాలు. అది గాకుండా అత్తవారి వంక నుంచి మరింత కలిసొచ్చింది. ఇంటికి యెందరొచ్చినా, ఎవరొచ్చినా ఇంత భోజనం పెడతాడు. ఎక్కడ సంతర్పణ జరిగినా సరే - తూమెడు బియ్యం, పప్పూ - ఉప్పూ పంపిస్తాడు. అంతేకాని, నగదు రూపంగా ధర్మం అంటూ చెయ్యడు. డబ్బు దగ్గర ఖరా ఖండీ మనిషంటామా అదీ లేదు. లేనివాళ్ళ పిల్లలకు వడుగులూ, పెళ్ళిళ్ళు చేయిస్తాడు. ఖర్చుకు వెనకాడడు. కాని, రాగి కానీ ఇంకొకడి చేతులో పెట్టడు. అదీ అతడి తత్త్వం! పిల్లలు లేరు. 'మా నాన్న పేరెట్టావ్ - మీ బుచ్చిగాణ్ణి నాకియ్యరా' - అనేవాడు. 'వాడికి తమ్ముడు పుట్టగానే చంకనేసుకు వెళ్ళరా!' అనేవాడు అన్నప్ప. ఎంత కాలానికి ఆ ముచ్చట తీరకపోవడంతో, 'మరెవ్వరినైనా పెంచుకోరాదుట్రా' అంటే - 'మరెవరినో పెంచు కోవడమెందుకురా! మా నాయన యెక్కడ పెరిగితే ఏం? నీ ఇంట వుంటే ఒకటీ - నా ఇంట వుంటే ఒకటీనా?' అంటాడు. అదీ ఆయన ఆపేక్ష!

ఇదివరకల్లా అన్నప్ప చీటికి మాటికి బందరు రావడం వాల్తీ. పిల్లనిచ్చుకున్న

తరువాత రాకపోకలు మరింత యెక్కువైనాయి. సహజంగా ఇప్పుడిటీవల వాళ్ళందరూ తిరుపతిలోనే ఉంటూండటంతో తన వాడంటూ ఊరి మొత్తానికి ఈ చిదంబరం ఒక్కడే! అమ్మడు కాపురం చేస్తున్న రోజుల్లో అయితే, పేటకు వచ్చినప్పుడల్లా తొంగిచూసి వస్తూండేవాడు. ఇన్నేళ్ళుగా అదీ లేదాయె? అంతేకాక, కూతురూ, అల్లుడూ ఇక్కడ ఉంటూన్నప్పుడైనా, తన బస చిదంబరం యింట్లోనే! తానున్న పూటో – అరపూటో అమ్మాయీ – అల్లుడూ వచ్చి తనతో బాటు ఇక్కడ ఉండాల్సిందే! లేకపోతే, యీ చిదంబరం ఊరుకుంటాడా; ఊళ్ళో ఉండటమే వస్తే, ఇద్దరూ ఒకర్నొకరు వదిలి ఒక్కక్షణం ఉండరు – ఉండలేరు, ఎందుచేతనంటే, రోజు మొత్తం మీద ఒక్కసారైనా గజకచ్ఛపాల్లాగా కలియబడకపోతే తోచదు. చిదంబరం పక్కా రామభక్తుడు! అన్నప్పగారికి, అతడికీ ఆ విషయానికొస్తే – చుక్క యెదురే కదా! ఈ తగవులాటలో యెన్నిసారులు శ్రీమద్రామాయణం మధించారో?...

తాను అనుకున్నట్టుగానే తలుపువేసి ఉంది. ఈ ప్రబుద్ధుడు యెండ మొగం మీదికొస్తేగాని నిద్రలేవడు. ఆ యిల్లాలు దొడ్లో యెక్కడో ఉంటుంది. పిలిస్తే వినబడుతుంది గనుకనా – వాడి చిత్తమొచ్చి, తలుపు తీసిందాకా జపం చేస్తూ కూర్చోవలసిందే! కొంతసేపటికి లోపల నుంచి వాడి గొంతు వినిపించింది. 'కోదండ రాములూ, మమ్మోకన్నవారూ – దయతో ఆదరించి, పెంచీ విడానాడాలే... రూ జానకీ లోచన ద్వంద్వ – చకోరానంద చంద్రమా! రమతే మమ తేనిస్వీరామః కామనమో హ్రుది...'

చిదంబరం తలుపుతీసి, అన్నప్పను చూడంగానే 'హో హో హో, ఒంటి బ్రాహ్మడా! రాముడ్ని స్మరించుకుంటూ తలుపు తీయగానే యిలాటి శకునమైంది కనుక, ఇవాళ వంకాయకూర వజ్రగా వేగుతుంది. సొరకాయ పప్పు పాకాన పడుతుంది. మజ్జిగ పులుసు మాంచి ఘుమ ఘుమ లాడుతుంది. గారెముక్క పంటికిందికానుతుంది. క్షీరాన్నంలో దొరగావేసిన జీడిపప్పు సమృద్ధిగా పడుతుంది'– అంటూ చదువుకుపోతూండగా, అన్నప్ప మాట కలిపించుకుని 'ఇవాళకు యింతకన్న భుక్తాయాసం వద్దురా! తతిమ్మా పదార్థాలు రేపూ – యెల్లుండీ చూసుకుందాం!'

'అంటే, ముక్తసరిగా మూడు పొద్దులు వుంటావన్నమాటేనా! వచ్చేవాడవు బుచ్చిగాణ్ని వెంటేసుకు రాకపోయినావ్!'

'ఎల్లుండి ఉదయానికల్లా యిక్కడుంటాడు. అవధాన్లుగారి అమ్మణ్ణి వెంటబెట్టుకు వస్తాడు.'

'అహఁ! ఏం యిన్నాళ్ళకు కథ యిలా తిరిగింది!'

అన్నప్ప పూసగుచ్చినట్టు యిన్నాళ్ళ భోగట్టా – చిదంబరానికి తెలియజెప్పాడు. 'అవధానులుగారు నీకు తగలలేదా?' అన్నాడు.

'తగిలితే, తప్పించుకుపోయేవాడా?'

'ఇప్పుడు మటుకు యెక్కడికి పోతాడులే!'

'ఇలాటి పుండాకోర్ పనులు చేసేవాళ్ళని, ఆ విశ్వనాథుడు మటుకు ఉండనిస్తాడా? అపరాధాలు చేసిన వాళ్ళందరూ యానాం పారిపోతుంటే, అవధాన్లుగారు కాశీకే యెసరెట్టారు. ఇలాటివాళ్ళు నలుగురు చేరితే, ఆ అన్నపూర్ణ సత్రంలోనూ ఇహ అన్నం పుట్టదు. లేనివాళ్ళు లేక అఘోరిస్తూంటే, ఉన్నవాళ్ళకీ పొయ్యేకాలమేమిటి?'–

'తాను మంచా? తన కొడుకు చెడ్డా? ఆత్మావై- అంటూ ఘోషించిన వేదకాలం వాళ్ళు వెర్రివెధవలా? ఎందాకా వస్తాడో కాని, అప్పుడే ముక్కట్టుకోవచ్చు?'

'ముక్కట్టుకునే కూర్చుని ఉంటాడు.'

'కూర్చునే రకమైతే ఇక్కడే కూర్చునేవాడు. కాశీకి పోయినా కర్మం తప్పదన్నట్టు అక్కడా కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూ ఉంటాడు. గీత కాకపోతే, శాంతమ్మ ఇంటో ఉండగా- యీయన మనశ్శాంతి కోసం తెంచుకు పారిపోవడమేమిటి?'

'అవునురా! నీవన్నట్టే గీత! – రాముడంతటి వాడికి తప్పలేదు.'

'అంటే, శ్రీరాములవారు కావాలని తప్పిదం చేశాడంటావా?'

'నేననేదేమిటి? వాల్మీకులవారే అన్నాడు. ధర్మం – తరానికో తీరున ఉంటుందా! తరహాను బట్టి మారుతుందా? ఆవాళ రాముడు సరే. ఇవాళ ఏ రామచంద్రయ్యో ప్రజాక్షేమం కోసం పెళ్ళాన్ని వదిలి పెడుతున్నానంటే ఊరుకుంటావా? పైగా, సీతమ్మవారేం అల్లాటప్పా మనిషా? జనక రాజర్షి బిడ్డ! 'సహధర్మ చరీ తవీ!' అన్నప్పుడు తలెందుకు ఆడించాడూ? నా వీలును బట్టి పరిత్యజించే హక్కు కూడా నాకు ఉండాలి సుమా అనే షరతు ముందుగానే యెందుకు పెట్టలేదు? అగ్నిసాక్షిగా చేసిన ప్రమాణమే లక్ష్యపెట్టకుండా ఉండటం దేవతాలక్షణం కావచ్చునేమో కాని సిసలైన మనిషై పెళ్ళాంమీద ఆదరాభిమానాలు ఉన్నవాడైతే యేం జేసేవాడు? మీ రాజ్యమెంత జేసు? మీరెంత జేసు? జనకరాజర్షి కుమార్తెనే గౌరవించలేని మీరూ ఓ ప్రజలేనా? అనేసి, హాయిగా ఆవిడను వెంటదీసుకుని అడవికి పోయుండేవాడు కాని, ఆ మహానుభావుడికి అవ్వక్కర్లేదు – బువ్వక్కటే కావాలి! తన కీర్తిలో చిన్నమెత్తు తరగకూడదు! కావాలనే చేయక, కళ్ళు మూసుకుచేశాడంటావా?!'

ఇంతలో సీతామహలక్ష్మి – అంటే చిదంబరం భార్య అక్కడికి వచ్చి, వీరివాలకం జూసి, 'సీతారామ యుద్ధం ప్రారంభమైంది' అనడంతో, ఇద్దరూ సర్దుకుని ఊరుకున్నారు.

'బావగారు పదిరోజుల పాటైనా ఉంటారా?' అన్నది. చిదంబరం మూడు వ్రేళ్ళాడించాడు.

"మూణ్ణాళ్ళా – అయ్యోరామ!"

చిదంబరం కనులతో, నొసలితో, మునివేళ్ళతో, కలగలుపుగా రకరకాల సైగలు చేశాడు. వాడి ఎదురుగుండా – రామా! అంటావేమే! ఇప్పుడే పారిపోయేను – అని ఆవిడకు తెలిసేటట్టు. ఆవిడ చిరునవ్వుతో –

'బావగారేమీ అనుకునేవారు కారు ! సీతా అని జనకుడు పేరెట్టిన తరువాత, రామా అనక మరేమంటాను? వారికి ఆ మాత్రం తెలుసులేండి! ఇన్నాళ్ళనుంచీ వినేవారు లేక ఇదౌతున్నారు. ఈ మూణ్ణాళ్ళూ కరువుతీరా ముష్టియుద్ధం చేయండి! కబుర్లు చెప్పుకుంటూ కాస్త కూరా నారా సంగతి చూశారా అంటే, చిటికెలో వంట అవుతుంది' అంటూ ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది. అన్నప్ప నవ్వుకుంటూ – 'బ్రహ్మదేవుడు మా మరదలికి యీ నడుమ ఆ రవంత చెవుడంటూ ప్రసాదించాడు గనుక, సుఖంగా ఉంటూంది. లేకపోతే, నీ సంగీత సాహిత్యార్భాటంతో – దారుభూతో మురారిః– అన్న స్థితికి వచ్చి ఉండేది! ఇంతకూ ఆవిడ అదృష్టవంతురాలు...'

'అంతో ఇంతో – ఆ అదృష్టంలో అరపాలు మనకూ పట్టిందోయ్! మా ఆవిడకు వాళ్ళ వాళ్ళు ఏరి కోరీ ఆ పేరెట్టిందుకు, మాయలేడిని పట్టుకురమ్మని మారాముళ్ళు

పెట్టదు. నామీద యెంత తామసం వచ్చినా, భూమి బద్దలు కొట్టదు. అదీ రవంత సుగుణం! కాని అసలు విషయం మరెవ్వరికి తెలియదు. ఈవిడ పుట్టింటి తరఫు వాళ్ళందరిదీ మాంచి వాగ్ధాటి ! ఈ పిల్లదానికి మరో పాలెక్కువ! దాంతో కాపురానికి వచ్చిన క్రొత్త రోజుల్లో చూసుకో, నా స్థితి! వెనుకటికి వేణుగోపాల శతకంలో జెప్పినట్లు, ఆత్రుడౌ విటగాని కతిభాషి లంజైన, ముప్పొద్దులూ ఆ చిలక పలుకులు వినలేక, దీనికి మందు ఇదీ అని నేను సంగీతంలో పడ్డాను. అయితే, అది మనకు వికటించి, ఆవిడకు గుణమిచ్చింది. మనఘోష వినిపించదు. మనం మటుకు వినక తప్పదు. చూశావట్రా ! ఇంతకు పూర్వమంటే, ఆవిడ మాటలే వినాల్సుండేది. మన శాపం కూడా మనమే ఆలకించవలసి రావడంతో, ఇహ మన అవస్థ చూడు! పోనీ – ఊరుకుందామా అంటే, ఆవిడ వెంటనే అందుకుంటుందాయెను ! దానికన్న ఇదే కొంత మెరుగని, ఇలా కాలక్షేపం చేసుకొస్తున్నాను. తినగ తినగ వేము అన్నట్టు, ఇప్పుడిప్పుడే నా సంగీతం నా చెవికి ఇంపుగా ఉన్నట్టు భ్రమ కలుగుతూంది. కనుక బతికి పోయినాను కాని. లేకపోతేనా – నాకూ యేనాడో చెవుడొచ్చి ఉండేది!'

ఇద్దరూ కాస్సేపు నవ్వుకున్నారు.

అప్పటికి కాస్త ప్రొద్దెక్కింది.

'నేనలా వెళ్ళిరానా !' అన్నాడు ఇతడు

'నేనూ వస్తున్నాను' – అన్నాడు అతడు.

'ఇద్దరం వెళితే, రాయబారం వచ్చామని వాళ్ళు అనుకుంటారేమో !'

'వచ్చింది అందుకేగా! ఇందులో లౌక్య మేమిటోయ్ – ఒరేవ్! నాకా మాత్రం తెలియదటరా! నేను నాగేశ్వరస్వామి ఆలయంలో ఉంటాను గాని, నీవు వెళ్ళి పని చూసుకునిరా!' అన్నాడు చిదంబరం.

సరాసరి వచ్చి, కొండూరి వారి ఇంటి మీదుగా వాలులోంచి ఆలయం ముందుకు వచ్చారు. పక్కసందులోనే రమణయ్యగారి యిల్లు –

ఇంటి ముందు ఒంటెద్దు బండి ఉంది !

బండీలో కొంత సామాను!

రమణయ్యగారు ఒక చిన్నమూట, కిత్తనార సంచి తీసుకు వచ్చి, బండిలో పడేసి మళ్ళీ ఇంట్లోకి ఒక అంగవేశాడు. అన్నప్ప ఇంటి ముందుకు వెళ్ళేసరికి, లచ్చమ్మ ఆ చేతా యీ చేతా మరికొంత సామాను పట్టుకుని గుమ్మంలోకి వచ్చింది.

'అన్నప్ప బాబూ! ఎప్పుడు రావడం?'

'ఇంతకు ముందే!'

'మహామంచి శకునం! తిరుపతి ప్రయాణం పెట్టుకున్నాం. పడవకు వెళుతున్నాం. మన వాళ్ళందరూ బాగున్నారు కదా!'

'ఆహా!'

'అదేమిటి అలా నుంచునే ఉన్నారు – రండి ఇంట్లోకి!'

'వద్దమ్మా! వేసిన అడుగు వెనక్కి వేయరాదు. నేనూ నాలుగడుగులు మీతో వస్తాను. మీరు బండి యెక్కండి!' అంటూండగా – రమణయ్యగారు, 'ఓహోఁహో! ఎన్నాళ్ళకు కనిపించారన్నప్పగారూ!' అంటూ దగ్గరకు వచ్చాడు.

'ఎప్పటికప్పుడు వద్దామనుకోవడం, ఏదో పని అడ్డం రావడం – మీరు అసలు ఇక్కడ ఉంటారో వుండరో అని అనుమానిస్తూ వచ్చాను. అబ్బాయి దగ్గిర వుంటున్నారేమో అనుకున్నాను!'

'సరిపోయింది – అక్కడ మాకేం తోస్తుంది? అబ్బాయంటారా –వాడు వల్లమాలిన కామాటమంతా పెట్టుకున్నాడు. క్షణం తీరికుండదు. మేమక్కడ గోళ్ళు గిల్లుకుంటూ యేం జేస్తాం! పైగా మాకు ఇల్లు కదిలే అలవాటు లేదు. మీకు తెలుసుగా! ఇప్పుడంటే, మొన్న విదియనాడు – యీవిడకు స్వప్నమైంది. తాను తిరుపతి కొండ మీద స్వామి దర్శనానికి వెళుతున్నట్టు, వెనుకనుంచి అత్తయ్యా – అత్తయ్యా అని కేకలేస్తూ కోడలు పరుగెత్తుకు వస్తున్నట్టూ! ఇలాటి అంకిలేదో ఉండబట్టే, మన ధోరణిలో మనం ఉంటూన్నా, మనఃక్లేశాలు తప్పడం లేదు. ఒక్కసారి వెంటనే స్వామిని సేవించుకు వద్దాం అని కూర్చుంది. అందుకు అభ్యంతరమేముంటుంది గనుకా?'

'ఆహాఁ! నిజంగా ఇది వాడి అనుగ్రహమే! మీరు తిరిగి వచ్చేటప్పటికి మీ కోడలు ఇంటో వుంటే సరిగదా!'

'అన్నప్పగారూ! మాకూ అంతకన్నా కావలసింది ఏముందీ? మిమ్మల్ని చూడగానే ఇలాటి చల్లని కబురేదో పట్టుకొచ్చారనే అనిపించింది సుమండీ! లేకపోతే, ఇన్నాళ్ళాయె! ఇటు పదచలనం చేయందే. వస్తూ వస్తూ వట్టి చేతుల్తో రారు కద! వాడే బయలుదేరదీసి వుంటాడు.'

'మనం మనం మనసులు కలిసిన వాళ్ళం. అందరూ బాగుండడమే మనకు కావల్సింది. మీది అద్దరి, మాది ఇద్దరీ! కాని, అందరిదీ కృష్ణాతీరమే! అంతేకాకుండా చుట్టరికాలంటూ కలవడంతో మరింత చేరువౌతాంకద! మీ ఊళ్ళో పోపు పెడుతూంటే, మా ఊళ్ళో ఘుమఘుమలాడుతుంది. ఎంత వద్దనుకున్నా వింతలూ విడ్డూరాలూ వినక తప్పడం లేదు. ఎప్పుడో అప్పుడు పెద్దవాళ్ళకు మతిపోవడం సహజమే! అల్లాగే పిల్లలకు బుద్ధి తెలియడమున్నూ!'

'నీవు పైకిలా కనబడుతున్నావే కాని, సామాన్యురాలవు కావు తల్లీ! బ్రాహ్మణ ఇంట పుట్టబట్టి కాని, పరగణా ఏలవలసినదానివి!' అని మనసులో అనుకుని, అన్నప్ప పైకి అన్నాడు కదా–

'అమ్మా లచ్చమ్మగారూ! అన్నీ తెలిసినవారు కనుకనే అరమరికలుండవని, నేనిలా రావడం జరిగింది. కర్ణాకర్ణిగా మా విషయాలు మీకు తెలిసి వుండవని నేనెలా అనుకుంటాను! ఐనా స్వజనంలో వాడిని కనుక దాపరికం లేకుండా, యావద్విషయమూ మనవి చేస్తాను. ఇంతకాలమూ మీరందరూ యేమైనారు – అంటారా? దానికి సమాధానం యేమి లేదు. స్వామికి ఇప్పటికి, అనుగ్రహం ఇలా కలిగింది!' అంటూ ఆనాటినుంచి యీనాటి వరకు నడచిన కథ అంతా విశదంగా ఏకరువు పెట్టి ఊరుకున్నాడు.

అప్పటికి పడవల రేవు జేరుకున్నారు. లచ్చమ్మగారు యెంతో వుత్సాహంతో బండి దిగింది. రమణయ్యగారు పడవల గుమస్తాను వెదుక్కుంటూ వెళ్ళాడు.

ఆవిడ అన్నది కదా – 'అన్నప్పగారూ! మాకు స్వామి దర్శనం ఇక్కడే అయినంత ఆనందంగా వుంది. మేమింటికి తిరిగి వచ్చేప్పటికి మళ్ళీ ఇల్లు కలకల్లాడుతుందంటే అంతకంటే యీ జన్మలకింకేం కావాలి?'

'ఇద్దరూ గుంభనంగా వుండటంతో ఇందాకా వచ్చింది!'

'నాకూ చూచాయగా తెలిసున్నా, చెవులు మెలేసి కూలేసేదాన్ని కాదూ; కానీ యండి, కారణార్థం అలా వుంది.'

'రంగడి మూలాన వీళ్ళ కాపురం ఇలా కావడం యేమిటి? నవ్వుబాట్ల పని!'

'పనిలో పని, మీరు వెళ్ళి పిల్లవాడిని పిలుచుకు రండి!'

'వాడు తప్పకుండా వస్తాడు!'

'నా బిడ్డ ఒకరిలాటి వాడు కాదు!'

'వాడికి నిజానికి దానిమీద యేం కోపం లేదు.'

'ఇద్దరిలో ఓ పిసరు మొండితనం వుంది' –

'అయితే, యిహ సర్దుకు పోతారు.'

'బాబూ! ఆనాడు పెళ్ళి చేయించావ్! ఈనాడు మళ్ళీ కాపురం కూడదీస్తున్నావ్!'

'నీ కడుపు చల్లగా...'

'మళ్ళీ వారం నాటికల్లా తిరిగివస్తాం ! ఇంటి దగ్గిర సామాను పడేసి, మీ ఊరు వస్తాం! వచ్చి, మా వియ్యపురాలిని ఇక్కడికి తీసుకు వస్తాము. ఆవిడ ఒక్కర్తె అక్కడ వుండటం యెందుకేమిటి? చూడు నాయనా ! అక్కడికి వచ్చినప్పుడు పాలెం వెళ్ళి రావడం పడుతుందంటావా?'

'వెళ్ళడం యెంతసేపు కాని, అక్కడ భోంచేస్తేనే గాని వాళ్ళు విడిచిపెట్టరే మరి–'

'మరీలేదు, మడీలేదు ! నా కోడలు నాకు పనికిరాగాలేంది, దాని తోడబుట్టిన వాడు పరాయి వాడవుతాడా? చెడితే అందరం చెడ్డాం ! మా వియ్యంకుణ్ణి మట్టుకు అలా కొంగజపం చేస్తూ అక్కడ కూచోనిస్తామనుకుంటున్నావేఁ? నేను ఆయన చెల్లెల్ని కానూ, అంతకన్న మొండికేయగలను ! ఏమనుకుంటున్నాడో...'

రమణయ్యగారు కాళ్ళీడ్చుకుంటూ వచ్చి 'రెండు రోజులదాకా టపాపడవ నడవదుట – రహదారి పడవైతే. సంజవేళకు కదులుతుందట కాని, లాకుల దగ్గిర తణిఖీలవుతున్నాయట! అది బెజవాడకు చేరుకునేటప్పటికి రెణ్ణాళ్ళవుతుందో, మూణ్ణాళ్ళవుతుందో, చెప్పలేరుట – ఏమిటి చేయడం? –'

'పడనల్లేకపోతే ప్రయాణం ఆగుతుందా ? జటకా మీద పోదాం! సాయంత్రం బండికే అందుకోవచ్చు! ఓ జటకా కేకేసుకు రండి ! సరాసరి కట్టనంటే చౌకు దగ్గర దిగి అక్కడ మాట్లాడుకోవచ్చు!' రమణయ్యగారు మళ్ళీ ఎటో పరుగెత్తబోతూండగా, వీళ్ళను ఎక్కించుకొచ్చిన బండివాడు 'అదిగో, ఆ వచ్చేది పామర్రు జటకా! కేకేసుకు రమ్మంటారా?' అన్నాడు.

'వద్దులే, తిరుగుబేరం అయెను! పెళ్ళి నడకలు నడుస్తుంది. మమ్మల్ని చౌకు దగ్గిర దింపు. అక్కడ లక్షణమైన బళ్ళు దొరుకుతాయ్. అంచెలంచెలు కాకుండా, ఇక్కడ ఎక్కి అక్కడ దిగడం అవుతుంది. అన్నప్పగారూ, బండిలోకి రండి – కావాల్సినంత చోటుంది, ఎలాగో సర్దుకు కూచుందాం.'

'అక్కర్లేదమ్మా! బండితో నడిచాం గనుక యింతసేపు పట్టింది కాని, పట్టుమని పదిబారలెంతసేపు నడుస్తాను? క్షేమంగా వెళ్ళిరండి. తిరిగి వచ్చేసరికి లాభం గుమ్మంలో ఎదురౌతుంది' – అంటూ నడకందుకున్నాడు.

నాగేశ్వరస్వామి ఆలయంలో, లోపల పూజ జరుగుతూంది. చిదంబరం, ముఖ మండపంలో కూర్చుని, నమక పారాయణ చేస్తున్నాడు. ఇతడు రావడం ఓ కంట గమనించి శ్రుతి హెచ్చించాడు. అన్నప్ప అందుకున్నాడు, మరో ఘడియకు యింటిదారి పట్టారు.

'నీవు వెళ్ళినపని ఏమైంది' – అన్నట్టు అన్నప్ప వంక చూశాడు. ఈతడు నవ్వుతూ, తల ఊగించాడు. ముక్తసరిగా, జరిగిన సంభాషణలో సారాంశం జెప్పి 'నేనేమో అనుకున్నాగాని వాళ్ళిద్దరిదీ కానరాని గడుసుతనం – ఆపేక్ష ఒలకబోస్తున్నట్టు మాట్లాడుతూనే నొసలతో వెక్కిరించడం మానలేదు. పైగా మేము ఎన్నటికి పై మెట్టు మీదివారమే, ఎదుటివారు మా కాళ్ళ దగ్గిరకు రావలసిందే, అనే బింకమూ కనబడుతూనే ఉంది. ఇంతకూ అవధానులుగారు వచ్చినప్పుడు ఏం జరిగిందేమిటి?'–

'రభస. ఆయనన్నా నిదానంగా విషయం ఏమిటో తెలుసుకుంటే బాగుండేది. రావడమే అగ్గిరాముడల్లే వచ్చాడు, నిప్పులు చెరిగాడు. ఎరిగున్న వాళ్ళందరితో చెప్పి యాగీ చేశాడు. అయినా వీళ్ళు గుంభనగానే ఉన్నారు. అప్పట్లో, ఆయన రాకుండా నిన్ను పంపినా యింత ముదిరేది కాదేమో! ఆ కావేషం మనసులో ఉంచుకోకుండా, ఇంత సాయలా పాయలాగా మాట్లాడారంటే, అది పిల్లదాని అదృష్టమే!'

'రామశేషయ్య, వీళ్ళని మించిన గడుసువాడు – కనుక బయటపడడు. ఇంతవరకూ జరిగినదాన్ని బట్టి చూస్తే, మన పిల్లదానిలోనే కించిత్తు దుడుకుతనం ఉన్నట్టు స్పష్టమౌతూంది కద! ఇకనైనా సర్దుకుపోతే సుఖపడుతుంది. సరే, నీవు భోంచేసి ఆ వూరు పోయివస్తావన్న మాట! రేపు సంజవేళకల్లా వచ్చేశేయి. రామలింగేశ్వరస్వామి వారి ఆలయంలో లోకోత్తరమైన హరికథ! రాధాకృష్ణదాసు మళ్ళీ ఊళ్ళోకి వచ్చాడు. ఇప్పటికి నాలుగేళ్ళాయె, వాళ్ళు తునిలోనే ఉంటున్నారు. రాణీగారు యింతకాలం వారిని కదలనివ్వలేదు.'

'రాజమ్మ దగ్గిర రాణీగారు, అధ్యాత్మ రామాయణం, తరంగాలూ, చెప్పుకునేవారట! వారైతే, వీరిని వదిలిపెట్టలేదు – కాని, యిక్కడ మఠం సరిగ్గా సాగదేమోనని, వీళ్ళు చక్కావచ్చారు. నిజమే, వీళ్ళు యిక్కడ లేకపోవడంతో సాధువులొచ్చినా సన్యాసులొచ్చినా వాళ్ళ అతీగతీ కనుక్కునేందుకు తగిన మనిషేడీ? వెళ్ళేటప్పుడు వెంకటదాసుకు అప్పగించి వెళ్ళారనుకో కాని, పెద్దవాడై పోయినాడు : తన చేతిలో ఆడుతున్నంతవరకూ, బాగానే సాగించాడు. కాని, యిప్పుడు పెత్తనం కొడుకులది. వాళ్ళు నిక్కచ్చి మనుషులు; తూచి ఖర్చు చేసేరకం. మునపటి కన్న వీళ్ళ పని బాగానే ఉందనుకో – ఒకటికి నాలుగు సున్నం గానుగలైనాయి – కడపరాతిలో బాగా కలిసొస్తూంది. పైగా యిటికి వర్తకం కూడా మొదలుపెట్టారు! మరో రెండు భవంతులు కట్టారు, లక్ష్మి రాగోరుతుందని. యిప్పుడు అడపా వారిలోకల్లా, వాళ్ళే శ్రీమంతులు – దీనికి తోడు వడ్డీ – వడ్డీ అంటూ, ఉండనే ఉంటాయి కదా! యింతకూ చెప్పొచ్చిందేమంటే, వీళ్ళిలా వేసీ వేయకుండా ఉన్నా, తండ్రి ఏం చేసినా అజ అడుగుతారు: దాంతో దాసుకు కంపరమేసి, అన్నీ వద్దనుకుని – చేతులు కడిగేసుకున్నాడు! 'నా పరిస్థితి యిలా ఉంది, కనుక మీరు తిరిగి వచ్చి పూనుకుంటేనే గాని, లాభంలేదూ, గ్రామంలో మరెవరూ ముందుకు రావడంలేదూ,' అని కబురెట్టాడు. వీరు వెంటనే వచ్చేశారు. మళ్ళీ అంతా సవ్యంగా నడుస్తూంది! దేనికైనవాళ్ళు దానికి లేకపోతే, – ఆ వెలితి వెలితే!' అన్నాడు చిదంబరం.

మధ్యాహ్నికం ముగించుకుని, భోజనానంతరం కాస్సేపు మాలిగి, ఎండ జారుతూండగా, అన్నప్ప ప్రయాణమైనాడు. 'బండి కట్టించుకు పోరాదుట్రా' అన్నాడు చిదంబరం. 'యీ భాగ్యానికి బండెందుకోయి! – అలా చౌకులోకిపోయి, – కావిళ్ళ వాళ్ళు తగులుతారు; వాళ్ళకు నాలుగు మంచి ముక్కలు చెవిని వేసినట్టా ఉంటుంది – నాలుగడుగుల్లో వెళ్ళిపోతాం! పది కోసులు లోపేగా, పొద్దుపోకముందే జేరుకోవచ్చు! ఏదో యింత నంజి – కాస్సేపు కబుర్లు చెప్పుకు, – ఒక్క కునుకు తీసి, కూరగాయలవాళ్ళ వెంటపడ్డానా అంటే – యిదిగో ఊరు...'

నాలుగు కోసులు ఆడుతో పాడుతో నడిచి, యింకా ఏపాటి లెక్కుంది, అన్నాడు అన్నప్ప – 'అల్లదిగో, ఆ తాటితోపు దాటితే, ఎదరే మనూరు : మరో అడుగేస్తే – రాంసేసయ్యగారి తోట' – అన్నారు వెంట వస్తున్నవాళ్ళు – అప్పటికి సంజెవేళ అయింది. 'అయ్యగారుండారుగందా అని, కాలు నాన్చేస్తుండాం! కాని, యీతలికల్లా ఊళ్ళో ఉండమే! పైగా యియ్యాల కూసింత బేగి బయలెళ్ళినాం' – అంటున్నారు. 'అబ్బే ! నేనూ నడిచే మనిషినేరా, ఫరవాలేదు. అడుగు ఊతంగా వేయండి' – దీపాల వేళకు, రామశేషయ్య యింటి ఛాయలకు జేరుకున్నాడు: తోట పెద్దదే! అయిదారెకరాల పై చిలుకుండచ్చు–

కోరడిగా కొబ్బర్లూ, నలువంకలా మామిళ్ళూ – యిల్లు కూడా సొంతంగానే కట్టుకున్నాడు ! తెలివైనవాడే – కాని ఏమిటో ఎందుకో యీ అరణ్యవాసం! వీడి బుద్ధి మంచిదీ, పుటక మంచిదీ కనుక సరిపోయింది కాని, మరోలాటివాడైతే, ఎప్పుడో అమ్మణ్ణి ఉసూరు మనిపించుండేవాడు కాదా?–

అరుగులు మాంచి విశాలంగా వున్నాయి. తానక్కడ కూచుని పురాణం జెపుతూంటే – బహు రమ్యంగా ఉండేటట్టుంది – యీ తడవ తీరుబడిగా వచ్చి పదిరోజులు పాటుంటే బాగుంటుంది –

యింట్లో ఎవరూ లేరా ఏం చెపుమా?

ఉండటానికి ఎందరున్నారు – ఇతడొక్కడేగా, – ఎటో పోయివుంటాడు. అయితే తిరిగి వచ్చేంతవరకూ, దీపం లేకుండా యిలా ఉండవలసిందేనా – ఎబ్బే! అది మంచిపని కాదు.

ఇంతకూ, ఆ రంగడూ వాళ్ళూ ఎక్కడుంటున్నట్టూ? యిక్కడేవుంటే, ఆ మాత్రం దీపమన్నా పెట్టరా?

అరుగుమీదకు చేరుకున్నాడు.

అతగాడు ఏ వేళ్టికి వస్తాడో?

వచ్చినా రావచ్చు – ఒకవేళ బద్ధకించి ఎక్కడన్నా పడుకున్నా, పడుకోనూవచ్చు; యిక్కడేం బెంగ ఉంది?

తీరా, యీ మనిషి యీ పూట రాకపోతే, కాస్సేపుజూసి, అలా ఆ గుడిసెలకేసి వెళ్ళి కనుక్కుంటే జాడ తెలియకపోతుందా? కబురు చెయ్యొచ్చు!

దీనికి తాత్సారం ఎందుకూ, – యిప్పుడే ఒక్క అడుగు అటువేస్తే సరి!–

ఎవరా వచ్చేది?–

మనిషి దగ్గిరకొచ్చాడు : వెనకటికి మన ఊరు బండీ కట్టుకువచ్చిన సుబ్బయ్యే లాగుంది ! – వీడిక్కడుంటున్నాడన్న మాట! అహఁ,వాళ్ళు వీడి మానాన వీడిని విడిచి

పెట్టలేదు! – ఒక కన్నిటువేసే ఉంచారు!–

'ఏం సుబ్బయ్యా! బాగున్నావ్!' తాను, వెంటనే గుర్తుకు వచ్చినట్టులేదు – కాని గడుసువాడు కనుక, – అయ్యా మీరా! అన్నాడు!–

'నే జ్ఞాపకం ఉన్నానా?–'

'అదేమిటి అన్నప్పగారూ, మిమ్మల్ని మరవడమే! అవనిగడ్డలో, అవాళ మీరు పెట్టిన అన్నం, యిప్పటికీ సత్తువిస్తూంది!–'

'ఏవో పచ్చడి మెతుకులు! అంతేకాని, నీకేం అమృతం పోశానా?'

'అమృతం ఎందుకు – మీ ఆదరణముందు – ఏమిటి బందరొచ్చి వచ్చారా? మనూళ్ళో మనాళ్ళందరూ బాగున్నారా! కాకిచేత కబురెట్టక పోయినారా? బండీ కట్టుకు ఎదురొచ్చేవాణ్ణి! పేటలో మా అయ్యగారు కనిపించారా? ఏమంటారు?–'

'మీ అయ్యగారూ, అమ్మగారూ, యీ పాటికి పట్నం బండెక్కుంటారు! తిరుపతి వెళుతున్నారు – మీకు తెలియనే తెలియదా?'

'అద్దెంతరగా అప్పటి కప్పుడనుకుని ఉండాలి!– మా అమ్మగారితో కూర్చిన ఏపనైనా అంతే కదుండి!– ముందు తెలిస్తే నేను పోయుండే వాణ్ణి కాదూ–'

'యిప్పుడు మటుకేం – మించిపోలేదులే!–

'ఆ దంపతులతో కాకపోతే – యీ దంపతులతో వెళ్ళచ్చు–'

'అంటే, మీరేదో మూట కట్టుకొచ్చినట్టున్నారే!–'

'లేదులే! అయినా సుబ్బయ్యా!– ఎల్లకాలం యిలాగే ఉంటుందా? వెనుక కీడు ముందుకు మేలన్నారు!'

'ఏడుకొండలవాడు తిన్నగా చూస్తే – ఏకం కావడం ఎంతసేపు!–'

'మా అమ్మగారలా మొక్కున్నారా?'

'వేరు మొక్కుకోవాలా? ఆవిడ అంతస్థు అలాంటిది! నా యిరుగు నా పొరుగు చల్లగా ఉండాలని మనం సంజెదీపం వేళ మొక్కుకోవడంలా? పిల్లలిద్దరూ తమ కళ్ళ ఎదుట ఉండాలనీ – మనసులో అయినా ఉండదూ – పైకి కనుకపోతే మటుకు?–'

'ఎందుకుండదులెండి! కాని,–'

'ఉఁ– యిప్పుడా ఊసు ఎందుకు లెగుండీ!'–

'చేషయ్యగారిని కేకేసు కొస్తాను!'

'కేకలూ వద్దు కూకలూ వద్దుగాని, – కూచుందూ'–

'యిప్పుడు కాకపోతే, యిహ, కాస్సేపటికి – వచ్చేను యింతలో, మించిపోయే రాచకార్యం ఏం లేదులే! అవునుగాని, – ఒక్కసారే యింత అత్తెసరు వేస్తాడా, – ఏపూట కాపూట ఉడకేసుకోవడమేనా?...'

'ఏపూట కాపూటే!'

'అహఁ! – ఆధరువులూ అవీ చేయడం, చేతనౌనా?'

'చేతనౌనా? – ఆవిడ చేతివంట అమృతం కదుండీ!'

'ఆవిడెవరు?–'

'అదేవిటండి! – రంగమ్మగారుండలాఁ?'

–'రంగమ్మగారంటే – ఆ, గొల్లవాళ్ళమ్మాయేనా?–'

'అంత యిచిత్రంగా, - మాట్టాడుతున్నారు అన్నప్పగారూ! రంగడు, రంగమ్మగారెట్టా అవుతుంది?'

'మనవాళ్ళను మనం గౌరవించడంలో తప్పేముంది?'

'మీలాటివోరు ఏంచేసినా తప్పు కాదనుకోండి! - కాని, అయ్యా మన కళ్ళముందోళ్ళను పట్టుకుని గారూ గేరూ అంటే, మనసులో ఏదో కచ్చ ఉందన్నమాటేగా! - అయిదొందలోసి గుఱ్ఱాన్ని కొన్నామని అంబారీ యేస్తామా? - అబ్బాయి తాసీల్దారు చేస్తుండా, కన్నోరు, అయ్యా చిత్తం! అంటారా? - రంగడిని పట్టుకుని రంగమ్మగారంటం యిసుమంటిదే, - కాదుండీ!-'

'రంగడు నీడను పుట్టిన పిల్ల - యేళకొచ్చి, యెన్న ముద్దేసుకుని బువ్వదినేందుకే దానికి బద్దకం! అది వొళ్ళొంచి వండకేం?'

'రంగమ్మగారంటే, మా అయ్యగారికి సయ్యాన, సినతాతగారి మనుమరాలు కాదుండీ! అంటే అబ్బాయిగారికి వొదినొరుస! ఆ అమ్మొచ్చింది ; మాకింత బువ్వెదు తూంది, యింక బందరేం పని! ఎల్లకాలం, యీడనే ఉండిపోతాం!'

'అలాగే - అలాగే! ఎక్కడుంటే మాత్రం మీకు లోపం ఏమిటి?'

'అవునయ్యా! రంగమ్మగారు చెప్పినట్టు - మనిషికి మనిషి చేసేది - లోటు, దేవుడు చిన్నచూపు చూస్తే - అది, లోపం: నాలికమీద తేనె ఉంటే నరుడికి మంచి, మనసులో పూవులుంటే, దేవుడికి మంచి! అంతే కాదుండీ! యీ యింటోరికి, లోటూ రాదూ, లోపమూ ఉండదు:'

'ఆహాఁ!- అందరూ కోరేది, అదే!'

'అదే! మీలాంటి పెద్దోరు, సాధారణంగా సత్తెమే పలుకుతారు! కాని, రంగమ్మ గారన్నట్టు, మనిషిని పోలి దేవుడుండడు! దేవుణ్ణి పోలి, మనిషుండడు! కనుకనే, కనుచూపుమేరలో, యింత యిచిత్రం!'

'అన్నప్పగారూ, మన తోటలో తులసి మొక్కను తెచ్చి యేసుకున్నామనుకోండి; దానికి పూలూ కాయలూ లేకపోతేనేం - పూజ్జేసుకునేందుకు పనికిరావడంలా? మామిడి అంటును అల్లా దిగ్గాయించడమేం? నన్నిల్లా చిగుళ్ళతోనే సరిపెట్టుకొమ్మంటాడేం? అని తగూలాడుతుందా? మన పుటకిందుకూ అని, మనం దెలుసుకుంటే మనిషికి చింతే ఉండదు! తవురేమంటారు?'

'ఆరి నీయిల్లు బంగారంగానూ? పద్ధెనిమిది పురాణాల్లో సారాంశం రెండు ముక్కల్లో జెప్పేశావే!'

'అయ్యా! బతుకంతా, రెండు ముక్కల్లోనే వుంది, కాదుండీ?'

'మంచీ - చెడ్డా! ఆ రెండూ మన చేతుల్లోనే ఉంటాయి.'

'రంగమ్మగారేమంటారు? ఒరే సుబ్బన్నా, అడవి పక్షుల కెవ్వడాహార మిచ్చెను, మృగజాతి కెవ్వడు మేతపెట్టే - అని పెద్దలన్నారు. అందరికీ ఆకలి ఒకటేకదా! తినే తిండికిన్ని పేర్లెందుకంటావా? అక్కడే వుంది కిటుకు! తిన్నతిండి, విన్నమాట! మనిషికి పడితే మంచీ! వికటిస్తే చెడ్డా! మీరూ అంతేనంటారా?'

'అది నాకు అర్థంకాని విషయం!'

'అర్థం కాకపోతేనేం? ఏదో ఓ ముక్క అనేయరాదు'-

'అనడం మహా తేలిక - ఆనక మాట కూడదీసుకోలేక మన పని అవుతుంది.'

'అదెంతమందికి తెలుసంటారు?'

'తెలియకపోతే, - వాళ్ళకే తెలిసొస్తుంది!'

'ఎప్పటికి?'-

'-యిప్పటికీ! - అనుకో...'

'నువు చూడబోతే పిట్టంతలేవు, కాని, గట్టివాడివోయ్ సుబ్బన్నా! - చీమ కుట్టినట్టు కుట్టావు, నాచేత ఒక్క చిందేయించావు!'-...

'చిందేసేది నేను! మీరు పలికారు! పండుగ బువ్వ దిన్నట్టుంది!...'

దూరాన్నుంచి, పాట వినిపించింది:

'రంగమ్మగారు!' అన్నాడు సుబ్బయ్య-

అన్నప్ప చెవులప్పగించి వింటున్నాడు :

గొంతు బాఁగుంది! మనిషికూడా, తీరుగానే ఉండచ్చు-

వయసు-? వీడి యీడుదేనేమో, గొంతు బహులేత మీదుంది! మంచి కాలక్షేపమే...

రంగమ్మగారు, వచ్చేసింది: చేతులో గుండు చెంబు - పాలు కాబోలు!-

ఎబ్బే, బాలాకుమారి కాదు; తన యీడుది, కళగల మొఖం! వీడి యీడు పిల్లలుండచ్చు!- బాగుంది! పోషణ బాగానే జరుపుతుంది!

ఆవిడ, అంత దూరంలో ఉండగా, ఆగిపోయింది. సుబ్బయ్య, 'రంగమ్మగారూ! - వీరు మన అన్నప్పగారు, అవనిగడ్డ నుంచి వచ్చారు'- అన్నాడు.

'అన్నప్పంటే, అవనిగడ్డలో పురాణం జెప్పుకునే వాడేనా?'-

(యిదేమిటి యిలా అంటుంది! యీవిడ ఎవరు? ఏమిటా పొగరు?)

'ఆఁ మరేనమ్మా!'

'-చిన్నప్పుడు, వేదం అఘోరించినవాడవేనా?'

(ఏమిటి? తిక్క మనిషా?)

'కొల్లూరులో తిన్న మొట్టికాయలు గుర్తున్నాయా? లేకపోతే' (తెల్లబోయినాడు)

-రంగమ్మగారు విసవిస వచ్చి, అన్నప్ప నెత్తిన మొట్టింది. ఆయన కెవ్వున - 'రాజమ్మా!' అన్నాడు! ఆవిడ ఒకటే నవ్వు!-

'నువ్వా!' అన్నాడు! 'సుబ్బయ్యా! చెప్పావు కాదేం! రంగమ్మగారు, రంగమ్మగారంటే ఎవరో అనుకున్నా, మా రాజమ్మ! మా గురువుగారమ్మాయ్! వనపర్తి నుంచి ఎప్పుడొచ్చావ్?'

'ఓరి నీ తెలివి దొంగల్దోలా! వచ్చి, పదేళ్ళాయె కాదుట్రా! అవును మరి, ఒకరి కబురు, ఒకరికి తెలియకపోతే, ఇంతే. పెద్ద వాళ్ళిద్దరికీ, సంస్థానంవారే ఉద్యోగాలు చూపించారు!'

'పెద్దమ్మాయిని, అక్కడే జనగాం యిచ్చాం. దానికి నలుగురు మొగపిల్లలు - చిన్నదాని అత్తారిది - కరీంనగరం - కాని వారు హైదరాబాదులోనే ఉంటారు. యిజారామీద తడవకో నాలుగు సంచులొస్తాయి. అల్లుడు రుమాళ్ళ వారని, పేద్ద వర్తకులు. వారికి లెక్కాడొక్కా చూసి పెదుతూంటాడు. బాగానే ముదుతుందట! పోతే ఆ మూడోవాడు, అక్కడే రామానుజాచార్ల గారి దగ్గర వ్యాకరణం జెప్పుకుంటున్నాడు. ఇంకొక్క ఏడాది

పాటుంటే పూర్తవుతుంది... అటే సంబంధాలు వస్తున్నాయి. వాడికీ మొగ్గు అటే వుంది. యిహ మిగిలింది, మేమిద్దరం. కడసారపుదీ, దానికీ ఏడేళ్ళు వెళతాయి. పైసాలుకన్నా ఎక్కడో ముడెట్టాలి కద:'

'ఏకబిగిని పాతికేళ్ళు సంస్థానాన్ని నమ్ముకుని ఉన్నాం. రాజాంగంగానే జరిగింది; యిప్పటికీ అక్కడి వారికి ఆయనంటే గురే! ససేమిరా మీరు వెళ్ళడానికి వీలు లేదన్నారు! కానీ యీయనకెందుకో గాలి మళ్ళింది. 'పుట్టి పెరిగింది – కృష్ణాతీరం! ఎప్పటికైనా అక్కడికి జేరుకోవలసిందే! యావజ్జీవమూ ఉన్నా, యిది మాకు స్వగ్రామం అవుతుందా?' అన్నారు వీరు; అంతేకదా! కృష్ణ నీరు అలాటిదిరా! నీ మటుకు నీవు – బస్తీ చేరుకునుంటే యీపాటికి కాళ్ళా చేతులా సంపాదించకపోదువా! ఉన్నంతలోనే తింటూ అక్కడే ఎందుకు పడున్నావ్! పొరుగూరు పోయి, విందులు కుడిచేదాని కన్నా, యిక్కడ పుడిసెడు నీళ్ళు త్రాగి బతకడం మేలనేనా?'

'మరి, – మీరెందుకు వెళ్ళారని నీ వడగవచ్చు. ఆయనకు దేశం మీదికిపోయి, – కవిత్వం జెప్పి, తోడాలూ పతకాలూ, దిగేయించుకోవాలని. అదో వెర్రి ! అయితే, అలాగే జరిగిందనుకో. రాజావారు వీరికి, ముమ్మారు ఏనుగంబారీ వేయించారు. నిజానికి, యీ మనిషికి యిలాంటి ఆడంబరాలు అంటే అట్టే యిష్టం లేదనుకో ! పైగా, యింకోటీ! ఆనాడు, అల్లసాని వారెక్కారు, యీనాడు అంబటిపూడివాడూ యెక్కాడు! దీంతో, దీని పరువూ పోయింది.' అన్ని యిలాగే పుల్లవిరుపు మాటలనుకో! ఎదుటివారు ఎంత వారైనా సరే, – మొగం మీద అనేయడమే. రాజాగారితోనే, అంటే, 'ఏలినవారు, రాయల వారంతటివారే, కనుక, నాకీ పెద్దరికం యిచ్చారు! యిది కేవలం తమ కరుణ కాని నీ ఘనతకాదు! – ' అలా అనేశారు : రాజావారికి, వీరి తత్వం తెలుసును కనుక నవ్వుకున్నారు! – ఎప్పుడూ ఆ వరుస అంతేననుకో, కాని, కవిత్వమంటావ్! – అమృతమే! కల్తీలేదు! అంచేతనే ఒక్కముక్క అర్థం కాకపోయినా, అక్కడి మ్లేచ్ఛులందరూ కూడా అందలం పడతారు...'

'వాళ్ళు యిలాంటి అర్థంలేని పనులు చాలా చేస్తుంటారు!–'

'ఊఁ, మీలాగానే కన్నబిడ్డలకన్న ఎక్కువగా చేసుకుని, చదువుచెపితే నువ్వు మధ్యలోనే కట్టుతాడు తెంచుకొని పారిపోయినావ్! ఆ చిదంబరం ఉన్నాడంటే, మా నాన్నంతటి వాడైనాడనుకుంటే వాడలా అఘోరిస్తున్నాడు.'

'అవధాన్లుగారికి పేరు తెచ్చింది, అల్లుడా, మీరా?'

–'రాజమ్మా! – అందరికీ మేనత్త కొడుకంటే అలుసుకదా!'–

'నీవు అమాంతం అంతరిక్షానికెత్తి పడుతున్నావే!– ఏమిటా గొప్ప!'–

'నీవు నోటితో వాగితే, ఆయన కాగితం మీద వాగుతున్నాడంతేనా?– సాలిజాంద్ర సభామధ్యే... అన్నట్టు, – సాయిబుల చేత సమ్మానం జేయించుకుని చంక లెగరేయడమా!...'

'ఆఁ ఆఁ! ఏం పోతరం రా!–

'అదేం అల్లాటప్పా దేశం అనుకున్నావా? నిలవేసి నిగ్గదీస్తారురా! – జాతి రత్నమైతేనే అక్కడ చలామణీ!' –

'మనం కృష్ణాతీరం వాళ్ళం!'

'పేరు గొప్పకాదు : ఎక్కడికి వెళ్ళినా పెద్దపీట వేయించుకుంటాం!'–

'ఓయబ్బ!– ఏటి ఒడ్డున పుట్టిన వాళ్లెవరైనా యింతే!'–

'అటు పెన్నలో వాళ్ళూ, యిటు గోదావరిలో వాళ్ళూ, – ఏడేడు తరాల నుంచీ యిదే రాంభజన'–

'వాళ్ళు చేశారంటే సబబుంది! అక్కడ నన్నయ్య, యిక్కడ తిక్కన్న పుట్టుకొచ్చారు...'

'ఆ, – భారతమూ పుట్టుకొచ్చింది! మూడూళ్ళు తిరిగితేకాని ముడిపడలేదు. కృష్ణ ఒడ్డున కూచుని సంకల్పం జెప్పుకుని, ఒంటిచేతి మీద భాగవతం వ్రాశాడు, ఆ పేద బ్రాహ్మడు! అన్నీ నదులే, కాని, యిదిరా నాయనా తేడా!'–

'ఒరేయ్! వీరు, యింత కవిత్వం కట్టినా, ఒక్క అక్షరం నరాంకితం చెయ్యలేదంటె నమ్ము : సర్వమున్నూ ఆ వేములవాడ రాజేశ్వరుడికే, సమర్పించారు. యిదంతా ఏమిటంటావ్! మా నాన్న చలువకాదూ! పిలిచి పిల్లనిచ్చుకున్నందుకు, అటు ఆయన, బిడ్డల్లాగా చూసుకున్నందుకు, యిటు మీరూ, ప్రయోజకులై పేరు తెచ్చుకున్నారు...'

'ఆహాఁ! అది ఎవరు కాదంటారు?'–

'కాని, రాజమ్మా! యిందులో ఒక్క తిరకాసు లేకపోలేదు!'

'పెద్దలదీవెన, అన్నప్పుడూ వెన్ను కాయదు!'

'డొక్కశుద్ధి అయేదాకానే, దానిశోభ! మనిషికి దశ ఎత్తాలంటే, నూటికి నూరేళ్ళూ, వాళ్ళు వర్ధిల్లాలంటే, ఆడదానిది అదృష్టం! వీడి నిర్వాకం కాదు!'–

'సరే, అది కలిసిరానిదయితే?'–

'పాడికి బఱ్ఱెను కొంటే, ఎగిసి తంతే ఏం జేస్తాం?' –

'హేయ్ఁ–హేయ్ఁ! ఆడవాళ్ళను పట్టుకుని బఱ్ఱెలూ గొఱ్ఱెలూ అంటావుట్రా!'–

'కలలో అయినా అంటావా? – ఏనాడో నన్ను కన్న తల్లి, కళ్ళ ఎదుట ఉన్న, యీ చెల్లెలు, అవనిగడ్డలో ఉన్న, మీ అనాకారి వదిన, తిరుపతిలో కాపురం జేస్తూన్న మా బంగారు తల్లి కాముడు, ఆడవాళ్ళంటే యిలాటివాళ్ళు!'

'అమ్మమ్మ! వీళ్ళమీద ఈగవాలడమే!'

'బ్రహ్మ సృష్టిలో, స్త్రీలు అని జంతు విశేషాలున్నాయి.'

'అవి, జోరీగల గొడ్లు! కొమ్ము విసరడం వాటి గుణం.'

'కొంప గొడ్లసావిడి క్రింద త్రొక్కి, త్రెంచుకు పారిపోవడం, వాటి నైజం.'

'ఏం, నేనన్నది అబద్ధమా?'

'పురాణం జెప్పేవాడివీ, పుట్టెడు బుద్ధులు,' – అని, రాజమ్మ నవ్వుతూండగా, రామశేషయ్య, యీల వేసుకుంటూ వచ్చి, తనవంక రవంత జంకుతో సంకోచంతో, చూడటం అన్నప్ప కనిపెట్టి, 'ఏం నాయనా క్షేమంగా ఉన్నావు కద!' అని, మీదకు పూలమాల విరిసినట్టూ, కేకేసి, లేచివెళ్ళి కౌగలించుకున్నంత పనిచేసి, జబ్బలు పుణికి, వెన్ను నిమురుతూ, 'నిన్ను చూస్తే, నాకెందుకో వల్లమాలిన ఆపేక్ష –' అనడమే, తడవుగా–

'అనుక్షణం చూసుకుంటూంటే, ఆపేక్ష హద్దు మీరుతుందేమోనని, అయిదేళ్ళకో సారి దర్శనమిప్పిస్తారు. అన్నీ తెలిసినవాళ్ళు!' అనేశాడు రామశేషయ్య.

'అది కాదయ్యా! యింత దూరం వచ్చి, యిక్కడో ఆశ్రమం కట్టుకున్నావ్! ఏదో యోగనిష్ఠలో ఉన్నావ్! అందరికీ అట్టే యిట్టే రావల్లనా? అర్హత తెచ్చుకోవద్దా!'

'ఒరే, అన్నప్పా - యిందులో అంతరార్థం ఏమిటిరా?' అని కలిపించుకుంది రాజమ్మ.

'మాటకు నానార్థాలు కాని, మనసుకా? మన వాళ్ళందరూ బాగుండాలనే మన మథన.'

'ఎవరికి వాళ్ళు ఎక్కడో అక్కడ బాగానే ఉన్నామనుకుంటూంటే మధ్య నీకెందుకురా - మథనా?'

'ఆ బాగేమిటో అర్థం కాకనే!'

'ఆహాఁ - అయితే, అవనిగడ్డలో ఎలా పుట్టావురా? అయినదానికీ కానిదానికీ అర్థాలు తీయడం అక్కడివారికి అలవాటేగా?'

'నీ మాటెందుకు కాదనాలి కాని, మాకు, పోనీ అదే అలవాటే అనుకున్నా - మనదాకా వచ్చేసరికి ఆ మంత్రం పారడంలేదు. పరాయివాడిని పట్టుకుని, త్వం శుంఠ! అనడానికి నీవూ నేనూ సిద్ధమే - కాని, మనవాళ్ళే ఏకు మేకులైతే ఏమిటి చేయడం? అసలు విషయం అర్థమయీ కూడా, అనేసేందుకు నోరు రాదే!'

'ఒరే శేషు! వీడి మాట అర్థమయిందా?-'

'అర్థంమాట దేవుడెరుగు! - మా అన్నం మాటేఁవిటి?'

'యిదిగో, మడిగట్టుకోవడమే! ఒక్కక్షణం ఓపిక పట్టారో, వడ్డించేస్తా!-'

'కొంచెం లఘువుగా వడ్డించు, మాతల్లీ!-'

'అహాఁ - అదెలా! - పెట్టేవి నాలుగూ పెట్టద్దూ?'-

రంగమ్మగారు, అటువెళ్ళంగానే, - రామశేషయ్య, అంత కలుపుగోలుతనంగా ఉన్నవాడల్లా, అట్టె ముఖకవళిక మార్చి, 'ఏం, యింతదూరం వచ్చారు?' అన్నాడు.

వీడికింత తలపొగరా? అని మనసులోనే అనుకుని, పైకి మటుకు, 'ఎంత దూరమయినా, - చేరువేగా, -' అన్నాడు, - అన్నప్ప.

'మీ చిత్తశుద్ధి అలాటిది!- కాని, మునుపటికన్న దూరం పెరిగింది!-'

'నేను రాబట్టా?'

'మీ అవధాన్లుగారు రాబట్టి!'

'ఆఁ! వచ్చి...'

'కొడుకుమీద కోపం కొద్దీ అల్లుడిని దువ్వజూశారు!-'

'యితగాడు దువ్వించుకున్నాడా?'

'జుట్టు చేతికి అందనిస్తే కాశీదాకా దేకించడూ?'

'అందుకే, అందకుండా పొందకుండా, తప్పించుకొచ్చావన్నమాట!'

'అన్నప్పగారూ! తగిన కారణం లేనిదే వచ్చాననంటారా?'

'ఎందుకొస్తావూ? నీవేం అవ్యక్తుడివా? అసహాయుడివా?... కాని, నిన్ను యింటిపట్టున నిలువనీయకుండా చేసిన ఆ కారణం ఏమై ఉంటుందో, ఎంతటిదై ఉంటుందో... అదే తెలియడంలేదు. నాయనా రామశేషూ, ఒక్కక్షణం ఊఁకొట్టు, అవనిగడ్డ తాలూకు పూర్వపీఠిక అంతా ఏకరువు పెడతాను. అప్పుడు మళ్ళీ ముగ్గులోకి వద్దాం...' అంటూ సుబ్బరాముడి పెళ్ళినాటి నుంచీ అవధాన్లగారి కాశీ యాత్రదాకా, నడిచిన ముచ్చట యావత్తూ, టూకీగా చెప్పి, అమ్మడు విషయం వచ్చేసరికల్లా మరి కాసిని లేలేత చిలవలూ

పలవలూ జేర్చి, పురాణ ధోరణిలో, వలసినచోట వత్తి పలుకుతూ అభినయ పూర్వకంగా తన అభిప్రాయమూ, ఆ అమాయకురాలి ఆవేదనా – యిక ఉత్తరత్ర యితగాడి కర్తవ్యమూ, గుచ్చెత్తి విశదీకరించేసరికి ఎంత ప్రొద్దుపోయిందో, రంగమ్మగారు వంటా వార్పూ వగైరాలు ముగించుకుని, ద్వారబంధానికి ఆనుకుని, అన్నప్ప ధోరణి అంతా ఆలకిస్తూ ఉండటం రామశేషయ్య గమనించి–

'భోంచేస్తూ – తరువాయి ఏమన్నా ఉంటే పూర్తి చేద్దురుగాని–' అనడంతో అన్నప్ప, 'అవునయ్యోవ్! భోజనంవేళ దాటినట్లుగా ఉంది. హెచ్చరించావ్ గనుక సరిపోయింది. లేకపోతే, దంత ధావనం వేళకే తెమిలేవాళ్ళం. రాజమ్మా! వడ్డించమ్మ!'

'నీ అనుష్ఠానం –'

'రేపటికి వాయిదా వేశా! రెండు చాదల నీళ్ళు దిమ్మరించుకుని, చక్కావస్తా! ఆచమనం చేయడం, ఆపోశనం పట్టడం, అంతే, యీ పూటకు! నాయనోయ్! భోజనం దగ్గిర నేను ఊఁకొట్టకపోతే, ఏం అనుకోమాకేం! నాకో రవంత నియమం ఉందిలే! – నీవు మహారాజులాగా మాట్లాడచ్చు, అభ్యంతరం లేదు: నేను మటుకు మాట్లాడనుగానీ,–'

'ఒరే అన్నప్పా! – అదృష్టమంటే, నీ భార్యదిరా ! మగాడు, నోరుమూసుకుని పెట్టిందేదో తిని పోతూంటే, యిల్లు దిద్దుకోవడం యెంత సుళువు!–? అక్కడ మా యిల్లు, – కావడానికి కలియుగ వైకుంఠమే – కాని, ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఉండదు కదా! ఓ చెంపను నమకాలూ, ఓ చెంపను యమకాలూ అన్నట్టు, – ముందు వసారాలో వేదఘోష, యిల్లంతా మావారి కంఠశోష! అదేం పుణ్యమో కాని, ఆ మనిషి, అరగడియ ఒక్కచోట కుదురుగా కూర్చోడమంటూ ఉంటేనా? అంతటా కలయ దిరుగుతూ, – పనస తొనలు వొలిచి పడేసినట్టు, పద్యాలు విరజిమ్ముతుంటారు! యిహ భోజనాల దగ్గిర చూసుకో, ఆయన ప్రతాపం! ముద్దముద్దకూ కవిత్వమే! బూజంబంతి నాటి ముచ్చట్ల దగ్గిర నుంచీ, – త్రవ్విపోస్తూ, మరీ పసిపిల్లవాడి వతు అనుకో! పంక్తికి పదిమంది వచ్చే లోగిలి కదా! పరాయివాళ్ళున్నారని లేదు, బంధువులున్నారని లేదు : ఆ పరిహాసాలకి అంతుండదనుకో! ఎన్నడన్నా, – బిడియం వేసి, – కాస్త వెనుకాడానో, అవాళ నా భరతం పట్టారన్న మాటే! ఏదో చిన్నప్పటి నుంచీ మాలిమి కనుక, ఎంత వయసు వచ్చినా, ఎవరూ లేకుండా చూసి, ఎన్నడన్నా ఓ నవ్వుమాట అన్నారనుకో, ముద్దులు గుడిచారే అనుకో, ఎలాగో సరిపెట్టుకు పోవచ్చు. అంతేకాని, – ఎదుటపడటం వ్యవధానం, నన్ను రంభనూ, ఊర్వశినీ చేసి వర్ణించడం మొదలెడితే, – ఏం జేసేదంట! వెయ్యేళ్ళూ యిలా గడవాల్సిందేనా?'–

'ఆహా!'

'అంతా విని,– ఆహా అంటావేమిట్రా? – మా ఊరొచ్చి ఓ నెల్లాళ్ళపాటుండి పోరా తండ్రీ! నిన్ను చూసన్నా నేర్చుకుంటే, నేను తెరిపిని పడతాను...'

'ఆయన్ను చూసి, నే నేర్చుకుంటే?–'

–రామశేషయ్య నవ్వుకందుకుని, 'అన్నప్పగారు అయ్యవార్లంగారి పేచీ వేశారు వొదినా!' అనేసి, ఆయనకు అర్థమయేట్టుగా... 'యీవిడ చెప్పిన కథే! అయ్యవార్లంగారికి, ఓ శిష్యురాలు దాపురించిందట! పూర్వాశ్రమంలో భోగాలేలిందిట! వయసు మళ్ళడంతో, కూర్చుంటే, ఓ పట్టాన లేవలేని స్థితిలోకి వచ్చింది: అస్తమానమూ తమ సన్నిధిలోనే

పడివున్న ఆ మనిషిమీద వారికి ఎట్టకేలకు జాలివేసి, నీ కోరిక ఏఁమన్నారుట ! ము-ము-ముత్తి! అన్నదట! ముక్తిమాట పెరుమాళ్ళెరుగును గాని, నీ నత్తి నా కబ్బేట్టుంది! మరో గురువును చూసుకో, అన్నారట! - ఏమంటే ఏం లాభం? వినపడదుగా. ఉన్నచోటే ఉంది! అన్నమాటే అంటూంది. దాంతో వీరికి తామసం హెచ్చి, పొ-పొ-పోఁ! అనేసరికి, ఆ చేతి విసురుడు చూచి, తన్ను నిలుచోమంటున్నారనుకుని, ఉత్సాహంకొద్దీ, ఉన్న సత్తువ కూడ దీసుకుని చేతనైనంత వయారంగా, చేతులు జోడించి నిలుచోంగా, వారికి మరింత దిమ్మదిరిగి, రెండు చేతుల మునివేళ్ళూ ఒక్కపెట్టున విదిలించడం మొదలుపెట్టగా, నాట్యం జేయమని ఆజ్ఞాపించినారనుకుని, ఎలాగో ఓపిక చేసుకుని, శబ్దంపట్టీ, చెంగ్‌మని, - రొప్పుతూ రోజుతూ, పళ్ళబిగివిని, తీర్మానం జెప్పి, కూలబడి, 'పెద్దింటయ్యా! పెరుమాళ్ళగుపించారయ్యా!' అన్నదట అంతటితోనన్నా వారు జాలిదలుచకుండా, అలాగే ముప్పొద్దులూ - సేవించుకోమన్నారట!-...'

'నాయనా, యీ కథ యింకా ఎంత వుంది!' అన్నాడు అన్నప్ప.

-'ఇప్పుడే అంకురార్పణం అయింది. ముక్తసరిగా చెప్పుకుంటూ పోయినా, మూడు రోజులు పడుతుంది. అవునురా నాయనా! ఏమల్లా చూస్తావ్! మన కళ్ళెదటవాళ్ళు ఒక చిన్న విషయం పట్టుకు, జీవితమంతా సాగదీస్తూ ఉండటం చూస్తూ ఉండలా? చిలవలూ పలవలూ చేసి, చివుళ్ళూ పువ్వులూ జేర్చి, మాల అల్లుకుంటూపోతే, దానికి అంతేమిటి? వాగుడులో పడ్డామో, వంట పలాముల్లై పోతుంది. అతిమంచివన్నా, ఓ హద్దంటూ ఉండాలి! అదిగో, చూశావా, అంతదూరం నుంచి అత్తవారి తరఫు మనిషి వస్తే, అన్నానికి మొగం వాచేట్టుచేసి పంపిచాట్ట అని, అక్కడివాళ్ళు - మధ్యను వీడిని ఆడిపోసుకుంటారు. మన చాదస్తం మనతో ఉండేదే కాని, మడిగట్టుకొచ్చి మంచిమాట చెయ్' అని, రాజమ్మగారు వాళ్ళను తరిమితేనేకాని, అక్కడనుంచి కదలందే!

అప్పటికి, ఎంతసేపయో వెన్నెల వచ్చింది.

'అరుగుమీంచి లేచి, ఆరుబయటికి వచ్చేసరికి, ఆహాఁ! పెళ్ళిపందిట్లోకి అడుగుపెట్టినట్టుంది. ఈ గాలి తిని బతకచ్చు!-' అనుకుంటూ పెళ్ళి నడకలు మొదలెట్టాడు; అన్నప్ప-

రామశేషు, ఆయనతోబాటే అడుగు నిదానించి వేస్తూ, 'ఆహాఁ! ఎంతకాలం దిన్నా తరగని పంట!- ఎందరొచ్చినా, ఎవ్వరొచ్చినా అభ్యంతరం అంటూ ఉండదు.'

అన్నప్ప గొంతు, రవంత ఉలిక్కిపడ్డది- 'ఎవ్వరొచ్చినా - అంటే-'

'అంతే! మీరనుకున్నదే, నే నన్నదీ!'

ఆయన రామశేషు మొగంలోకి మొగంపెట్టి, 'నీ కడుపు చల్లగా...' అంటూండగానే, 'అఁ - అఁ మీవంటి యోగ్యులచేత అంతమాటపడే యోగం నాకు లేదండోయ్!' అని, రామశేషు నవ్వుతూనే అన్నా, అన్నప్పకు, ఎందుచేతనో, ఆ ముక్క అలా, అతగాడి నోటి వెంట రావడం మహా బాధగా అనిపించింది. ఒక్కక్షణం, అట్టె మనసు విలవిల్లాడిపోయింది. అమాంతం కావిలించుకునేంత ఆవేశంతో మీదిమీదికి పోబోయి అంతలో నీళ్ళు కారిపోయి, మళ్ళీ అట్టె నిలవదొక్కుకుని, 'నాయనా, ఎంతమాటన్నావ్ నా తండ్రీ! పనిగట్టుకొచ్చావ్ - పరశురామక్షేత్రం ఫలసాయానికి దెచ్చావ్! పదిమందికీ సుష్ఠుగా అన్నోదకాలు కలిపించావ్! యీ సుకృతం గాలికిపోతుందా?

కనుచూపు మేరదాకా, నీవు చేసిన మేలు కనబడుతోనే ఉందిగా! నాలుగు చెంపలా పచ్చగా వుంటే, నడుమ నిప్పచ్చరమౌతుందా! అబ్బాయ్! సీతమ్మ తల్లి స్మరణే జీవితమైనవాణ్ణి, చిత్తశుద్ధిగా అంటున్నాను : నీవున్న చోట కొరతుండదు. వేయి జన్మలకైనా వెలితుండదు...'

రామశేషు, పకపకా నవ్వుతూ; 'యింతా పొగడిందీ, యింకా వేయి జన్మలెత్తమనేందుకా? ఎత్తి, ఎవరి నుద్ధరించనండీ!'

'లోకాన్ని–'

'సరిపోయె!– నా ఒళ్ళే నేనే మోయలేకుండా ఉంటే,–...'

'అంటే–'

'అదో సెమత్కారం లెగుండీ! బావిలో నీళ్ళు సల్లారిపోతుండాయి, పదుండీ!–' అని సుబ్బన్న కలుగజేసుకున్నాడు అంతవరకూ, వాడు వెంట వస్తూన్నది, – అన్నప్ప గమనించలేదు; ఛెళ్ళున ఆతడి వంక చూసి, – 'ఆఁహాఁ! – ఆహాఁ! అంగోస్త్రంలాగా, అహర్నిశలూ అంటిపట్టుకునే ఉంటావన్న మాట! ఎంత పుణ్యం జేసుకుంటేనోగాని, యిలాటి అంగరక్షకులు దొరకరు ! పొరబాటున ఎన్నడన్నా కట్టుకున్నదన్నా, అంటే, కట్టుకున్న ధోవతన్నా తొలగుతుంది కాని, నువ్వు మాత్రం వైదొలగవు! మాకు తోడొచ్చావా నా తండ్రీ! ఏం? మేం, తోడిపోసి పోసుకోలేం?–'

'తోడీ పోసుకోలేరు, ఆడీ పోసుకోలేరు:'

'యిక్కడి నీళ్ళూ, యిక్కడివాళ్ళూ వీళ్ళది ఒక్కటే తరహాఁ – అవతలి వారికి, అట్టి చేలోకువ అవడమంటూ లేదు:'

'చూశారూ అన్నప్పగారూ, బందరు ప్రాంతాల్లో అంటే, పైపైన గోకితేచాలు, జలేసుకొస్తుంది. యిక్కడ అట్టాకాదే! గడ్డి మహాగరుసు! తవ్వుకుంటూపోతే కాని తడి తగలదు.'

'మనవన్నీ మోటబావులు! సుబ్బన్న చెయి చేసుకోవలసిందే కాని, మనం చేదలేం!' అంటూ పోతున్నాడు రామశేషు:

'వీడి తస్సదియ్య! యిక్కడికివచ్చి వీడింత అరిందా అయినాడా,' అనుకుంటూ అన్నప్ప పైకి బాహాటంగా ఒక్క నవ్వు నవ్వేసి, 'అలాగే' అనేసి, యిప్పుడు వీడి నిహ కదిలించడం మంచిది కాదు. భోజనానంతరం ఒక్కపట్టు పట్టిచూద్దాం, అనుకొని మౌనంగా స్నానం ముగించేసుకున్నాడు! స్నానానంతరం, ఆచమనానికి ముందు, ఓ చిన్న అనుమానం!–

నిజానికి సుబ్బన్న వచ్చి, నీళ్ళుతోడి పెట్టలేదు; కుండునిండా పట్టేవున్నాయి. ముంచి పోసికున్నారు. ఇది, మడి ఎలా అవుతుంది? అలా అనుకుంటూ మీమాంస పడుతూండగానే, నవ్వు తెరొచ్చింది. ఒళ్ళు తుడుచుకుంటూ నవ్వుకుంటూన్నాడు.

'అన్నప్పగారూ, మీరు యింటికి వెళ్ళేప్పుడు మీ నవ్వు కాస్త యిక్కడ దిగవిడిచి వెళ్ళండి. అరగారగా నవ్వుతూంటే ఆరోగ్యం మరింత బాగుపడుతుంది!' అంటూన్నాడు రామశేషు. అది ఓ పట్టానికి విడిపించుకుని, అన్నప్ప – 'అంటే – యిప్పుడు నీ ఆరోగ్యానికి వచ్చిన లోపమేమిటి?'

'ఇప్పుడేం లేదనుకోండి!'

'ఒకప్పుడు మట్టుకు?'

'ఏం సుబ్బన్నా, చెప్పనా?'

'ఓ మా రాజుబిడ్డలాగా! ఇప్పుడా యెద్దడి తీరిందిగా - అన్నప్పగారూ! శేషయ్యగారు చెప్పడం కాదు, నేం జెప్పుతా వినండి! యీ కుఱ్ఱాయినికి పెళ్ళామంటే ప్రాణం! మా అమ్మాయిగారికి, యింకా చిన్నతనం; వృత్తి పుణ్యానికి, ఏదో మాటామాటా పెంచుకుని, నవ్వులతో పోనిచ్చేదాన్ని నారసాల దాకా తెచ్చుకున్నారు : యిద్దరికీ గుక్క తిప్పుకోడం చేతకాలేదు : యిప్పుడిన్ని కబుర్లు చెబుతూ యింత నిరవాకం జేస్తున్నాడే యీ బంగారు తండ్రి - తానేం జేశాడు? చేతనైతే తనిల్లు తాను దిద్దుకోవాలి - లేదా యీ ముసిలాడికి చెప్పాలి!'-

'అమ్మా అయ్యకు జెప్పేందుకు, మొగ బిడియం గావచ్చును : నాతో జెప్పడానికేం?- కన్నామన్న పేరే వారిది కాని, పెంపకం నాదేకంద!'

'ఉహూఁ చెప్పలా!'-

'మీసం మొలకేసిందిగా, మొనగాడైనాడు!'

'తిండీ తిప్పలు మాని, కంపనుబడ్డ కాకల్లే తిరిగి, - ఎండగట్టుకుంటే ఏమౌతుంది? ఏనుగ చిక్కింది. ఎలక పిల్లయింది! అప్పుడన్నా మేలుకోవచ్చా? పంతాలాయెను ! పాలలోబడ్డ బల్లి అయితేనే గాని, ఆయనకు ఒళ్ళు తెలియలా! సీతారామాచార్ల దగ్గిరకు పోయినాం : ఆయ న్నరం నరం పట్టిచూసి, ఆహాఁ ! అనుకుంటూ అటూ యిటూ పచార్లు చేసి, రవంత కూనిరాగందీసి, వచ్చి వెన్నుమీద ఒక్కటి చరచి, 'ఒరి భడవా, మమ్మల్నందర్నీ మించేట్టున్నావురా!' అంటూ, 'ఒరే సుబ్బన్నా, మాకు, వచ్చిన వ్యాధి నయంజేయడం ఎలాగో, తగుమాత్రం తెలుసు, వీడికి వ్యాధి రప్పించుకోడమెలాగో-తెలిసిందోయ్! ఏంరా శేషూ, ఏమిటీ నీకీ తెగులు?' అని ఓ గదమాయింపు గదమాయించే సరికల్లా, బయట పడక తప్పింది కాదు; మాచేత వాగిందే వాగించి, ఏమాకళింపు జేసుకున్నాడో, మళ్ళీ కూనిరాగం అందుకున్నాడు; అలా కుసింత సేపు గునిసి, - నను బ్రోవమని చెప్పవే, సీతమ్మ తల్లీ, - అని పాటెత్తుకున్నాడు : ఆ మనిషి అలా పాటెత్తుకున్నాడంటే, వచ్చినవాడి ఖాయిలాకి రాంకీర్తన పాడేస్తున్నాడన్న మాట! అదే కొండగుర్తు: వేళ్ళు మడిచి చిటికెవాయిస్తూ, ఆయన పాడుతూంటే, - ఎదటివాడు అప్పటికప్పుడే సగం కోలుకుంటాడు; అఁ అదేమందూ, అదే మంత్రం! ఆ మనిషి వైద్యం అదోమాదిరి!-

అలా, పాట ఆసాంతం పాడేసి, సీతమ్మతల్లిని ముమ్మారు తలచుకుని, ఎదురుగుండా కూచుని, ఏమన్నాడంటే-

'చీకటితో బలరాముడు
ఎండెక్కితే చిన్నికృష్ణుడు,
మధ్యాహ్నం భోజరాజు
రాత్రికి రాయలవారు'-

'ఒరే, నాయనా, ఓ యేడాదిపాటు యిలా కానీయ్! తరువాత అదే అలవాటై ఊరుకుంటుంది. పచ్చటి నీడను పగటి నిద్ర అలవాటు చేసుకో! వెన్నెల్లోకూచుని హాయిగా సంగీతం పాడుకో! బద్ధకమేసిందీ, ఒక్క గుక్కెడు మంచినీళ్ళు - గుక్కెడే తాగి బబ్బో!'

'శేషూ, రావణబ్రహ్మకు లంకంత లోగిలుండగా ఆ ఒక్కమనిషీ ఉండేందుకు చోటు లేకపోయిందా? ఆవిడ ఉండనందా?'–

'అది కాదురా అసలు సంగతి;'

'అతగాడు వేత్తకదా? లంకానగరం రాగద్వేషాల మీద నిర్మించిందాయెను. కనుక వాటికి అంటీ ముట్టకుండా ఉండేట్టు అశోకవనం నిర్మించి, అక్కడ ఆ తల్లికి విడిది కలిపించి సేవించుకున్నాడు.'

'నాయనా! మనందరిదీ, రావణాబ్రహ్మ మతమే.'

'ఆ తల్లి ఉన్న చోట అశోకవనం!'

'తనువుకైనా, ధరణికైనా యిదే భేషజం!' యిలా అనేసి ఊరుకున్నాడు. మాకు అందులో ఒక్క ముక్క అర్థంకానిదే! ఆచార్లగారూ, చీకటితో బలరాముడేమిటి, చిన్ని కృష్ణుడేమిటి? ఏమిటీ దాని కమామీషు, అని అడిగేశాను. ఆయనన్నారుగందా! ఒరే, మరేం లేదురా! నిద్దర్లేవంగానే, పుడిసెడు తేనె పుచ్చుకోవడం – ఎండెక్కినాక వెన్నముద్ద! అక్కడికి ప్రాతఃస్మరణ అవుతుంది. భోజరాజు వారు, పెసరపప్పు గుత్తంగా వండించుకుని, నెయ్యోడుతూ తినేసి, గడ్డపెరుగు, ఫలహారం జేసేవాట్ట! రాయలవారున్నారే, ఆయనకు రాత్రిపూట వేరే తిండీ తిప్పలు అవసరంలేదు, పాలమీద చెత్త యింత తినేసి, హాయిగా పడుకునేవాడు.'

'ఇదీ పద్ధతి. యిదీ పథ్యం! యీ సాలుకు యిలా జరుపుకుపోతే, వచ్చేయేడు కాముడు ఖజ్జూర పండు దినచ్చు.'

'ఒరే శేషూ, యీ వెర్రి నీ మంచికే వచ్చిందిరా, ఒంటరొంటరిగా, అఘోరించదలచు కున్నప్పుడు, యింటి పట్టున ఎందుకూ? నేం జెప్పినట్టూ ఆ పైన్నీకు తోచినట్టూ చెయ్!'

'మామిడికోళ్ళ దగ్గిర, మనకో మూడెకరాల తోటుంది; దాన్నంటే ముప్పై ఎకరాల బంజరూ! అదీ యిదీ పనగలిసి పచ్చపడితే, అక్కడున్న పదిమందీ మనకళ్ళ ఎదుట చల్లగా ఉంటారు : అంతమేరా నీకు సర్వదుంబాలాగా, హస్తార్పితం జేస్తున్నాను. ఇహ ఆ పని మీద ఉండు!' అని మాకు సెలవిచ్చి, పదిబారలు వచ్చినాక నన్ను మళ్ళీ వెనక్కిపిలిచి, – 'ఒరే సుబ్బన్నా, వీడిని యిక్కడికి లాక్కురావడం అన్నిందాలా మంచిదే అయింది సుమా! మరి ఏ సంచికట్టుగాడికో చూపించి ఉంటే శ్వేత పాండువనో, కాకపోతే రాజయక్ష్మమనో, పుస్తకాల్లోంచి ఏవో దిక్కుమాలిన పేర్లు వెదకిపెట్టి. పుఠం ఆర్చేవాడు. ఒరేయ్, దొబ్బుడాయ్ అనేది కావడానికి గొప్ప జబ్బు! అది వీడికి పట్టుకుంది. అందుకు సందేహం లేదు!'

'దీనికి, అనుపానమే ఔషధం!'

'నేనింత చేతకాని వాణ్ణయితినేమా అని, లోలోపల గింజుకోవడంతో, యిలా లోచెద్దాడు. చేతినిండా, చిత్తం వచ్చిన పనంటూ ఉంటే, నిబ్బరం, దానంతట అదే అబ్బుతుంది. మళ్ళీ నిమ్మకు నీరెత్తుతుంది; యిదీ అసలు కిటుకు! యీ విషయం రెండో కంటివాడికి తెలియనీయద్దు. వీడిక్కూడా, చెప్పద్దు. నీవు మట్టుకు అంటిపెట్టుకుని ఉండు.'

'నేను, యీపూట అక్కడికి వెళుతున్నాను.'

'మీరు, శనివారం తెల్లారిగట్ల బండీ కట్టుకున్నారా అంటే, ఆట్టే ఎండెక్కకముందు చేరుకుంటారు. వండుకునేందుకూ వార్చుకునేందుకూ అక్కడ అన్ని ఏర్పాట్లూ ఉన్నాయి. ప్రస్తుతానికి మన పర్ణశాల ఉంది. మనిషి సాయం అంటావా, చెదురువాటుగా ఓ యాభై కుటుంబాల దాకా ఉన్నాయి. చెప్పిన పని చేతులు కట్టుకు చేస్తారు, దూకూ అంటే దూకేస్తారు: వాళ్ళందరూ, మన బలగం! చక్కగా కాలక్షేపం అవుతుంది. ఒరే, వాడి వళ్ళు బాగుపడాలంటే, నీవో ఏడాదిపాటు, వళ్ళు దగ్గిర పెట్టుకు ఉండాలి. యిహ పోయిరా, పోఁ' అన్నారు. సరేనని యింటికిపోయి కావలసిన బట్టా పాతా పట్టుకుని అనుకున్న నాటికి యిక్కడకు వచ్చి పడ్డాం'–

'ఏమర్రా, యింకా అక్కడే వున్నారా?' అని రంగమ్మగారు రాగయుక్తంగా కేకలేసికుంటూ రానే వచ్చింది.

'అయ్యో రామ! అల్లా మిర్రి మిర్రి చూస్తావేంరా అన్నప్పా! చిన్నప్పటినుంచీ నీకు తిండిరంధే ఆయెను? ఆ ఆకలంతా ఏమైపోయిందిరా?'

'రాజమ్మా! తాతలనాటి నుంచీ వస్తూన్న వారసత్వం! దానికి వృద్ధేకాని, తరుగులేదు. ఈ క్షణంలో మరీ పదును మీదుంది. కారణం ఏమిటో తెలుసునా? మనవాడు రాత్రిపూట లఘువుగా ఏం పుచ్చుకుంటాడో యింతకుముందే తెలిసింది. జిహ్వ పురపుర లాడిపోతూందనుకో! కనుక వేసే ఆ గడ్డ పెరుగుతో బాటు, ఓ పట్టెడు పాల నిగ్గు కూడా యేకనువేస్తే అది జుర్రుకుంటూ, యిది నంజుకుంటూ, అక్కడికా మొక్కు తీర్చుకుంటే, అనంతరం ఏ చక్కెర కేళీపళ్ళో, యిన్ని మల్‌గోవా ముక్కలో, అవీ యివీ గాకపోతే కనీసం పళ్ళెముడు పనసతొనలో పుచ్చుకోమని నీవు ఎలాగూ బలవంతం చేయక మానవు – తశ్శాంతికిగాను, ఓ తవ్వెడు పాలూ దాహం బుచ్చుకోక తప్పదు. పొరుగింట భుక్తాయాసం అభినయించవలసిందిగా గృహ్య సూత్రకారుడి ఆదేశం గనుక లాంఛనానికి ఆపసోపాలుపడే సన్నాహంలో ఉండగానే, ఓ పదో పరకో సున్నుండలూ, ఓ బొత్తి అరిసెలూ, తబుకులో ఉంచి, ఎదటపెట్టి, 'యివో పంటికింద పడేయరా' అనక మానవు! నాకు జ్ఞాపకం ఉందే తల్లీ!'–

'మన చిన్నతనంలో, నీకు, ఆ భక్ష్యాలుంటే చాలు, అన్నం అక్కరలేదు : ఆ మక్కువ లెక్కడికి పోతాయ్ ?'

'నీ ఐదవతనం కలిమిని, అరిసెలూ, మినపసున్నీ, నీ యింట నిత్యనివాసం జేయవలసిందే.'

'మొహం మొత్తింది మొర్రో అని మొత్తుకుంటూన్నా ససేమిరా అంటూ నెత్తిన మొట్టి తినిపించేదానివి! ఆ యింట ఆపేక్ష, అంతఃకరణలు అలాంటివి!' –

'అక్కడ చదువు అబ్బకపోయినా, ఆ పెట్టుపోతలు ఒంటపట్టి, నాటికీ నేటికీ ఒక్క తీరునే ఉన్నాను!–'

'వెయ్యేళ్ళకూ, యిలాగే ఉంటావ్!'–

' ఒరే, అన్నప్పా ! – ఏటికేడాదీ పురాణం జెప్పేవాడికి, ఎదుటివాడి కునికిపాట్లేం దెలుస్తాయ్, – అని సామెతుంది కాదూ ! నీవు, సకల పురాణాలూ మథించి, ఆ అమృతం కాస్తా, ఆపోసెనం బట్టినవాడివి : నీకు, అన్నం అంటే మన్నన లేదు, ఆకలంటే లక్ష్యమూ లేదు – మేము కంటికి రెప్పలున్నవాళ్ళం వేళపట్టున కలోగంజో, – యింత పడకపోతే–'

'మాతల్లే! – కలో గంజో అలవాటైన ప్రాణి. ఒంటి నేత అంగోస్త్రమల్లే, యాచుకుపోయి, ఉసూరు మంటూ ఉండాలి కాని, యీ విసుర్లు విసిరేందుకు త్రాణ ఉంటుందా ? – వస్తున్నాం అమ్మా ! వచ్చేశాం! యింతకూ, అధరువులు ఏంజేశావో, చెప్పావు కాదు – తినబోతూ రుచులెంచితే, తిన్న ఆ ఒక్క పిడచా, ఆపోతుందని, అనుభవం మీద తెలుసుకున్న విషయం కనుక, –'

'అయ్యో!' అన్నాడు సుబ్బన్న: 'మీ కబుర్లు వింటేనే కడుపు నిండుతూంది; మీరు పిల్లాపాపతో వచ్చి, మాతోబాటు కాపురం ఉండిపోతే, మీ పుణ్యమా అని రంగమ్మగారికి, యీ వంట ఎద్దడి తప్పుతుంది...'

'తప్పదురా తండ్రి!యిబ్బడి ముబ్బడౌతుంది; నేను ఒక్కపూట భోజనం మానను, వేళ మించినా ఒక్క ముద్ద తక్కువ తినను! మా తెలివి తక్కువదంటావా ఏ కళనున్నా నాకన్న ఒక్కపట్టు ఎక్కువే పడుతుంది: సరే మా మాటకేంగాని, మా బుచ్చిగాడున్నాడే, దేవతలు మెచ్చే తిండి వాడిది. ఈ కలికాలంలో దేవతలంటూ యింకా ఒకరో అరో మిగిలి ఉంటే, వారు ఏ పని మీదో దిగివస్తే మావాడు భోంచేయడం చూస్తే – యిక ఆ దిక్కుమాలిన అమృతం, ఔషధ ప్రాయంగానన్నా, జన్మకు పుచ్చుకుంటారా? రాజమ్మోవ్ – మావాడే, దోసకాయ పప్పుకూర వేసి, ఒక్క యెకరం మేర కలిపి, యిట్టె తిరిగి చూసేప్పటికి అట్లె మాయం జేస్తాడు. పెరుగూ అన్నంలో శరవేగంతో వంకాయగుత్తులు నంజుకుంటూంటే – అలనాడు ఆ ఉత్తర కుమారుడు – ఉత్తర గోగ్రహణ సందర్భంలో, కౌరవ వీరుల తలచీరలు ఒడిసి పట్టిన చాకచక్యం, కళ్ళకు కట్టినట్టుంది. మీరందరూ మునివేళ్లతో కొక్కిరించి మూతి తుడుచుకునేవాళ్ళు. మమ్మల్ని ఉన్నచోటే ఉండనిస్తే మేలు!' అన్నాడు అన్నప్ప.

'కనుక, ఎక్కడున్న వాళ్ళు అక్కడ ఉండటమే మంచిదంటారా అన్నప్పగారూ!' అన్నాడు రామశేషయ్య.

'ఎక్కడ ఉండవలసిన వాళ్ళు, ఏనాటికైనా అక్కడ ఉండటమే మంచిదీ అంటాను' అని తడుముకోకుండా అనేశాడు అన్నప్ప.

'ఎవరికి ఆ మంచి?'

'తనకే–'

'తన మంచి తనకు తెలియకపోతే–'

'పసితనం.'

'అది యీ జన్మకు వదలకపోతే–'

'వచ్చిన ప్రమాదం లేదు! మనం ద్విజన్ములం! – మరో జన్మ ఎత్తేందుకు హక్కు ఉంది.'

రాజమ్మ నవ్వుతూ 'ఒరే రామశేషూ, వాణ్ణి మళ్ళీ కదిలించావెందుకురా, యిలాగే అల్లుకుపోతూంటాడు. అన్నప్పా! వంకాయకూర చల్లారి పోతుందిరా!'

'ఆ మాట యిందాకే చెపితే!' – .

యిహ అన్నప్ప అక్కడ నిలవందే!

అందరూ తీరుబడిగా భోజనం చేశారు.

'నాయనా, నేను యిక నిశ్చింతగా నిద్రపోతాను' అన్నాడు అన్నప్ప.

'అన్నప్పా! యిది అశోకవనంరా! చీకూ చింతా యీ ఛాయలకు రావు' అంటూన్నది రాజమ్మ–

అంతలోనే అన్నప్ప గుర్రందుకున్నాడు.

'ఆరి నా తండ్రీ! అరిసెముక్కలమాటే మరచిపోతివి కదరా!' అనుకుంటూ రాజమ్మ ఇంతసేపు నవ్వుకుని, తమ చిన్నప్పటి ముచ్చటలన్నీ ఏకరవు పెట్టి, 'వీడిది మొదటి నుంచీ అతి తెలివి – అందుచేతనే మన్నుదిన్న పాము లాగా ఒక్క విద్యతోనే ఊరేగకుండా అన్నీ అంతో ఇంతో ఆడుతూ పాడుతూనే ఆకళింపు చేసుకున్నాడు. చదివింది సద్వినియోగం జేస్తున్నాడు. వాడేం చేసినా ఏం చెప్పినా, ఎదుటివాళ్ళ మంచికే – ఊళ్ళో ఎక్కడన్నా ఉయ్యాల వేశారని తెలుస్తే వీడిక్కడనుంచే లాలిపాటలు పాడుతాడు – నిత్యానందుడు! షష్ఠేరు ఘళ్ళూ కృష్ణాష్టమే కాని, ఏకాదశీ అమావాస్యలు ఎరుగడు. అదీ వాడి పుణ్యం! ఇన్ని సుగుణాలూ ఓ చెంపను ఉంటూన్నా పైకి అంతబోళాగా కనిపిస్తూన్నా, వాడేం వెన్నదిన్న గోపాలుడు కాడు – పరువుకు పుట్టిన పరశురాముడు. వాడి ఆపేక్షంటే పాముపగే... ఇంతకూ వీడెందుకు వచ్చాడో అర్థమయిందిగా? తబిసీళ్ళకేంగాని, తరువాత జూసుకోవచ్చు. రేపోమాపో అమ్మడు పుట్టింటినుంచి రానున్నదని తెలుస్తూనే ఉందిగా, – వస్తే ఆపై మాట?

'మా అమ్మా! మా తల్లీ! అని ఎప్పటిలాగా నెత్తిన పెట్టుకోవడమే–' అని నసిగాడు సుబ్బన్న.

'ఏమిరా, శేషూ! నీవూ వీడిమాటకు తాళం వేస్తావా?'

'నేనూ, యీ మేళంలో వాడినేగా!'

'అదే నీకు శ్రీరామరక్ష! పిల్లది యకాయకిని యిక్కడికే వస్తుందా, – అక్కడ పేటలో యింటికి వెళుతుందా?'

అన్నప్ప నిద్దర్లోనే, 'ముందు రావడం అక్కడికే ననుకో–' అంటూ చటుక్కున లేచి కూర్చుని, 'ఎల్లుండి తెల్లారేసరికల్లా, మనింట్లో ఉంటుంది.'

'ఓరి నా తండ్రీ, నీవు నిద్రపోలా?'

'మీకు లేని నిద్ర నాకు వస్తుందా, రాజమ్మా! – అలవాటు కొద్దీ నడుం వాల్చానే కాని నాకిదే ఆలాపన! నీవు నన్ను ఇంద్రుణ్ణీ చంద్రుణ్ణీ చేసి పొగడుతూంటే, పొంగిపోతూ, అలాగే పడి ఉన్నాను. తన వాళ్ళు ఔననగా ఆలకించేందుకు నోచినవాడే ధన్యుడు!'

'ధన్యుడవేలే, బబ్బో–'

'అబ్బో! యిక నిద్ర ఎందుకు! పనిలో పని మా భోగట్టాయావత్తు చెప్పేస్తాను,' – అంటూ గ్రామంలో వైనం పూసగ్రుచ్చి, – 'ఇప్పుడు బుద్ధికుదిరి, బుద్ధి తెలిసి వస్తూంది : మీరు, – పుల్లవిరుపు మాటలంటారనీ, – చులకనగా చూస్తారనీ, – అలాటి భయం అన్నందినేవాళ్ళకు ఉండదు: కాని తినేది అన్నమే అయినా, అనుపాన భేదాన్ని పట్టి, రకరకాల రుచులు జిహ్వను పుట్టుకొచ్చినట్టు, – అవస్థాభేదాన్ని, అనుసరించి, – అంతరంగ బహిరంగాలు తీన్ తేరా కావడమున్నూ, దాంతో, – సాత్త్వికంగానే అనుకో, – యింగితం అనేది, కుప్పిగంతులు వేయడమున్నూ జరుగుతుందని, వ్యాసులవారంతటి వారికి, అనుభవంలోకి వచ్చిన విషయం, – యీ డొంక తిరుగుడు మాని, విడమరచి చెప్పాలంటే, – ఆవగింజంత అమాయికత్వం ఉన్నచోటే, వేపకాయంత వెర్రి ఉంటుంది కాదుటమ్మా,

రాజమ్మా! కాచివడబోయందే, కష్టమేదో సుఖమేదో ఎలా తెలుస్తుంది? – ఉగ్గు తాగే పాప, ఉండ్రాళ్ళ తద్దె నోము పట్టిందని; – పిచ్చికను, పిల్లికూత కూయమంటే వల్లనయ్యే పనా? మొగుణ్ణి కొట్టేందుకైనా, మొగసాల ఎక్కేందుకైనా, – తగిన శాణాతనం ఉండాలి! సత్యభామ శ్రీకృష్ణుణ్ణి, తన్నరానిచోటే తన్నింది; ఆ సుకుమారి పాద పల్లవం, అతగాడికి తగలరాని చోటే తగిలింది; అదే గనుక, లోకసామాన్యపు గృహస్థు తాలూకు గృహకృత్యమాయెనా, – శుంఠం తామ్ – కాని, ఆ మనిషి, ఫక్తు వెన్నమీద పెరిగినవాడు కావడంతో, – మెత్తహా ఎత్తుకు పైఎత్తు వేశాడు. రామశేషూ! ఆ కందాయంలో, తిమ్మన్నగారు కట్టిన పద్యం నీకూ వచ్చే ఉంటుంది! చూశావా, రస్నా అంటే అదీ! – కస్సుమన్నదాన్ని, చిటికెలో కలకలలాడించాడు! యిల్లు దిద్దుకోవడమంటే, అదీ! – పెళ్ళాం, కాసిని పువ్వుల కోసరం ముచ్చట పడితే, – చెట్టుకు చెట్టే పెల్లగించి తెచ్చి, దొడ్లో పడేయటం ఏమిటి? ఓసి, వాపిరిగొట్టు మొగమా! యిదిగో, ఏటికేడాదీ నెత్తిన కొట్టుకోవే, అనడమే కాదూ! మగరాయడి గడుసుతనమంటే – అద్గదీ! నాయనా రామశేషూ? ఆడకూతురు మకురుతనం చేసిందంటే, అది అర్థంలేని మొండిపట్టు అనుకోవడం, మన అమాయకత్వం కాని, మరొహటి కాదు; కవ్వించడం అనేది తలకొక రకం! తమలపాకుతో తానొకటంటే, మల్లె చెండుతో మన మొకటన్నప్పుడే మన్మధులవారు మనకు దాసోహం జేసేది!' రామశేషు, చేతులు జోడించాడు.

'అన్నప్పా!, ఒక్క కునుకు తీయవురా?' అంది రాజమ్మ:

'ఓం – నిరభ్యంతరంగా!' అనడమేమిటి, గుర్రు కొట్టడమేమిటి!...

తూరుపు తెలతెల్లవారుతూండగా కాని, అన్నప్పకు మెలకువరాలేదు. కార్యాలు ముగించుకుని, – చెట్టున ఆరిన పొడిబట్ట కట్టుకుని, బావి దగ్గర నుంచి, యింటి ఛాయలకు వచ్చేసరికి, వసారాలో, రంగడు ఎదురైంది. దణ్ణం పెట్టింది. అలా ఒక్కసారి పరకాయించి చూసి, మెప్పుగా తల ఊగించి, 'తొయ్యలి చిరుసానబెట్టిన అనంగుని మోహన బాణ మోయనన్' అని మనసున కూనిరాగం దీసి, 'ఏం రంగా!' అన్నాడు. రంగడు ఉలికి పడ్డది! ఒకరినొకరు యింతకుముందు చూసిన పుణ్యానబోలేదు; తానని ఎలా గుర్తుపట్టారో? దానికేంగాని, ధుమ ధుమ లాడుతూ ఉంటాడేమో అనుకుంటే, చూడగానే కస్సుమన కుండా, కన్నబిడ్డను పలుకరించినట్టు పలుకరించాడేమిటి?–

అన్నప్ప అనుకున్నాడు కదా! ఏ కులాన పుడితేనేం, ఇది వున్నచోట సిరివుండటం తధ్యం! తామిద్దరూ ఒక్క తల్లి కడుపున పుట్టకపోయినా రామశేషుకు, ఇలాటి చెల్లెలు అమరబట్టే ఏట పడ్డవాడు ఎదురీది ఒడ్డు ఎక్కాడు; ఇది అంతా దీని చలువే!

మనిషి మళ్ళీ నీళ్ళోసుకున్నట్టుంది; పూవుల పొట్లం లాగుంది.

'అమ్మాయ్! వచ్చి ఎంతసేపయిందేమిటి?'

'ఇంతకుముందే! మీరు అక్కడ జపం చేసుకుంటూన్నారు. దూరాన్నుంచే దణ్ణం పెట్టుకు వచ్చాను. రంగమ్మగారు, మందిరం దగ్గిర వున్నారు, శేషన్నయ్య చింతలతోపుకు వెళ్ళాడు. సీతారామాచార్లగారొచ్చారు. తేనె పట్టిస్తున్నారు! పాలుగాచి తెచ్చాను; మీరు దాహం పుచ్చుకున్నాక...'

'నాకు అలవాటు లేదే–'

'అమ్మవారికి ఆరగింపు చేసి, రంగమ్మగారిచ్చారు. ఆ మాటే మీతో చెప్పమన్నారు.'

'అలాగా?' అంటూ అన్నప్ప లోపలికి వెళ్ళాడు. లోపలి సావడిలో, పీట వేసుంది. ఎదుట వెండి దొప్పలో పాలు, ఘుమఘుమ లాడుతున్నాయి. నిదానంగా కూర్చుని 'సీతమ్మ తల్లీ! చిద్రూపిణీ! జగన్మాతా! జనకనందినీ!' అనుకుంటూ, అనుకుంటూ, దాన్ని అందుకుని 'ఆరగింపు చేసిన దెవరికమ్మా?' అన్నాడు. రంగడు వసారాలోంచే, 'ఆదిలక్ష్మమ్మకు' అన్నది.

'అహఁ– అనాదిగా, యీ గడ్డమీద ఉంటూన్న తల్లి ఆవిడా?'

'యీ మధ్యనే వెలసింది. అన్నయ్య యిక్కడకు వచ్చిన నెలలోనే శాంతయ్య గారొచ్చారు. ఆయనతోనే అమ్మవారూ వచ్చింది. మావిళ్ళ తోపులో మందిరం కట్టించారు.'

'శాంతయ్యగారంటే?'

'–ఏమో! ఏక్కడివారో – ఎవరో, తెలియదు. ఏ భాషో తెలియదు. ఎప్పుడూ మౌనం. ఆయన చల్లగా, వెన్నెలలాగా ఉంటాడు. మీగడలాటి నవ్వు, వెన్నపూసలాంటి వాలకం! ఆయన్ను చూస్తే దేవుణ్ణి చూసినట్టే–'

'ఓనాడు తెల్లారేసరికల్లా, మామిడి తోపులో అవుపించారు. చూసిన మనుషులొచ్చి చెప్పేసరికి, అన్నయ్య పరుగెత్తుకు వెళ్ళాడు. అక్కడ ఆయనా, అమ్మవారి విగ్రహం! దేంతో చేశారో, ఎవరు చేశారో, ఆ తల్లి ధళధళలాడుతూ ఉంటుంది. పాలల్లో తానమాడుతుంది. అంతే, పూలూ పత్రీ అంటూ పూజలంటూ మరేం లేదు.'

'శాంతయ్యగారని, ఆయనకు మేం పేరెట్టుకున్నాం! పాలూ తేనే పుచ్చుకుంటారు రోజుకొక్కసారి : మరి, పండూ ఫలం అంటూ వేరే ఏం లేదు!...'

'వారొక్కరే, ఆ మందిరంలో ఉంటారన్నమాట.'

'వారితోబాటు, పసుపూ, కుంఖం'–

'అంటే,'–

'చూద్దురుగాని, రండి!'

–అన్నప్ప, మూడు గుక్కల్లో పాలు పుచ్చుకుని లేచివచ్చాడు; యిద్దరూ బయలుదేరారు; యీ ఆవరణ దాటగానే అన్నీ బాదం చెట్లు : బాగా యకరం మేర ఉన్నాయి. అవతల, వేపలూ నేరేళ్ళూ, దాన్నంటి దానిమ్మ అడవి! ఆ పక్కనే, మామిడి తోపు!

నిజానికి, అది, తోటగా వేసిన తోటకాదు, చుట్టూతా మామిడి అంట్లు. మధ్యనంతా, మెరాబా, ఆ మధ్యనుంది, యీ మందిరం. మెరాబా అంతా పచ్చిక పట్టూ–

అక్కడికే మేళ తాళాలు వినిపిస్తున్నాయి! పాట పాడుతున్నది, రాజమ్మ లాగుంది.

అన్నప్ప అడుగు వడిగా వేశాడు.

మందిరంలో ఆ తల్లి ఇంత దూరానికే కళ్ళకు కడుతూంది. మంచుముద్ద మలచి చేసినట్లుంది. స్ఫటికమేమో – అయితే, ఆ తళుకెక్కడిది?

రాజమ్మ మీరా కీర్తన పాడుతూంది; బ్రహ్మానందంగా పాడుతూంది. శాంతయ్య చిటికెలూ, కంజీరా వాయిస్తున్నాడు. ముంజేతుల మువ్వలు, మోచేతుల చిరుతలు కాలి బొటనవ్రేళ్ళకు తాళాలు –

అమ్మవారి సన్నిధిలో పసుపువన్నె, పారాణివన్నె, రెండు త్రాచులూ, పడగలు విప్పి నిశ్చలంగా ఉన్నాయి. కుంకుమా, పసుపూ అంటే వీరేనా, అన్నట్టు రంగడివంక

జూశాడు. రంగడు తల ఊచింది.

శాంతయ్యగారూ, రాజమ్మా వీరిని చూశారు. అన్నప్ప చేతులు జోడించి అలాగే నిలుచుండిపోయినాడు.

పాట అయిపోయింది. శాంతయ్యగారు చిటికె పక్కనుంచి తాళాలు, చిరుతలూ, మువ్వలూ విప్పివేసి, చేతులు జోడించి ఓంకారం పట్టారు. కుంకుమా, పసుపూ వారి ముంజేతులకు పెనవేసుకుని, పడగలు జోడించినవి. అన్నప్పకు ఒళ్ళు తెలియలేదు. మళ్ళీ తెరిపిని పడేసరికి వారు అక్కడ కనిపించలేదు. అటు ఎటో పోతున్నారు. అవతల ఉన్నదే అశోకవనం. అక్కడ కొంచెంసేపు తిరుగుతారు. నాగులను అక్కడ విడిచివేస్తారు. అక్కడ నుంచి ఎటు వెళతారో తెలియదు. మళ్ళీ సంజెపడకముందు తిరిగి వస్తారు అందరూ కలసి. యిలా యీ వైనం అంతా రంగడు చెప్పుకుపోతున్నది. అన్నప్ప ఊకొట్టనన్నాలేదు. అలా చెవులప్పగించి ఊరుకున్నాడు.

'యీ వేళ్ళకు శేషు యిక్కడికి రాడా?' అన్నాడు.

'ఎక్కడకు పోతున్నా ముందు యిక్కడకు రావలసిందే! నీవు వచ్చేందుకు ఓ క్షణం ముందే అటుకేసి వెళ్ళాడు.'

'తేనె కాస్తున్నాం అని ఆచార్లుగారికి కబురు చేయగా వారు వస్తారు. వచ్చి వడకట్టిన దాంట్లో ఏదో చూర్ణం కలుపుతారు. ఎంతోకాదు. బానకో చిటికెడు. ఓ వారం రోజులపాటు అలా వాసినకట్టి అశోకవనంలో అట్టే పెడతారు. ఆ తరువాత గ్రామంలో అందరూ పంచుకుని, వాడుకుంటారు. ప్రొద్దున్నే తేనే, ముప్పొద్దులూ పాలూ! పసిపిల్ల బాలాదీ పుచ్చుకోవలసిందే! యిది ఆచార్లగారి ఆజ్ఞ! ఊరంతా ఉమ్మడే – పదిమందీ కలసి పండించుకుంటారు. లోటులేకుండా, భోంచేస్తారు. ఎలా? ఏకభాండాశనమే కాని, యింటికో పొయ్యి అంటూ లేదు. ఒకటే వంట, ఒకటే పంక్తి! మన రామశేషుకి యిలాటి వెర్రి మొర్రి ఆలోచనలే అనుక్షణం పుట్టుకొస్తూంటాయి. మనుషులందరూ, ఒక మాట మీద ఉండటం, మాబాగే కాని, ఒక కాడి క్రింద కట్టేస్తే ఎలా? జిహ్వాకోరుచీ! కలుపుగోలుతనం, సహజంగా అందరికీ ఉండే సుగుణమే నాయెను. అందుకో కట్టడీ ఖరారూ ఎందుకూ? వీడు తలపెట్టింది మంచిదే, వాడి ఉద్దేశమూ మంచిదే, కాని ఆ పద్ధతే నాకు అంతగా సొసాయించడంలేదు. వీడికి తోడు, యీ ఆచార్లగారొకరు. కావ డానికి ధన్వంతరే కాని, చెట్టుకూ పుట్టకూ కూడా పాలు తేనె పడతానంటాడు. అదోరకం వైద్యం, ఏది ఏమైతే మట్టుకు, యిక్కడ ఉన్న పదిమందీ సుఖంగా ఉంటున్నారు...' అంటూంది రాజమ్మ.

'దివ్యచకోరంగా ఉంది. కలికాలంలో యింతమంది మహానుభావులు ఒక్క చోట ఒనగూడటం అనేది చాలా అపూర్వమైన విషయం. యీ శాంతయ్యగారు, యిలాటి మహానుభావుడొకడు, యిక్కడ ఉన్న సంగతి యింకా దేశం మీద ప్రాకినట్టు లేదే!'

'వీలు లేదు! యిక్కడి విషయం యిక్కడే, బయటికి పొక్కరాదు.'

'అదెలా? పోనీ, యిక్కడి వాళ్ళంటే ఒక్కమాట మీదే ఉంటారనుకో; పొరు గూరివారైనా, త్రోవను పోతూ, యిటు వస్తే?'–

'వచ్చినా, వాళ్ళూ అంతే! చూసి సంతోషించి వెళ్ళిపోతారే కాని, టముకు కియ్యరు: యింతవరకూ అలా జరగలేదు. ముందైనా అంతేనేమో. లలితా త్రిశతి, తలకట్టుగా ఏం

జెప్పాడో జ్ఞాపకం లేదుట్రా అన్నప్పా? గుహ్యం గుహ్యతమమ్ అని ఓ చెంపనుంచి చెపుతూనే, తన తల్లి చీకటితప్పంత బహుగోప్యంగా దీన్ని ఉంచాలని, అలాంటి నీచోపమ అంతటి మహానుభావుడి నోటివెంట వచ్చిందీ అంటే, దాని పరమార్థం ఏమిటి?– కొన్ని సంగతులు, మంచికానీ, చెడ్డకానీ, చెప్పేందుకు, నోరు రాదు : అది, మహిమ కావచ్చు, మనుషుల మంచితనమే కావచ్చు...'

'కావచ్చు...'

'ఏమండోవ్ అన్నప్పగారూ!'... అంటూ గజగమనంతో వస్తున్నాడు, ఆచార్లగారు: వెంట రామశేషూ, మరో యిద్దరు మనుషులూ ఉన్నారు.

మనిషి కడుపు నిండేట్టున్నాడు. నవ్వితే, ఉరుం ఉరిమినట్లే – మాట మల్లెమొగ్గల ముసురు.

దగ్గిరసా వచ్చాడోలేదో, రెండు జబ్బలూ పట్టుకుని ఒక్క ఊపువూపి, వెన్ను క్రింద ఒక్కటి చరచాడు : కలుక్ మని మెటిక విరిగింది! అన్నప్ప పైకి మటుకు అబ్బా అనలేదు కాని, అంత మొగం చేసికున్నాడు.

'పాయెపోఁ – అది మళ్ళీ కలికానికి కనిపించదులే. ఎన్నేళ్ళ నుంచి పెంచావో పాపం! యిక నుంచి పూటకో రెండుముద్దలు ఎక్కువ తింటూ పది పొద్దులపాటు పుడిసెడు తేనె పుచ్చుకుంటూ వుండు.'

రంగడు పకపకలాడింది. 'అంతటి అన్నప్పగారూ ఆచార్లగారికి లోకువే' అనే సింది.

'కావల్సిన యోగం ఉంది! పదేళ్ళ క్రిందట ఓసారి శ్రీరామనవమి సందర్భంలో శ్రీమద్రామాయణం ఏకబిగివిని పారాయణ జేస్తున్నాము, పదకొండుమందిమి : ఆ తరుణంలోనే అందరికీ నడుములు పట్టేసినయ్. అందరూ ఓ పది రోజులపాటు పడకవేశారు. నేను తోసుకు తిరిగాను, అప్పటినుంచీ, – యిది ఎప్పుడో ఒక్కప్పుడు ఉన్నాననిపిస్తూనే ఉంటుంది. నన్నిలా చిన్నచూపు చూస్తున్నావ్‌గా అని, నిష్ఠురంగా ఒక్కపోటు పొడుస్తూనే ఉంటుంది. అయ్యా ఆచార్లగారూ, నేటి నుంచీ నాకు ఆ ముచ్చట కాస్త లేకుండా చేశారు! అనుక్షణం, నేనున్నానంటూ వేపుకుతినే కోపధారి యిల్లాలు, మూటాముల్లే కట్టుకుని, శాశ్వతంగా కాశీ వెళ్ళిపోతే, యిల్లు ఆనందంగా బావురుమంటున్నట్టుంది – నా స్థితి : యీ అంకుశెం అంటూ ఒకటి ఉండబట్టి, అప్పుడప్పుడు కాస్త తిరిగి చూసుకోవలసిన పని ఉండేది. యిక ఒంటి సంగతి మరచిపోవచ్చు' – అని మనవి చేస్తున్నాడన్నప్ప–

'మరచిపోయినట్టు నటించడం అలవాటైపోయింది కాని, మీరంటే, నేనంటే, అంటే మనకారు వాళ్ళం, ఎల్లవేళలా, ఒళ్ళు దగ్గిరబెట్టుకునే ఉంటాం కాదుటండీ! అది పెద్దలిచ్చిన ఆస్తి. పెంపుచేసుకోవలసిందే!' అంటున్నారు ఆచార్లగారు–

'అది అక్షరాలా పాటిస్తూనే ఉన్నాడు లెండి! చూసీ చూడటంతోనే, యిట్టె పట్టేశారే, ఏమిటా కిటుకు చెప్పరూ–' అని అడిగింది రాజమ్మ–

'కిటుకూ లేదు, చిటకాలేదు, యీ పెద్దమనిషి, సాఫీగా కాకుండా, కొంచెం త్రిభంగిలో నిలుచున్నాడు. తెలిసిపోలా?' – కూర్చునేవాడికి నడుమూ, నిలుచునేవాడికి మోకాలూ పట్టుకుపోవడం అనేది, అతి మామూలు. యిందుకు గ్రంథావలోకనం

అవసరంలేదు. అన్నప్పగారూ, యింతకు పూర్వం, నేను ఎంతోమంది పండితుల్ని వెన్నుచరచి ఉండటంతో, ఆ అలవాటు కొద్దీ, – మీ మీదా చెయి చేసుకున్నా...'

'చేత్తో అయితేనేం, నోటితో అయితేనేం – చేసింది వైద్యం'. రాజమ్మ తేల్చి చెప్పింది.

'అది ఖాయం, జోలల్లుపాడితే బాలలకు నిద్రా అన్నట్టే, పిల్లవాడికి ఓ పిసరు అజీర్ణం చేసి, పక్కలు వెచ్చగా వుండి, కారణం లేకుండా గునుస్తున్నాడనుకో, తల్లి గారాబం చేయకుండా నోరు చేసుకుంటే ప్రకృతి సుమపాళానికొస్తుంది : యిలాటి భేషజాలు నిత్య జీవితంలో లక్షోపలక్షలు. కుప్పెకట్టుకన్న వాటిమీదే నాకు గురి. ఏమండీ అన్నప్పగారూ! మీ ఊరువచ్చి, మీరు పురాణం చెపితే వినాలని బహుకాలం నుంచీ వుంది, ఎప్పుడు రమ్మంటారు?' అని భుజం పట్టుకుని అడిగాడు ఆచార్లగారు.

'మీ చిత్తం వచ్చినప్పుడు : మీరు వస్తాననడమే మహద్భాగ్యం : కాని పురాణం కోసరమే అయితే, – అంతదూరమెందుకూ, – సన్నిధిలోనే ఉంటినిగా, – కాని, ఆచార్లవారూ, – మీరన్నట్లు, – నేను ఒళ్ళు దగ్గిర పెట్టుకున్న వాడిని కావడంతో, – మీ ఎదుట కూర్చుండి పురాణం జెప్పే సాహసం జేయలేనని – సంకోచం! – మీ సెలవైతే పదిరోజులపాటు, – మీ వెంట వెంట తిరుగుతూ, – నాలుగు మంచి ముక్కలు చెవిని వేసుకుంటాను!–' అని విన్నవించుకున్నాడు అన్నప్ప.

ఆచార్లగారు ఫెళ్ళున నవ్వుతూ, – 'నీదీ, – మన మతమే!' – అనేసి, – 'అబ్బాయి శేషూ, – నేను, – యిక పేటకు వెళుతాను – లెక్క ప్రకారం, – యీ పూట యిక్కడ ఉండవలసిందే – కాని, – అక్కడ, – ఓ చవకబారు పని ఉండిపోయింది : మన పొరుగువాళ్ళ పిల్ల, – పదేళ్ళది – దానికి ఉన్నట్టుండి అంగటి తాళం పడ్డది : దవడ ఆడదు– తెరచిన నోరు అలాగే ఉండిపోయింది. ఉపశాంతి చేశామనుకో, – అంటే మరేం లేదు. వెన్నుపాము కింద తేనె రాచి చేతులు వెచ్చచేసుకుని, ఒక్క క్షణం పైపై మర్దన చేయడం, మరోక్షణం ఆగి కనుకొలుకుల్లో ఒక్క బొట్టు తేనె వేయడం – అంతతో సళ్ళిస్తుంది. అలాగే యిచ్చింది. కాని, ఒక్కొక్కప్పుడు పది ఘడియలు ఆగి, మళ్ళీ కనబడవచ్చు – అది కేవలం బెదురు వల్లనే అనుకో! నాలుగు మాట్లు యింత తేనె నాలిక్కు రాస్తే ఫరవాలేదు – కాని, దానికి తేనె అంటే పడదు : అది మూతి బిగించి మారాం జేస్తే, ఆ పెద్దవాళ్ళు ప్రాలుమాలితే, అందరూ గాభరాపడచ్చు! నేను గట్టిగా చెప్పే వచ్చాననుకో, అంతగా అవసరమే వస్తే, జటకా వేసికు రమ్మన్నాననుకో; అయినా, నేనుంటే వాళ్ళకు ధైర్యం! అయినా, ఏ కబురూ వచ్చి చెప్పమన్నాననుకో, కాని, నా లెక్క ప్రకారం మరేం తవాయితీ రాకూడదు, కాని– ...

'అయ్యా శేషయ్యగారూ!' – అంటూ ఓ కుర్రాడు పరుగున వచ్చాడు; 'పొట్టి శేషయ్య కూతుర్ని తీసుకొచ్చాడు! మంచం డోలీ కట్టుకొచ్చాడు–; మంచానికి అంటుకుపోయి ఉంది: వాళ్ళమ్మ గొల్లుమంటూంది. మీకు కబురు చెప్పమని యిటురికించారు–...'

'వస్తున్నా పద!' అన్నాడు రామశేషు:

అందరూ అటు నడుస్తున్నారు–

'జబ్బేమిటి?' – అని అడిగారు ఆచార్లగారు. రాజమ్మ అందుకుంది –'దాని అత్తగారికి పుట్టిన దొబ్బుదాయి. కావడానికి మేనత్త! – అప్పుడు కావాలనే జేసికుంది –

ఆ మర్నాటి నుంచీ రాచి రంపాన పెడుతూంది. అదో కొరతకాదు, కోరంటికం కాదు. దానికితోడు మందోమాకో పెట్టిందని, అందరి అనుమానం : పిల్ల మానావతి. ఒక్కనాడు బయటపడలేదు! చివరకు ఊళ్ళోవాళ్ళే కబురు చేయగా, వీడు వెళ్ళి, యీ స్థితిలో తెచ్చాడన్న మాట!'

'ప్చ్ – దానికొచ్చిన భయం లేదు! ఒరే అబ్బాయ్ – ఆ డోలి, యిక్కడకు పట్టించమను – వెంట వచ్చిన వాళ్ళు, కంట తడిపెట్టకూడదని చెప్పు, పోయిరా – పో. శేషూ, – పది నిమ్మపళ్ళు, పావుశేరు తేనె – రాజమ్మా– దోసెడు దానిమ్మ యిగుళ్ళు, – అన్నప్పగారూ, మీ జబ్బపుష్టి చూపించాలి. ఆ యిగుళ్ళను ఒక్క పట్టుపట్టాలి, పది చుక్కలు, లెక్కకు పది చుక్కలు రసం చాలు. యివన్నీ కలిపి రంగరించడం, మీ వంతు. వారం రోజులు ముప్పొద్దులూ, పుచ్చుకుంటుంది, కాసిని పాలు పుచ్చుకుంటుంది! తరువాత మామూలుగా భోంజేస్తుంది. యిందులో పెద్ద భేషజం లేదు. చూశారూ, యీ మందులూ మ్రాకులూ పెట్టడం అనేది, మనకు ఆదికాలం నుంచీ వస్తూన్న ఆనవాయతే. సత్యా ద్రౌపదీ సంవాదం, మనం ఎరుగున్నదే కదా! తెలియక కొన్ని అవకతవకలు చేస్తూండటం అనేది మానవసాజం. చూశారూ; యీ మూడు రసాలూ, కలిస్తే – అది ఓంకార తుల్యం. విషానికి విరుగుడు. నరాలకు సత్తువ!...'

యింతలో వలసిన ద్రవ్యాలన్నీ ఒనగూడినవి. అన్నప్ప, ముందు యిగుళ్ళరసం పిండాడు. ఆపై తేనె వేసి బాగా రంగరించాడు. నిమ్మరసం, పైన ఉంచి ముమ్మారు మరో పాత్రలో తిరుగబోశారు. యిది సిద్ధమయే సరికల్లా ఆ పిల్లదాన్ని అక్కడకు జేర్చారు. ఎక్కడ? అమ్మవారికి ఎదురుగుండా! ఆచార్లగారిని, చూసేసరికి ఆ తలిదండ్రులకు దుఃఖం ఆగింది కాదు. రాజమ్మ వాళ్ళవంక చూసి ముక్కున వేలుంచుకుంది. వాళ్ళు దణ్ణాలెట్టుకుంటూ అలాగే నిలుచుండిపోయినారు.

పిల్లది – పాపం, బాగా లోజెడ్డది అనుకున్నాడు అన్నప్ప. ఆచార్లగారు అట్టె పరకాయించి, తనలో నవ్వుకుని, ఒక్కసారి ఒళ్ళు విరుచుకుని, 'ఏమే ఎర్రపిల్లా,. లేచి కూచో!' అని చులాగ్గా అనేశారు.

'అయ్యా, ఓపికేదీ? తూలిపోతుంది, పడిపోతుంది!' అని విలవిల్లాడాడు తండ్రి.

'శేషయ్యా! తూలిపడటం అనేది – నీ వంశంలో లేదు. నీ బిడ్డ గుణవంతురాలు! ఎవ్వరిమీద తూలలేదు. ఇక ముందు తూలదు. అమ్మ సీతమ్మ తల్లీ! కూచో అమ్మ! అదిగో అ తల్లివంక చూడు – రాజమ్మా! రవంత ఆ తేనె నోటికి అందించమ్మ – అలా పక్కనే కూచో. నిన్ను ఆనుకుని ఒక్క అరక్షణం కూచోనీ – ఆఁ – ఇంక నడుం వాల్చమ్మ. అమ్మాయ్! నీకు వంట్లో జబ్బున్నదెవరే? ఏంలేదు! వట్టి బద్ధకం – రోజూ కాసిని గుమ్మపాలుచ్చుకో! మూడు రోజులైనాక, సంజెవేళ కూడా పుచ్చుకో! – అలా మరో నాల్రోజులు : ఆ మర్నాడు నుంచీ పెరుగూ అన్నం సుబ్బరంగా తినేయ్, – రేపీపాటికి గుమ్మటం లాగా, – తయారౌతావ్! – యిక యింటికి వెళ్ళవచ్చునమ్మా : నిద్దరొస్తే కళ్ళు మూసుకు పడుకోరాదూ, – ఏమన్నా పాటలొస్తే పాడుకుంటూ ఉండు : కాస్త రెండుమూడు రోజులు పోతే, – హాయిగా కూర్చుని చింతగింజలాడుకోవచ్చు! మళ్ళీ వారం తిరిగేసరికల్లా, – నేను వస్తాను : నీవు లేడిపిల్లలాగా ఎగురుకుంటూ ఎదురుగుండా రావాలి! – శేషయ్యా! పిల్లను యింటికి తీసుకువెళ్లు :...'

వాళ్ళు వెళ్ళిపోయినారు :

'మందేం వేరే పడనక్కర లేదా?' అంది – రాజమ్మ.

'పడిన మందుకే యిది విరుగుడు : ఆ అత్తగారు, మనం అనుకున్నంతా చేసింది: ఏదో తినిపించింది : యిప్పుడు యిదమిత్థమని చెప్పలేను కాని, నేను అనుకొన్నదే నిజమైతే–ఎల్లుండి, గట్టి జలుబు చేస్తుంది : అలా ఒక్క రోజుండి మర్నాటికల్లా తగ్గిపోతుంది. అలా జరిగితే, అది సీసలు, వెల్లుల్లి రసం, ఆవమొక్కరసం, పాత బెల్లం, మెదిపి పెట్టిందన్నమాట! – వెల్లుల్లిరసం, చిక్కని పట్టుబట్టమీద, మూడు ఆవృత్తులెండబెడితే, రసమంటే పాయ రసం గాదు, మొక్క మొక్కా వ్రేళ్ళతో సహా, రసం బట్టాలి. ఎండి చూర్ణమయితే, అది నాటు పాషాణం : అలాగే ఆవరసం చూర్ణమయితే, అది, లేతబారు గంధకం. పాత బెల్లంలో భాస్వరముంది : యీ మూడూ కలిసి, పిసరంత చొప్పున వంటబడితే, ఆ మనిషి అతి మేధకురాలై మనకు పక్కతాళం వేస్తుంది : అయితే, యీ ప్రక్రియ వాడేటప్పుడు, మనిషి నవ్వుతూ తుళ్ళుతూ ఉండేట్టు చూడాలి : కస్ బుస్ లాడితే, నరాల సత్తువ తగ్గి, మనిషి యిలా అవుతుంది; యిలాంటివి, ఎన్నో ప్రక్రియలున్నాయి. కాని సర్వసాధారణంగా వాడేది, యిదే. యిప్పుడు మనం వాడుతూంటిమే, దానిమ్మ యిగుళ్ళ రసం, అది దేనికన్నా విరుగుడు; మరికొన్నింటితో చేరిస్తే వశ్యౌషధం! వాజీకరణం! యిదీ రాజమ్మా – దీని భోగట్టా! దాని అత్తగారిని రప్పించరా శేషూ – యీ మందిరం ముందు నిజం పలికించి చెంపలేయించు రాజమ్మా! ఆపై అందరూ సుఖంగా ఉంటారు!' అని, పైమీద ఉత్తరీయం, నెత్తికి చుట్టుకున్నారు ఆచార్లగారు!

'అన్నప్పా, అలా చుట్టుకుంటే ఆయనకు వల్లమాలిన కోపం వచ్చిందన్నమాట!' – అని రాస్యం జెప్పింది రాజమ్మ – అది ఆచార్లగారికి వినిపించనే వినిపించింది.

'అవునమ్మా! కోపం వచ్చింది! ఎందుకు రాదూ? యిక్కడ పుట్టి పెరిగిన పిల్ల – మన కళ్ళముందు పిల్ల, దాని బతుకు యిలా కానా? ఒరే శేషూ, ఆ తలకుమాసిన వాడిని రప్పించి యిక్కడే కట్టెయ్; ఊహుఁ వాడొక్కడే? ఆ కుటుంబం యిక మన కళ్ళ ముందుండాల్సిందే! అన్నప్పగారూ, నాకిక సెలవిప్పించండి! మీరు సావకాశంగా దేవతార్చన కానిచ్చుకుని, యివాల్టికి యిక్కడ విశ్రమించి, తెల్లవారి పేటకు వద్దురుగాని, ఉహుఁ – నాకు యింకో ఆలోచన తోస్తూంది. మనవి చేస్తాను మీరు ఔననండి!'

'మీరు, యిక్కడే ఉండిపొండి. రాజమ్మ వచ్చి, అమ్మాయిని తీసుకువస్తుంది. అమ్మవారి సన్నిధిలో ఒకరి మొగం ఒకరు చూసుకుంటారు. అది భావ్యమని తోస్తూంది. మీ సెలవు ఏమిటి?'

'అయ్యా! నన్ను అలా పెద్దను చేస్తూంటే వినడానికి చిన్నతనంగా ఉంది. మీ మాట మాకు ఆజ్ఞ! నేను, మీ శిష్యకోటిలో వాణ్ణిననుకుని ఒరే అంటే ఆనందిస్తాను.'

'ఒరే అన్నప్పా! సరేలేరా!' అంటూ నవ్వుతూ ఆచార్లగారు అన్నప్పను ఓ చరుపు చరిచారు. 'బాబ్బాబు, ఆ ప్రక్రియ మళ్ళీ ప్రయోగించ నవసరం లేదు. బయట పడేందుకు పాత నొప్పులేం లేవు' అంటూ సంబరపడ్డాడు అన్నప్ప. అందరూ తోటదాటి అటు మల్లెతోటకు అడ్డంపడి పెద్ద రావిచెట్టు దగ్గిరకు వచ్చారు. దానికి పక్కనే ఉన్నది ఊరు మొత్తం.

ఒంటెద్దుబండి సిద్ధంగా ఉంది. ఎద్దు మైసూరు ఎద్దు – మాంచి ఉతారుగా

ఉంది. బండీ కూడా చిన్నం చితుకా కాదు – చిన్న రధంలాగా, యీ మనిషి కూచునేందుకు తగినంత విశాలంగా ఉంది. బండీలో అప్పటికప్పుడే రెండు బానలు ఎక్కించారు, తేనె కావచ్చు!–

ఆడా మగా, అంతా ఓ వందమంది పైచిలుకు అక్కడ ఉన్నారు! వాళ్ళల్లో నిత్యమూ పేటకు కూరాగాయా వేసుకుపోయే వాళ్ళు సగం పైచిలుకు! ఆచార్లగారు వచ్చారని అట్టె ఉండిపోయినారేమో అనుకున్నాడు అన్నప్ప. రంగడు యింత సేపటి నుంచీ, ఆయన గమనించకపోయినా, ఆయన వెంటనే వుంది. వాళ్ళ వంక పరకాయించడం కనిపెట్టగానే–

'యీవాళ శుక్రవారం కాదూ, చెట్టు మీద చెయివేయరు; యీ ప్రొద్దుకు అందరికీ ఆటవిడుపు!' అన్నది. ఆహాఁ! అన్నట్టు తల ఊగించాడు అన్నప్ప.

ఆచార్లగారు నలుగురినీ పారజూసి, తల ఊగించారు, అందరూ నవ్వు మొగాలు చేసుకున్నారు. ఒక్కడూ దణ్ణం పెట్టలేదు – అదేమా అనుకున్నాడు, అన్నప్ప.

ఆయన అన్నప్ప దగ్గిరకు వచ్చి, 'ఏంరా, వెళ్ళి రమ్మంటావా?' అన్నారు.

'రమ్మనమనే, అంటున్నాను. మీరు కూడా, –'

'ఒరే, నన్ను మీరంటావేమిరా? ఇక్కడిందరున్నారు చూడు! వీళ్ళు నన్ను ఒక్కనాడనలేదంత మాట. అన్నను తమ్ముడు పట్టుకుని 'మీరు' అన్నాడంటే, ఎప్పుడంటాడు? ఓ చెంపను మునసబు కోరటులో దావా నడుస్తున్నప్పుడు! అందుకోసమనే, రోజూ ఒక్క పర్యాయం తేనె పుచ్చుకుంటే, నోటికి అనవచ్చిన మాటేదో అనకూడని మాటేదో తెలిసి వస్తుంది. అవును గాని, నీవు ఆ రామయ్య తండ్రిమీద ఒంటికాలి మీద లేస్తూంటావట! ఆ తల్లి ఏమనుకుని పోతుందో, అనే ధ్యాస వుండద్దురా! బిడ్డ తండ్రిమీద ఎదురు తిరగడం ఏ తల్లి హర్షిస్తుందిరా?'–

'నాయనా మనం మనుషులం! దేవతల తప్పు లెన్నేందుకే బ్రహ్మ యిచ్చాడింత తెలివి! మన అమ్మ మనకు దేవత! మరో దైవం మనకు లేదు. అక్కరలేదు! ఆ మాట నిజమే! కాని రాఘవుడు మన దైవానికి దైవం కాదుట్రా! అమ్మ అంటే, బిడ్డకు లోకువ కనుక, పిలిచినప్పుడల్లా పలుకుతుంది. మనకు తల్లి దగ్గర అంత గారాబం లేదనుకో, అయితే మటుకు మనం అంటే, మన మనం 'అమ్మా' అని, ధ్వనించినప్పుడల్లా 'నాన్నా!' అని ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. ఆ మాట కాదంటావా? ఆ తల్లిని నమ్మినవాడికి లోచూపు లేదంటావా? లోపించిందంటావా? జయ్ రఘునాయక! జయ్ జానకీరమణ! ఒరే అన్నప్పా! యీ నటన కూడా ఒక లీలా వినోదమే! శ్రీరామ నామం హృదయంలో పదిలంగా దాచిపెట్టుకుని పైకి యిదో నాటకం ఆడుతున్నావూ? అంతేకాదూ?...' ఆచార్లగారు యిలా లాలన చేస్తూండగా, అన్నప్ప కనులనీరు నిండినది: అమితానందాన, – మనిషి గజగజలాడి పోయినాడు. తెప్పరిలి, నవ్వుతూ అంతలో అంతకంతగా పొంగి పోయినాడు. 'ఔనన్నా, పిల్లవాడు తాయెల్లందాచుకున్నట్టూ దాచుకున్నాను, నేటికి నా బండారం బట్టబయలు చేశావ్! జయ సాకేతనిలయ!' – అంటూ చిందులు తొక్కుతున్నాడు అన్నప్ప. 'రామహో సీతా రామహోఁ' – అంటూ రాజమ్మ గానాని కందుకున్నది – అందరూ ఒక్క క్షణం ఆ తన్మయత్వంతో ఉండి, –మన ధోరణికి వచ్చారు.

ఆచార్లవారు, 'అమ్మా సీతమ్మా!' అని గర్జించి బండీలోకి ఎక్కి కూర్చున్నాడు. బండి పరుగందుకున్నది. బండి కనుమలుపు తిరిగేదాకా, ఎవరూ కదలలేదు. ఆపై

ఎవరి దోవను వారు తప్పుకున్నారు! 'అలాబోయి, పాడీపంటా జూసొద్దాం' అన్నది రంగడు. పంటతోబాటు, మీ యింటాయిన్ని కూడా, చూడాలి!' అన్నాడు అన్నప్ప. రంగడు నవ్వుతూ, 'మహా చూడాల్సిన మనిషేం కాదు. పిట్టల్లే ఉంటాడు!'

'నీవు పిచికంటిదానవైతివి! నీ కంటికి ఆ పిట్టే భీముడల్లే కనిపించేసరికి, ఏరికోరి చెట్టాపట్టాలేసుకున్నావ్, ఔనా?'

రాజమ్మా రామశేషూ, నవ్వుకుంటూ, 'యతికి ప్రతి దొరికింది! మనమిక పోవచ్చు' అనుకుంటూ ఇంటిమొగం పట్టారు.'రంగడూ! మాటల్లోపడి తిండి సంగతి మరచిపోకండేవ్' – అని రాజమ్మగారు ఓరగా చూసి ఒక కేక పెట్టింది.

'మరచిపోవడం కలలో వార్త – ఒక్క అరసోలెడు ఎక్కువ వార్చు, యీపూట మంచి ఆకలి మీదున్నాను' అని అన్నప్ప – బదులు కేకపెట్టాడు.

'ఆచార్లగారి ప్రక్రియ వాడరా తండ్రీ! రవంత మందగించుతుందేమో?' అటు నుంచి ఆ కేక!

'ఆ మందుపడితే మరింత కింత ప్రజ్వలిస్తుంది. అందుకే ఓ పిడచ ఎక్కువ వండమంట!' యిటు నుంచి కేక. రాజమ్మ ఆగకుండా నడచిపోతూనే ఉండటంతో యిక అటు నుంచి కేకవేసినా వినిపించదు. వీరూ నడుస్తూనే ఉన్నారు! అన్నప్ప, ఏదో ఆలోచనలో పడ్డాడు, అందరికీ లేని ఆకలి, తనకు సంక్రమించడమేమిటి? తనకే కాకుండా తన చిన్నవాడిలోనూ, యితోధికంగా వర్థిల్లడమేమిటి? వెనుకటి తరంలో, ఏ ఆపన్నుడో అన్నానికి మొగం వాచిపోయి, అందుకుగాను, జన్మంతా తపస్సు ధారపోయగా, దాని ఫలితం తన హయాములో కనిపించిందా? యీ సుకృతం ఎన్ని తరాలదాకా, క్షీణించకుండా, తన వంశాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది? లేక వృకోదరుడి హయాంలో లాగా తనకూ అలాటి విశిష్టమైన జఠరాగ్ని, యీ బొమ్మను మూసబోసేప్పుడే ఆ బ్రహ్మదేవుడు ఏర్పాటు చేశాడా? తన తిండిపుష్టి, ఎదుటివారికి ఎబ్బెట్టుగా ఉండదా? ఎన్నటికన్నా ఎవరి దృష్టి దోషమన్నా తగిలి, అది ఓ వాసి సన్నగిల్లడమంటూ ఉంటుందా? అలా జరిగే పక్షంలో మామూలు సత్తువ ఉంటుందా? దామాయిషిని లోపిస్తుందా? అలాటి లోపమేదన్నా, జరుగడమంటూ సంభవిస్తే, మళ్ళీ బండీ దారిని పడటానికి, తేనె తప్ప శరణ్యం లేదా?– ఎటు తిరిగీ మనకీ, ఆచార్లగారి భేషజం తప్పేట్టులేదే?' యిలా అనుకుంటూండటంతో, తెలియకుండానే, నవ్వు వచ్చింది. అలా నవ్వుతూనే ఉండగా, రంగడు, ఆ నవ్వే మనిషిని చూసి నవ్వడంతో, నిలువదొక్కుకుని, రంగడి వంక చూసి మూతి బిగించాడు; 'నన్ను చూసి నవ్వుతున్నావుటే భడివే!' అన్నాడు. 'మీరు నవ్వుతూంటే, మీ నవ్వు నాకూ పట్టుకుంది కామోలు! నాకు తెలియనే తెలియదే, యింతసేపూ నవ్వానన్న మాట!' అని పసిపిల్ల మొగం చేసుకున్నది – 'ఓసి చిలకా! ఏం నేవళంగా ఉన్నావే! – అలనాటి పదార్వేల పైచిలుకూ, నీ చిరునవ్వు ముందు దిగదుడుపూ! నిన్ను చేపట్టినటువంటి ఆ చిన్నవాడెవడో, వాడిది శ్రీకృష్ణ వైభవమే! మీ కాపురం రాధా మాధవలీలే!' అన్నప్ప యిలా ముద్దు చేస్తూంటే, రంగడు, మాటకో తీరున బిడియపడి, చిగురుకు, ఒక్క కులుకు కళ్ళతో కులికి, అంతలోనే, చేయెటో విసిరి, 'అదుగో, మా శ్రీకృష్ణుడు!' అంది. మనిషి దూరాన ఉన్నాడేమో యిక్కడికి రూపురేఖలు చూపు కానడం లేదు. అయితేనేం, ఆ నడకలో నిబ్బరం, ఆ వాలకంలో నిండుతనం, చూచాయగా, తెలిసిపోతూనే ఉంది.

'పేరేమిటో?'

చెప్పేందుకు సిగ్గుపడ్డది–

'ఓ యబ్బలాల! యిప్పుడు చెప్పకపోయినా, రేపు నూతులో చేద వేసేనాడూ, తప్పించుకుంటావా? నేను ధోవతి కట్టినా, పెద్ద ముత్తయిదు వంటివాణ్ణే, చెప్పవే!'

'అంత వినసొంపుగా ఉండదు.'

'సొంపుగా ఉన్నా యింపుగా ఉన్నా, నేనేం కొరుక్కు తింటానా? మనిషి గురుతుకో మాటంటూ ఉండాలి కద? లేకపోతే, ఎదుట పడ్డవాణ్ణి – ఏం, మా రంగడి మొగడా అని పలుకరించడం, ఏమంత బాగుంటుంది?'

రంగడు, తనలో తాను నవ్వుకుంటూ,–

'చింతాలంటారు!' అన్నది.

'ఏం దానికేం, నిక్షేపంలాంటి పేరు!'–

'మనిషీ నిక్షేపరాయడే!'

'అంటే?'

'పొద్దుననగా, చీకటుండగానే పోతాడు : బువ్వ చేను మీదే తింటాడు. నిద్దురకు తూలుకుంటూ జాంపొద్దుపోయినాక యింటికి వస్తాడు. మున్నూట అరవై రోజులూ అంతే.'

'అంతేనన్న మాట: ఓ ముద్దూముచ్చటా'అంటూ లేకుండానే, యిన్నాళ్ళ నుంచీ, కాపురం జేస్తున్నాడన్నమాట! – రానీ, గట్టిగా బుద్ధి చెపుదాం!–'

'బుద్ధి కుదురైందే'

'కాని, ఏం లాభం, – అస్తమానం, చేతులు కట్టుకు నీ ఎదుట నుంచోడు! – నీ కొంగట్టుకు తిరగడు! – అంతేనా?'

'అంతమాట నేనంటానా? – పని వున్నంతసేపూ, – తిరగొద్దన్నానా? నేనేం కొంగున కట్టేసుకున్నానా? చేయి తీరికె వున్నప్పుడైనా, యింటికేసి తొంగిచూస్తే, ఏం పోయిందో? శేషన్నయ్యంటే, – మా వొదినమ్మ యీ కడ లేదుగనుక, చెట్టును జూసు కుంటూనో, చేమను జూసుకుంటూనో లక్ష పనులెట్టుకుని తిరుగుతూ ఉంటాడు : యింక రేపో మాపో, మా దొరసానమ్మ వస్తే, మా అన్న క్షణం గడప కదుల్తాడా! – తానూ జూస్తాడుగా : పేటలో, వాళ్ళ ముచ్చట నేను కళ్ళజూసిన దాన్నేగా. మంచివాణ్ణిగా చూసి, మా అన్న నాకీ మనువు తెచ్చాడు : నాకేం లోపం జరగలా. కాని, అన్నప్పగారూ, – మనుషులమై నాక, ఏవో చిన్న చిన్న కోరికలుంటాయ్. మాకు మేడలొద్దు, మిద్దెలొద్దు, నగలొద్దు నాణేలొద్దు. పిల్లపిల్లతరానా మా అన్న చలవను, యిలాగే, యిక్కడే సుఖంగా బతికితే చాలు. అలాగే యీ గడ్డమీదున్న వాళ్ళందరూ బతుకుతారు : చేతిలో ఎంతపనున్నా, చీటికీ మాటికీ ఒకసారి యింట తొంగిచూసి, ఓ పలుకరింపు పలుకరించి, ఏదో ఓ నవ్వు మాట అనేసి, ఓ పరాశికమాడి పోతూంటే, అది ముచ్చట కాదండీ! నాకు ఎంత సత్తువుంటుంది, ఏ పని చేసినా ఎంత సంబరముంటుంది! మా మనిషికి యిలాటి మన సుంటేనా అండీ!... యికనూ వన్నెచిన్నెలు చెప్పనా అండీ! యీ యీడప్పుడే కదా, యిలా అనిపించినా? యింకో పదేళ్ళో పాతికేళ్ళో పైబడేసరికి ముసలితనం రానేవస్తుంది. అప్పుడు ద్వారకలో శ్రీకృష్ణుడుంటే రేపల్లెలో రాధ ఉండచ్చు...'

అన్నప్ప ఆ మాటలకు తెల్లబోయినాడు. 'రంగడూ, నీకు యిన్ని ఊహ

లున్నాయనుకోలేదే!' అన్నాడు ఏదో మంత్రం జపించినట్లు,-

'రంగమ్మగారి పుణ్యమా అని ఆవిడ వచ్చింది. నన్నో మనిషిని చేసింది. అంతకు ముందేముంది : ముప్పొద్దులూ మీగడేసుకు యింత మెక్కడం, పిల్లి మీసాల్ దువ్వడమూ – నాకు పెళ్ళీ పేరంటమైనాక గూడా'-

అన్నప్ప మాటకు అందుకున్నాడు.'అమ్మాయ్ ఒకరినొకరం చూసుకున్న వేళావిశేషం – నీ మనసులో మాట దాచకుండా చెప్పావ్. నేనూ దాపరికం లేకుండా అడుగుతున్నాను – ఏమనుకోవని నాకు తెలుసు-'

'మీరడిగేదేమో తెలిసిపోయిందిలెండి! యిన్ని కబుర్లు చెప్పేది, మారు మనువు చేసుకుందేమా అని కాదూ? పెద్దవాళ్ళందరూ, కలిసి గారడి చేశారు లెండి! మేం బిజాపూర్‌లో ఉండంగా ఆ గత్తరొచ్చింది. మా నాయన అప్పటికప్పుడు పైపై మాపు చేశాడు, ఆ మనిషిని ఎటో తోలేశాడు ! నేను పేటకు వచ్చేశాను. వచ్చానే కాని, మనసు మనసులో ఉంటుందా, చేసినవన్నీ కోతి చేష్టలేనేమో? చివరకి శేషన్నయ్య ధర్మమా అంటూ మళ్ళీ ప్రజల్లో పడ్డాను. నాది, మారు మనువు కాదు. దమయంతీ దేవి రెండో పెళ్ళిలాంటిది.నా మనిషే నావాడైనాడు.'

అహ! అదా కథ! మరి, అప్పుడు వచ్చిన అవాంతరం ఎలాగో మెట్టుకు పరుసుకు పోయిందన్నమాట!'

'అహ! అది కాదు కథ : యీ మనిషి, పుట్టువతో మెతక! అట్టా అని వెర్రిబాగులు కాదు! మాంచి చురుకు. తాను నమ్మితే ప్రాణం యిస్తాడు, ఎదుటివాణ్ణి యిట్టె నమ్ముతాడు. వర్తి జాలిగుండె! మంచికిపోయి నెత్తికి తెచ్చుకున్నాడు. ఎట్టాగంటే, లచ్చుమయ్య అని, సాటి సిపాయి ఉన్నాడు. మాకు ఎక్కడో ఓ వేలిడిచిన చుట్టరికం, మా నాయనే కొలువిప్పించాడు. సెంటు భూమిలేదు. రెక్కలే ఆధారం. వాడి పెళ్ళాం, భూదేవే! యిద్దరు పిల్లలు. జీతం రాళ్ళు చాలవు. స్వతహా, కత్తంటివాడే కాని దరిద్రంలో దరిద్రపు బుద్ధిపుట్టింది – సర్కారు దస్తుకంలో, వెనుకాముందు చూడకుండా, అందిన మట్టుకు కతికేశాడు, కాని, నేరుపుగా గుక్కతిప్పుకోవడం చేతకాలే! పీకమీదకు వస్తుందనగా బిత్తరోయి, పీక దీసుకుంటానన్నాడు. యీ మనిషి అడ్డం వెళ్ళాడు. బిడ్డల మీద ఒట్టేశాడు: గుళ్ళోకి తీసికెళ్ళి ప్రమాణం చేయించాడు. నింద తనమీదేసుకున్నాడు. వాడికి పిల్లా పాపా ఉంటే తనకూ కనీసం ఓ కట్టుకున్నదంటూ ఉంది కదా, దాని బతుకేంగాను అని అనుకోలా, – నేను, ఎంత పిల్లనిచ్చుకున్నా పరాయివాణ్ణే, వాడంటే మామకు దూరంగానైనా యింటి వరస చుట్టం. వాడు బయటపడితే మాకు పరువు పోతుంది – అనుకున్నాట్ట, వెర్రాడు. అంతేకాని, మా నాయన పరువు నిలిపేది తనని ఆ ఊహే లేందే! ఆయన ఎదుటపడి తాను జేసినట్టు ఒప్పేసుకున్నాడు! ఎందుకట్టా ఒప్పుకున్నావని యిప్పుడడిగితే అంటాడు గందా– వాడు నాకు అన్నలాటోడు; ఒకడికొకడు తోడుగా ఉండాల్సినోళ్ళం. వాడి బుద్ధి డొంకను బడుతూన్నదంటే కనిపెట్టి మళ్ళేయకపోవడం, అది నా తప్పుకాదా? ఆ శిక్ష నాకే అనుకున్నాను.' అలాటి వాడిని ఏమంటాామ్? 'నన్నన్యాయం జేసి పోదామనుకున్నావ్ గాదూ,' – అంటే, 'నిజం చెప్పాలంటే నీ ఊసే నాకు తోచలా! వాడి కోసం వాడి పిల్లలు బెంగెట్టుకు పోతారేమో అనే తప్పు! వాడికి నౌకరీ ఊడి, బేడీలడితే, ఒక్క ఆడ కూతురెలా బతుకుతుంది? అయ్య కోసం బిడ్డలు మారాం జేస్తే – ఎలా

సముదాయిస్తుంది? తానో మనిషల్లే నలుగురి ముందూ తలెత్తుకుని ఎలా బతుకుతుంది? నాకు అదే గుంజాటన. అప్పుడు నీవు కనబడలా, మీ నాయనా అగుపించలా – అది మంచను, చెడ్డను!' అని జవాబు చెపుతాడు, అలాటివాడికి చెయ్యెత్తి మొక్కద్దూ!'

'నాకు ముందేం తెలియదుగా, నాతో ఒక్కముక్కన్నా చెప్పిపోయినాడా? మా నాయన ఎదుట పడి ఆ బొంకు బొంకేసరికి, యీ మనిషిని, దేశం పట్టిపొమ్మన్నాడు. తన పరువు చూసుకున్నాడే కాని, నా బతుకేమౌతుందో చూడలా – పొమ్మంటే నేనూ పోయేదాన్ని గంద? అంత నాటకం ఆడాడు! నన్ను యింత కోత పెట్టాడు. నాడూ నేడూ నవ్వుతూ నా కళ్ళెదుటున్న మనిషి, దుమ్ము ధూళైపోయినాడని చెప్పేందుకు నోరెలాచ్చిందో?'

'కాని, యిదంతా మా నాయన పన్నాగమని, నా మనిషి భూమ్మీదే ఉన్నాడనీ, అప్పుడు నాకేం తెలుసు? కంటికీ మంటికీ ధారగా శోకాలెట్టాను. మా అమ్మా నాయనా ఎందుకో, నిబ్బరమేసి ఉన్నారు. నీ బతుకంతా వెయ్యేళ్ళ పంట ముందుంది. యిదో కలొచ్చిందని మరచిపోఁ అన్నారు. అదీ కన్నవాళ్ళ సముదాయింపు. నాకు అక్కడ ఉండబుద్ధి పుట్టలా! కోసెడు దూరంలో, భువనేశ్వరి ఆలయం ఉంది. అక్కడకుపోయి పడ్డాను. మూడు పొద్దులు అక్కడే పడున్నాను. ఆ మగతలో ఏదో పొద్దువేళ స్వప్నం అయింది. ఎవరో పెద్ద ముత్తయిదు వచ్చి, నాకు కుంకుమెట్టింది. నేనెక్కడున్నాను? నా యింట్లోనే. బిడ్డ నెత్తుకున్నాను. మా మనిషి చేతుల్లో మరో కూనుంది. అదీ స్వప్నం. ఆ తల్లి సత్తెం లోకానికి తెలుసు. నాకు తెలుసు. ఆ శోకమంతా ఏమైపోయిందో, చెంగున యింటికి వచ్చాను.'

'మొగం తుడుచుకుని, కుంకుమ పెట్టుకున్నాను. 'యిదేం పోయేకాలం?' అనుకుంది మా అమ్మ. 'పోయిన వాళ్ళు వచ్చేకాలం – నా మనిషి ప్రజల్లోనే ఉన్నాడు. అంబ సత్తెం చెప్పింది!' అన్నాను. నేను ఏదో వెఱ్రిని బడ్డాననుకున్నారు మావాళ్ళు. నేను మొరాయించి, మా నాయన్ను నిలవేసి నిక్కచ్చిచేసినా. ఆయనకు ఓ పళానికి చిఱ్రెత్తుకొచ్చి 'వాడు వున్నా, లేనివాడికిందే జమ!' అనేశాడు. నేనా మాట పట్టుకుని, మరింత మొండికేసి, నిజం చెప్పించాను. అప్పటికి తెలిసింది, నాకు ఏం జరిగిందీ! అప్పుడూ నాకు నమ్మకమే – ఆ మనిషి అలాటి నీచానికి పోయేవాడు కాదని, ఎక్కడున్నాడో వెదికించమన్నా – నిజం నీ యెదుటే పలికిస్తాగా అన్నా! మా నాయన మొగ్గలా! నేనిటు పేటకొచ్చేసినా! ఔను, మా కన్నారితో నాకేం పని? యిక్కడి కొచ్చినాక, వెంటనే మా శేషన్నతో చెప్పేందుకు మొగం చెల్లలా! నా గ్రాచారం ఆ యింటికి చుట్టుకుని మా అమ్మడు వదినె కన్నోరి యింటికి వెళ్ళడంతో, నాకు అప్పటికి గ్రాయకం వచ్చి అన్నతో చెప్పుకుని గొల్లుమన్నా! మా అన్న మీ ఊరి అల్లుడన్నంతవరకే కాని ఆయన నైజం మీకేం తెలుసు? తన మీద కొండలు విరిగిపడుతున్నా, అడుగటు వేయడు. దులిపేసుకోగలను అనే ధీమా వుంది. అది మొండితనం కాదు. ఆ మనసుకి అలాటి తండరుస్తే ఉంది; కాని ఎదుటివాళ్ళకి చీమ కుట్టిందంటే చాలు బావురుమంటాడు. అలాటివాడు అందులోనూ నాకింత గడ్డురోజు లొచ్చినాయని వినేసరికి ఆయన తీరు చెప్పనా! ఆ వాలకం జూడగా చూడగా, వెఱ్రెత్తిపోతాడేమోనని హడలిపోయినా. నేను ధైర్యం జెప్పినా. 'నా గీతకు ఏవంకా రాలేదన్నా! యిప్పుడెందుకో యీ అవకరం వచ్చింది కాని, నా బతుకు మళ్ళీ పచ్చగా ఉంటుందిలే! అమ్మ వారు దీవెన యిచ్చింది గదా!

అంటే గాని, హిమ్మత్ రాందే!'

'మా మనిషి, ఏదో కన్నోరితో మాట పట్టింపొచ్చి, చెదరిపోయొచ్చి పటాలంలో కలిశాడు కాని, ఉన్న ఊరిలో, ఉంటానికీ తింటానికీ లోటొచ్చి కాదు; ఆకడ, గంపెడు బలగం. చుట్టపోళ్ళలో యీయనంటే ప్రాణమిచ్చే కుర్రకారుంది : శేషన్నయ్య, వెంటనే, వాళ్ళ ఊరు, మామిడాడ – వెళ్ళాడు : పదిమందిని, దేశం జూసిన వాళ్ళని ఏరి, వాళ్ళకీ రాస్యంజెప్పి, ఉత్తరాదికి వెదకబంపాడు: మనిషి ఆచోకీ కనిపెట్టి, తనకు తార్ కొట్టమన్నాడు. వాళ్ళు వానరసైన్యం లాగా, దేశం మీద పడ్డారు : రెండు మాసాలు అంగుళం మేర విడవకుండా గాలించగా, నా పుణ్యం కొద్దీ, అప్పటికీ దేవుడి అంతుచిక్కింది – కాశీలో, సన్యాసి వాలకంబట్టి తిరుగుతున్నాడు. వెదకబోయిన వాళ్ళు, యీ మనిషి సంగతి చిన్నప్పటి నుంచీ తెలిసినవాళ్ళు; అందుచేత, కంటికాపడగానే, గబాల్న కావిటేసుకోకుండా, వెనక వెనకనే వెంటాడి, మనిషి వాలకం కనిపెడుతూ వచ్చారు; మనిషికి వెర్రెత్తి పోలా, కాని మామూలు మనిషికి మల్లే మెలగడంలా. ఎవరితోనూ ఊసులాడటం, పలుకాడటం లేదు. కోడికూత వేళప్పుడు, గంగలో మునగడం, కోయిలకొచ్చి పూజ్జేసుకోడం, కాయో పండో, ఎవరన్నా యిస్తే తినడం, ఏ సత్రంలోనో పడుండటం, – ఎంత చాలాకీ మీదుండే వాడు! – ఎట్టా బతికేవాడు చివరికిట్టా అయిపోయినాడుగందా, అని సాటోళ్ళకు దుఃఖం ఆగలా. మూడు నాలుగురోజులు తాళి, ఎదుట పడ్డారు; యింక ఆ దాగుడుమూతలాడటం వాళ్ళకి తరంకాలా! – యాత్రకొచ్చినామని, టొకాయించారు. కాని, యీ మనిషి నమ్మలా, తనకోసమే వచ్చారనుకున్నాడు : ససేమిరా, రానన్నాడు. కాని, శేషన్నయ్య యిలా పంపాడనంగానే, యింకమరి, తల విసరకుండా తలొంచుకుని వచ్చేశాడు. యిక్కడికే వచ్చాడు. ఎలా వచ్చాడు. వెర్రి సంతోషం మీద! ఒక్కటే పరుగున! ఎందుకంత సంబరం! మళ్ళీ యిన్నాళ్ళకు ప్రజల్లో పడుతున్నాననా, తన మనిషి బతుకు పచ్చగా ఉంటుందనా? అలాటి ఊహలు ఓ డొక్క మెసులుతున్నా, అలా ఉరుకు మీదొచ్చింది అందుకోసం కాదు!'

'అసలు ఎందుకంటే'–

'ఆ గత్తరొచ్చి పడుతుందనగా, ఆ రోజుల్లో నేను నీళ్ళోసుకున్నాను. కాని, నేను జేసుకున్న పూజ నేలగలిసిపోయింది. కోలుకోంగనే, పోయి అమ్మవారి ముందు పడ్డాను. యింతకుముందు చెప్పుకుపోతూంటినే, చిన్నతనమేసి యీ కమామీషూ దాటేసినా. కాని, తండ్రి దగ్గిరా దైవం దగ్గిరా దాపరికమెందుకూ?'

'ఆఁ – నా మనిషి, అలా రెక్కలు గట్టుకుని, ఎందుకొచ్చాడు? బిడ్డను ముద్దు చేసేందుకు. నా చేతుల్లో కూనను, అట్టె అందుకుని ఎత్తి ఎగరేద్దామని. కాని, నాకప్పుడా గీతలేదు, లేకపాయె.ఆ మనిషి నా కన్నెదరపడేసరికల్లా మొగం చూపించలేక నేల కంటుకుపోయినా, – అంతా ఆకళింపు చేసికున్నాడు, ఏం తొణకలా! పోగా, అప్పుడు ఏమన్నడు?'

'ఎందుకే శోకాలు? గుళ్ళోకెళ్ళాం, దేవుడికి దణ్ణమెట్టాం. పెసాదం పెడుతున్నారు. మనం చేజాపాం. కూసింత వెనకా ముందూ కాని, మనకూ ముట్టకబోతుందా? వరస తిరిగి రావడంతో ఎప్పుడో మనొంతూ వస్తుంది. మరేం అనుకున్నా బ్రమతే – దేశం మయ్యాన ఉంటూన్నా దేవుడి గుళ్ళో ఉన్నట్టూంటే, దిగులు చింతా ఉండదు! మన

బాగోగులన్నీ ఆరే జూసుకుంటారు!'

'ఆ మనిషల్లా అంటూంటే - గుళ్ళో లెంపలేసుకున్నట్టుంది. ఆరతి కళ్ళకద్దుకున్నట్టుంది. ఆ పొద్దేళ మరో పుటక బుట్టాను...'

-యిలా చెప్పుకుపోతూనే ఉంది. యింతలోనే చింతాలు రానే వచ్చాడు; మాటల్లోపడి, వీళ్ళిద్దరూ అతగాడి రాక గమనించలేదు,

-'మరో పుటక పుట్టడంతో ఏదో మాత్యం ఉందట. వారికి మనవుల్జేసు కుంటున్నావా, ఆ కులపోరు పుట్టిందందుకోసమేగా-' అన్నాడు చింతాలు. ఆ అనడంలో, యద్దేవాలేదు; లేకపోగా, అనే తీరులో వినయం ఉంది, ఆ చూపులో, పండిన అమాయకత్వం ఉంది; అయితే వాలకంలో అలా గంగి గోవైనా, వనరులో సింహమే! రంగడు కన్న ఓ ఛాయ తక్కువే కావచ్చు కాని, మొగంలో ఆ కళ! మనిషిలో ఆ ఠీవి! జడలు పెంచక పూర్వం విశ్వామిత్రుడిలాగే ఉండేవాడేమో! వాడిని చూస్తే, ఆ యీడూ జోడూ చూస్తే, ఆ మమకారం, మమతా చూస్తే బహుముచ్చటగా ఉంది! 'దాం, యిలా దగ్గిరకురా,-' అంటూ దగ్గిరకు తీసుకున్నాడు అన్నప్ప.

'యింతకు ముందు నీ కథే వింటున్నాను-రవంత కురదలా ఉంది...'

'అలాగా? చెప్పాల్సినవన్నీ చెప్పి - దెప్పాల్సినవన్నీ దెప్పి, కంటపడగానే మీచేత అచ్చింతలు వేయిస్తుందేమోనని పక్కబెదురు మీదొచ్చాను.'

'అక్షింతలు ఎలాగూ తప్పవనుకో, ఒరేయ్ అబ్బాయ్! పనివేళ యింత దూరం ఎందుకు వచ్చాననుకున్నావ్? యీ సుబ్బరాముడి బావమరిది పెట్టే పంచభక్ష్య పరమాన్నాలూ బావుకునేందుకా? నా వాళ్ళనుకున్న వాళ్ళు నలుగురినీ దేవుడి పేరుచెప్పి దీవించేందుకు కదూ? ఆ భువనేశ్వరీదేవి; ఆ జగన్మాత, వేయిజన్మల భోగభాగ్యాలు యీ ఒక్క జన్మలో అనుభవించి, అనంతంగా పుణ్యం గణించుకుని, అనంతరం అనగా యీ భూమ్మీద కళ్ళు తెరచిన నూరేళ్ళకు ఆ తల్లి శ్రీ చరణ సన్నిధిలో పూజాపుష్పాలై శాశ్వతంగా ఉండిపోయేరని, దీవించరా నాయనా! కాశీక్షేత్రంలో అన్నాళ్ళూ ఉండటం నీ ప్రయోజకత్వమనుకున్నావా? అన్నపూర్ణతల్లి, విశాలాక్షమ్మ కావాలనే నిన్ను కళ్ళ ఎదుట ఉంచుకున్నది. ఎండను పడకుండా కాపాడింది. సిగపూవు వాడకుండా యింటికి చేర్చింది. కీడులో మేలంటే యిదేరా తండ్రీ! యీ రూపేణా కాకపోయినట్టయితే, నీ అంతట నీవు కాశికి పోయేవాడవా? ఒకవేళ వెళ్ళినా అంత దీక్షతో ఆ క్షేత్రాన్ని సేవించుకుని ఉండేవాడవా?'

'అయితే, దేవతా మూర్తులకు మా మీద యింత అనుగ్రహ ముంటూండగా, యిన్ని అగచాట్లెందుకు రావల్సి వచ్చిందీ, అంటావా? అదో లీలయ్యా! అమ్మ నెత్తిమీద మొట్టికాని అప్పచ్చి పెట్టదు. ఆవిడకు అదో ముద్దు! సరేగాని, రంగడూ, మళ్ళీ యింతకు ముందు కథకు అందుకుందామా? యీ చిన్నవాడు ఎట్టకేలకు తిరిగి వచ్చి చిన్నదానితో కలిసి సుఖంగా కాపురం జేస్తూన్నాడు; బాగానే ఉంది. మధ్యలో వచ్చిన లచ్చుమయ్య అని ఒహడున్నాడే, యీ చౌగండానికి ఆదిమూలం - అతగాడి భోగట్టా కూడా తెలియకుండానే కాని, కథకు కడుపు నిండదు. అతగాడేమైనట్లు?'-

-'సుఖంగా ఉన్నట్టు!' అని చింతాలందుకున్నాడు. 'ఎట్టా, అదేం లెక్క?' కుతూహల పడ్డాడు అన్నప్ప.

చింతాలు, మామిడిపూవలు రాల్చినట్టు – 'లెక్క సరైందే! మద్దెన కూసింత వంకరోయింది, కాని అందుకూ వాడి జవాబుదారీ లేదు. వాడు కత్తిలాటోడు. కావాలని, నేను పైనేసుకున్నాను. అల్లందుకు నాకేం, విచారం లేకపోయింది గాని, వాడు దిగులేసి మంచమట్టాడు. యిది రండా గర్భమైపాయె! ఆ తలకు మాసిన బతుకు, వాడు బతకలేకపోయాడు. మా దొరున్నాడు, కప్టెన్ టిండేర్, అని. ఆరి కడ, నిజం చెప్పేశాడు. అప్పుడేమైందీ – ఏమై ఉంటుందంటారు?' ఉప్పు అందిచ్చాడు చింతాలు. అన్నప్ప కూత అందుకున్నాడు–

'మేలే జరిగి ఉండాలి,'–

'యిది, ప్రశ్న చెప్పడం కాదు: నీ, ముఖ కవళికను బట్టి, యిలా ఊహిస్తున్నాను. పని గట్టుకుని, వాడి కోసం యీ నిందె మోశావే, ఆ లక్ష్మన్న మీద, ఈగవాలి ఉన్న పక్షంలో, నీవిలా నిశ్చింతగా ఉండేవాడివా? – నీవన్నట్టు, నిజం చెప్పినందుకు మెచ్చుకుని, మీ దొరవారు, ఆ మచ్చ మాపుచేసి ఉండాలి!'–

చింతాలు మరియాదతో కూడుకున్నటువంటి చిరునవ్వు తెచ్చుకుని, 'మీ లెక్క చెప్పాలంటే, పప్పులో కాలేశారు! వాడు అతి మంచోడు కనుక, హడలిపోయి, అబద్ధం చెప్పేశాడు: అది నేను నమ్మి, దేశాలు పట్టినా. కాని, మా దొర నమ్మలే! నిలవదీసి, నిజం తెలుసుకున్నాడు ; అసలేం జరిగిందంటే, పటాలంలో మా మురాకు దిన వెచ్చానికి, సరిపడే రొక్కం, వారానికోతూరి బట్వాడా చేస్తారు. ఆ దస్తు, లచ్చుమన్న పరంగా ఉంటుంది. అందరికీ కొలువు విడిచినాక, సంజెపూట పంచిపెడతాడు.'

'మద్దినాళ ఖజానా నుంచి సంచులొస్తాయి; షరాబు నాలుగ్గంటలకల్లా పంచేస్తాడు; ఆరు గంటలకి బట్వాడా! లచ్చుమన్న ఆ పైకం పుచ్చుకుని తిన్నగా అమ్మవారి కోవిల కెళ్ళి కళ్ళు మూసుకు కూర్చుని సంజెపొద్దువేళకు మకాం కొస్తాడు, అదీ వాల్తీ.'

'కోయిలకు వెనుకు పేటీని అంతా చిక్కనడివి! ఆ అడివిలో జొరబడి కొంతలెక్కపోతే అంతమేర, మందార పూవులు దొరుకుతాయి. ఆ పూవులు దెచ్చి పూజ్జేయడం లచ్చుమన్నకు అలవాటు. అలాగే పోయినాడు. పోంగా, ఏమైంది? ఎన్నడూలేంది ఎలుగుబంటి మీదికి వచ్చింది. నిబ్బరం ఉన్నాడు గనుక, చెకుముకేసి, వరుగాకులు మంటేసి, దాన్ని బెదరగొట్టాడు. అమ్మవారికని పూలు తేబోతూంటే యీ అంసపాదేమా అని, చివుక్కుమన్నదట. కాని, ఏందోలే అని సరిపెట్టుకుని గుబురుల్లోకి జొరబడ్డాడు. అక్కడ పులి కాపుమీదుంది! అమ్మోరమ్మడివిలో రకరకాల మెకాలున్నాయి. కాని అంతమేరా, వేటా – మాటూ కూడదు. అందులోనూ పులి అంటే ఆ తల్లికి వాహనం! చేయెత్తి దణ్ణం పెట్టి, దారి తప్పుకోబోయినాడు. మెకం గుర్రుమన్నది.'

'అడుగు అటే వేయబోయినాడు, నిలవేసింది.'

'నడుం పట్టాకు, బందూక్కు లగించే బదిసె ఉంది. నారసమల్లే దిగేసుకు పోతుంది. కలేబడి, పుచ్చెకాచుకోవచ్చు! వీడూ, గుండెలు దీసిన బంటే కాని, – అమ్మోరి మెకమాయెను, చేయెత్తడమే?–'

'లచ్చుమన్నకు మరేం పాలుబోక, ముల్లెకట్టిన దస్త్రం దాని ముందుకు విసిరాడు; తొగరు అంచు చూసి, నంజుడనుకుని, లిపటాయించింది. పొదల్లోకి దూకింది. వీడు వెర్రిమీద వెంటబడ్డాడు, అది కానరాందే!'

'వీడు గొల్లుమంటూ అంబా అని గోడెట్టుకుంటూ ఎటో, ఎంత లెక్కో పరుగెత్తాడు! కట్టుకనుపటికి, ఆ తల్లి సత్తైమో అన్నట్లు, ఆ దర్త్రం, అల్లంత దూరాన ఆపించింది.'

'కాని, – మరో మాయొచ్చి పడ్డది.'

'కంటికి ఆనింది కాని, చేతికి అందలా!'

'ఏం అంటారా? –'

'వీడా వెంపుకు పరుగందుకునే సరికి, – పై నుంచి కొమ్మిరిగిపడి దారి కట్టేసింది, అట్టె కమ్మేసింది. కొమ్మ నూగుతూన్న కోతి, యీ మూట ఎగరేసుకుని, చెలో – చెట్టెక్కింది. గుబురులోకి మాయమైంది. అది క్షణానికి ఆమడ లెక్క లగెత్తుతుంది. తరిమి పట్టడం నరుడి తరమా? దాంతో వీడు నీళ్ళు కారిపోయినాడు.

'మరేం, దిక్కూ మొక్కూ...? తన కళ్ళ ఎదుటే యీ విడ్డూరం జరిగినా. బిడ్డడల్లా తల్లడిల్లిపోతున్నా, – ఆ తల్లి పలకలే, – ఆ ఛణాన పలకలేఁ–'

'నిజం చెపితె నమ్మేట్టుందా? –'

చెప్పినా, – నమ్మకపోవడం మాట అటుండగా, – ఏదో అవసరానికి అడ్డం వేసుకుని, అది పరుసుకుపోవాలని యిదో కథ అల్లాడు. యింతకాలంగా మంచిగా బ్రతుకుతూండటమనేది కూడా ఓ ఎత్తే – ఎప్పుడో యిలా కతికేందుకని ముందునుంచే జాగ్రత్తపడుతూ వచ్చాడు. అని అనుకుంటే, నిందెపడేరాత ఎలాగూ ఉంది; మోస్తే పోలా? యింకా మునిగేదేముంది; అని ఓ దనాసరి ఆలోచన చేసి, నాతోనే బొంకాడు. వాడి మాటంటే నాకు మా చెడ్డ గురి! వాడలాటివాడు కాడని, మనసులో ఓ మూల పీకుతూవున్నా, నమ్మేశాను. అది నా మీదకి తోసుకున్నాను. వాడు చెప్పింది నేన్నమ్మలేకపోయినా, నేనన్నది, మా మామ నమ్మాడు. మస్తరిలోంచి పేరు కొట్టేశాడు.

'నేనేం జెప్పాను మా మామగారితో–'

'లచ్చుమన్న అమ్మోరి కోవిలకిబోతూ, నమ్మకస్తుణ్ణి కదా, అని ముల్లె నాకాడ ఉంచి వెళ్ళాడు. అంత రొక్కం ఒక్కసారి సేతిలో పడంగానే, చెయ్యి రెపరెపమంది; పెట్టెబడుంది గదా అని, వెళ్ళి డావుకొట్టుకొద్దాం అని పోయినాను. వాళ్ళు పచ్చెపోళ్ళనీ, నేంజేసేది బుద్ధి తక్కువ పని అనీ తెలుసు – కాని, కళ్ళుపొరలేసినాయి – వాళ్ళు మూడు ఆటల్లో దులిపేశారు.'

'నే జెప్పింది వినుకోంగనే మామ అగ్గిభరటా అయినాడు! నేం జెడ్డానని కాదు ఆయన బాధ. తన పరువుదీశానని. ఆ పొద్దే పటాలం తాలూకు మందు గిడ్డంగి ఒకటి పేలి, జననష్టం అయింది! ఆ పాపంలో తాను గట్టుకున్న పుణ్యాం ముంచేశాడు, మా మామ! గాపాటుకొద్దీ, నేను లచ్చుమన్నతో చెప్పిపోలేఁ– శాల్తీ గల్లంతయిందని, అందరు నమ్మినట్టుగానే, వాడూ నమ్మి తాన్జేసిన పాపం, నన్ను గొట్టిందని, మంచం బట్టాడు. ఒకటే యేదన! ఒకటే రోదన! వాడట్టా పడుండగా ఓ యిచిత్రం జరిగింది. కోతి ఎత్తుకు పోయిందే, ఆ మూట ఓ ముసిల్దానికి దొరికింది. ఎట్టా?'

'అడివిలోకి, పాలపళ్ళు కోసుకురాబోతే, శివలింగాల మాను మొగదల, ఏదో ఎర్రంగా ఆపించిందట! దానికి సరిగా, చూపానదు! ఏందది అనుకుని, పట్టిచూసి, యిప్పి చూసేతలికి, దాని కన్ను చెదిరిపోయింది. ఎవడో దారిని బోయేవాడు ఆకడబెట్టి, నీల్దాగేందుకు బోయినాడో అని, అంత లెక్కా, గావుకేక లెట్టుకుంటూ గాలించింది. ఎక్కడా

మనిషి అలికిడి కాలా. యిదేం మాయదారిదో మనకెందుకు – అనుకుని దాన్ని, అక్కడే బడేసి, ఊళ్ళోకి లగెత్తుకొచ్చింది. శివపూజ మానుకాడ, లచ్చల్లచ్చలు రూపాలున్నాయర్రా, అని వెర్రి కేకలెట్టింది : మతోయిన మాటలనుకున్నారు, ఒట్లూ, సత్తేలూ పెట్టింది. అయినా గురి కుదరలే, కాని దాని గొడవంతటితో మానుతుంది కదా అని వెంటపడిపోయినారు. అట్టానే దొరికింది. సంచి కట్టుమీదుండి ముద్దర గుర్తులు జూసి, యిది పటాలం వోరి సొత్తయి ఉంటుందనుకుని, అస్తారిపితంగా తెచ్చి దొరకప్పజెప్పారు. అది ఎవరి గుజారతు అని వాకబు చేయంగా, లచ్చుమన్నదనీ, మనిషికి ఉన్నట్టుండి ఖాయిలా జేసిందనీ తెలిసింది. గుర్రం వేసుకుని లచ్చుమన్న బసకుబోయినాడు. అప్పటికప్పుడే లచ్చుమన్న దొరకాడికి బోయి తప్పొప్పుకోవాలని డోలి కట్టించుకున్నాడు. దొరను జూడంగానే, నిటారై సల్యూట్ జెప్పి, గోడు జెప్పుకోంగా, ఆయనకు నిజం దెలిసిపోయి లచ్చుమన్నకు హాత్‌మిలావ్ ఇచ్చి గ్రేడ్ సిఫారసు జేశాడు. అక్కడనుండి పోయి మా మామగారిని, ఖుద్దుకు రప్పించుకుని నిగ్గదీశాడు. దొరల బుద్ధంటే నరులబుద్ధి కాదుగా, నారాయుడి బుద్ధి – ఏం జరిగుంటుందో యిట్టె ఆకళింపు జేసుకుని, ఆయన ముక్కట్టుకున్నాడు, నిజం ఒప్పించాడు.

'ఒప్పించి, అప్పుడా పెద్ద మనిషిని బట్టుకుని, ఏమన్నాడు? – ఏం జేశాడు?'

'ఏం జెయ్యాలా! చెయ్యకపోగా, –ఎడాపెడా ఉబ్బేశాడు. 'కప్తాన్ నాయుడూ! – యిన్‌సాన్ అంటే యిన్‌సాఫ్ అని ఋజువుచేశావు! సెబాస్! ఖాందానీ అంటే యిదీ! నీ కూతురు సుఖం చూడలా. కళ్ళు మూసుకుని నీ డ్యూటీ నువ్వు చేశావ్! వాడొచ్చి బద్‌మాష్‌ని అన్నాడు! బస్! బస్! యింకేం కావాలి! బర్తరఫ్! నాయుడూ, నీవు అవ్వల్‌దర్‌జా అఫ్సర్‌వు!'

'మామూల్ బందూక్ వాలావు కావు : తల్‌వార్‌కి తేజి ఉన్నట్టు అఖల్‌కి కూడా ఉండాలి : నీకు అది లేదు : రహమ్ అంటే నీకు అర్థం తెలియదు: పోనీలే! పటాలంలో మన తరఫీయత్ ఏమిటి? – ఎదురుగుండా, బందూక్ పట్టుకొచ్చినవాడు దుష్మన్; వెంటనే గోలీమార్! అది మొకద్దమా అనుకో! – చూడు నాయుడూ, సంగ్రామ్ వేరు, సంసార్ వేరు : యీ సంగతి నీకు తెలుసునా? ఎవడన్నా ఓ మనిషి నీ దగ్గరకు, – వచ్చి – నేను మహారాణిగారి భర్తనంటే – వెంటనే నమ్మేస్తావా, – సల్యూట్ చేస్తావా? దిమాగ్ గల్‌తీ అనుకోవూ! – అతి మంచితనం కూడా, అలాటి ఒకరఖం పిచ్చే, – నీ అల్లుడిలాటి వాళ్ళకి పుటకతో అంటుకుంటుంది – నీకు ఇలాటివాడు తగలడము, ఇదే మొదలుకాదూ, పోల్చుకోలేకపోయినావ్!'

'మన లా, ఏం చెపుతుంది?'

'ఎదుటివాడి పుంధాకోర్‌తనం, ఋజువు కావాలి – అప్పుడు వాడిని ముద్దాయి క్రింద కట్టాలి! అంతేకాని, నోటి మాట మీద వ్యవహారం నడుస్తుందా? నడుస్తే – లా ప్రకారం అది, చెల్లుతుందా? నాయుడూ, నీవు ఒకటికి మూడు తప్పులు జేశావ్. అదిగో పులి అంటే యిదిగో తోకన్నావ్! దున్నపోతు యీనిందంటే, దూడను కట్టేయమన్నావ్! దూడ గడ్డికోసం తాడి చెట్టెక్కావ్! సమ్‌ఝూ? నాయుడూ, జిందగి ముకద్దమా కాదు; ముయిమ్మా! చిక్కు విడదీస్తామా, చీల్చి చెండాడుతామా? యిప్పటికన్నా బాగా ఆలోచించి చూడు; నీవు చేసిందేమిటి? మంచివాడికి అపకారం – కన్నకూతురికి అన్యాయం – నీకేమిటి ఫాయిదా? యిజ్జత్‌లేని మనిషి, అఫ్సర్‌గా ఉండటం మంచిదంటావా?'

'యీ లెక్కను నవ్వుతూనే గుమికీ లిచ్చేసరికి అంత మనిషీ కుదేలైపోయి మీసకట్టు మీదుగా కన్నీరెట్టుకుని, పటకా – బెల్టుతీసి, దొర పాదాల ముంగల బెట్టాడు:'

'ఆయన ఒక్క నిమేటు మా మామకేసి జూసి, – కప్తన్! – పోయి నీ డూటీ జూసుకో! యింత కాలం, కూతురి కాపురం జేతులారా తీశానే అని, ఎంత బాధపడుతున్నావో అంతకన్న శిక్ష, నీకెవరు వేయగలరు? నీవు పడిన బాధ, – పగవాడికైనా రారాదనీ, – యిలాటి, అవకతవక, మనిషైనవాడు యీ జన్మకు కాదు, మరో జన్మకైనా చేయరాదనీ, – శిలువమీద రక్షకుణ్ణి, ప్రార్థన చేస్తాను: నాయుడూ, వీరుడి చేతా కత్తి ఉంది, భజంత్రీవాడి చేతా కత్తి ఉంది: కాని ఆ చేతికీ యీ చేతికీ ఎంత తేడా? అలాగే, మనిషికీ మనిషికీ, మనసుకీ, మనసుకీ! – నేను, ఫౌజులో చేరిన రోజుల్లో, ఒక పెద్ద తప్పు చేశాను! – కొన్ని అర్జంట్ కాగితాలు, ఆఫీసరుకు వెంటనే అందించమని, నాపై అధికారి పంపించాడు. వాటిని కోటు జేబులో పెట్టుకుని బైసికిల్ మీద పోతున్నా. పదిమైళ్ళు పోతేనే కాని, ఆ క్యాంపు రాదు : అడ్డదోవను చేలగట్టు మీంచి పోతున్నా!–'

'ఓ చేలో, ఓ అమ్మాయి, ఒంటరిగా, ఆలూగడ్డలు తవ్వుతూంది: పిల్ల, ఏపిల్ పండులాగుంది.'

'అమ్మాయ్! యివాళ ఆదివారం కాదా?' అని కేకేశాను, సరదామీద.

'ఆకలికి ఆదివారం ఏమిటి?–' అని పకపకలాడింది.

అందమైన పిల్లకు, – ఆకలేమిటి?

'పటాలంలో కొలువు చేసేవాడికి, – పడుచోళ్ళతో పరాసికాలాడేందుకు, – జీతమిస్తారేమిటి? – రెక్కాడిస్తేనే మనలాటి వాళ్ళకి బువ్వ! – నీ దారిని నీవు పోః–'

'ఎండలో నిన్నొదిలెట్లా పోను?'

'–పోలేకపోతే, పైన గొడుగట్టు.' మళ్ళీ పకాలు మంది.

నాకు ఆ నవ్వుతో, మతిపోయింది, బైసికల్ గట్టు మీద, ఒడ్డిగిలేసి, పైన కోటూ నెత్తిన టోపీ అక్కడ పడేసి, – చేలోకి ఎగడ్డాను.

'నీలాటి దేవసుందరి యిక్కడుందని తెలిసుంటే తప్పకుండా గొడుగు తెచ్చేవాడినే? అయినా, నీకు, నీడకేం తక్కువే; మంచి పిల్లకాయలాగా పోయి, ఆ చెట్టు నీడను కూర్చుంటే, నిమిషంలో చేనంతా నేను తవ్వేస్తాను' అంటూ ఆమె చేతిలోంచి తవ్వుగోల లాక్కున్నాను. ఆ పిల్ల నవ్వుతూనే, పెనుగులాడి, చివరకు నాకు వదిలేసింది. చిన్నప్పటి నుంచీ మా చేలో పనిపాటలకు అలవాటు పడ్డవాణ్ణే గనుక, ఆ పిల్లచేత సెబాస్ అనిపించుకుందామని, – చీనా మంత్రతాడు బంతులు ఎగరేసినట్లు – ఆలూ గడ్డలు తవ్వేస్తున్నా!'

'ఆ పిల్ల కెవ్వుమంది! అటు చూస్తునుగదా, – పై చే లోంచి రెండు గిత్తలు పరుగుమీద వస్తున్నాయ్ – మాకు సూటిగా, – మరో క్షణంలో మా మీదికి వచ్చేస్తాయ్! ఎక్కడివక్కడే వదిలేసి, పక్క తోపులోకి ఉడాయించాం! కొమ్మల్లోకి ఎగబాకాం! అంబోతులు – దూసుకువస్తూన్న వల్లా గట్టుమీదికి వెళ్ళి, కలయబడ్డాయి. వాటి లడాయి కన్నుల పండువుగా ఉంది. కాని, వాటి తాకిడితో, నా తాలూకు సామాను నామరూపాలు లేకుండాపోయింది.'

'అవి, – కుమ్ముకుంటూ నా బైసికిల్ మీద పడగానే, నేను నేలకు దూకేశా – కాని ఆ పిల్ల నా వెంటనే దుమికి కదలకుండా పట్టేసింది. 'అటు పోవడమే, – అమ్మో

యింకేమన్నావుందా? చీల్చేస్తాయి!' అని విలవిల్లాడుతూ నన్ను ఉడుంపట్టు పట్టుకుని వదలందే!

'నా సైకిల్, నానా వంకర్లూ పోయింది.'

'నా కోటు – చీలికలూ వాలికలూ–!'

జేబులో కాకితాలు, – తుంతూతునకా!–

అదంతా అలా కళ్ళప్పగించి చూస్తున్నాను!–

ఆబోతులు, రంగందాటి పోయినాయి,

'అవి, ఎంతో దూరం పోయినాకగాని, ఆ పిల్ల నన్ను అడుగు ముందుకు వేయనీయలేదు:'

కోర్ట్ – మార్షల్ –

కోదండం –

బరికి దెబ్బలు –

డిమోట్ –

వెట్టిచాకిరీ

సాటివాళ్ళ వెక్కిరింత!–

నాన్న చీదరింపు –

అమ్మ శోకం –

అన్నీ ఒక్కసారి మనసులో తిరిగినాయి. నాకు తెలియకుండానే కంట నీరోడింది! – ఆ పిల్ల నవ్వింది – 'ఎద్దులు కుమ్ముకుంటే జడుసుకునే యీ మగాడు, యుద్ధమేం జేస్తాడు?' అంది – జడుపుకాదు : నా అవస్థ యిదీ, అని పొడిమాటలతో జెప్పాను, అందుకూ నవ్వింది –

'మీ దొర ముసిలాడా?' అంది!

'మా నాన్న వయసుంటుంది' అన్నాను!

'అయితే జంకెందుకు జరిగింది చెప్పేయ్. చెప్పేందుకు జంకులేదు – శిక్షంటే, భయం లేదు. కాని, నిజం చెపితే, నీవు నలుగురి నోళ్ళల్లోనూ పడతావ్!'

'నీ పేరు నాకు తెలియదు. చెప్పలేననుకో!'

'ఎవరో ఓ పడుచు పిల్లను జూసి వీడు యీ పల్టీ కొట్టాడని అనుకుంటారు. జరగనివన్నీ వూహించుకుంటారు. నీ రూపు రేఖలు మనసులో చిత్రించుకుని, గుటకలు మ్రింగుతారు. ఓ అభం శుభం ఎరుగని ఆడపిల్లను అందరూ అలా అవమానిస్తూంటే, నేను తల ఎత్తుకు తిరగ్గలనా! నో – వ్ – నా యిష్టం వచ్చిన అబద్ధం ఆడతాను – వాళ్ళ చిత్తం వచ్చిన శిక్ష వేస్తారు!'

–ఆ అమ్మాయి తొణక్కుండా, నా ముఖం కవళిక ఓరకంట చూస్తూంది.

'ఎవరికి?'

'నాకే–'

'అంటే మనకన్న మాటే'

'నిజం అదికాక మరేమిటి? మీ ఆఫీసర్లకు బుర్ర ఒక్కటే కాకుండా, బుద్ధి అనేది కూడా రవంత వుంటే, ఇంత అందమేసుకు పుట్టి, దాంతో నీలాటి అమాయకుణ్ణి

అటకాయించినందుకు, ముందు నాకు వేయాలి శిక్ష!'

'అదేంమాట? ముక్కుకు సూటిగాపోయి నా డ్యూటీ చేసుకోకుండా, దారిలో ఒళ్ళు మరచిపోవడం నా తప్పుకాదా?'

'అదే ఓ తప్పయితే, అలాటివి చేయడం చేతగాని జీవులు మనిషి పుటక పుట్టడం దండుగ కాదూ! ఎర్రని గౌను చూసి ఎద్దంటిది కట్టు తెంపుకుంటుందే, వర్ణని పిల్లని చూసి, వయసులో ఉన్నవాడు ఒళ్ళు మరచిపోవడం – నేరమౌతుందా? పైగా, నీవేమన్నా ఆగడం చేసి, అల్లరి పడ్డావా?–'

'ఒంటరిగా చూసి రొస్టు పెట్టావా?'

'అయ్యో పాపం, యీ లిల్లీ ఎండను పడిపోతుందేమోనని, జాలిదలచి, సాయం వచ్చావ్!'

కనపడ్డవాడిని, కాల్చేయడమే కాని, మనిషికి మనిషల్లే, తోడు కావడం, మీ రూల్సు ఒప్పుకోవా?

రైఫిల్ బుజాన వేసుకుని రైట్ లెఫ్ట్ కొడుతూ జన్మంతా కీలుబొమ్మలాగానే ఉండాలా?

పద, నేనొచ్చి మీ ఆఫీసరుతో మాట్లాడుతాను!'

'నీవా? – పిల్లా! అలుసిచ్చానని, అంత శ్రుతిమించకు!–

'శ్రుతి మించకపోతే ఆలాపన రక్తి కట్టదు:'

'మిస్టర్ సోజర్! కాబోయే ఆఫీసరువి కాగితాలు చిరిగితే అంత గాభరా పడతావేం? మళ్ళా కొత్తవి వ్రాసి యివ్వమను!'

'ఆఁ–'

'ధీమాగా చెపితే దేవుడైనా వింటాడు!'

– ఆ ముక్క ఎంత ధీమాగా చెప్పిందని!

నిజంగా; ముచ్చటవేసి, సెల్యూట్ చేశాను.

పల్లెలో పుట్టి చేల వెంబడి పెరిగే పిల్లకు యీ తెలివి తేటలు, పుటుకతో దేవుడే యిచ్చాడు కాని, పుస్తకాలు కొరకడం వల్ల అబ్బినవా? అనుకున్నాను.

'అబ్బా, నీవు చెప్పినట్టే చేస్తాను! ఆపై మన నౌకరీ అటో యిటో అయితే,–'

'హాయిగా వచ్చేసి, నాతోబాటు దుంపలు తవ్వుతూ ఉండు–!'

'జైలు వేస్తే?'

నిన్నే జైలులో వేస్తే పై నుంచి చుక్కలు రాల్తాయి, యీలోగా వేసినవాడి పళ్ళు రాల్తాయి.

రాల్చేదెవరో?

ఈ రాలుగాయే!

'ఈ సంగతి ఆఫీసర్‌కు చెప్పనా?'

'నీవు చెప్పాల్సింది నీవు చెప్పు! వినడో, – మనం చెయాల్సింది మనం జేస్తాము!'

'ఖాయమే!–'

'మనిషి పుటక పుట్టి, మాట తప్పడమే!'

'థేంక్యూ మిస్–' అని కొంచెం వెటకారంగానే సలాం జేశాను. ఆ అమ్మాయి

అది గమనించినట్టుగానే,-

'మనిషివనిపించుకొని తిరిగివస్తే - మదాం అని పిలవనిస్తా!' అనేసి చటుక్కున బిడియపడింది. ఆమె చెక్కిలి మీద పూసిన గులాబీలు, కనుల కద్దుకుని, సుడిగాలల్లే పోయి, మలయ మారుతమల్లే తిరిగి వస్తా! అంటూ ఆ కాగితాలు ప్రోగు చేసుకుని, సైకిల్ అక్కడే వదిలేసి, వచ్చిన త్రోవనే దౌడుతీశా!

మా ఆఫీసరు బ్రహ్మచారి, -చిరాకు పక్షి- ముక్కుకు సూటిగాడు. సాధారణంగా మంచప్పుడే, ఆ మనిషిని పలుకరించడానికి మాకందరికీ హడలు!-

కాని నేనప్పుడు, మామూలు మనిషిని కానుగా, వేయి సింహాలపెట్టు ఉన్నా.

ఎదుటపడి సెల్యూట్ చేశాను.

ఆయన కస్సుమని 'ఇంకా ఇక్కడే ఉన్నావా? వెళ్ళలేదా?' అని గద్దించాడు.

'సగం దూరం వెళ్ళాను.'

'వెళ్ళి-'

తిరిగి వచ్చాను.

'ఏం?'

'రావలసి వచ్చింది. కాగితాలు ఎద్దులు తొక్కేశాయ్.'

'ఏమిటీ!' అంటూ నిలువెత్తున లేచాడు. నేను ఆయన కోపతాపాలు లెక్క జేయకుండా, గబగబ జరిగిన యావత్తూ చెప్పేశాను. ఒక్క ఆ పళ్ళు రాలగొడతానన్నది మినహాగా, ఆ ముక్కా, ఆ ధూకుడులో నాలుక చివరదాకా వచ్చింది కాని, నొక్కిపెట్టేశాను.

నేనన్నదంతా మా ఆఫీసరు కనుబొమ కదలకుండా విన్నాడు. ఒక్క నిమిషం సేపు గట్టిగా అనూపానూ ఆలోచిస్తున్నట్లు, నిశ్చలంగా ఉన్నాడు. బుజ్జగించినట్లు అడిగాడు.

'యింతకూ తప్పు నీదా, ఎద్దుదా?'

'యిద్దరిదీ కాదు,' అనేశాను, వెనుకాడకుండా!

'వారిద్దరిదీ కాకపోతే, నీదే! అని నిదానంగానే అన్నాడు. నేనేదో దానికి బదులు చెప్పబోతే, నన్ను నోరెత్తనీకుండా హుంకరించి, బల్లసొరుగు ఛెళ్ళున లాగి, పిస్టల్ దూసి,...

'సోజర్ పటాలంలో చేరినవాడు - చేయరాని నేరం, - ఒళ్ళు మరచిపోవడం- దానికి ఒకటే శిక్ష!-' అంటూ, పిస్టల్ నాచేతి కందేట్టు ఎగరేశాడు; మొగమటు తిప్పాడు.

గాలిలోకి ప్రేల్చాను; ఆయన చప్పున యిటు తిరిగాడు -

'కెప్టెన్ సర్! మీ మాటమీది గౌరవం కొద్దీ, ఒక కాటేజ్ వేస్టు చేయాల్సి వచ్చింది. మన్నించండి!

మనం ఆయుధం చేతపట్టామంటే,

పగవాడికి - హెల్!

మనకు, విక్టరీ - ఎవఁ - ఫరెవఁ

యిది మీరు నేర్పిన పాఠమే-

ఒకటికి వెయ్యిమంది ఎదురైనా, వెన్ను చూపరాదు:' - తన్ను తాను హతం చేసుకోరాదు.

చేత ఆయుధం పోయినా, నిండు జీవంతో, నిలువత్తునా కలియబడాలి ; దెబ్బతీయాలి!

యిది, మీరిచ్చిన శిక్షణ!
మీ జీవితాలు దేశసేవకు అంకితం!
మీ జవసత్త్వాలు, దేశరక్షణకు, అవలంబనం,
మీరు, దేశ సౌభాగ్యానికి అవసరం!
యిది – మీరు చేసిన ఉపదేశం!
నేను – మరువను!
ఈ జన్మకు మరువను – కెప్టెను!
మన్నించమని మరోసారి వేడుకుంటున్నాను.
ఆ కాటేజ్ ఖరీదు నా జీతంలో మినహాయించండి!

–యిలా అనేసి, పిస్టల్ ఆయనకు అందించి, సెల్యూట్ చేసాను! దాన్ని, నా చేతులోంచి, ఊడలాక్కుని, నా మీదికి గురిచేసి, 'నీకు మూడు నిముషాలు గడువిస్తున్నాను! ప్రార్థన చేసుకో,' అని ఉరిమి చెప్పాడు. నేను అందూకూ ఏమాత్రమూ గగ్గోలు కాకుండా,

'కెప్టెన్ సర్! మీరిచ్చిన గడువు తీసుకుంటున్నాను.'

'కాని, దానిని ప్రార్థనకోసం వినియోగించను. పటాలంలో చేరినవాడి బ్రతుకే ఒక ప్రార్థన!–'

'తన దేశంలో, శాంతి శాశ్వతంగా ఉండాలని, తాను రైఫిల్‌పట్టి రక్తపాతం జేసే అవసరమే రాకూడదని!'

'కెప్టెన్ సర్! మనకు సాహసమంత సహనం కూడా ఉండాలి. రౌద్రమంత వాత్సల్యం ఉండాలి! రక్తపాతం విధి లేనప్పుడు చేసిన పాపానికి పరిహారంగా, భూతదయ అమితంగా అలవరచుకోవాలి!'

యీ మాటలన్నీ మీ దయవల్ల మాకు వంటపట్టినవే!–
మీరు, నన్ను కూల్చేయవచ్చు!
కారణం – నా అవిధేయత అని చెప్పవచ్చు–
అలా పై అధికారులను ఒప్పించవచ్చు!
కాని, నిజం దాగదు!
లిల్లీ దాచదు!
మీరు సేఫ్‌గా ఉండాలంటే ఆ పిల్లను కూడా కాల్చేయాలి!...
అంతపని మీరు చేయగలరని నాకు తోచదు! మీరు రాక్షసులు కారు!
హృదయమున్నవారు!
ధైర్య సాహసాల్ని, అభినందించేవారు!

పరమ శత్రువైనా, – వాడు మాంచి వీరుడైతే, – సెబాస్ అని బాహాటంగా అనగలవారు!

అంతే కాదు–
పటాలంలో మేమందరం – మీ పిల్లలం!
అలాగే చూసుకుంటున్నారు.

నేను, నిజంగా కాల్చేసుకున్నానేమోనని ఒక్క సెకన్ మీరు ఎంత ఖంగారు పడ్డారో, నేను గమనించలేదనుకున్నారా!–

నేను, – నూరేళ్ళు బ్రతకాలని.–

మీకూ ఉంది,... నాకూ ఉంది!

పైపెచ్చు, లిల్లీదీ, పరిపూర్ణంగా, అదే కోరిక!

అలాగే జరుగుతుందని, నా నమ్మకం,...

మీ ఆశీస్సు!–

యిలా చూచాయగా యిదే ధోరణిలో, యివే ముక్కలు కాకపోయినా, గుక్క తిప్పకుండా అనేసి, అప్పుడు ఆయన మొగం వంక జూశాను. ఆయన నవ్వేశాడు.

జాన్, పగవాడిని చూడగానే కొందరికీ, పడుచు పిల్లను చూడగానే కొందరికీ, ఎక్కడలేని ఆవేశం పుట్టుకొస్తుందని అనుభవం ఉన్నవాళ్ళు చెపుతారు.

నీవు అందరినీ మించిపోయావ్!

పగ – ప్రాణాంతకం.

ప్రేమ – ప్రాణదాత!

'నీ దారిని నీవూ పోతూ, కన్ను బెడిసి ప్రేమలో దుమికావ్! మన పటాలం పరువు నిలపావ్' అని వెన్ను చరిచి, పంపేశాడు.

'ఆ లిల్లీయే – నా భార్య!'

'యింత కథ, యింత వివరంగా నీకు ఎందుకు చెప్పానో అర్థమయిందా నాయుడూ! నీవు కలుగజేసుకుని యింత కంగాళీ చేశావుగాని, అదే పిల్లకాయలకు వదిలేస్తే నీ కూతురింత అఘోరించవలసిన స్థితి, దాపురించేదికాదు.'

'అయిపోయిందానికి, యింకా బాజాలెందుకుగాని, యికనైనా, వాళ్ళు చల్లగా ఉండేట్టు చూడు.'

అని, ఆ పుణ్యాత్ముడు. అంతదూరం సబబుగా సర్దిచెప్పాడు. కానైతే, మా మామకు మొగం చెల్లిందికాదు. చేతకాని పనిజేసి మాటపడ్డానే అని, అంతమనిషి బిగలా పడి ఖాయిలా తిని, రిటైర్ అయినాడు. ఇంత లెక్కుంది మా సొద!

మా మామ్మీద నాకేం కోపంలేదు. ఆ మనిషి సొబావం నాకు తెలుసు. రంగడికి, నిన్న మొన్నటిదాకా, వాళ్ళ నాయనంటే గుస్సా ఉండేది కాని, – ఈడకు జేరుకున్న తరువాతను, ఆ సీకూ సింతా, అంతా హూష్ కాకాయి.

కానయితే, వెనకటి నైజంకొద్దీ, నన్ను యెంటాడి యేపుకు దినడం మాత్రం మానదన్నమాటేగాని,–

అన్నప్ప, ఎక్కిదక్కిగా నవ్వుకుంటూ, 'చింతాలూ, గంగాస్నాన ఫలితం ఊరికే పోతుందా నాయనా! యీ పాటు నీకు నూరేళ్ళపాటు తప్పదురా అయ్య!'

'మన వారణాసిలో జూశావూ, ఆ విశ్వేశ్వరులవారు, తెల్లవారుతూనే నిద్రలేచి, ఒంటినిండా యింత విభూతి పట్టించుకుని, మెలికెలుపడ్డ నాగహారాలు చక్కచేసుకుని, త్రిశూలం చేతపట్టో పట్టకో, నగరంమీదికి తిరగబోతాడు. ఆయనకు అడుగడుక్కూ ఏదో వింత కనబడుతూనే ఉంటుంది. అవున్రా నాయనా! దేవతలకి మన భూలోకం అంటే మహాప్రీతి. ఇక్కడ గోచరించే ప్రతీది వారికి విడ్డూర్యమే! అందుకనే ఎప్పుడు విమానాలేసుకు అట్టే తిరుగుతూ – ఆ వంకా యీ వంకా జూస్తూ, కబుర్లు చెప్పుకుంటూ కాలం వెళ్ళబుచ్చుకుంటారు. వాళ్ళ లోకంలో చక్కహో ప్రొద్దుపోదవటం, పవలెల్లా ఎండకాయడం

– చీకటి పడటం, వెన్నెల కాస్సేపు కాయడం, తొలికోడి కూయడం – యిలాటి ముచ్చట ఒక్కటీ లేదుగా! పవలూ రాత్రీ అంటూ లేదు, ఎదుగూ బొదుగూ లేదు. కనీ పెంచే వేడుక లేదు – మరే వేదనా లేదు... ఎందుకొచ్చిన లోకం అంట – పోనీ తిండి విషయం అంటామా? పప్పుందా? పాయసముందా – పూర్ణపు బూరెవుందా పులిహోరుందా? ఆఖరికి నాలిక్కి రాచుకునేందుకు విసిరికాయ పచ్చడన్నా ఉందా – రుచీ పచీలేని ఆ అమృతం తప్ప! కనుకనే, వాళ్ళందరూ మనం పెట్టే నైవేద్యాలకి ఎగబడ్డం! బ్రహ్మదేవుడంతటి వాడు బెల్లంగడ్డకు మొగం వాచిపోయినాడంటే – ఆ సౌదుభ్యం – ఇహ అడగనా?

'సరే, – వాళ్ళ గ్రహచారం వాళ్ళదీ, – కాని,–'

'అలా ఆ విశ్వేశ్వరులవారు, ఊరిమీదికి విజయం చేస్తే, యింటికి యేవేళకు వచ్చేదీ యిల్లాలికి తెలియకపోయే!–'

అమృతం ద్రావిన ప్రాణి అయితే, ఆకలికి తాళుకోగలడు ఫరవాలేదు, అనుకుందామా అంటే, అదీ లేదాయె! లోకంలో నలుగురూ దేవాది దేవుడనుకోవడమే కాని, ఆ ఉబ్బులింగడు ఎంతటి అమాయకుడో, ఆ యిల్లాలికి తెలుసునేమో, ఎండనుపడి తిరిగి తిరిగి, ఎంత ఆకలిమీద వస్తాడో అని, ఓ చేతను గిన్నే, ఓ చేతను గరిటే పుచ్చుకుని గుమ్మంలో పడిగాపులు పడి ఉంటుంది. మరి, దాంపత్యం అంటే అదీ! – యింటికైన మగవాడు, పొలం బోతే, – ఆపేక్షా అంతఃకరణా అంటూ వున్న ఆడకూతురి మనస్సున్నదే, – అదీ వాడి వెంటపడి పోతుంది. ఒళ్ళు వంటింట్లో వున్నా, కళ్ళు తలవాకిట కాపలా ఉంటాయి. నీకు యీ సంగతి, ఎప్పుడో అనుభవంలోకి వచ్చి ఉండాల్సిందేనే–'

చింతాలు, – అతి మర్యాదమీద, వచ్చే నవ్వును ఆపుకుని, –

'రంగా! దొరికిపోయావ్‌లే!–'

'వీడో తలకుమాసినోడని, – అన్నప్ప గారితో మొరెట్టుకున్నావ్ గాదూ,?–'

అంటూ జబ్బపట్టుకుని, ఓ కులుకు కుదిలించి,

'యీ మనిషి, – పూసలో దారమంటిదుండి,–

'పైకి అలా అవుపిస్తుంది కాని, – మా చెడ్డ – కానరాని గట్టిపట్టండీ' అంటూ ఆయనకేసి చూసి, నసుగుతూ బిడియపడ్డాడు...

'ఆఁ– గట్టిపట్టు కనుకనే, – ఆ భువనేశ్వరి మీపట్ల ఉంది! కనుకనే, అరణ్యకాండ వెనకట్టింది, – అయోధ్యకాండ ముందుకొచ్చింది; ఒరే అబ్బాయ్, – నా నోటి వాక్యాన యిలాగే ఊగులాడుకుంటూ ఉత్తపుణ్యానికి కీచులాడుకుంటూ, – యిలాగే ముప్పొద్దులూ వేడుకగా, – ఉన్నచోటే నూరేళ్ళ పాటుందురుగాని!–

'అమ్మాయ్ రంగడూ! వెనుకటికి ఓ మహాముని ఉమామహేశ్వరుని స్తోత్రంజేస్తూ, ఏమని సెలవిచ్చాడనుకున్నావ్! ఈ తల్లి చూడబోదామా అంటే, తగని నిష్ఠ – ఎప్పుడూ మడికట్టుకుని ఉంటుంది. అయితే, అతి సుకుమారపు ఆడకూతురా అంటే, కాదు. సమయం వస్తే దున్నపోతును తెగేసే స్వభావం! పోనీ, ఆ అయ్య అయినా ఎలాటి సరసుడంటే మన్మథుణ్నే చావగొట్టినటువంటి వాడాయెను! వారి దాంపత్యం తీరు ఎలాటిదో, ఎవరికి తెలుస్తుంది? అంటే–

ఆ జగదంబ మహిషాసురమర్దిని!

ఆయనేమో, కామదహనం జేసినవాడు!

కనుక యిద్దరూ సామాన్యులు కారు!

అలాటి చండ ప్రచండుల అన్యోన్యం అనేది ఎలా ఉంటుందో, ఏకాంతాన ఉన్నటువంటి సమయాన వారి ముచ్చటలు ఎలా ఉంటాయో, మానవమాత్రులం మనం ఊహించేందుకన్నా తరమా?

'యింతకూ చెప్పదలచుకున్న దేమిటంటే జగదాంబ చేరువలో వెలసింది, మీ కోసమే అనుకున్నంటివారై ఆ తల్లికి చూడముచ్చటయేట్టు మీ కాపురం మీరు చేసికోండి!–'

చింతాలు చేయెత్తి అన్నప్పకు దణ్ణం పెట్టాడు.

అప్పుడు గమనించాడు.

చింతాలు కుడిచేతి బొటనవ్రేలు ప్రక్కనున్న రెండువేళ్ళూ మొండేలు!

చింతాలు ఆయనచూపులోకి చూసి, మొగం తిప్పేసుకుని, 'అదేందో చిలిపిజట్టీలెండి!' అని చప్పరించేశాడు!

'కాదండీ ఘనకార్యమే చేశాడు.'

'కాశీలో ఉండగా, ఎవరో ఓ ఆడకూతుర్ని తురకసాయేబు లెగరేసుకుపోయి, పై మిద్దెకెక్కించి, నిరబందం చేయబోయినారటఁ. వాళ్ళ కరమం బాగుండక యీ మనిషి కంటబడ్డారు! పైకెగబాకి కలెబడ్డాడు, ఆరుగురున్నారట! చితకా బాదాడు. వాళ్ళకడ బాకూ బల్లెం గొడ్డలీ ఉంటేమటుకేం, చాప చుట్టుగా కొట్టి ఆ ఆడకూతుర్ని వెన్నున వేసుకుని, క్రిందకు దిగొచ్చాడు. ఆ రొష్టులో ఆ రెండు వేళ్ళూ వాళ్ళుచ్చుకున్నారు...'

'ఆఁ– ఆఁ–'

'మరేం పెమాదం రాలేదు లెగుండి; సేత ఒంత కర్రముక్కన్నా లేకపోయింది. సెయిదిరిగే జాగా లేకపోయింది. ఒకడు బరిసె మీదికేసినాడు. ఒడిసిపట్టినా ఆ పరాకులో అంటే ఆ ఆడకూతురు కెవ్వుమన్నది లెగుండి. మరో గడ్డపాడు గొడ్డలిసిరినాడు. ముక్కలెగిరినయ్ అంతే, మరి ఈగవాలనిచ్చానా?' అని అందుకున్నాడు చింతాలు.

'మరేం గాయాలు కాలేదు కద!'–

'ఆఁ– ఏవో చిన్నంచితకా తప్ప, ఒంటిమీద దిగలేదు లెగుండి, కాని అమ్మకూ అబ్బకూ పుట్టిన అంత మందిలోనూ, ఒక్కడూ లెగవందే! మళ్ళీ ఎప్పటికి తెప్పరిల్లారో ఏందో,–'

'అంటే తెలియకడుగుతాను,–'

'అంత బీభత్సం జరుగుతూంటే – నలుగురూ పోగవలేదా?'

'ఎబ్బే! అదో మారుమూల!'

సుట్టుపక్కలంతా యిదే సజ్జు–

'ఎవడి మట్టుకు ఆడే!–'

'అయితే, ఆ ఆడకూతురు ఎవరో!–'

'వాళ్ళు మంచి మారాజులు – మారువాడీ కులం, కుబేరులాంటాళ్ళు! యీ పిల్లకాయను కొంచుపోయి యింటికాడ అప్పజెప్పేసరికి, ఓ యబ్బ! ఆ యింటికి వెయ్యి యిలాయిల యెలుతురొచ్చింది, నాయేళ్ళుబోతే లెక్కేమిటి!–

'ఆ యింటోరు నాకు తవ్వి తలకెత్తుతామన్నారు. ఛస్, ఓ ఆడకూతురికి సాయమెళ్ళినందుకు యేతా బుచ్చుకుంటానా? పోనీ మందు మాకు వేయిస్తామన్నారు!

తప్పించుకొచ్చేసినా! అప్పుడు, ఆఘణంలో యింటి మీదికి గాలి మళ్ళింది. నిజం జెప్పద్దూ! రంగడేమైపోయిందో! – ఒంటిదైపోయిందని, సీకటిమాటున ఏ దండోళ్ళన్నా, ఎగరేసుకు పోతరేమో, అనుకుంటూ నూరు పుటకలు బుట్టినా; ఆడకూతురికి కట్టమొచ్చినా, ఆపదొచ్చినా ఆదుకునేందుకు లేని బతుకేల ననుకున్నా! గంగలో ఉరుకుదామని పరుగులకించుకొని త్రాణతప్పి సొమ్మసిల్లిపోయినా,–...'

రంగడు కెవ్వమంది : చింతాలు, వెంటనే సందిట వేసుకుని, 'బతికొచ్చాగా! నీ ఎదరే ఉన్నాగా, కళ్లెరు!' అని మాటలో గజగజలాడిపోయినాడు; రంగడు, నెమ్మదిగా కనువిప్పి, మత్తుగా చింతాలు వంక చూడంగా, అతడు నవ్వేసి, 'మళ్ళీ చూడబోతే, మీసాల్నాయుడు కూతురివి, ఊసుకే ఉలికి పడతావేం, –' అని

'అన్నప్పగారూ, యిదంతా నటనండోవ్!'

'మీ మెప్పుకోసం, మామూలు ఆడకూతురల్లే బెంబేలట్టింది. అంతేకాని, మీ రింతకు ముందు సెలవిచ్చారే అట్టాంటి మనిషి, మా మనిషి, – కారుదున్నను తెగేసే రకం; సెడీవరసకు బరిమీద్దూకితే, ఎదరెందరున్నా తోపతోపే–'

'ఆహా! – రంగడికి ఆ విద్య కూడా వచ్చునన్నమాట!' 'అన్నప్ప మాటలో, – ఆ ఆహా! – లో వల్ల మాలిన మెప్పుంది. మనసు నిండిన దీవెనుంది: –

'ఏ ఎండ కా గొడుగు పట్టాలి కాదండీ! యీ మనిషి, బాణా చెడీలో, జిల్లా మొత్తానికి చిన్నప్పుడే పేరు దీసుకొచ్చాడు. ఆ లెక్కమీదే, పటాలంలో కొలువిచ్చారు; చేరిన వాళ్ళం దరికీ, కత్తిసాము నేర్పాడు: నేను – జేరకపోయినా, చిన్నపిల్లను జేసి, ఆ విద్దె నాకూ నేర్పాడు.'

'నేరపడమే బుద్ధితక్కువైంది : నాయుడోరి కూతురు గందా. నవనవ మీదున్న పిల్లగందా, అని చనువిచ్చి, కిటుకులన్ని జెప్పినందుకు, మా శిష్యురాలు, మా విద్దె నాకే తిప్పికొట్టింది. దసరా పండుగల్లో చూడవేడుకౌతుందని, వరస కలిపా! పసిపిల్లగందా అని పరాకుమీదున్నా, ముక్కు మున్నుగాకుండా బాదిందనుకోండి; కాచుకోడం గగనమైపోయింది,–'

'భేష్–'

'యీ – తవురన్న ముక్కే పదిమందీ అన్నారు. పటాలం దొర, బంగారపు గడియారమిచ్చాడు – ఛోటే సుబేదార్ బిరుదు నిషానీ లిచ్చాడు. యిలాటి తరిఫీయ దిచ్చినందుకు, అందరి ముందూ నాకూ హాత్ – మిలాపిచ్చాడు...' రంగడందుకుంది, పైమాట–

బుద్ధిమంతులందరూ మెచ్చుకున్నారని, యీ మొగవీరుడికి, అలుకొచ్చింది. ఉలుకొచ్చింది. నాకు గౌరవం జేశారంటే, అది తనకు కాదేం? – మూల నక్కి ముంగల్లే కూచున్నాడు.

మొగమింత జేసుకుని,...

సిగ్గువిడిచి నేను పోయి, గడ్డమట్టుకున్నా–

మరింత బిర్రబిగిశాడు!

'చివరకు, మరే, మా నాయనొచ్చి, – నా పిల్లకాయను నీ కిచ్చుకుంటాను, తప్పుగాచి, ఒప్పులెంచుకో అన్నమీద గాని, యీ అయ్య గుర్రం దిగాడేమో, – అడగండి!–'

'అబ్బో చాలా ఉందే కథ–'

'కథల్లేనే ఉంది మా కాపురం! యెనకటి కెప్పుడో, నేనేదో మారాం జేశానని, డొక్కను బెట్టుకుని, – కానరాకుండా కత్తికట్టింది. నవ్వుతూనే, నన్ను యేపుకుతింటూంది – ఎప్పుడో తిక్క తిరిగితే, కాశీకి బోతా, –'

కాశీకి బోయినా గంగోత్రి బోయినా, తాచేసుకున్నది తన వెంటనే ఉంటుంది. అంటారు రంగమ్మగారు...

అయ్యగారిని, అలా మాట కట్టుమీద నిలవేయకపోతే : అట్టా; నాలుగు చెంపలా చూపించి రారాదూ–

'సత్తెమ్మీపాటికి చెట్టు కిందికి జేరుకునుంటుంది. ముందాతల్లిని జూపించు: ఆపైన మస్తానయ్యను చూడబోండి దానిమ్మ చేన్దగ్గిర, అమ్మోరి సింగం తగలచ్చు, నంజుడికి వేళయిందిగా, యీ పూటకు అంతతో సరిపెట్టు. సంజెపూట, సాముగరడీలు జూపచ్చు.'

'అయ్యగారు – నేను మా యింటికేసి ఓమారి తొంగిచూసి అటునుంచి అక్కడికి వచ్చేస్తా' అని, గునగునా నడిచిపోయింది.

ఎటు చూసినా, అంతా ఏకంగా తోటల్లే అవుపిస్తూంది. అటు ఎడమవెంపుగా ఓ వందగజాల లోపు దూరాన యిళ్ళు కనిపిస్తున్నాయి, 'అయ్యగారూ, అటుపోతే, ఓ మైలుదూరం, అంతమేరా మనూరేనండి. శేషయ్య బావ యీ కాడికి రాకముందు సెదురువాటుగా తలో మూలా తలో గుడిసె ఉండేవి. అయన్నీ ఒకసోటికి జేర్చి, హోల్ మొత్తం ఒకూరు జేశాడు. పేటలో వోరికి లేని సుఖం, మాకిక్కడుంది...'

'అలా అయితే, ఊళ్ళోకిపోయే, అటేటో పోవచ్చునుగా;'

'అది పెద చుట్టవుతుంది!'

పైగా, అందరూ పొలంమీదికి బోయినారు.

మనం, యిప్పుడిటు బోదాం!

'ఊరి కన్న యిది ముఖ్యం...'

ఎదటంతా, కోరనార మళ్ళు – అక్కడ పండని దినుసులేదు. ఏం పదును జేశారో కాని, కాపు నేవళందేరి, పచ్చివి కొరుక్కుతినేట్టున్నాయి. అందులోనూ ముఖ్యంగా ఆ వంకాయలు – నీలవర్ణుని కరాంగుళులల్లే – అనుకున్నంతలో, చింతాలు వ్రేళ్ళు జ్ఞాపకం వచ్చి, అబ్బాయి! తరువాత ఏం జరిగింది?–

చింతాలుకు వెంటనే ఆకళింపు కాలేదు,

అర్థం కాలేదన్న చూపు చూశాడు!

'యిందాక నీవు చెపుతూన్నది! గంగలో దూకుదామని, పరుగుతీస్తూ–'

పతంగీ వాలినట్టు వాలిపోయినా, ఓ సాధువు దారెంట బోతూ, నన్నుచూసి, ఆదుకున్నాడు,

'ఏం జేసినాడో, తెలివొచ్చింది. సత్తువొచ్చింది. గాయానికేదో పసరు బూసినట్లుంది. రగతం ఓడటం కట్టింది. లెగిసి నిలుచున్నాను, ఎట్టా? ఒక్కగంతేసి; యింక వెంటబడ్డాను; ఆ రోజు నగరం అంతా తిరగేశాం.'

ఎక్కడా ఆగడం లేదు:

ఎవరేం చూపినా చేజాపడంలేదు;

నాకూ ఆకలనిపించలేదు -

సంజెవేళ, తానేదో, యింత ఉండవేసుకుని, నాకింత యిచ్చాడు, మింగేశాను; పిండొంటలతో ముప్పొద్దులు బువ్వదిన్నట్టుంది-

ఎంతదూరం వస్తావురా! అన్నాడు.

'బతికినన్నాళ్ళూ తవురెంటే! అన్నాను;

నవ్వాడు;

యింకో ముప్పై ఏళ్ళు పోనీరా - అన్నాడు;

నాకు అరదం కాందే!

నీ బతుకూ నీ ప్రాణం నీ గడ్డమీదుందిరా! మొక్కకు యెయ్యి ముక్కలు జూసి, కాయజూసి పండుజూసి, మనవడి మొగం జూసి మా దగ్గిరకు రారా! అన్నాడు.

ససేమిరా! నాకా జంజాటన యీ జలమకు వద్దు - నిన్నే నమ్ముకున్నానని, అడుగులో అడుగేశా!

మూడు పొద్దులలా నడిచినాం:

నగరం యిడిచి యెంత లెక్కొచ్చినామో,-

దారంతా మంచుగెడ్డ - పై నుంచి పేలగింజలు రాలినట్టు, ఒకటే తుంపర, అంతా కొండలమయం, కింద జూశామో అగాధం: హోరు; చీకటికాదూ, పవలూ కాదు, అదేదో మసక!-

అదేం మయిమోగాని, వణుకుట్టుకురాలే!-

కనుచూపు మేర, కొండంతా పూసింది -

ఎన్ని రంగులు, అవేం పువ్వులు -

యిది నరుల్దిరిగే జాగా కాదేమో అనిపించింది · ఓ గట్టుకెక్కినాం - అల్లంత దూరాన, గులాపువ్వులు, మైళ్ళకు మైళ్ళు అడవి - అవి మొక్కలు గావు, మానుగట్టిన వృక్షాలు - పువ్వులు కోసుకురారా అన్నాడు స్వామి. నాకు, అవి అందుతాయా అనుకున్నాను. ఆనందజీ ! అని కేక వెయ్యరా నీకు అందంది ఉండదురా ! అన్నాడు. అటు పరు గెత్తినా; ఎగిరి ఓ పూవందుకున్నా. పువ్వంటే పువ్వా! పెద్ద యిస్తరాకంత ఉంది. ఏం గుమగుమ!- తలొంచుకుని, ఉన్నచోటికి లగెత్తుకొచ్చినా! ఏడీ స్వామి!-

అడుగు ముంద్రైందేమోనని అరుచుకుంటూ బోయినా,... కాని నాకు అంతే ప్రాపతం ! మరి అపడలా! పోగాపోగా సాధూలమూక ఎదురొచ్చింది! ఆరితో మొరెట్టుకున్నా...

ఆరన్నారు గందా, 'బేటా, నీ పుణ్యం యిప్పటికి యింతవరకే. ఆ తరుణం వస్తే, ఆనంద్‌జీ రప్పించుకుంటాడు.'

స్వామీజీ పూవుతెమ్మన్నారు ; తెచ్చేలోగా మాయమైనారు ; అని వాపోయిను.

ఆయన నవ్వాడు ; ఎక్కిడికీ మాయంకాలా! ముందులాగే నీ ముందు నడుస్తానే ఉంటారు ; ఆ దోవనే పోరా ! అన్నారు. వారి వెంటపడి కాశీ జేరుకున్నాను.

నగరంలో కాలెట్టినా, ఆకలిదప్పికలట్టుకున్నాయి. అక్కడ తిండికి కొరతేమిటి? అలా తిరుగుతున్నా, ఆనంద్‌జీ, నా ముంగల నడుస్తున్నట్టే ఉంది. ఆరే ఇక్కడ పడేశారు; ఎప్పటికో రప్పించుకుంటారు!... ఆనంద్‌జీ! గురుమహారాజ్!' అని ఒళ్ళు పొంగిన కేక

పెట్టాడు చింతాలు: అన్నప్ప ఉవ్వెత్తు పెరిగి, అమాంతం కౌగలించుకున్నాడు. 'నాయనా! ఆ స్వామికి నీ మీద దయవొచ్చి, ఆ తరుణం వచ్చినప్పుడు. యీ అన్నప్పను మరచిపోకురా, నన్నక్కడకు జేర్చురా తండ్రీ' అని విలవిల్లాడాడు. చింతాలు గంభీరంగా, 'అన్నప్పగారూ, నాలాటి అధమస్తుడే, ఆ సొరగం కంటజూశాడే, మీకేం తక్కువౌతదండీ! ఆనంద్‌జీ, తవుర్నీ రప్పించుకుంటాడు !...' ఆ ముక్కలు వేదవాక్కుల్లాగా వినిపించినాయన్నప్పకు...

యిద్దరూ మాటామంతీ లేకుండా పదిబారలు నడిచారు. అక్కడనుంచి కొండగోగు మడి, నిలివెడుకుపైనే ఉంది మొక్క, పువ్వులు, కొమ్మల్ని విరబోసినాయి, చేను మయ్యానుంచి, బాట ఉంది. ఆ చేను అనుకునే తోటకూర మడి లేత మొక్కకాదు – కాడేసి మాను కట్టింది, కరివేప గుబురల్లే ఎదుగుకొచ్చింది. ఆ చేనుకు అవతల కొంతమేర మెరాబా – అక్కడో దిరిసెన చెట్టు ఒక్కటే ఒక్కటి కాని, మహావృక్షం ! ఆ చెట్టు నీడను కపిలగోవు!

తల్లీ, సత్తెమ్మ ! అని చింతాలు చేతులు జోడించి కేకపెట్టాడు. అన్నప్ప కూడా వెనువెంటనే, చేతులు జోడించబోయి, అంతలో ఏదో సందేహం వచ్చి చేతులు ఆకట్టుకున్నాడు, కపిలగోవు వీరిని చూసి, రథం కదిలినట్టు ముందుకు కదిలి వచ్చింది. హిమాలయ శృంగాన్ని చూస్తున్నట్టనిపించిందన్నప్పకు ! నిలువు నిలువూ కపిలవర్ణం, మొగాన, అరచేతిమేర పసుపుబూసి కుంకుమ బెట్టినట్టు, మచ్చ, మొనల్దేరిన కొమ్ములు, దండైన మూపురం ! రెండు పొదుగులు – చమరీవాలమంటి కుచ్చు –

అన్నప్ప, కనులు మూతలు పడ్డాయి.

మనసు ప్రదక్షిణ నమస్కారాలు జేసింది –

అంతలో ఒళ్ళు గరిపొడిచింది.

కళ్ళు తెరిచాడు.

సత్తెమ్మ – తనకు దగ్గరగా వచ్చింది –

అంతమేరా, అదో పరిమెళం !

అమ్మా ! సత్తెమ్మ – అన్నాడు!

హాఁ ఆఁ – అన్నది –

అమ్మా, యింత కాలానికి, వీడికి దరిసెనమిచ్చావా తల్లీ ! అన్నాడు. పించెం అన్నప్ప వెన్ను నిమిరింది. కపిలగోవు, తిరిగి తానున్న తావుకు నడచిపోయింది.

ఇంక కదలమని చింతాలు సైగ చేసినాడు. అలా కొంతదూరం పోయినారు. అదంతా ప్రత్తి చేను –

అప్పటికి మాట పెగిలింది అన్నప్పకి.

ఆఁ, ఏమిటీ తల్లి కథ ! అన్నాడు.

కథేముందండీ !

ఏమన్నా ఉన్నా, మనకి ఎరికెలేదుండీ !

ఏ తల్లి కన్నదో, ఏ సీమలో బుట్టిందో –

శాంతయ్యగారెంటనే వొచ్చింది, రావడమేమిటి యిక్కడే మకాం –

ఎన్నడన్నా, గోగుపువ్వులు కొరుకుతుంది. మరోమేత ముట్టదు, వానకురుస్తూంటే, మోరెత్తి, నాలిక తడుపుకుంటుంది, మరి అంతే, నీల్ ద్రాగదు. మండేసంగిలో అప్పుడూ

యిలాగే మల్లెపువ్వల్లే ఉంటది.

అదేం సత్తెమో కాని,

చూడికి,– రాలేదు–

కాని పొల్జేపుతుంది–

అదన్నా నిత్తెమూ కాదు –

మనూరిలో, ఎన్నడన్నా, ఎవరికన్నా పసోడికి కూసింత నలత జేస్తే, సిన్న లోటా బుచ్చుకుని, తల్లో,–మరోఆడకూతరో యీడకు లగెత్తుకొచ్చి, నీ సత్తెం మాయమ్మా?అనం గనే పొదుక్కో జువ్వ్గా జువ్వుతుంది. ఆ పాలచుక్క గొంతు దిగడమేమిటి, బిడ్డ లెగిసి, కేరింతాలు కొడుతుంది –

ఈ గడ్డమీద, ఆ తల్లి చలువను ఖాయిలా అంటూ రానేరాదు – వచ్చిందో, తప్పిజారి, యిదేమందు– ఆచార్లుగారు చెప్పిన మాటే –

'అయితే, తతిమ్మా గోవులతో, కలుపుగోలుగా ఉండదా?'

'ఎందుకుండదూ; అదే మనవి చేసుకుంటున్నా. పండగనాడు అమ్మవారు బయళెళ్ళినట్టు, పున్నమి పున్నమికీ, మందలో కొస్తుంది. యింక రేయికి రేయి, ఆ సంబరం జూసుకోండి ! పెళ్లోరిల్లు లాగుంటుంది. మలి కోడి కూసేతలికి మళ్ళీ యధాప్రకారమే – ఎవరుండేచోట అరుండాల్సిందే!'

'బాగుంది మహబాగుంది!'

'అయితే, చింతాలూ! జిహ్వాచాపల్యంకొద్దీ అంటే నోటి తీటకొద్ది, అడుగు తున్నాననుకో, మన మనసులో – ఏదో తలకు మాసిన ఆలోచన, ఒకొక్కప్పుడు దానంతటదే పుట్టుకొస్తుంది. అలాటిదాన్ని అక్కడే హతమార్చడం – ఒక పద్ధతి. బయటకనేసి, ఆపై చెంపలు వేసుకోవడం – మరో పద్ధతి...'

నేనడగొచ్చిందేమంటే, ఎంత దేవతామూర్తి అయినా, ఆవిడ సత్తెం తెలుసు కోలేనందువల్ల, పశుబుద్ధితో, అంటే అర్థమయిందికాదూ? మన మందలో ఉన్న కోడెలు ఎన్నడన్నా –'

'అరదమైంది.'

అవి పశువులే కావచ్చు కాని వాటికీ గ్యానం, ఉంది. సత్తెమ్మ, మందలోకి బయదెల్లొచ్చేయేలకు, మందలో కోడెలన్నీ ఎటో ఉడాయిస్తాయి. ఆ తల్లి, కనుసూపు దాటినాక గాని, మందలోకి మళ్ళవ్!

ఆహాఁ– నేనూ అంతే అనుకున్నాలే'...

... అన్నట్లయితే, అది అబద్ధం.

అవకతవకపు ప్రశ్న వేశాను.

అది కప్పిపుచ్చుకునేందుకు, యిలా గొణిగాను.

యీ తప్పుకాయి, సత్తెమ్మ తల్లీ!'

యీ మాటల్లో పడటంలో, వచ్చినదూరం తెలియలేదు. మళ్ళీ ఓ మెరాబాలోకి వచ్చారు. అక్కడ మేకల మంద, ... ఓ, కుంటి సాయేబూ,... ఓ జత జాగిలాలూ, సాయేబు చేత వో కంజీరా!

సాయేబుకు వయసు మళ్ళినా, గునపమల్లే ఉన్నాడు. వ్యాసులవారి గడ్డం...

మామూలు పంచకట్టు కట్టుకుని, గళ్ళరుమాలు తలకు చుట్టుకున్నాడు. దగ్గిర ఓ బారెడు లాఠీ ఉంది-

అక్కడ ఓ రాతి బండ మీద కూర్చుని ఉన్నాడు.

వీరిని చూసి లేచి నిలుచున్నాడు.

నవ్వుమొగం జేసుకొన్నాడు.

'రాండి అన్నప్పగారూ!

తమాషా చూడండి' అన్నాడు.

ఆయన బండమీద కూర్చున్నాడు.

చింతాలు నిలుచునే ఉన్నాడు.

సాయేబు కంజీరా మీద ఓ ఝుణుకు వాయించాడు. చెదురువాటుగా మేస్తూన్న మేకలన్నీ, వచ్చి వలయం కట్టి నిలుచున్నవి.

వరుసలో గతిమార్చి, రవంత దురితం జేశాడు. నాలుగు మూలల నుంచీ, కాళ్ళకు మువ్వలున్న కరిమేకలు, పోతులంటివి; చెంగుచెంగున, ఆ మయానికొచ్చి, చిందేయడం మొదలెట్టినాయ్, మరో నిమిషానికి, సరిగ్గా లెక్కకు అన్నే, - తెల్లమేకలు, అక్కడికి దుమికి, తాళానికి అనుగుణంగా, అందుకు పైకాలం అందే చిందేయడం సాగించినవి. వాటి వాలకంలో, మనుష్యులకుండే సకల తెలివితేటలూ ఉన్నట్లు స్పష్టమౌతూనే ఉంది. కాని మనుష్యుల్లో, ఇంత జవ ఎక్కడిది? యిలా ఒక్క అరఝాము, ఆ చిన్నే. - చిద్విలాసం నడిచింది. మస్తానయ్య ముక్తాయింపు ముగింపుకు తేంగనే, ఎక్కడివక్కడికి తప్పుకున్నాయి.

అన్నప్పగారు, రామరసాయనం సేవించినవాడికిమల్లే పెల్లుబుకే ఆనందంలాగా ఒక్క అరగడియ కూచున్నచోటే ఉన్నాడు కదళీకందమల్లే. పండు నిదరుపోయి, మేలుకున్నవాడికి మల్లే నింపాదిగా, చూపూ కవళికా సంబాళించుకొని, ఆహాఁ- అని నింపాదిగా అంటూ లేచి నిలుచున్నాడు.

అన్నాడు, 'మస్తానయ్యా! ఆదికాలంనాడు, యమునా తీరాన, ఆ నల్లనివాడు, లేగలతో యిలాగే ఆడుకునే వాడంటావా?'

'మీ మాట నాకు అరదం కాలేదు' అన్నాడు మస్తానయ్య. 'మీ తీరే నాకు అర్థం కాలేదు. దానికేంలే! కాని, సాయేబయ్యా, నీకు ఏ దేవుడీ జన్మయిచ్చి, యీ విద్యయిచ్చాడో, వాడే, మా కళ్ళు చల్లగా ఉండేట్టు, వెయేళ్ళపాటు నిన్ను మరచిపోవాలి!'

'యిదీ అరదం కాలేదు.' అని నవ్వుతూ అన్నాడు మస్తానయ్య.

'కాకపోయినా, నేనన్నది కాక తప్పదులే!'

అని అక్కడ నుంచి కదిలాడు.

మస్తానయ్య, ఆయనను ఆపి సాష్టాంగ ప్రణామం జేశాడు. ఈయన తెల్ల బోయినాడు. 'అఁ-!- యిదేమిటి యిదేమిటి? నేనే జేయవలసింది నీవు చేస్తే ఎట్టాగయ్యా!'

- - మళ్ళీ దర్శనం జేసుకుంటాను-

అంటూ నడక సాగించాడు. పదిబారలు సాగగా, చింతాలు వచ్చి కలుసుకున్నాడు.

'అయ్యా! ఎలా ఉందా ముచ్చట!-'

'ఏం చెప్పను; యిక్కడ వున్నవాళ్ళు, మనుషులో దేవతలో చెప్ప శక్యంగాకుండా ఉంది. ఆ సాయేబు–'

ఏ సాయెబేమిటి! మస్తానయ్య–

'మస్తానయ్యను సాయేబును చేశారేమిటండోయ్! ఆయన బ్రాహ్మలండీ, మల్లావధాన్లగారు – యేదం అంతా ఒక్క గుక్కను ఒప్పజెపుతారు.'

'ఆఁ ఎట్టా, ఎట్టా!'

అవునండీ, ఆరిది మనపేటే, బావకు ఓ వేలిడిసిన బామ్మరిది అవుతారు. సిన్నప్పుడు, బిడ్డలు దక్కకపోతే కన్నోరు యీ పుట్టినాయన్ను మస్తాన్‌గారి దరగాకాడ తురాయి గట్టించి ఆ పేరెట్టుగున్నారు. పెద్దోరయిన తరువాత మీ లాగే కొండి పిలకెట్టించుకుని యెన్నేళ్ళో సదువు జెప్పించుకున్నారు. అప్పుడేం జరిగిందంటే– పేటకు ఓ ఫకీర్ బాబా రాంగనే, ఆరెంట వీరు పడిపోయినారు! ఎన్ని సమచ్చరాలు ఏడతిరిగారో, ఏం జేసారో మనకేం తెలుసు? రెండేళ్ళనాడు తిరిగొచ్చారు. వెంట ఆ సిందేసే మేకల్ని దెచ్చుకున్నారు. అదే ఆరికి ఆనందం, మరో జోలికి రారు.

'ఏమిటో ఆ సాధన!'

'ఓ సాధకం జేయరు ఓ సాము జేయరు; మనందరిలో మడిసిలాగానే ఉంటారు; బువ్వదింటారు. నవ్వుతూ ఊసాడతారు. ఎన్నడన్నా అమ్మోరి మందిరంకాడికి వచ్చి యేదం సదువుతారు. ఆరు సదువుతూంటే శాంతయ్యగారు, ఆరన్న దానికి పై ముక్కలు పిల్లంగోవి మీద వాయిస్తారు! అది, మా లాటోళ్ళకు యినేందుకు మా రమ్జుగా ఉంటదండీ.'

అవును; బ్రహ్మానందంగా ఉంటుంది!

యితగాడికి, తల్లీతోడూ అంటూ–

ఓ గంపెడు బలగం, కట్టుకుపోయినంత ఆస్తి – ఏదీ తనది కాదనుకున్నాడు.

పోనీ, వాళ్ళెవరూ చుట్టపుచూపుగానన్నా – అతీగతీ కనుక్కుంటారా?–

'ఆరికేం బట్టింది? ఎవరి మట్టుకు ఆరు,–'

సాలినోరే, అయితేనేం, యీయనకాడ లప్పంతా తవురికి కట్టబెట్టలేదని, మంట! మస్తానయ్య దేశంమీదికి బోయినేళ – ఎవరికోరు బొర్రెదదామని జూశారు. కాని, మన సోములుగాడు, వాడున్నాడు గదుండీ, పుచ్చెల్తో బెచ్చాలాడే రకం–

అయితే తమాయించే ఉన్నాడు!

అవును మరి, తాను, కావండ్ కాదు, పాలేరాడు – ఎదుటోరు సూద్దామా అంటే, బ్రాహ్మర్లు సావంతులు!

నేనేం పాపాన బోయినా సరేగాని,–

యీ పెద్దింటోడికున్న నీతి, నిజాయితీ, యీ గొప్పంటి మారాజులికి లేకపోయింది.

బెమ్మదేవుడి శిరసుల్లోంచి బుట్టుకొచ్చారట, యీరు, ఒకటికి నాలుగు తలకాయలయే సరికి, తలకో ఆలోచనబోయి, బుద్ధి నిలకడుండదంట ఆయనకి. ఆ గాచారమే, వారసత్తంగా, యీరికీ దఖల్ పడిందని రంగమ్మగారు జెప్పారండీ... ఏందయితేనేంగాని సోములుగాడు ఆరినో గుక్కట్టించాడండి! గడ్డిపరక ఆరిసేతి కందనిస్తేనా.–

తవురికడ్డమొస్తే నిలువునా పాతరేయిత్తామన్నారంట. ఆడేమన్నడు? అయ్యా పరాయిసొమ్ము యిసం! బ్యామర్ల యిసం బెట్టిన పాపం నాకెందుకు? తిండికి తక్కువైతే గొప్పోరికడ చేజాపండి! అంతేకాని మీ సాటోరు మీ కళ్ళముందు పుట్టినోరు మల్లన్నగారు నేలగలసిపోతే ఆరి ముల్లె మీకు దక్కాలని ఆసెకు పోకండి. యీ గాచారం బిడ్డ బిడ్డ తరాన సుట్టుకుంటుంది. బగవంతుడు తిన్నగా జూసి మల్లన్నగోరు తవురందరికన్న యేడింతలెక్కువ బతకబోతాడు, సూద్దురుగానిగా అన్నాడు. ఆపైన వీడు మాటకు లొంగేరకం గాదనుకొని తాశిల్దారుగారు జమాబందికి రాంగా జూసి ఆరినాకట్టుకుందామని జూశారు. యీపూది బెత్తెడు మందాన పట్టించుకొని సేలువలుగప్పుకొని, సెవులకుండలా లాడించుకుంటూ,– సెప్పినవన్నీ దబ్బరలేగంద!'

'ఆరు, యిచారిస్తాంబొమ్మని పంషేసి, సోముల్కొబులావ్' అన్నారు : యీడెళ్ళాడు; ఉన్నదున్నట్టు జెప్పాడు : ఆస్తంతా తవురి కొగ్గేసి తప్పుకుంటే, సెరువు కింద సెక్కరెండకరాలు, కట్టార్జితం జేసి యిస్తామని ఎరజూపినారని, సత్తెప్పమానంగా సాచ్చీకం దెస్తానని జెప్పాడు. సరే, పోరా అన్నాడు. ఓహో యిదా కత! అని, ఆసాముల నందర్నీ రప్పించాడు. మాంచి మరేద జేశాడు. మాటల్లోకి దించి, 'అయ్యా, నేను కులానికి భజంత్రీ వోణ్ణి, మా తాతముత్తాతలందరూ, పొదట్టుకున్నాళ్ళే : యిప్పటికీ మా సినతాతకొడుకు బిడ్డలు, కులవృత్తే జూసుకుంటున్నారు. నేనూ, సిన్నప్పుడు మా నాయనెంట బడెళ్ళి, సెక్కులూడదీసినోణ్ణే! యింతమంది తవురిలాటి తలకు మానినోళ్ళు కంటికావడేసరికి, చేయి పురపురలాడుతూంది. నేను సాయంగా, సబ్బురాసి, గీసేసి, అబద్ధానికోగంటుసొప్పునెట్టి, గంటుకు సున్నం బట్టించి, బత్తె కర్చులిచ్చి, పంపేస్తాను; ఏమిటి సెలవు! అనేతలికి, అన్నంతపనీ జేస్తాడేమోనని గజగజలాడిపోయారంట! కాని, గడుసోరు కావడంతో, 'మీరు స్వయంగా పూను కొంటామంటే అంతకంటేనా, కాని, మా యింటి మంగలి మాకు ఉండనే ఉన్నాడు. వాడి నోటిముందర కూడు తీసేయడం, అధికారులకు భావ్యం కాదు. పైగా పుస్తకం బట్టిన చేత్తో పొదిపడతాననడం, మీకు అంత శ్రేయస్సుకాదు. అదిన్నీగాక, అంత దూరాభారాన శ్వేత ద్వీపంలో కొలువుదీరి వుండి, కేవల కటాక్షవీక్షణం ద్వారా, భరతఖండంలో ప్రజల యోగక్షేమాలు కనిపెడుతూ ఉన్నటువంటి ఆ ప్రభువులు తమ ప్రతినిధిగా, మిమ్మల్ని ఏర్పాటుచేసినారనే విషయం మీరు కలలోనైనా విస్మరించరానిది. రాజు ఎషువంటివారో ప్రజలున్నూ అషువంటివారే అవడం కద్దు అని మన ఋషులు సెలవిచ్చే ఉన్నారు గనుక, మీరు మామీద అనుగ్రహం కొద్దీ, యీ పనికి పూనుకుంటే... అక్కడ ఏలినవారికిన్ని యదేకులవృత్తేనేమో, అని అభిప్రాయం కలుగవచ్చును. కనుక అన్నదాతలైనటువంటి ఆ యొక్క ప్రభువుల పరువు మర్యాదలను కాపాడే నిమిత్తమైనా, మీరు మాకు తలపెట్టిన సత్కారం జరిపించకుండా ఉండటమే ఉచితం అని తోస్తున్నది. అలాక్కాదు, దాని బరువు బాధ్యతలు, నేను జూసుకుంటాను, నా ఆజ్ఞప్రకారం తల ఉగ్గండయ్యా అంటారా,... యిది పరోక్షంగానైనా రాజాజ్ఞే, కాబట్టి తిధివార నక్షత్రములతో నిమిత్తం లేకుండా, పచ్చని యింటో యీ ఓగాయిత్యమేమిటని అయినా అనుకోకుండా, చేతులు కట్టుకుని కూర్చుంటాము. ఆ పైనంటారా, యిది ఏగాని క్షౌరంకాదు గనుక మాసానికి దోసెడు రూపాయిలు తెచ్చుకునే ఉద్యోగస్తుడు, చేసిన నిర్వాహకం కనుక, తడవ తడవకూ తలతడిమి చూసుకుంటూ, మీ ఘనత నలుగురికీ వెల్లడయేట్టు

సంచరించగలము!' యిట్టాగనేసి, ఆరి నోరుకట్టేసి, తప్పించుకుని బయటపడ్డారంట. కాని, ఆ తాసిల్దారు బదలీ అయిపోయేంతవరకూ, వీరు నిద్దరోలేం- యింక ఏమనుకున్నారో ఏందో, మరి సోములు జోలికి రాలేం, యింతలో మల్లన్నగారు రానేవచ్చె.-'

పిచ్చోడల్లే యెల్లిపోయినోడు, బీషిములోరల్లె మర్లొచ్చినాడు. ఈ బూమీ పుట్రా తనకెందుకూ, బూమి పుట్టించినోడు దేవుడు, ఆడిసొమ్మాడిదే, అనేశాడు. కాని సర్కారువారికోసమంటూ లెక్కేదో, ఉండాలిగందా అని చేషయ్య బావ జెప్పినమీదట, అమ్మోరికప్పజెప్పి, అట్లని పట్టా రాయించాడు. తల్లి దగ్గిర పాలు బిడ్డలందరూ త్రాగినట్టు, యీ గడ్డమీదున్నోళ్ళందరూ : అందులో పండే గింజాగట్రా తింటూ సుఖంగా ఉండాలని కోరుకున్నాడు. అట్టానే జరుగుతూందిలేం కనుచూపు మేరదాకా, అంతా అమ్మోరి పరగణా-

'ఆ సోములు బాగున్నాడు?'

'రాయిలాగున్నాడు, - మనం కూసింత లెక్కబోతే తగుల్తాడు.'

... అక్కడంతా యిహ దానిమ్మతోట. తోటేమిటి అదో పెద్ద అడవి. పక్కనే చిన్న తగుపాటి తటాకం. గట్టుచుట్టూతా జేమచెట్లు.

తటాకంలో అమ్మోరి వాహనం యీదులాడుతూంది. వీళ్ళను చూసీ చూడటంతోనే నీళ్ళలో ఉండే గర్జించి ఒడ్డెక్కి జూలు విదిలించుకుని చింతాలు మీదికి దూకింది - అమ్మా - మా అమ్మా! అంటూ సందిట వేసుకున్నాడు! అక్కడనుంచి అన్నప్ప ముందుకు దూకింది- అప్పటికి ఆ రూపు అంతు చిక్కింది.

షుమారు పదేళ్ళ ఆడపిల్ల-

మొగం చంద్రబింబమే!-

కెంపుల్లాంటి జడలు -

తామర రేకులలాటి కళ్ళు,

ఆ చూపు- సూర్యమండలం,

ఆ నవ్వు - గర్జన -

అన్నప్ప -విస్తుబోయి అప్రయత్నంగా నమస్కారం జేసినాడు. అమ్మోరి వాహనం - ఎగిరి ఆ చెంపను యీ చెంపనూ; పెట్టుపెట్టి లేడల్లే పారిపోయింది! ఆ తాకిడికి అన్నప్పకు కంటనీరు కమ్మింది.

'అయ్యా! అయ్యా, ఏం అదృష్టమండీ!'

శాంతయ్యగారిని అలా కొట్టింది-మళ్ళీ మిమ్మల్నే కొట్టింది, ఏం నిదర్శనమండీ! ఆ తల్లికి-మీమీద్దయొచ్చింది. యిందరమున్నాంగదా-ఒక్కరికీ అంతపున్నెం లేకపోయె-'

మళ్ళీ యిల్లా దయచేస్తుందా?

చెప్పలేం, ఆ తల్లిదయ!

కొంచెంసేపు, ఆ తల్లిదయ!

కొంచెంసేపు యిక్కడ ఉందామా!

తవురి సిత్తం-

-అన్నప్ప కూర్చోబోయినాడు.

'అయ్యా, అయ్యా! అని చింతాలు వారించినాడు. అమ్మోరి వాహనం తిరిగే యింతలెక్కా, నర మానవుడు కూచునే ఆచారంలేదు. తెలియక ఎవరన్నా సదికిలపడితే

ఓ జాంచేపు మోకాళ్ళట్టుకు బోవడమే, కూకన్న కాడ నుంచి కదలేరు. అయినా బాదేం ఉండదు. ఆ తల్లిందలుచుకుంటూ అల్లా వుండగా. ఆయమ్మకు, దయొచ్చి వెన్ను జరచినట్టవుతుంది. అప్పుడు, ఆ తల్లిలాగానే, – కాళ్ళమీద చేతులమీద నడుచుకుంటూ ఈ మయం దాటంగానే మళ్ళీ నిటారవుతారు. అంత సత్తెముంది. సాధారణంగా, యీ కద మనిషి అలికిడుండదు, ఒక్క సోములు తప్ప. ఆడు అమ్మోరి వాహనానికి లెంక! ఆడే దానిమ్మ గింజలు రసం పిండి, ఆ యమ్మకు బడతాడు. మున్నూటరవై పొద్దులూ, అదే ఆహారం. ఎన్నడన్నా, జేమచిగుళ్ళు కొరుకుతుంది. మరేదీ నోట బెట్టదు.

'అవును! అది అమృతం ద్రావిన పుట్టుక. ఏదో ఓ ఆహారం పుచ్చుకోవడమనేది అదో లీలా, కాని ఆకలి దప్పికలుండా! ఈ తల్లి ఈ గడ్డమీద వెలసి ఎంతకాలమయిందో?

'పదేళ్ళ లోపండీ, పరాయి బిడ్డకాదు, పుట్టటం మనిషిగా పుట్టింది, మనిషికే పుట్టింది; మన సోములుగాడి మనుమరాలండీ, సొయాన, సొంతకూతురిబిడ్డ! –'

'అమ్మోరి సంబరాలకని బెజవాడకు బోయి కొండమీద బందుకొనుండగా, మీనమ్మ కల్లోకి, అమ్మోరి వాహనం దూకిందట : ఆ దూకిందల్లా, పసిబిడ్డయిపోయి, ఒళ్ళో పందుకున్నట్టు ఆపించిందట. తెల్లారి మేలుకొనంగనే, సత్తెం దలచుకుంటూ చెంపలేసుకొని, అమ్మా దురగమ్మ తల్లే! నీ విచ్చిన పున్నెం నిజం జేస్తే వచ్చే సాలుకు బిడ్డందెచ్చి, నీ పాదాల కాడుంచుతానని, మొక్కుకున్నదంట? సత్తెమంటే సత్తెమే! పున్నెన బోయింది. పురుడోసుకుంది, కాని కల్దెరిచి బిడ్డను చూసుకునే తలికి మనిషిబుద్ధికనక బెంబేలు పడిందట. ఒక్కచ్చణం... మళ్ళీ గుక్కదిప్పుకుని, లెంపలేసుకుంది లెగుండి! దాని మొగోడికీ సత్తేలేం బట్టవు! ఏందీ పిల్ల అడివిలో ఒగ్గేయమన్నడంట! మీనమ్మ కాగ్రం వచ్చి మూతిమీద గొట్టింది.దాంతో దానికాపురం ఏటగలిసిపోయింది. గూడెపోళ్ళు నలుగురూ ఆడికి అట్టనరాదని బుద్ధి చెప్పినారు. ఆడైతే మామకాడ ముల్లెజూసి మెత్తబడ్డడు కాని, యిది మొగ్గలే. అమ్మోరి వోగనాన్ని అంత కూతకూసిన ఆ మడిసి మొగం మరి జల్మకు జూడనంది. అమ్మా! యెయ్యేళ్ళు బతకాల్సిందుందికదా, యీ కుమ్మరాం దెచ్చిపెట్టుకునెట్ట బతుకుతావే! అన్నాడంట సోములు. ఆ అమ్మ పాదాలకడ బడుంటనన్నదంట! అంతే ఎవరూ నోరెత్తలా! అనుకున్న లెక్కప్పెకారం బిడ్డను కొండ కెత్తుకెళ్ళింది. సోములు యెంటెళ్ళాడు. ఈ తల్లి నిట్టిట్టు బెంచమని, దురగామ్మోరు సొపనం యిచ్చిందట! అంతేనుండీ సోములు అట్టనె యినుకొన్నాడు. దానిమ్మలు బెంచినాడు, జాంచెట్లు బెంచినాడు. మరో మడిసి ఆసరా లేకుండగా ఒంటిసేతిమీద నా చెరువు దొవ్వినాడు. సుట్టుపక్కలంతా వనం జేసినాడు. ఎండకు గొడుగట్టినట్టు, యెంటంటే తిరుగుతూ ఉంటడు. సంజపడిందో, మరి, ఆ చాయలకు బోడు. ఆడేమిటి నరమానవుడు బోడు. అమ్మోరు కొండమీంచీకడకొచ్చి, రేయికి రేయంతా వోహనం మీద ఊరేకుతుందట! ఔ నదేసత్తెం, అమాసనాడైనా అంతమేరా యెన్నెలబూసినట్టుంటుంది. యిదీ యిక్కడి యెవ్వారం....'

వాడలా అంటూ వీరు వింటూ యింటి దరిదాపులకు వచ్చేశారు. 'అయ్యా' నేనింక దిగడతాను. తవురు బోంచేసి ఓ కునుకుదీయండి. పొద్దు వాటారంగనే వచ్చితోడుకపోతాను. మా సాములుజ్జాదురుగాని!' అన్నాడు చింతాలు.

"ఆc, సాములుజ్జాసేదేమిటి లెస్తూ! యింకా యిలాటి విశేషాలేమన్నా ఉంటే చూపిద్దూ' అని చప్పరించి మాట తేల్చేశాడు అన్నప్ప.

'ఏ యిసేసం లేందీ తవురితో జెప్పాల్సిన పనేందండీ?'

అన్నప్ప, 'సరేలే చూద్దాం' అన్న ధోరణిలో అంటే – ఎన్ని కబుర్లో అడగాలి!–

'అమ్మయ్యో మా ఆడకూతురూరుకోదండీ! యింతకు ముంగలే, పోతూ పోతూ, తవురి కంట బడకుండా ఖబడ్దార్ అన్నట్టు సైగజేసి వెళ్ళింది. తవురెంటుంటే యిడిసిపోలేను. యిప్పటికి యిడవండయ్యా! ఒక్క అంగన పోయి ఒక్క ముద్దతిని దాన్ని కుశాల్ మీదుంచి లగెత్తుకొస్తా–'

భార్యా అంటే అంత భయముందన్నమాట?'

భయమనుకోండి భకితనుకోండి!

సేతగాని సన్నాసి నన్నిపొద్దు లప్పు దుసూరుమనిపించా! అది తలచుకుంటే యెర్రెత్తుతుంది. యింక యీ జనమకు, దానికంట, నీటి సుక్కరానీను, అన్నప్పగారూ, మా అమ్మోరికాడ జెప్పిందే, తవురికాడ జెప్పుతుండ. గుళ్ళోకిబోయినా మరే కోరికా మొక్కను, మా రంగణ్ణి సల్లంగ సూడమనే. నాకు యింక మరే అదురుష్టమూ అక్కరలేదండీ. రంగడు, కళ్ళతో హుకుం జారీజేస్తే జీ సాహెబా! అనుకుంటూ యెయ్యేళ్ళు బతుకుతానండీ!

'తథాస్తు! ఒక్క వెయ్యేళ్ళేం లెక్క చింతాలూ, –మీరు శాశ్వతంగా, – యిలాగే సుఖంగా ఉంటారు నాయనా!–

'మనిల్లిక్కడి కెంతుంటుంది–?'

'కూసింత దూరమే; యిటెంతో, అటు అంతే!'

"అయితే నీతోబాటు ఒక అడుగు అటే వేస్తాను– నీ కూతుర్ని చూడనేలేదు : దాని బుగ్గమీదో చిటికేసి, పోయి భోంచేసొచ్చి, మధ్యాహ్నం కాస్సేపు మీతో బాటుంటాను."

చింతాలు నవ్వి, తల ఊగించాడు. యిద్దరూ చేమలుపు తిరిగి, అక్కడికి జేరుకున్నారు. బాదం తోపులోంచి గ్రామం కనబడుతూనే ఉంది. తోపు దాటగానే – ఆహాఁ అది, గ్రామమేమిటి, దాని సౌభాగ్యం మహాపట్టణానికి, లేదు; కావడానికి, అన్నీ తాటాకుయిళ్ళే,– కాని, ఆ నిండుతనం! ముందూ వెనకా, వేపచెట్లు, రహదారిగా దిరిసెన చెట్లు, ఆ నీడలో, దేవతార్చనలో, దీపారాధనకు కుందులమర్చినట్టు, గ్రామం కనుసొంపుగా ఉంది.

ఉంది, అష్టదళ పద్మాకృతిలో,–

నడిబొడ్డుగా, –ఏనాటిదో మర్రిచెట్టు మహావృక్షమైపోయి, బాగా విస్తరించి పెళ్ళిపందిరల్లే ఉన్నది. ఆ నీడను విశాలంగా, యిన్నూరు మంది కూర్చోవచ్చును. కావలసినంతమేర చపటా కట్టారు. అటూ యిటూ చూసుకుంటూ అక్కడకు చేరుకున్నారు. చింతాలు పైకి చూసి, దణ్ణం పెట్టాడు. కొమ్మమీద కృష్ణుడున్నాడు!; అఁ– అనుకున్నాడు, అన్నప్ప!– మన రంగమ్మగారు దయచేసినారండీ, స్వామోరిని! మర్రిచెట్టు అలా, దిసిగా ఉండరాదంట, గ్రామానికి రక్ష కావాలంట. అందుకని, ఆరు నవాబుల రాజ్యంలో, గండా శిలిపి అని బ్రతుకుతున్నారట. ఆరికి చెప్పంపించి, చిన్నకిట్టమ్మలని రప్పించారు.

అయ్యోవ్! మన గ్రామం అంటే యింతమేరే అనుకున్నారేంటి? నాలుగింతలుంది. ఆచార్లుగారు యేసిన పంపిణీ యిది; తావర పదమానికి, నాలుగు రెక్కలంట; ఆరు, రెక్కకో పదమం జొప్పున, నాలుగెనిమిదులు ముప్పైరెండు, అదో దేవతా లెక్కంట. ఆరు, నడుం కట్టుకుని, యీకడ నిలబడి, యీ నిరవాకం జేశారు...

'బాగుంది, దైవం రక్షించి, కుటుంబవృద్ధి అయి, సంసారాలు పెరిగితే,–'

'అంటే యిప్పుడున్న జాగా సరిపోకపోతే ఏం జేస్తారనేగా, తమరనేది? ఆచార్లగారు ముందు జాగరత మీదే ఉండారు. పిల్లలు పెద్దోళ్లై, యింటికి ఓ కోడలంటూ అల్లుడంటూ రావడం అంటూ వచ్చినా, యీ తరానికేం యిరకాటం ఉండదు. యింక ఆళ్ళ పిల్లలనాటి మాట. అప్పటోళ్ళ మోజుదెట్టగుంటదో? మాలాగే పచ్చని నీడనే ఉంటరో, బవంతులే కట్టుకుంటారో.'

'మీ చేషయ్య బావ కట్టుకున్నట్టు.'

'అది బావ మోజు కాదుండీ,'

'మాతో బాటే ఉంటనన్న దానికి ఆచార్లుగారు ఒప్పుగోలే! కొన్నాళ్ళపాటు నాలుగోడల మజ్జెనా నిదరోవడం, ఒంటరోదు కనుక, అలవాటుకొద్దీ ఆడ ఉంటున్నాడు కానీ, రేపీ పాటికి, మా యింటి పక్కకిరాడూ; ముందలగనే చేషయ్య బావకో యిల్లు కేటాయించాంగా! యెప్పుడన్నా, యిల్లు వాడుకుంటూనే ఉన్నాడుగా! నలుగురూ జేరి కష్టం సుఖం జెప్పుకునేది, అడనేగంద.'

... యిదిగో యిదే మా నీడపట్టూ!'

యిద్దరూ, లోపలికి అడుగుపెట్టారు.

కావడానికి అది నిట్టాళ్ళపాక కాని, లోపల ఎంత శుచి, ఎంత శుభ్రత! పైగా ఆ కళ!

ముందర అర. తగుపాటి విశాలంగా ఉంది. చుట్టూ నడుం ఎత్తు, గిలాచీ చేసిన రాతిగోడ; గోడల నిండా సందులేకుండా రంగురంగుల సుద్దతో జేగురుతోవేసిన దేవతామూర్తుల బొమ్మలు లక్ష్మీ, సరస్వతి, పార్వతీ, వినాయకుడు, రామపంచాయతనం, శివపార్వతి లీలా నాట్యం, రాసక్రీడ చిత్రములన్నీ ముద్దులుగారుతూ, కొట్టొచ్చినట్టు కనిపిస్తూన్నవి...

అన్నప్ప, చింతాలు వంక జూశాడు. 'యిది నీ ఘనకార్యమేనా' అన్నట్టు అతడది ఆకళింపు చేసుకుని 'నేను కాదండోయ్. నాకు అంత చెయ్ దిరగదు. రంగడు చేసిన చేతే, యింటికి యిల్లంతా దేవుళ్ళమయం చేసింది. అట్టయితేనేగాని ఆరి మొగాల్జూసయినా నేను బుద్ధి కుదురుగ ఉంటానని నమ్మకంట! నాకు మాసెడ్డ ఉక్కిరిబిక్కిరనుకోండి. నవ్వేందుకూ కుసింత తుళ్ళేందుకూ యీ కడ జంకే...'

'ఆహాఁ! పిల్లదానిది, ఓ విధంగా చూస్తే కానరాని గుడుసుదనం. మొగకొడుకు యింటికి అలిసి సొలసీవచ్చి, చిరాకున చిర్రు బుస్సుమనకుండా ఉండేందుకు, యిది మా మంచి మంత్రం; యిందులో యిహమూ పరమూ రెండు ఉన్నాయి : చెయి తెరపిగా ఉన్నప్పుడు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోకుండా, యిలా ప్రొద్దుపుచ్చడం ఎంత విశేషం? అదిన్నీ కాకుండా, మొదటి నుంచీ వీరినే నమ్మింది, అపరదైవానివి గనుక, నిన్నూ నమ్మింది. ఈ ఉభయులూ కూడా దాన్ని చల్లగానే చూస్తూ ఉన్నారు. వేయేళ్ళకూ, అలాగే కంట కాపాడుతారు!...'

'ఏందండే తవురూ అలా అంటారు? నేను దేవుడంటాడినయితే నన్నే నమ్ముకున్న ఆడ కూతుర్ని, అద్దానపడవిలో జారిడిచి, జాడన్నా తెలియకుండా ఎగిరిపోతానా? అది కంట తడెట్టిందంటే ఊరికే బోతదా, దాని మొగాన కుంకుముండే రాతుండబట్టి, నా పీక

తెగాల్సింది పోయి, యీ యేళ్ళతో సరిపెట్టుకుపోయింది. ఛస్ నేను మంచోణ్ణని, తవురూ అనడం బాగోలేదు.–'

'అనకపోతే, నా చెవి మెలేయదూ?'

ఒరే అమాయకపు సన్నాసీ! నీ పెళ్ళాం అప్పుడు, రంగడలా రాగా లెట్టిందంటే, నీవు అన్యాయం జేసిపోయినావనా? – ఛాం– ఛ! తనలాటిదాన్ని కట్టుకోబట్టి కదా,– నీకిన్ని అగచాట్లు వచ్చాయి కదా అని!– కావాలంటే రుజువిప్పిస్తా... చింతాలూ, యీ కృష్ణాతీరాన పుట్టిన ఆడపిల్లలందరూ, రుద్రమదేవుల్రా నాయనా, దద్దమ్మలుగారు... మరేమనుకున్నావ్?–

'సరేకాని, – నీకు చీమ కథొచ్చా... రాదూ!–'

'చెపుతా విను:'

'అనగనగా! ఓ రాజు, రాజుకో భార్య!–

ఒక్కటంటే ఖరారుగా ఒక్కతే!

ఆ పిల్లదంటే అతగాడికి ప్రాణమే అనుకో!

ఆయనకు అన్ని జంతువుల భాషలూ వచ్చు!

అది, ఆ రోజుల్లోకూడా విశేషమే!

ఒకనాడు సాయంసమయాన వనవిహారం జేస్తున్నారు.

ఆ సందర్భంలో, ఆయన కేదో యాదకువచ్చి, మందహాసం చేశాడు. అంటే చిరునవ్వు నవ్వాడు. వాళ్ళు అందరి మనుషులలాటి వాళ్ళు కారు గనుక, – సంతోషం పట్టరానంతగా వచ్చినా, నోరారా హాయిగా నవ్వేందుకైనా నోచుకోలేదు. ఆ పుటక అదీ! ఆ పెంపకం అదీ!

ఆయనలా నవ్వడం రాణీగారు చూసింది.

కారణం ఏమిటో చెప్పమని కంఠం పట్టుకుంది.

ఎన్ని విధాలో చెప్పి చూశాడు. కాని ఉహుం–

"చివరకు యీ సంగతి నా నోటంట చెపితే నా శిరస్సు వ్రక్కలౌతుంది. యిది దేవరహస్యమే సుందరాంగీ' అని కూడా గడ్డం పుచ్చుకుని బ్రతిమాలుకున్నాడు. అయితేనేం రాణీగారిది భల్లూకపట్టు–

'నేను నీ ప్రాణాలకన్నా కూడా అధికురాలనని నీవే అంటూంటావు కదా! నా దగ్గిర ఏ రహస్యం దాచను అని చేతులో చెయ్యి వేశావు కదా– యిప్పుడీ నాటకం ఏమిటి? నీవు ఎవతెనో తలుచుకుని, దాని వయారం తలచుకుని ఒళ్ళు తెలియకుండా నవ్వావ్! నన్ను మభ్యపెట్టేందుకు యీ నాటకం ఆడుతున్నావ్! ఏది ఏం జరిగినా చెప్పి తీరాల్సిందే' అని కూచుంది. 'నీవు నిజం చెప్పకపోతే నేను యిలా కుమిలిపోతూ ఉండలేను' వగైరా వగైరా, వేపుకుతింది. రాజుగారు 'యిదేమిటి? యీ మనిషి యిలా తయారయిందేమా' అని గిగనాసిల్లి పోయినారు. తెల్లవారేలోపుగా నాకు నిజం చెప్పకపోతే యీ జన్మకు యింతే అని కూడా అనేసింది. దాంతో మనిషికి కాళ్ళూ చేతులూ ఆడక హంసతూలికా తల్పంమీద అలా వ్రాలిపోయి కన్ను మూతపడక, గోడవంకే చూస్తున్నాడు.

గోడమీద ఓ దోమ వాలింది.

మహారాజుల అంతఃపురాల్లో కూడా, దోమలుంటాయా? అంటావా? తతిమ్మా

రాజభవనాల భోగట్టా మనకేం దెలుసుగాని ఆ సమయంలో ఆ స్థలంలో దోమవాలినమాట మటుకు ఖాయం.

అదల్లా వాలి, రెక్కలు తడుముకుని, అటూ యిటూ చూసి, అమ్మయ్య, అనుకునేంతలోనే ప్రక్కను మరో దోమ వాలింది.

వాలిందే తడవుగా పనస ప్రారంభించింది!

తప్పించుకు పోదామనుకున్నావేం!

నీవు ఎంత ఎత్తు కెగిరితే, నేను ఎగురుతా!

యిందాక ఎందుకు అలా నవ్వావో, చెపితేకాని వదలను. చెప్పితీరాల్సిందే, అని సంగీతం మొదలెట్టింది.

ఏ పుటక పుట్టినా, యీ యిరకాటం తప్పేట్టులేదే అని రాజుగారు నవ్వడం మొదలుపెట్టారు.

ష్‌ఁ– రాజుగారు నవ్వుతూన్నారన్నాడు దోమ.

యీ నవ్వెంతసేపు, అని అటుకేసి ఎగిరి జబ్బ చురుక్కుమనిపించి వచ్చింది భామ!

రాజుగారు, జబ్బ నలుపుకుంటూ ఉలిక్కిపడి లేచి కూర్చుని, దోమవైనావ్ బతికిపోయినావ్. అదే మా జాతి ఆడదానివైయుంటే, ఏం జేశేవాడినో.

ఒరేయ్, అదల్లా వేధిస్తూంటే మెమ్మే అంటావేంరా, సిగ పాయదీసి నాలుగు ఉతకరా...! అని మనసారా అనేసి, వాటివంకే జూస్తుంటే, నికరంగా తానన్నంత పనీ జరిగింది.

ఆ ప్రాణనాయకి రొద భరించలేక, మీదకు దూకి, రెక్కలు విరిచి పట్టుకుని, అన్ని కాళ్ళతోనూ మట్టగించేసరికి, అది కూనిరాగం పెట్టి అగపడకుండా పోయింది. దోమ, జయించిన ధీమాతో సంగీతం పాడటం మొదలుపెట్టింది. రాజుగారి చెవిదగ్గర చేరి–కుట్టనుమటుకు కుట్టలేదనుకో! దానికి మటుకు ఆ పాటి విశ్వాసం ఉండదా ఏం?

తెల్లవారింది, ప్రొద్దెక్కింది. రాణీగారు, ఏడు వారాల సొమ్ములూ అలంకరించుకుని, మళ్ళీ రభసలో దిగారోలేదో, రాజుగారు ఆ భామామణియొక్క ఏడుపాయల జడను ఎడంచేత్తో ఒడిసిపట్టి ఆ చెంపా యీ చెంపా వాయించారు; రాణీగారు అతిసుకుమారి కావడం మూలాన దిమ్మతిరిగి పోయినా, వీరాధివీరుల వంశాన పుట్టిన కారణాన సంబాళించుకుని, కలకల నవ్వింది. 'ఎందుకా నవ్వు?' అన్నారు రాజుగారు. 'చెపుతాను – చెప్పకూడదని నాకేం పట్టింపులేదు – శాపమూలేదు.'

'నేను చక్రవర్తి కూతుర్నే అయినా, చిన్నప్పుడు ఎత్తి పెంచింది – మామూలు మనుషులే! వాళ్ళ మాటామంతీ – వాళ్ళ వైఖరీ, నాకు ముచ్చటగా ఉండేవి! నేనూ అలాగే పెరిగితే బాగుండుననుకున్నాను – కాని, పెద్దలు వల్లకాదన్నారు. ఠీవీ దర్పం, ఎదుటివాళ్ళను చిన్నచూపు చూడటం యిత్యాదులు ఆభిజాత్యానికి గుర్తులని, మనం అందరి మనుషులలాంటి వాళ్ళం కామనీ, కాకూడదనీ, కట్టడి చేశారు. నాకు యిదంతా కంటగింపుగానే ఉన్నా తల ఒగ్గక తప్పలేదు; అత్తవారింటికి వచ్చాకన్నా, నేను కోరిన తీరున సుఖపడతానేమో అనుకున్నాను. మీరు కిరీటం భుజకీర్తులతో ప్రత్యక్షమైనారు : గౌరవంగా ప్రేమించారు. నా కనుసన్నల్లో మెలుగుతూ అన్నిందాలా లోకువైనారు :

ఎట్లా మిమ్మల్ని మార్చి మనిషిని చేయడం? అందుకోసం యిలా మొండికేశాను. వేధించగా ఏ వేళకన్నా మీలో ఏ మూలల్లోనో నక్కి వున్న మనిషితనం రగులకపోతుందా అని ఆశపడ్డాను: నా పున్నెం బాగుంది. మీరు నాకు నచ్చిన మనిషి అయినారు' అన్నదట! రాజుగారూ రాణీగారూ ఎందుకో కీచులాడుకుంటున్నారు. ఆ పళాన పట్టుకు ఉదికాట్ట అనేటువంటి శుభవార్త మును ముందుగా రాజధానిలోనూ వెనువెంటనే రాజ్యం అంతటనూ చల్లనిగాలిమీద తేలుకుంటూ వచ్చి పరిమళం లాగా వ్యాపించడంతో వారి ఏల్బడిలో ఉన్న ప్రజలందరూను అన్నాళ్ళకు 'హమ్మయ్య' అనుకుని వాళ్ళు మనంటి మనుషులే అని తెలుసుకున్నవారై, ఆ రాజదంపతులు తమతోబాటు వారినిగానే భావించుకుని, వాళ్ళ కష్టసుఖాలు వేయికళ్ళ కనిబెడుతూ, కలిసికట్టుగా సుఖంగా ఉన్నారుట!

కనుక ఆడకూతురు ఆంతర్యం అలా ఉంటుంది. తనకు కోపం వస్తే నవ్వుతుంది. నీక్కోపం వస్తే, అయ్యోపాపం అని జాలిదలుస్తుంది. ఆలనా పాలనా అంతా లాలనే! సిసలైన ఆడదానికి తన పెనిమిటంటే, కడసారపు పసిబిడ్డవతూ. అవతలివాడు పేట్రేగి ధూమ్ ధాములు చేసినా, అదోరకం గునుపుక్రింద కట్టేసి బుజ్జగించి, మంచిగా మెలగడం అనేది, గోరుముద్దలు పెట్టినట్టు మెల్లిగా వంట పట్టిస్తుంది. అంతమాత్రాన చిన్నచూపు చూస్తూందా,-? ఎబ్బే; తాళికట్టినవాడు దైవమే! నలుగురూ కూడా మంచికిగాని చెడ్డకుగాని ఫలానా సుబ్బమ్మ పెనిమిటి అని చెప్పుకుంటూంటే ఎంతో ఉప్పొంగిపోతుంది. అందుకనే, గృహమంటే గృహిణియే అని పెద్దలన్నారు. రాములవారంతటివాడు, సీతమ్మ తల్లిని గురించి ముచ్చటిస్తూ ఏమన్నారు -'ఈవిడ నా యింటికైన లక్ష్మీదేవి!' కనుక చింతాలూ! ఫలానావాడు లక్ష్మీపుత్రుడు అనిపించుకోవడంకంటే, వీడు వర్థి లక్షింపతి అని అనిపించుకోవడం ఎంతమెరుగు! పెళ్ళాం అంటే నెత్తిమీది దేవత అనుకునేవాడే, వీడొట్టి యిల్లో నారాయణమ్మ! అని ఎందరు ఎద్దేవా చేయనీ - వాడే, అంటే నిజానికి నీవంటి వాడే సుఖపడేది! -' అన్నాడు.

రంగడు, నవ్వుకుంటూ లోపల నుంచి వచ్చింది.

అన్నప్ప 'యింటి వెనుకాల యింగువ చెట్టుంటే యిల్లంతా ఘుమఘుమనే అమ్మాయ్! నీవు ఏ మూలనో ఉండి మా కబుర్లు వింటూన్నావని నాకు అప్పుడే అనిపించింది. ఏం, చీమ కథ ఎట్లా ఉంది?'

'చీమ కథని దోమ కథ చెప్పారు' అని నవ్వింది రంగడు. అన్నప్ప, అట్టె మనస్సు కేసి పరకాయించి, 'ఆఁ' అప్పుడా చీమ తన యిల్లాలిని చూసి 'ఓసి యింటిదానా, విన్నావుకదా దోమకథను! ఎన్నడన్నా వెర్రి వెర్రి వేషాలేశావంటే జాగ్రత్త! అని హెచ్చరిక శాయంగా, అదు చీమ అంతకుముందే కుత్తుకబంటీగా తేనె పుచ్చుకుని వచ్చిందేమో, మాంచి ఉమ్మసంమీద ఉండటం చేతనున్నూ, అదీగాకుండా ఎన్నడూ తనను నిలవేసి పల్లెత్తుమాట అననటువంటి భర్త అకారణంగా, యిలా తనను గదమాయించడమున్నూ చూసేసరికి, మీదకు ఉరికి ఏమిటి యీ వాగుడు! అంది. దాంతో చీమనాథుడు ఖంగారుపడి యిది నా వాగుడు కాదే, నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పాడనీ ఆ సందర్భంలో అక్కడి గింజలేరుకుంటూ తాను అక్కడ ఉండి, అది వినడం తటస్థించిందనీ, మా ముత్తాతగారి తమ్ముడు నాకు దారిలో కనబడి చెప్పాడు. మంచి ముక్కలు కదా అని నీ చెవిని వేస్తే అంత ఆగ్రహమెందుకే, మనుషులు చెప్పుకున్న కథ

మనకు నచ్చకపోతే, అందులో పేచీ ఏముందీ? ఒకవేళ ఎన్నడన్నా నీవు మొండిపట్టే పట్టడం సంభవించితే, పది ఆమడదూరం పారిపోతాను కానీ, నీ ఎదుట ఉండి నెగ్గుకు రాగలనా? ఏదో బుద్ధి లోపమై యిలాటి కట్టుకథలు వినడం అంటూ వచ్చినా, నీతో చెప్పనుగా, అని బుజ్జగించి ఆ బుల్లి మొగం మరల కలకలలాడించి తానూ తన భార్యా సుఖంగా ఉన్నవారైరి!...'

చింతాలూ రంగడూ ఒక్కసారి కలిసికట్టుగా నవ్వేశారు – 'ఆహాఁ' కథ చెప్పిన ఫలం దక్కింది! వచ్చే జన్మక్కూడా ఏ రూపాన ఉన్నా ఈ కలకలా కలిమిడి మిమ్మల్ని అంటి పట్టుకునే ఉంటూంది.'

'ఏ రూపాన వున్నా అంటే? మళ్ళీ మనిషి పుటక రాదా ఏం?' అని రవంత కొంటెగా అడిగింది రంగడు.

'రాదని చెప్పలేంగాని వస్తుందనే ఖరారు లేనప్పుడు మాట జాగ్రత్త మీదుండటం మంచిది. అయినా – మారితే ఆకారం మారుతుంది కాని అంత మాత్రాన అంతస్తు మారుతుందా? అంటే నేననేది మంచితనం విషయంలోనే సుమా! పెద్దలేం జెపుతున్నారంటే–

మంచిగా పోయి ఫలం ఆశించకుండా ఉంటే, కానరాని మేలు కలుగుతూనే ఉంటుంది. అలా కాకుండా బుద్ధి వక్రించిందనుకో, తెలిసికూడా సరిదిద్దుకోలేదనుకో, తిట్టినతిట్టు గాలికిపోయిందిగాని – మొట్టిన మొట్టు జ్ఞాపకం ఉంది అన్నట్టు – దాని దాఖలా, వచ్చే జన్మలో అయినా కనబడే తీరుతుంది. వెనకటికి–

'ఓ పేద బ్రాహ్మడికి ఒక అమాయిక పెళ్ళాం ఉండేది. ఆవిడ నా అంత చక్కనిది. అయితేనేం, బహు అన్యోన్యంగా ఉంటూండేవారు. పైగా అతగాడు ఏకాంతాన రకరకాల ముద్దుపేరులుపెట్టి పిలుస్తూ, ఉబ్బేయడంతో, తాను అధిక – చక్కందాన్ననే అనుకునేది. ఇలా బహు, – ఆనందంగా కాపురం చేసుకుంటూ వుండగా, ఏం జరిగిందంటే, ఓ రాజకుమారుడు దేశ సంచారం చేసుకుంటూ మారువేషంతో యిక్కడికి ఒకనాటి ఉదయం వచ్చి, అలా చెరువు గట్టుమీద నుంచి వస్తూండగా – యీవిడ కనబడింది. యీవిడేమో వయ్యారం వలుకబోస్తూ నడుస్తుండటంతో – యీ కురూపేమిటి – యీ వగలేమిటని అతగాడికి నవ్వు వచ్చింది. ఎవడో పరాయి మగవాడు తననుచూసి అలా నవ్వేసరికల్లా – సత్తెకాలం మనిషి కనుక, అతగాడు తనను వంకరచూపు చూశాడనుకొని, దద్దరిల్లిపోయి, ఒక్క పరుగునపోయి రాణీగారితో మొరపెట్టుకుంది. అమ్మా – భూమి పుట్టిన యిన్నేళ్ళకు మన పరగణాలో యీ పాపం పుట్టడమేమిటి తల్లీ, ఎవడో దారినపోయేవాడు, ఓ యిల్లాలిని చూసి భ్రమసి నవ్వడమేమిటి ఏలికసానీ! యీ విలయమేమిటని వాపోతూ, యింతకాలంనుంచీ పరపురుషుడు నన్ను కన్నెత్తి చూడలేదు... నన్ను చేపట్టిన వారికోసమని భగవంతుడు నాకు కటాక్షించిన యీ చక్కదనం,–

అనేసరికల్లా రాణీగారికి కూడా నవ్వు ఆగింది కాదు; యీవిడ మొగం వంక చూడనూ నవ్వనూ, యిలా ఓపిక వున్నంతవరకూ నవ్వేసింది. ఆ అమాయకురాలు, రాణీగారు తన చక్కదనానికి మురిసిపోయి నవ్వుతూన్నదనుకొని, ఆహాఁ– మీదంటే దేవతాపుటక ! మీ వంటి వారు కంటజూసి ఒకసారికి పదిసార్లు యిలా మెచ్చుకుంటే నాకు ఏ ఆక్షేపణా వుండదు. యిది ఒకవేళ మావారికి తెలిస్తే వారు కూడా హర్షించే

విషయమే కాని మరోటికాదు: మీకు తనివితీరేట్టు చూసుకోండి, అని మొదలెట్టింది. దాంతో యిక అక్కడ ఉన్న దాసీ పిల్లలకూ నవ్వు ఆగిందికాదు: అది చూసి, యీావిడ మూతి ముడుచుకుంది. ఎందుచేత? రాణీగారంతటి ఆవిడ, మెచ్చుకున్నటువంటి తన చక్కదనం, యీ దాసీపడుచులు కూడా మెచ్చుకోవడం ఏమిటి? – వీళ్ళ తాహతు ఎంత? – అనే దర్పం ఆవహించింది. అది రాణీగారు యిట్టె కనిపెట్టేసి, అమ్మా, మీరు యీ అజ్ఞానుల్ని క్షమించాలి! యీ పిల్లలందరూ చకోర పక్షులలాంటివాళ్ళు. ఇంతకాలం నుంచీ యీ వెన్నెల ఎప్పుడు వస్తుందా అనే తపనమీద వుండటంతో మీ ముఖ చంద్రబింబం కనీ – కనిపించడమే తరువాయి, తనివితీరేట్టు చూడకుండ నిలువలేకపోతున్నారు.

ఇది వాళ్ళ దోషం కాదు. మీ చక్కదనం ప్రభావం!

అనేటప్పటికి ఆ అమాయకురాలు, మరింతగా సంతోషించి, అలాగే నూరేళ్ళూ బ్రతికింది.

ఈ రగడకు అంతటికీ మూల కారణమైనటువంటి ఆ రాజకుమారుడున్నాడే, ఆతడు, ఊరిబయట మామిడి చెట్టయి పుట్టాడు. పంటకాలంలో చెట్టు, కొమ్మ విరగకాస్తుంది. అక్కడ పిల్లకాయలు చేరి, రాళ్ళు విసిరి కాయలు, పిందె మిగలకుండా రాల్చేస్తుంటారు. జన్మంతా యిలా దెబ్బలు తింటూ, గడపవలసివచ్చింది. కారణం? తాను వెనుకటి జన్మలో, కావేషం లేకుండా, ఓ విధంగా కానరాని మేలే అయిందనుకో. అయినా దేని ఫలం దానికి తప్పదు?

అలా రవంత నొప్పించిన పాపానికి,–

జన్మంతా చిటిమొటి కాయలు తినడం,–

చేసిన మేలుకు తగ్గపుణ్యాన, ఎప్పుడూ పచ్చగా వుంటూ, నలుగురూ తనకోసం ఎగబడేట్టు పండూఫలంతో నదరుగా కనిపించడం ఆ జన్మలో మంచితనమే యీ జన్మలోనూ అబ్బి, కుర్రమూక అల్లా రాయీ రప్పా వేసి గొడవచేస్తున్నా – పోనిద్దూ అమాయకులు; వాళ్ళ రెక్కల కష్టం ఊరికే పోవడం లేదు. అదే ఫలం పాటు అని సంతోషించడం!–

యిహ, ఆ రాణీగారి సంగతి,–

ఏ మాత్రమో కుత్సితంతోనే నవ్వింది కాబట్టి, ఆ మామిడి చెట్టుకు తేనెతుట్టిగా పట్టింది. చెలికత్తెలందరూ తేనెటీగలై. పట్టు నిండుగా తేనె నింపేసరికల్లా, ఏ తలకు మాసినవాడో రావడం పిండుకుపోవడం! అంతటితో అది తప్పపడిపోవడం – నామ రూపాలు లేకుండా పోవడం – యిలా ఆ జన్మ పదే పదే ఎత్తుతూనే ఉంది. ఇదీ కథ...

'మరి, ఆ అమాయకపు బాపనావిడ సంగతేమిటండీ?...' అన్నాడు చింతాలు.

'ఆవిడా, ఆనందంలో పుట్టింది. ఆనందంతో పెరిగింది. చివరకు ఆ ఆనందమే తానయిపోయింది! ఆ ఆనందానికి, నామరూపాలుండవు నాయనా! యిదే మన ఉపనిషత్తులు చెప్పేమాట!' అని వివరించాడు అన్నప్ప.

'అయితే, అన్నప్పగారూ! మా రంగడు ఎప్పుడూ నవ్వుతూనే ఉంటుందిగందా, మీరు చెప్పినట్టయితే పెద్ద చిక్కేనే, నన్నిడిసి, తన మానాన తాను తన నవ్వులోకి మాయమై ఊరుకుంటే నేనేంగాను?–'

'కావలసిందే అవుతావు, ఆ నవ్వంటే నువ్వే!' అన్నాడు నవ్వుతూ అన్నప్ప.

చదవండి! చదివించండి!!

# డా॥ దాశరథి రంగాచార్య రచనలు

| | | రూ. |
|---|---|---|
| మొదటి సంపుటం: | చిల్లర దేవుళ్ళు | 50/- |
| రెండవ సంపుటం: | జనపదం | 100/- |
| మూడవ సంపుటం: | మోదుగుపూలు, మానవత, శరతల్పం, దేహదాసు ఉత్తరాలు | 120/- |
| నాల్గవ సంపుటం: | మాయజలతారు, రానున్నది ఏది నిజం, పావని, నల్లనాగు | 150/- |
| ఐదవ సంపుటం: | జీవనయానం | 175/- |
| ఆరవ సంపుటం: | దేవుని పేరిట, ఉమ్రావ్ జాన్ అదా | 125/- |

పై పుస్తకాలు
విశాలాంధ్ర బుక్ హౌసుల్లోనూ,
ప్రముఖ పుస్తక విక్రేతలవద్ద
లభిస్తాయి

# తేజోమూర్తులు

గ్రామంపేరు తవిశిపూడి, -బస్తీ నుంచి సముద్రందాకా పోయే రహదారికి దిగువను ఉంది: అట్టే పెద్దదికాదు: ఎందుకూ పేరు మోసిందికాదు: చెప్పుకోతగ్గ మోతుబరులూ లేరు! కాని, - అక్కడ నివాసంగా ఉంటున్న వాళ్ళకి అన్నోదకాలకు, - లోటు ఉన్నట్టు కనిపించడంలేదు: పచ్చని ఫలవృక్షాల మధ్య కంటికి పచ్చపచ్చగా కనిపిస్తూంది. చూపు ఆనేసరికల్లా, - ఎంతకాలంగానో చూద్దామనుకుంటూన్న, ఆప్తబంధువు తనకు తెలియకుండా వెనకాతలే వచ్చి గుభేలున పలుకరించినట్టనిపించింది. కాశీ నుంచి కాలినడకను తిరిగి వస్తూన్నవాడికి- వూరి మొగదలకు చేరుకోంగనే వచ్చే ఆత్రం వచ్చింది- యింత కాలానికి తాను తన యింటికి జేరుకున్నట్టనిపించింది--

తన యిల్లు:--

ఉహుఁ- తనకోయిల్లు!-

ఎక్కడుంది? - ఎప్పుడుంది?-

తనదంటూ అసలు ఏముంది?-

అఖిలాండమ్మ పెట్టిన పేరు!-

అదొక్కటే తన మెళ్ళో జంజెంతోపాటు అంటిపెట్టుకుని ఉంది!-

పుట్టడం అన్ని జీవరాశుల్లాగానే, - తల్లి గర్భానే పుట్టాడు:

పుట్టాడుట - !

ఎక్కడ పెరిగాడు? ఎంగిలి మెతుకుల మధ్య!

ఎవరు పెంచారు? ఎండా వానా-

అక్కమ్మ - అంటే అఖిలాండమ్మ - పూటకూళ్ళుపెట్టేది-

భీముడల్లే ఉండేది! మాట్లాడితే కొట్టొచ్చినట్టుండేది-

నోరు మంచిది కాదు : మనసు మంచిది :

పార్వతీదేవంటి తల్లి : దబ్బపండుటాంటి మనిషి..

అమ్మ- ఎవరు? - ఆ యింట్లో వంట మనిషి.

చిన్నప్పుడే ముసుగేశారు : జన్మంతా చాకిరీ! - పూట గడవని లేమి-

నా అన్నవారు - ఒక్కళ్ళూ లేకపోయిరి.

ఎండకు ఎండిన మ్రోడు, - ఉన్నట్టుండి చిగురేసింది:

చిగురు తొగరు పోసుకుని నవనవలాడింది.

వెన్నెల సోకింది: మొగ్గ తొడిగింది:

మొక్క కూలిపోయింది. మొగ్గ మిగిలింది.

ప్చ్!-

అంతా వాడి మాయ! - ఆ నల్లవాడి మాయ!

అలనాడు, వాని వేణుగానం సోకి, మ్రోడులు చిగురించాయంటే, కళ్ళు కద్దుకుని యీ నాటికీ, నమ్ముతున్నామే!-

ఆ కొంటికోణంగి, – తనకు తోచిన తీరున కరుణిస్తే – వాడి అనుగ్రహం యిలాటిదని, – అర్థం చేసుకోలేక, – ఆ ప్రసాదాన్ని కాలదన్నేవారు, – వాళ్ళేలాటి మనుషులూ అంట:– అందరినీ కన్న తండ్రి వాడే!– అయినా, అదేం ముచ్చటో. పిల్లల్లో పిల్లలకు జుట్టు ముడిపెట్టి – తగవులు పెంచి తమాషా చూస్తూంటాడు : అది, – వాడికి నిత్య లీల: –

అమ్మపేరు, – సీతమ్మ –

ఛీఁ– చెడబుట్టింది : పెట్టిన పేరు చెడగొట్టింది!–

అన్నారుట అందరూ!

వెర్రివాళ్ళు కాకపోతే, –

ఆ పేరెట్టినందుకు, – సీతమ్మవారి కష్టాలన్నీ పడ్డది–

అలా అమానుషంగానే బ్రతికింది, – అని – జాలిదలచే, యింగితం ఒక్కరికీ లేకపాయెనే: –

ఉండదు: మనిషి బుద్ధంటే అంతే–!

యింతకూ అవతలవాడు –

మనిషనీ, – పెద్దమనిషనీ నమ్మింది–

దేవుడి ఎదుట ప్రమాణం చేస్తున్నాను అంటే – యిహ దానికి తిరుగుందా, – అనుకుంది: కాని, – ఆ మనిషి నైజం అలాటిదనీ – తన పబ్బం గడుపుకునేందుకు, – దేవుడి చేతా దయ్యం చేతా నోటుమీద సాక్షి సంతకాలు పెట్టించే రకమనీ ఆవిడకేం తెలుసు? అసలామనిషి పుట్టుపూర్వోత్తరాలేం తెలుసు?–

నెలకు ఎంతలేదన్నా, అయిదారుసార్లు బస్తీకి వచ్చేవాడు: వచ్చినప్పుడు రెండు మూడు రోజులకు తక్కువ ఉండేవాడు కాదు: అంతకుముందు, ఎక్కడ బసచేసేవాడో కాని – ఎవరో ఎరిగిన మనిషి వెంట,– యీ యింటికి వచ్చాడు: అంతే, – మరో గుమ్మం దొక్కలేదు యిహ: అఖిలాండమ్మ మా చెడ్డ ఆరిందా: వచ్చిన మనిషిని యిట్టె ఆకట్టుకునేది: వల్లమాలిన మరియాద చేసేది: ఆ మాటా మన్ననతోబాటు, వంట శుచిగా రుచిగా, – గిద్దెడు బియ్యపన్నం తినడానికి అసురుసురయేవాడు, – అర్ధశేరు, – పట్టు పట్టేట్టుండేది: దానికితోడు యింటచేసిన పాడి, – అప్పుడు కాచిన నెయ్యి, – యిహ చెప్పనా? – ఐశ్వర్యవంతులు కూడా, – కమ్మని బువ్వకు మొగం వాచిపోయినట్లు, అడపాదడపా, అక్కడే మడికట్టుకునేవారు! వంటా వారుపూ అంతా ఒంటిచేతి మీద తనే చేసేది! పైపనీ – వడ్డనా, – అమ్మ చూసుకునేది:

వయసులో ఉంది!

ఆట్టే అభం శుభం ఎరగంది!

అందుబాటులో ఉంచుకుందాం అనుకుని ఉంటాడు ఆ వ్యవహర్త : యిలాంటి వాళ్ళకు, – స్వంత సుఖం విషయంలోనైనా, – దృష్టి లెక్కా డొక్కా మీదే ఉంటుంది. ఔను! నానా గడ్డీకరచి నాలుగు డబ్బులు మూట గట్టేవాడు, – దమ్మిడీ – దమ్మిడీకి పందెం వేయడం సహజం!–

అందుకనే, – ప్రత్యేకం యిందుకోసమని, ఆనాడు కట్టుకువెళ్ళి, – అయిదో పదో తాంబూలంలోకనీ, ఒకటో అర్థో పైఖర్చుకనీ తడవ తడవకూ దర్శించుకోవడం

కన్న, – యిలా ఖత్తుకలపడం ఎంతో కిఫాయత్ అని అలాటివాళ్ళ అభిప్రాయం: కొందరు అసలు అందుకోసమే పుట్టినట్టు పుడతారు:

సాధారణంగా, – యిలాటి రెపరెప ఉన్న వాళ్ళల్లో నూటికి తొంభై మంది, – తలకు మించిన తబ్బిబ్బులకు పోయి, ఏదో సందులో, మారుమూల గదిలో – అత్తరువుదీపం వెలిగించి, చీకటి గుయ్యారంలోపడి, – సంచికట్టు నిండుకోవడంతో పైసాలేనివాడు పరస్త్రీ వర్జితుడు అనే బేరీజులోపడి, తాతగారి రుద్రాక్షతావళం అప్పుడు మెళ్ళో ధరించినవార్లై, పగలు వీధి మొగం చూస్తారు: తతిమ్మా పదిమందిలో కనీసం ఓ పుంజీ, – చేమగట్లూ చెరువుగట్లూ ఏలి, – అందులోనే తిమ్మిని బ్రహ్మిని చేస్తూ, – పెట్టుబడిలేని ప్రయోజకులై ఊరుకుంటారు: మిగిలిన పరకలు, – కాపులేని చేలోగళ్ళి పసరమల్లే సర్వదుంబాళాగా సాగినంతకాలం హక్కు భుక్తం చేసుకుని, – అక్కర తీరంగనే దేవుడిమాన్యంలో కలిపేస్తారు. వీళ్ళు ఓ చెంపను నికార్సయిన గృహస్థులు, – ఇల్లూ వాకిలీ పరువూ మర్యాదా,– వాసి చెడకుండానే, చాటుగా మాటుగా తలతడిమి బాస చేసి, – డబ్బువడేసి గుంజి, – యింట్లో యిల్లాలికి నగానట్రా చేయించడం, భూమీ పుట్రా ఏర్పాటుచేసుకోవడం, – రెండో కంటివాడికి తెలియకుండా చేసుకుపోతారు: వీళ్ళు స్వార్థంతో బాటు పరమార్థం కూడా ఆలోచిస్తారు: ఎలాగంటే–

వెనుకటికి, – బాదంచెట్టు కామాక్షమ్మ సంగతి చూడరాదూ: పోయేవాళ్ళందరూ వారిపుణ్యానబోతూ, – తలో కాస్తా, ఆస్తి, యిచ్చి వెళ్ళారు: ఆ యింటికంతటికీ ఒక్కర్తై– బాగా పాతికేళ్ళు వచ్చేదాకా, – ముక్కుకు సూటిగానే ఉంది: అలా, – పళ్ళ బిగివినే అనుకుందాం – ఉండిపోవడానికి కారణం కూడా ఉంది: గ్రామంలో ధోవతికట్టిన ప్రతిపడుచువాడూ, యిల్లు దిద్దుకోవడంలోనే సతమతం కావడంతో, పై చూపులకూ పక్కచూపులకూ ఆస్కారం లేకపోవడమే కాకుండా, –యింటికైన కోడలు అంతో యింత జాణకావడం మూలాన, – మగవాడికి వెలిచవులు మరగేందుకు వెసులుబాటు ఎక్కడుంటుంది: పైగా, –– అందరూ అనాదిగా ఒక్క కట్టుబాటుమీద ఉంటూండటంతో, – ఆ బ్రతుకు అలా అయిపోయిందే అనే జాలేతప్ప, – మరో ఊహపోదు: అలా ఉంటూండగా, – గ్రామంలోకి పేరయ్యశాస్త్రుల్లు అనే ఆయన పురాణం జెప్పుకు పొట్ట పోసుకునేందుకు, వచ్చాడు: ఆ మనిషికి అదే వృత్తి, అదే వ్యాసంగం: ఏడాదికి, – ఏడెనిమిది మాసాలపాటు సంచారం చేసి – దొరికినంత కూడబెట్టుకుని, – అది పెట్టుకుని యింటిదగ్గర పిల్లాపాపతో, ఓ నాలుగు మాసాలు కాలక్షేపం చేసి, – మళ్ళీ అంగోస్త్రం పైన వేసుకుని బయలుదేరుతాడు: అప్పటివరకూ ఆ మనిషిని గురించి మరో విధంగా చెప్పుకోలేదు: అంతకుపూర్వం రెండు మూడు పర్యాయములు యిక్కడికి వచ్చి వెళ్ళినవాడే! – అదివరకల్లా అంటే – ఎప్పుడు వచ్చినా కరణంగారి యింట్లో బస: ఉండటానికీ మాంచి వసతిగా ఉండేది: రాజాంగంగా జరిగిపోయేది:

ఈసారి, అక్కడ సందర్భపడలేదు:

కరణంగారు, – తలుపు తాళంబెట్టి, సకుటుంబంగా కాశీయాత్ర వెళ్ళారు: అయిదారు మాసాలదాకా రారు:

గ్రామంలో ఉండటానికైతే ఓ పాతిక పైచిలుకు బ్రాహ్మణ గడప ఉంది: కానీ, – అన్నీ తగుపాటి సంసారాలు:

తలదాచుకునేందుకు వసతికేం తక్కువలేదు:

అన్ని తరాలు చూసిన భవంతులు:

వంటయిల్లే కచేరీసావడంత ఉంటుంది:

ఏ యింట్లోనైన ఏకకాలమందు, యిద్దరు పెళ్ళివారు,- హాయిగా విడిది దిగవచ్చు!

కాని,

కుటుంబవృద్ధి అవుతూన్నకొద్దీ, జరుగుబాటు సన్నగిలుతూరావడం సహజం కనుక, - లేమిలేదు కాని - వెనుకటి కలిమి లేకుండా పోవడంతో, - ఓ ఆసామిని యింటతెచ్చిపెట్టుకుని కొన్ని మాసాలపాటు, పెళ్ళికొడుకును చూసినట్లు చూడటం అంటే, - మాటలా?-

అందువల్ల,- ఎవరూ నేనున్నానని, ముందుకు రాలేకపోయినారు: సరేకాని, మరి వచ్చిన అతిథిని సత్కరించడం ఎలాగా అనే మీమాంస రావడంతో, - యిది ఒక్కరిమీద బరాతం పెట్టకూడదని కూడబలుక్కుని, అందరూ కలిసి ఆయన యోగక్షేమం చూసుకుందామనుకున్నారు:

అనుకున్నంతలో, -యీవిడ కేం పుట్టిందో, -తా నందుకుని -ఒక్క విస్తరికోసం యిన్ని యిళ్ళల్లో స్వయంపాకాలు పోగేయడమెందుకు, ఆయన తినే పట్టెడు మెతుకులూ, నేను పెట్టలేకపోతానా?- దీనికిన్ని వచ్చుందాలెందుకు! అనేసింది:

అనేయడంతో,- అందరూ తెప్పరిల్లారు:

నిజం చెప్పాలిసివస్తే - ఉప్పుకానీ, పప్పుకానీ, చిటికెడైనా, -వాళ్ళ మానానికి చేరెడుక్రిందనే లెఖ్ఖ-యిలా నెలలకు నెలలు దర్శించుకోవడమంటే ఓ విధంగా యిబ్బందే: కాని నలుగురితోబాటు తల ఊచక తప్పదు కనుకన్నూ, అవతలి వాళ్ళేమనుకునిపోతారో అనే జంకుచేతనున్నూ, ఎవరికి వారు మొగ్గినట్టు నటించారేకాని,- రావాలని ముందుకు వచ్చినట్టు కాదు:

కావమ్మ యిలా ముందుకు రావడంతో,- అందరూ మనసుల్లో ఒక్కుమ్మడిగా 'నీ కడుపు చల్లగా' అనుకోబోయి, అంతలోనే నాలిక్కరుచుకుని, - ఒకరి మొఖాలొకరు బెరుకు బెరుకుగా చూసుకుని, - పైకి 'ఆహా! బహుయోగ్యంగా ఉంటుంది!' అనేసి అంగవస్త్రాలు దులిపి బుజానేసుకుని ఎవరిళ్ళకు వారు పోయినారు:

సరె,- యితగాడు మూటా ముల్లెతో అక్కడకు జేరుకున్నాడు: మొదట్లో,-యింటి వాసాలు లెక్కపెడదామన్న ఉద్దేశ్యం, ఏ కోశానా ఉన్నట్టూ తోచదు! కాని విధి బలం ఎటువంటిదో గాని, ఆ మనిషి ఆ గుమ్మం తొక్కిన క్షణం నుంచీ, ఆ యింటిజాతకం వక్రించింది!

అయితే, - యిందులో ఓ విశేషముంది:

అన్ని తరాలుగా, - వేద శాస్త్రాలు మార్మోగిన లోగిలి కావడంతో, - ఆ యింట వింత జరిగినా, విడ్డూరం జరిగినా, - అది, - వేద సమ్మతమే అవుతుంది, - శాస్త్ర చోదితమే అవుతుంది: అహాఁ!

యింతకూ, ఏం జరిగింది?

జరుగనున్నదే!-

కాని,- అందులో, ఓ రవంత కుడీ ఎడం!-

అంటే?–

అంటే!–

గుమ్మంలోకి, వచ్చీ రావడంతోనే,– ఆ మనిషిని చూసేసరికి, –యీ మనిషికి, కన్ను రెపరెపలాడింది:

ఆ యింటి కలిమి ఆకళింపుచేసుకోంగనే ఓ కన్ను కుట్టింది. నాలుగు మూలలా కలయజూసేసరికి, మరోకన్ను, కలిగింది: యింక వంటయింటి కుందేలును ఒడిసిపట్టే సన్నాహంమీదున్నాడు:

ఆవిడకూడా,–

మొదట రవంత ముభావంగా ఉన్నా,–

క్రమంగా,–

మాటామంతీ, –పిచ్చాపాటీ,–

చెప్పుకోవడం, –నవ్వే మాటకు నవ్వుకోవడం, – యిలా క్రమేపీ, దగ్గిరసా జరుగుతూవచ్చి, – చివరకు, – మధ్యను, – ఓ గడ్డిపోచ మాత్రం చూచాయగా అడ్డున్నంత ధోరణిలోకి వచ్చారు:

యిక నేడో రేపో, రొట్టి విరగడమే తరువాయి,–

అనుకున్నంతసేపు పట్టలేదు–

ఆ నేడో రేపో, దానంతటదే వచ్చింది–

చెయి సోకకుండానే రొట్టి–విరిగింది–

విరిగి,–

నేతిలో పడటానికి బదులు,

పాతాళానికి గుంజింది–

అదెలాగా, – అంటే,–

ఏటా వస్తున్నట్టే, ఆ యేడూ తిథి తప్పకుండా,– ఆబ్దీకం వచ్చింది–

శుభకార్యం కాకపోయినా, – ఆ యింట ఆనాడు,– ఫెళ్ళున కాశీసమారాధన జరిగినంత పెట్టున సాగుతుంది.

ఉండటానికైతే పురుడూ పుణ్యాలవాళ్ళు ఓ కోర్జెం ఉన్నారు: కాని,– రాకపోకలు లేవు:

అందుకు కారణం యీ కావమ్మ కాదు:

ఆ వంకవాళ్ళని అందర్నీ మంచిగానే చూసేది–

చుట్టాలమంటూ బుడుగూ–బుడుగూవచ్చి,– పూసుకు తిరిగేవారు: సాయలా పాయలాగానే ఉండేది: మాసాల తరబడి యింటపడి మేసేవారు– మేపేది: అంతటితోపోక,– ఏ వందో అరో రొండిని కట్టుకుపోదామని వదుపేశారో,– ఉహుఁ– పైసాకు చోటెట్టేది కాదు: నవ్వుతూనే సమాధానం చెప్పేది: యింటబుట్టినవారికి,– అనుభవించేందుకు ప్రాప్తం లేకపోయింది:

కాబోయే కర్త ఎవరో?

పుట్టే ఉన్నారో,–పుట్టనున్నాడో!–

యిదంతా వారిది!–

నేను కేవలం కాపలా మనిషిని!–

అది గ్రహించండి!–

నామీద జాలీ దయా ఉండబట్టి వస్తున్నారు ఉంటున్నారు: వచ్చినవారికి,– యీ యింటి పెద్దల చలువను భోజనానికేం లోటురాదు: కాని,– రొఖ్ఖం అంటారా,–మీ రడగరాదు,– నే నివ్వరాదు: ఏ జన్మలో పాదిత్యమో,–యీ జన్మకు నన్నిల్లా చేసింది, తెలిసి తెలిసి.– పరుల ద్రవ్యం నేను ఎలా పంచిబెట్టనూ?–

యిలా అంటే ఎదుటివారు నోరెత్తేందుకు వీలా?–

దాంతో,– దాయాదులందరికీ–ఎవడి మట్టుకు వాడికి,– యీ మనిషిని ఎలా మంచి చేసుకోవడమా అనే తాపత్రయం పట్టుకుంది–

ఉహుఁ– ఏమీ ఉపాయం దోచలా!–

పోనీ, – నలుగురూ ఒక్కటై, – అదురో బెదురో పెడదామా అంటే, – ఏ ఒక్కడూ కలిసిరాడు:

ఏ అభాండమో వేసి, – రచ్చకెక్కిద్దామా అంటే – ఊరు హోల్ మొత్తం ఈ మనిషికి వత్తాసాయెను! – రుజువు కావడం మాట అట్లా ఉండగా, – మళ్ళీ గ్రామంలో అడుగు పెట్టడానికి ఆస్కారం ఉండదు: కనుక ఓ కన్ను యిటువేసి ఉంచి ఓపికపట్టడం మంచిదనుకుని, – ఎవళ్ళకి వాళ్ళు ఏమీ ఎరుగనట్టూ, ఏమీ జరుగనట్టూ ఊరుకున్నారు: కాని లోలోపల అందరూ కత్తులు నూరుతూనే ఉన్నారు: ఈ మనిషి కూడా ఏమీ తనకు తెలియనట్టే ఉంది:

కాని, – ఊరుకోలేదు! మునుపటికన్న మరింత ఆపేక్షగా, – పేరు పేరు వరుసనా, – పప్పులో ఉప్పులో పంపుతూ ఉండేది.

తా నొకందుకు పోస్తే–నేనొకందుకు త్రాగానన్నట్టు,– వీళ్ళూ, పంపినవి పుచ్చుకునేవారు:

అప్పటికప్పుడే రెండు మూడేళ్ళాయె సాగుతూం దీభాగోతం: ఆ మతలబు యావత్తూ యీ ఆసామికి తెలుసు; యిన్నాళ్ళ నుంచీ నలుగుతూన్న చనువును పెనవేసుకుని, సమయం సందర్భం వచ్చింది కనుక, తానై కదిపి చూశాడు: ఎలా? బహు సుతిమెత్తనగా!–

'కావమ్మా!– యిలాంటి భక్తిశ్రద్ధలు యీ కలియుగంలో బహు అరుదు సుమీ'– అని ఎత్తుకున్నాడు:

ఆవిడ నవ్వి, "భక్తి శ్రద్ధలూ కాదు, బండలూ కాదు: ఏదో యీ వంక పెట్టుకుని, ఏడాది కోసారి నలుగురి కింత తిండి పడేస్తున్నా!–"

"ఆఁ"

"లేకపోతే, – ఎప్పుడో గాలిలో కలిసిపోయినవాళ్ళు, – యీ పప్పూ వణ్ణం కోసం,– అక్కడ పడిగాపులు పడి ఉండి,– కా, కా, అనగానే యిక్కడికి వచ్చి వాల్తారనే వెర్రివాళ్ళు ఎవ్వరూ లేరయ్యా!–"

"అయితే చూశావ్,–

కుచ్చుల కథలో రాములవారు,– పచ్చి పోకలా పణతికి ప్రేమ చాలగ తెప్పించుమి లక్ష్మన్నా, –యిలా – ముక్కారు దినుసుల పేర్లూ యాకరువుబెట్టి, వాపోయినాడంటే అందులో కొంత సబబూ సందర్భమూ ఉన్నది: అడివిలోనైతేనేం,– కొంతకాలం కాపురంచేసి

ఉండబట్టి, – మీ వదినకు ఫలానా చీరంటే యిష్టం, ఫలానా కూరంటే యిష్టం, – అంటూ పైకి చెప్పదగినవి పైకి చెప్పి, – చెప్ప వల్ల కాని మక్కువలను, మనసులోనే మననం చేసుకుంటూ అలా, – తానూ ఓ మనిషై కుమిలిపోయినాడు. మా నొసటను ఏ అచ్చటా ముచ్చటా వ్రాసిపెట్టలేదుగా!–

పెళ్ళిలో, –తలొంచుకుని కూచున్నాను:

అలాగే తలంబ్రాలు పోశాను:

అంతే!–

నా కంట వారు పడలేదు:

ఏడాది తిరిగే సరికేగా, – వారు ఏటిపాలైనారు:

పాపం–ఏకపుత్రి విశేషం!–

పాదం పెట్టింది–నిప్పచ్చరమైంది–

అని, –మెడకాయమీద తలకాయ ఉన్న ప్రతి జీవీ అంది!–అది, లోకసాజం!– ఆఖరికి కన్నవారు సైతం – ఛా! ఏం పుటక! అన్నారు!–

నన్ను పల్లెత్తుమాట అనకపోవడం అటుండగా, – అంత దుఃఖంలోనూ ఆదరించి కడుపులో పెట్టుకున్నది – మా అత్త మామలు!–

ఆయనో రుషి–

ఆవిడో అరుంధతి!–

'ఎవరో, యోగభ్రష్టులు – వారి మొక్కు తీర్చుకుని వెళ్ళిపోయినారు:

శోకించపనిలేదు–' అని మాత్రం అన్నారు:

అంతే, – ఆ ప్రస్తావన మరి ఆ జన్మకు లేదు:

ఎన్నడూ, కంటతడిపెట్టలేదు:

– ఆవిడమట్టుకు, – తగిన యిల్లాలు కాదూ!

'...అమ్మాయ్! నీవు కలకల్లాడుతూ, యిల్లు దిద్దుకు పోతూండగా, చూసే, – యోగం – యీ కళ్ళకు లేదు: అది మా సుకృతలోపం:

ఏనుగెక్కి ఊరేగే బిడ్డను ఎత్తుకు ముద్దాడాలనుకుందట ఓ నిర్భాగ్యురాలు!– దానికి బిడ్డ ఎలా అందుతాడు?– దీనికోసం ఎత్తుదిగివస్తాడా? – మన వెన్ను మనం జూసుకోగలమా? మన నీడ మనం పట్టుకోగలమా? – యిదీ అంతే!–

సుఖపడేందుకు మా యింటికి వచ్చావ్!–

ఆ మాట గురుతుంచుకో!–

ఎవ్వరేమన్నా వినిపించుకోమోకు:

కానిపోనివాళ్ళు కవ్వించినా కంట తడిపెట్టబోకు:

అయినవాళ్ళను చేరదీయకు–

అమ్మా తల్లీ అని లాలనచేసేవాళ్ళను దూరంగా ఉంచు!

మనకు భగవంతుడొక్కడే బంధువు!

దేవుడు పేరెత్తి దేహీ అన్నవాళ్ళే నీవాళ్ళు!– ...'

యిలా చెప్పుకొచ్చింది ఆ యిల్లాలు: అర్థం అయే యీడు కాకపోయినా, – ఆ ముక్కలన్నీ ఎక్కాలు వల్లించినట్టు వల్లించాను: ఓ ప్రాయానికి అర్థమయినాయి: అలాగే

హాయిగా బ్రతుకుతున్నాను: - యీ గడియవరకూ, ఏ ఒడిదుడుకూ లేకుండా: నీవు చూస్తూనే ఉన్నావుగా,-

మరే, చూశావ్!-- నేనూ ఓ కంట కనిపెడుతూనే ఉన్నాను-

ఎబ్బే! - నిన్ననుకునేవ్-

లోకాన్ని-

గోడవారనున్న కొమ్మకు ఓ పండు పండితే, - కోసుకుంటే బాగుండునని, - దారిని పోయే ప్రతి దగుల్బాజీకి అనిపిస్తుంది!-

అలాగే,-...

ఆఁ-

నీలాగా, పారజదివిన వాడికి, సామెత చెపితే చాలు, -

స్వారస్యం వేరే చెప్పాలా?-

అయినా, - అనుకోకుండా ధోరణిలో పడ్డాం గనుక యీ విషయం, ఒక దోవకు పట్టిస్తే, - ఉభయులకూ నిశ్చింత:-

ఆఁ-

వెనుకటికి ఓసారి నీలాటి ఆసామియే, పురాణం చెపుతూ, - ప్రహలాద చరిత్రలో, - కన్నుదోయికి అన్య కాంతలడ్డంబైన,... అని ఉంది చూడు, - అక్కడికొచ్చేసరికి,- ఆ ముక్కల్ని పట్టుకుని, - తమలపాకు యీనెలు దీసినట్టు అతి సుతారంగా చీల్చేవాడు: వడసారం అయిదేళ్ళన్నా నిండని లిక్కడు, - వీడికి, అప్పుడే ఆ యీడున స్వస్త్రీ పరస్త్రీ అంటూ ఆ తబీసీళ్ళన్ని తెలిసిరావడం ఏమిటి, - యిదేదో అతిశయోక్తి క్రింద జమకట్టడమా, అంటే, అలా వీలులేదు

ఒక్క విషయం, మనం మరచిపోకూడదు:

ఎంతకాదన్నా, - వాడు రాక్షసిబిడ్డే-

ఆ కులంలో పుట్టిన వాళ్ళు, - తల్లి గర్భంలోంచే కవచ కుండలాలతో ఊడిపడతారు: బొడ్డు కోసిన మంత్రసానితోనే, సరసమాడే మచ్చు:-- అంగసాచే వయసు వచ్చేసరికల్లా,- ఎదుటపడ్డవాళ్ళు అమరులైతే కత్తిదువ్వడం, ఆడకూతురైతే, కాలు దువ్వడం, - నిత్యకృత్యం,--

అలా మసులుకోలేనివాడు, - వాళ్ళ లెక్క ప్రకారం,- కులనాపకుడు-...

చూశావ్ పేరయ్యా, - యీ పురాణం జెప్పేవాళ్ళూ రాక్షసగణంలో చేరినవాళ్లే-

ఆహాఁ - నీతో సహా:-

యిన్నాళ్లూ, - ఆ ఊరూ యీ ఊరూ తిరిగి, - పరిగే ఏరుకుంటూ, --- పైకి గౌరవంగానే కాలం వెళ్ళబుచ్చుతున్నావు: కాని అసలు బుద్ధెక్కడికి పోతుంది? ఎదురుగుండా యింత లప్ప కనిపించింది: ఎగరేసుకు పోదాం అనుకున్నావ్:--

తప్పులేదు-

నీవూ, నిక్షేపంలాంటి మనిషివి-

నీతో కాపురం పెట్టడానికి,- పెద్ద అక్షేపణ ఏం లేదు, నిజానికి: పాపం సంగతంటావా? ఘనంగా ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు తగిన ధనం ఉంటే, -- పశ్చాత్తాపంతో నిమిత్తం లేకుండా, - తిలాపాపం తలోపిడికెడూ పంచిపెడుతూ, చేసింది

చేయకుండా, – రింగురంగామంటూ, వాళ్ళ నడుమనే ఉండవచ్చు!

కాని, నాకా పద్ధతి నచ్చదు:

చెడటమంటూ వస్తే స్విష్టకృత్‌గా చెడాల్సిందే!

అందులో మళ్ళీ, సంసారపక్షమంటూ ఎందుకు!–

రేపో మాపో, బయలుదేరి వెళ్ళి,–

–ఉన్నదీ మన్నదీ, మీ ఆవిడకు అప్పగింతపెట్టి పిల్లల్ని కడసారి కంటజూసుకుని,–

'యిక మీ కర్మం మీది' అని మనసులోనే అనుకుని, వెనుదిరిగి చూడకుండా, – కులగోత్రాలూ, – పెద్దల పేరు ప్రతిష్టలూ, – యిన్నాళ్ళూ గణించిన పరువూ, – మీ ఊరి శివార్ల పంటకాలవలో త్రొక్కి – వచ్చేసేయ్:

నేనీలోగా ఉన్న మటుకు మూటకడతాను:

యీ ఉన్న యీల్లూ వాకిలీ పొలం బొ(్రా – వారసుల మొగానకొట్టి, – యిద్దరం పట్నంబోయి తురకల్లో కలుద్దాం!

ఔను : యిందాకా వచ్చినతరువాత, యింకా యీ దిక్కుమాలిన బ్రాహ్మణీకం ఎందుకూ? – హాయిగా నీవు నీమా జామా వేసుకుని, – కాలుమీద కాలేసుకుని నవాబు సాయెబల్లే కూచుని, -- సీమనుంచి, మన దొరలు సీసాల్లోపట్టి పంపుతారే, -- ఆ పంచితం పుచ్చుకుంటూ ఓహో! వైభవం మీదుంటే, – నేను చెవులనిండా పోగులతో, కంటికి సురమా, పళ్ళకు కప్పు వేసుకుని, – లంగాకట్టి ఓణీవేసి – ముసుగు ముందుకు తీసుకుని, – నసుగుతూ నీ కళ్ళముందర తిరుగుతూంటూ – ఆహాఁ – యింద్రభోగం! – నేను ఒడుక్కొచ్చిన డబ్బులు నాలుగూ అయిపోంగనే, నీవు మెళ్లో డోలేసుకో, నేను కాలికి గజ్జకడతా: -- పోయి, రోడ్డుమీదపడి తైతక్కలాడదాం!– అప్పుడే నవాబుగారో దారి వెంబడిపోతూ, దీన్ని చూసి భ్రమించి, --ఛటులద్వారా తమ జనానాలోకి బట్వాడా చేయించుకుంటారు! ఆపై నీవు, ఓ పావలా డబ్బు లెట్టి గాజుపూసలు మెళ్ళో వేసుకుని, – సిలోన్ కొబ్బరిబొచ్చె చేతబట్టుకుని, 'అల్లాకే నామ్‌పర్' అంటూ, గడపగడపకూ లక్షణంగా అడుక్కుతినచ్చు–

అంతగా బిచ్చం పుట్టని రోజులొస్తాయీ– వచ్చి, మా హవేలి గుమ్మం దగ్గర పడుండు – మేం ఒక్కసారి చేయి విదిలిస్తే, నీలాటివాళ్ళు వందమంది బతకచ్చు,–..."

ఈ ముక్కలన్నీ బహులాలనగా, నవ్వుతూనే అన్నది: కాని, -- ఆ రవంత చిరునవ్వే, యీ పేరయ్యకు సింహస్వప్నమైపోయే!

వింటూన్నకొద్దీ గంగవెర్రులెత్తుకొచ్చి, గడగడ లాడుతూ, – చేతులుజాపి ప్రాధేయపడి,– 'అమ్మా! అమ్మా!'– అని గోలెట్టాడు. కావమ్మ, అప్పటికి, పంటిక్రింది కోపం పటపటలాడించి – అంతలో ఎప్పటినవ్వు తెచ్చుకుని,–

చూశావ్ పేరయ్యా,–

మన తెలుగుభాష, దిక్కుమాలిన డొంకతిరుగుడు భాష: ముక్కుకు సూటిగా సాగదు – వాగదు!–

నిన్ను కసిదీరేట్టు తిట్టాలంటే – ముందు నీ తల్లికో, తండ్రికో తగులుతుంది:

అందుచేత – నా అక్కసు యిలా అఘోరించాను:

నాకూ తామసం ఉంది:

తగినంత జబ్బపుష్టి ఉంది:

తలచుకుంటే మక్కెలు విరిగేట్టు తన్నగలను:

కాని, - నీలాటి పింజారీమీదనా, -- చెయి చేసుకోవడం? -

నీ యిల్లాలి ఐదవతనం గట్టిది -

బ్రతికిపోయావ్: -

పేరయ్యా, - నీవు నాకన్న పెద్దవాడివే, -

కాని, ఎందుకొచ్చిన ఏళ్ళు, -

యివాళనుంచీ, - యీ క్షణంనుంచీ నీవు నా బిడ్డవు: - మరో జన్మ ఎత్తావు: మా యింట పుట్టావు! -

యిక నేను చెప్పినట్టు విను : -

యీ గడ్డమీదే నీ పిల్లాపాపలతో నూరేళ్ళూ వర్ధిల్లు, -

నీకు యిక్కడ యిల్లు వేయించి యిస్తా, -

గ్రాసానికి సరిపోయే వసతి యిస్తా, -

వచ్చి కాపురముండు: ఏటికేడాదీ ఆలయంలో పురాణం జెప్పు! - పొట్ట చేతపుచ్చుకుని ఊరూరూ తిరిగే అగత్యం ఉండదు: పిల్లలకి కార్యాలూ కరామ్మతులూ వచ్చినా, - గ్రామం కనిపెడుతుంది: ఆ ఏర్పాటూ చేస్తాను, - సరేనా। -

మా ఆస్తియావత్తూ, గ్రామంలో పెద్దలకి ధర్మ కవిలెగా అప్పగింతపెడతా, - యీ యిల్లు సత్రం క్రింద జేస్తా, - చుట్టుపక్కల గ్రామాల్లో, - లేనివాళ్ళ పిల్లలకి వివాహ ఉపనయనాలు, యీ అయివజులోంచి జరిపించమంటా। యీ లోగిలి నిత్య కళ్యాణం పచ్చతోరణంగా ఉంటుంది: ఆలయంలో, - నిత్యం కాలక్షేపం ఉంటుంది: నేనంటావా, - నా దోవను ఏ కాశీకోబోయి బ్రతుకు వెళ్ళమార్చుకుంటా! -

పాపం, పేరయ్య పసిపిల్ల వాడివతు -

వలవలా -

అమ్మా! కావమ్మ తల్లి, -

నేను - పుట్టునిర్భాగ్యుణ్ని! -

భూమ్మీద పడ్డాను - తల్లికి మొగంవాచాను:

మా నాయనకు భార్య అంటే ప్రాణం -

ఏడ్చి ఏడ్చి, - ఆయన కళ్ళు పోయినాయి -

యింట మరో దక్షతలేదు -

కాచిపోసి కనిపెట్టి చూచే దిక్కు లేదు,

గ్రామం ఆదుకుంది - ఆ చేతా ఆ చేతా పెరిగాను: ఓ పెద్దమనిషి నన్ను చేరదీశాడు: విద్యాబుద్ధులు చెప్పి, - పిల్లనిచ్చి పెళ్ళి చేశాడు: మా నాయన, నిశ్చింతగా, - నేను ప్రయోజకుణ్ని కావడం చూసి, - మనవళ్ళని ఎత్తి, - చెల్లిపోయినాడు:

ఆయనకు జన్మంతా, - ఓ కంట నవ్వూ ఓ కంట కన్నీరే, -

అమ్మా! - అమ్మా అని పిలిచేందుకు మొగం వాచి పోయినాను: యిన్నేళ్ళకు, - నీవు కనిపించావు: కాని, - నీవూ కంటికి దూరమౌతానంటున్నావు: నాకిది జన్మ ప్రారబ్ధమా తల్లీ, -

అని గోడుగోడు మన్నాడు:

కావమ్మ ఏమన్నది?

'అబ్బాయ్!-

నాకు, - యీ రూపేణా తరణోపాయం దొరికింది: యిలా జరగడం దైవలీల: యిందులో నీ దోషం లేదు: నీవు నిమిత్తమాత్రం: నాయనా, - నా బిడ్డలాటి వాడొకడు,- యిక్కడ సుఖంగా కాపురం జేస్తున్నాడు కదా, అనే ఆనందంతో, - ఆ విశ్వేశ్వరుని సన్నిధిలో ఉంటాను।--' అని ఓదార్చి తన ముక్తి తాను జూసుకున్నది!

ఆ ధర్మ కాతాలోనే తనకు ఉపనయనం జరిగింది:

అమ్మకు, - కావమ్మ అంత తెలివితేటలు లేవు. ఆస్తీలేదు: అమాయకంగా ఆ అయ్యను నమ్మింది- గుళ్ళో మెడకు తాడోశాడు: తానే పుట్టుక్కున తెంచి, - తనదారి చూసుకున్నాడు: అమ్మ అమాయకురాలు - అంటే వెర్రిబాగుల్ది - ఎవరితో చెప్పాలో- ఏం చేయాలో తెలియదు: అలాగే తలొంచుకుని తిరుగుతూండేది : చివరకి,. అక్కమ్మే పసికట్టింది: అయ్యో పిచ్చిదానా। ఎంతపని చేశావే,- అని నవ్వుతూనే అంది: కష్టం సుఖం, కాచివడపోసిన ఘటం కనుక-మూడో కంటి వాడికి తెలియకుండా,-కన్నెల ఆసుపత్రిలో జేర్పించి పురుడోయించింది:

మళ్ళీ యింటికి తెచ్చి పెట్టుకుంది:

లోగుట్టూ లోకానికి తెలిసినా, అక్కమ్మ నోటికి వెరచి,- పైకి ఎవరూ ఏమీ అనేవారు కాదు:

అమ్మకు-మామూలు పనీపాటే.

తాను,- ఆ ఎంగిలి మెతుకుల్లోనే పెరిగాడు.

ఒడుగైంది-అంతే,-

అక్షరం ముక్క అబ్బలేదు-

కాని,-వంటలో వడ్డనలో చెయి తిరిగింది-

ఒరే,- కోనయ్యా,- మా నాయన పేరెట్టుకున్నందుకు, నీవు పండితుడి వౌతావనుకుంటే నలభీమపాకంలో పడ్డావేమిట్రా నా తండ్రీ,- అని ముద్దు చేసేది- తనకి పెళ్ళీడు వచ్చింది। అయ్యేదే కూడా,- కాని,- నూలువాసిలో తప్పిపోయింది: పిల్లని చూడటానికి,- అమ్మా అక్కమ్మా వెళ్ళారు. ఏట్లో పడవ బుడుంగుమన్నది-- అంతే,- ఆ యింటికి తాను మిగిలాడు:

యిల్లు మిగిలింది-తాను మిగిలాడు:

నవ్వుతూ,-త్రుళ్ళుతూ వెళ్ళారు:

నట్టేరు మ్రింగేసింది: మళ్ళా జన్మకు కనబడరు:

యిహ, రేపు వెళతామనగా-

ఎన్నడూ లేంది: అమ్మ తననుచూసి నవ్వింది: చెట్టంత వాడిని చేరదీసింది: పసివాడిని ఒళ్ళో వేసుకుని గారాబం చేసినట్టు,- దగ్గిరసా కూర్చోబెట్టుకొని,- వెన్ను దువ్వుతూ,- ఒరే కోనా,- నీకు పెళ్ళవుతుందిరా!- నాకు కోడలు వస్తుందిరా: పిల్లది, కాలు క్రింద పెట్టక్కరలేకుండా, మహారాణీని చూసినట్టు చూడాలిరా, నాయనా అది మనింట సుఖపడాలిరా।- నీకు పిల్లా పాపా కలుగుతారురా। - నాయనోవ్!- దాన్ని

పువ్వుల్లో బెట్టి పూజించు: కలలో అయినా దానికి అన్యాయం అక్రమం తలచకు!– అది కలకల్లాడుతూంటేనే మన బాగు! నా చేతులో చేయివేసి చెప్పరా నా తండ్రీ!– దాన్ని సుఖపెడతానని చెప్పరా!– అలా అంది:

తాను, చదువుకోలేదు:

లోకజ్ఞానం లేదు–

పేద్ద తెలివితేటలూ లేవు. కాని, – అమ్మ, అలా అంటూంటే, ఆ తల్లి దుఃఖమేమిటో, ఆ యిల్లాలి సహనమేమిటో, తనకు అప్పటికి అర్థమయింది– అమ్మా,– యింత కాలం రొమ్ముల కుంపటల్లే,– యీ దుఃఖం భరించావా తల్లీ,– అనుకుంటూ మనసులోనే కుమిలిపోయినాడు–

కాని,– పైకి మట్టుకు నవ్వుతూనే,– అమ్మా!– అయితే గియితే,– మనవడు పుడితే,– వాడికి పేరేం పెడతావమ్మా! అన్నాడు!–

"మీ నాన్న పేరే!–" అన్నది: తనకు ఒళ్ళుమండింది!

"ఆఁ ఆ పేరా?– కలలో అయినా తలచడమే!–" అన్నాడు.

"వెఱ్రినాయనా! వారు, నీకేం అపకారం జేశారు?– నాకేం అపకారం జేశారు?– మ్రోడల్లే బతుకుతున్నదాన్ని జాలిదలచి చేరదీశారు: నుదుట కుంకుమ పెట్టారు: నిన్నిచ్చారు: దూరమైనారంటావా? అది,– మన ప్రాప్తం! ఎన్నడూ, మనసులో వెఱ్రి వెఱ్రి ఊహలు పెట్టుకోకు!– నీకు పిల్లవాడు కలగగానే, వెళ్ళి మనవణ్ణి వారికి చూపించి రావాలి!– నాయనా,–మరోమాటన్నా, మరో ఊహకు పోయినా,– నామీద ఒట్టు'– ఆనాడు యిలా అంది అమ్మ!– తాను తల్లి మొగంవంక అట్టే పరకాయించి చూశాడు: అది మొగం కాదదో చంద్రబింబం: మచ్చలేదు, మాలిన్యంలేదు: పండువెన్నెల– తటాలున తల్లిపాదాలు పట్టుకున్నాడు: తల నిమిరింది–నా తండ్రేఁ! అన్నది– అమ్మ అప్పుడు నవ్విన నవ్వే, ఈ జన్మకు జ్ఞాపకం–

కాని,– ఏ కోరికా తీరకుండానే వెళ్ళిపోయింది:

ఆ యిద్దరూ,– పొద్దు వాలినట్లు వాలిపోయినారు:

తనని ఒంటరిగా ఒడ్డుకు వదిలిపోయినారు!–

హస్తంలో రేకలు బాగున్నాయి: ఆనాటి కానాడు కలసివచ్చింది: మునుపటి వ్యాపారం,–వెయ్యితలలు వేసింది : పదేళ్ళలో భాగ్యవంతుడైనాడు :

కాని, ఏం ఉండి ఏం జేసుకోను?

ఒక్కడూ!–

తలచుకుంటే ఎప్పుడో పెళ్ళి అయేది–

కాని, చూచి సంతోషించేందుకు,–అమ్మ లేనప్పుడు–

చేసుకోలేదు :

మాలి మయేందుకు,– సిగ్గుమాలినవాళ్ళు ఎందరో ఒడుపు వేశారు: వాళ్ళను చూస్తే, అయ్యో పాపం అనిపించేది! అమ్మ బ్రతుకు జ్ఞాపకం వచ్చేది–పదో పరకో చేతిలోపెట్టి, దణ్ణం పెట్టేవాడు: వీడో వెఱ్రివాడనుకునేవాళ్ళు– అవతల వాళ్ళు!–

తన వెఱ్రి తన కానందం!–

ఎప్పుడూ అమ్మ మాటలు జ్ఞాపకం!

ఎన్నడో–నాన్న మాట తలపుకొచ్చేది–

మళ్లీ మందేది: ఎదుటపడి సిగపాయ దీయాలనిపించేది–అమ్మ మొగం అడ్డం వచ్చేది–

– ఆయన భోగట్టా అంతాం–వాకబుచేసి కనుక్కున్నాడు:

స్వగ్రామం తవిసిపూడి: ఓ నాలుగెకరాల కొంద్ర– ఓ కొంపా ఉన్నాయి: మొదటినుంచీ ఆపాటి కుటుంబమే: పెద్దలు అందరూ పొదుపుగా బ్రతికి,– ఆస్తి ముద్ర శుద్ధిగా అప్పగించిపోయినారు.

యీయనకు,– యీ వెంకట్రామయ్యకు–నాలుగక్షరం ముక్కలబ్బినాయి: కాని మొదటినుంచీ తెగిన గాలిపడగ,– బందరులో పదేళ్ళపాటు ప్లీడరు గుమస్తాచేసి,– అక్కడ కొంతమేర రాజ్యం చేశాడు: ఎన్నడూ బస్తీలో కాపురం పెట్టలేదు: కుటుంబం గ్రామంలోనే ఉండేది: తండ్రి బ్రతికున్నన్నాళ్లూ,– ఆయన్నలా వేధించుకు తిన్నాడు:

తండ్రి పోవడం: గుమస్తాగిరిలో ఏదో తిరకాసువచ్చి,– అది ఊడటం జరిగింది: అప్పుడు యింటి మొగం చూశాడంట!

తల్లి బాగుంది: ఆవిడ పోరుమీదనైతేనేం,– మరెందుకైతేనేం,– ఆ రావడం రావడం యింటి పట్టునే ఉండిపోయి ఊళ్లో వాళ్ళ వ్యవహారాలు భుజాన వేసికొని బస్తీకి తిరగడం సాగించాడు: ఆ రోజుల్లోనే,– తన తల్లికి, తాను కలిగాడు:

ఆయనకు అప్పటికే ఒక ఆడపిల్ల,–

తనకు ఎన్నో వెనుకల మరో మగపిల్లవాడూ–

అంతే,–

పిల్ల పెళ్ళికి,– ఆస్తి కొంత హరించింది:

అవతల వియ్యాలవారితో,– ఏదో దబ్బు పేచీ వచ్చి,– ఆడపిల్ల పుట్టింటికి వచ్చేసింది–కోర్టుకెక్కి మనోవర్తి గుంజాడు:

ఆయన భార్యకు అది యిష్టంలేదు–

అందుచేత యిద్దరికీ మాటలు లేవు–

ఈయన,– మరి పేట్రేగాడు:

కరివేపాకు అమ్ముకునే సుబ్బాయి అని ఉంది: దాని గుడిసె పట్టాడు.

ఊళ్ళో నలుగురికీ యీ మనిషి చేష్టలు చూస్తే రోత వేసింది: కాని, తగవు పెట్టుకుంటే ఏం పేచీ వేసి కోర్టుకెక్కిస్తాడో అనే జంకుకొద్దీ,– పైకి మటుకు ఏమనేవారు కారు: కాని,– వెనుకటి పలుకుబడీ లేదు,– మునుపటి రాబడీ లేదు: అయినా ఏదో తిమ్మిని బ్రహ్మిని చేస్తూ,– నెట్టుకొచ్చాడు:

పిల్లవాడు చురుకైనవాడే; కాని,– పై చదువులకు పంపలేదు: యీ కాపురం తీరు చూసి,– ఎవరూ పిల్లనిస్తామని ముందుకు రాలేదు: మిగిలిన ఆ యెకరన్నరతో సంసారం గడవదు: పిల్లవాడే,– పదిమంది పిల్లల్ని ప్రోగుచేసి,– వీధి అరుగుమీద బడి పెట్టి,– రూపాయో అర్ధో నెల తిరిగేసరికి యింటికి అడ్డం వేస్తున్నాడు: పిల్లవాడి పేరు,– రాజగోపాలం. గుళ్లో స్వామివారి పేరు!–

కుర్రవాడు బుద్ధిమంతుడు,–

ఆ తండ్రి తెలివితేటలన్నీ వచ్చినాయి,–

కాని ఏ అవగుణమూ అబ్బలేదు:

వాడు,- అందరికీ తలలో నాలుక: మాంచి రూపసి!

ఊళ్ళో ఆలయం ఇన్నేళ్ళుగా,-శికస్తులో ఉండి పూజా పురస్కారాలు లేకుండటం బాగా లేదని,- వాడు,- మన గోపాలం - నడుంకట్టి,- నలుగురినీ కూడగట్టుకుని,- నిరుటినుంచీ మళ్ళీ ధూప దీప నైవేద్యాలకు ఏర్పాటులు చేయించాడట: కరణం రామన్నగారికి,- వీడంటే ప్రాణంట: తమ్ముడూ - తమ్ముడూ అంటూ ఒక్క క్షణం వదలడట-

వాడిని,- తమ్ముడూ అని పలుకరించాలి!-

పలుకరిస్తే-

వాడు,- ఏంరా అన్నాయ్ అంటాడా?-

నిజంగా,- అంటాడా?-

వాడిని చూసేందుకేగా తాను బయలుదేరింది?-

ఛస్-యిదెక్కడి చుట్టరికం-

కాదనుకున్నా పోతుందా?-

నాన్న,- అక్కడో కంఠానికి ముడేశాడు! •

ఫలితం యిక్కడ తానూ,- అక్కడ వాడూ!-

ఎవరూ సుఖపడటం లేదు-

అంతకూ కారణం,- ఆయన:- తాను మటుకు ఏం బావుకుంటున్నాడు: మూలబడ్డాడు: ఆ సుబ్బాయ్ గుడిసెలో కుక్కిలో పడుండి,- దాని మోచేతి క్రింది నీళ్ళు త్రావుతూ,- రోజులు గడుపుకుంటున్నాడు: అది చీటికీ మాటికీ చీదరించి కొడుతుంది- పురుగును చూసినట్లు చూస్తుంది- చూడక?-దానికెందుకుంటుంది-విశ్వాసం?- యీయన,- అక్కడే హరీ అంటానంటాడు కాని,. విడిచిరాడే!- అది ఏనాడో యీ బాదర బందీ తెంపుకు పారిపోయేదే,- కాని కరణంగారికి వెరచి,- యింత కాచి పోస్తూంది: దానికీ సుఖంలేదు: యీ మనిషి ఎక్కడ అడుగుపెడితే అక్కడే నిప్పచ్చరం:

కాని,- ఆ మనిషి, తన తండ్రి-

తలచుకుంటే బాధ-మరచిపోవడం తన తరం కావడంలేదు-

తండ్రి ఎలాటివాడు కాని,- బిడ్డ అన్న తరువాత,- ఆ భ్రమత బ్రహ్మారాతేమో?- జొనేమో-

తన దుకాణం ముందు,- ఓ హిందుస్తానీ మనిషి పాటలు పాడుతూ బిచ్చమెత్తుకునేది- మనిషి, రంభ-కిన్నెర కంఠం - మూడేళ్ళ ఆడపిల్ల,- ఉత్తరాన తురకల గత్తరొచ్చి పడినప్పుడు ,- వీళ్ళందరూ కట్టుగుడ్డలతో దేశం పట్టారు: వాడూ బాగా పాడతాడట: యిద్దరూ జోలె కట్టుకుని, పొట్టపోసుకుంటూ నాలుగు మాసాలు, హాయిగానే కాలక్షేపం చేశారుట: ఎవరో ధర్మప్రభువు, వీళ్ళ పాట విని,- ఓ పాత హార్మనీ యిచ్చాడుట: దాంతో,- నాలుగు డబ్బులెక్కువ రాలేవిట: ఓ బట్టా పాతా అంటూ కొనుక్కోవడం,- రెండు పూటలా తినడందాకా వచ్చి,- ప్రాణాలు సుఖపడుతున్నాయనుకునేసరికి,- ఆ మొగమనిషి చెప్పకుండా చెయ్యకుండా - వీళ్ళ మానానికి వీళ్ళను వదిలేసి ఏదో పిచ్చిక వెంటబడి-పోయినాట్ట- పిల్లకు తండ్రి దగ్గర మాలిమేమో,- ఎప్పుడూ నాన్నేడీ అంటూ

వేపుకుతినేది: వస్తాడమ్మా వస్తాడు,– నీకు మంచి కాజాలు తీసుకువస్తాడు! అంటూ ఎన్ని రకాలుగానో లాలించేది–కనబడ్డదల్లా కొని యిచ్చేది–కాని, దాని పోరు – దాని పోరే;–

పాపం ఒక్కొక్కనాడు,– ఎంతో బిగలాపడేది–

భాయీ,– చెపితే వినదు: తెలిసేట్టు చెప్పలేను.

నా కర్మానికి ఏడవనా,– ఒక్కొక్కప్పుడు విసుగెత్తి,– యీ పళాన సముద్రంలో దూకుదామనిపిస్తుంది – కాని,– నేనేమైపోతేనేం,– యిది,– వాడి బిడ్డ,– వాడి దయకు గురుతు,– యిది వెయ్యేళ్ళు బ్రతకాలి– ఆ మనిషి ఏం చేశాడో యీ పసిదానికేం తెలుసు?– తనని ఎత్తుకుని ముద్దుచేసిందే గురుతు!– అదొక్కటే జ్ఞాపకం: మనమూ యిలాటి పసిపిల్లలమైతే,– ఎంత బాగుండును: నవ్వుతూ బ్రతుకుతాం! – నా బిడ్డను నవ్వుల్లోనే పెంచుతా।–పిల్ల పెద్దదై,– నాన్న మాటెత్తితే– దేశంకోసం యుద్ధంలోకి పోయినాడంటా– బిడ్డ,– పొంగిపోతుంది: మా కుటుంబాల్లో అందరూ బందూక్ పట్టినవాళ్ళే– రెండిళ్ళకూ పాతికమందిమి ఉండేవాళ్ళం–ముగ్గురం మిగిలాం!– చివరకు యిద్దరిమైనాం!–దీన్ని ఎలాగైనా బ్రతికించుకుంటా– మనిషి యిలా అంటూంటే,– తాను అక్కడ ఉండలేక లోపలికి పారిపోయి–రోదనం చేసేవాడు:

'నా మనిషి! చాలా మంచివాడు – మాంచి జవాన్– ఎవరినీ కన్నెత్తి చూసేవాడు కాడు: నేనంటే ప్రాణం। ఏదో మైకంలోపడి దూరమైనాడుకాని, ఏనాటికైనా వెదుక్కుంటూ వస్తాడు–మమ్మల్ని విడిచి ఉండలేడు–' అనేది: అమ్మకూడా యిలాగే అనుకునేదేమో – ఏమనుకునేదో, తనకేం తెలుసు! మానవతుల మనసులో మాట పెదవి దాటదు!

పాపం,– ఆ మనిషికి ఎంత అభిమానం:

ఏదో పండుగకి,– తాను ఓ పది రూపాయలు చేతిలో పెట్టి,–బట్టలు కొనుక్కోమన్నాడు: ఆ కాగితం వెంటనే బల్లమీద పెట్టి, – దణ్ణం పెట్టింది। వద్దు భాయీ,– నన్నిట్టానే బ్రతకనీ–పైసాలు బిచ్చమెత్తుకునే దాని చేతులో కాగితం కనబడితే,– ఎదుటివాడు,– ఇదేదో నీతిమాలిన సంపాదన అనుకుంటాడు కాని,– నీలాటి ఓ అన్న దయతలచి యిచ్చాడని నమ్మడు: మొన్ననో నాడు, ఎవరో ధర్మతంత్రికి రూపాయికి చిల్లరిచ్చి కాగితం పుచ్చుకున్నా, బిడ్డకు రెండరటిపళ్ళు కొని దుకాణంలో ఆ రూపాయిచ్చా! ఆ ఆసామీ, కోరజూపు చూసి,– పక్కవాడితో,– మనకన్న వీళ్ళ సంపాదనే బాగుంది– అని యికిలించాడు:

ఆడది రోడ్డు పట్టిందంటే, నిలువ నీడలేక వచ్చిందనుకోరు:

ఓరచూపు చూసి,– వెంటాడుతాడు గాని,– పొరబాటున అయినా బహెన్ అని పలుకరించడు:

అది మా కర్మ–

భాయీ, నేనంటున్నానని,– ఏమనుకోవద్దు–

యీ తెలంగీ రాజ్యంలో,– నీ లాంటి వాడెవడో తప్ప– మొగవాళ్ళు అంత మంచివాళ్ళు కారు: తమకూ అక్కలూ, చెల్లెళ్ళూ ఉన్నారన్న జ్ఞాపకం వాళ్ళకు ఉండదు! నేను పుట్టి పెరిగిన దేశంలో– యిలా కాదు: భాయీ బహెన్ వరుస యింకా ఉంది: నేను అక్కడికే పోతున్నా–

మరే– మా మనిషి పేరిది– యిలా ఉంటాడు– ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు:

బహు మర్యాదగా మాట్లాడతాడు: పీలికలు కట్టుకున్నా ఠీవిగా ఉంటాడు: ఎన్నడన్నా నీకు కనబడితే– నీ బిడ్డ నీకోసం వెదుక్కుంటూందని చెప్పు... నా పుణ్యం ఎలా ఉన్నా బిడ్డ పుణ్యం మంచిది– తండ్రి కనిపిస్తాడు:

తన కళ్ళ నీళ్ళు క్రమ్మినాయి, ఆడకూతురు తన ద్రోవను వెళ్ళిపోయింది: బంగారంలాంటి కాపురం పాడుచేసుకున్నవాడు– వాడు కనబడితే– చెట్టుకు విరిచికట్టి తుపాకి నేయించాలనిపించింది– కాని – వాడు ఆడబిడ్డకు తండ్రి: ఆ మొగం చూస్తుంటే సకల పాపాలు పోతాయి–

'బిడ్డ పుణ్యం మంచిది। తండ్రి కనిపిస్తాడు–' అమ్మకూడా అలాగే అనుకుందా?– ఏమో!–

తనకు ఓ బిడ్డ ఉన్నాడనీ– తానో ఆడకూతుర్ని అన్యాయం చేశానని ఆ మనిషికి గుర్తుందా?– ఊహుఁ–

వారికి వీరెంతో– వీరికి వారూ అంతే।–

యిన్ని కోట్ల జనాభాలో– ఆ శాస్త్రీ – ఏమైతే– తనకేం కాని–అమ్మ మాట తప్పినట్టు కాదూ–

తల్లి పేరున ఎన్నో దానధర్మాలు చేశాడు–

కాని– ఏదో కొరత ఉండనే ఉంది?–

ఏమిటది?– చెప్పలేడు–

మనసులో ఉన్నది,–పైకి ఒప్పుకోలేడు – ఏమిటీ భ్రమత!– ఒక్కసారి పోయి చూస్తే. యీ అంకిలి వదులుతుంది– తన ఉనికి ఆయనకు తెలియదు కాని, తనకాయన ఉన్నవాడే!–

యిదిగో రేపు మాపూ అనుకుంటూనే ఏడాది జరిపాడు: ఎప్పుడు ప్రయాణం పెట్టుకున్నా,– ఎందుకో కాలు వెనుకాడేది: తంబుర తాత కథ విన్న తరువాత కాని,– తాను బయలుదేరలేదు: యిహ కాలు నిలువలేదు–

తాత అంటే పేరుకుగాని, వయసుకు కాదు:

చిరతలేస్తూ, – వీధిలో నిలబడి ఉండేవాడు: యింతప్పటినుంచీ హోటలులో నౌకరీ చేశాడుట – అదే మాలిమిచొప్పున అడుక్కునేందుకూ హోటలు దగ్గిరే తారట్లాడుతాడు: ఒక్క కొడుకు, – పెళ్ళాం,– యేటివరదలో కలిసిపోయింది– ఆ అయ్యకాళ్ళూ, ఆ అయ్యకాళ్ళూ పట్టుకునీ, చదువు చెప్పించాడు: తనకు చదువులేకనేగా యీ నాదారు బ్రతుకు: బిడ్డ చదువులో అందుకున్నాడు: కాస్త కలిగినవాళ్ళు పిల్లనిచ్చి,– పై చదువులు చెప్పించారు: ఉద్యోగం వచ్చింది – వాడికి ఫలానావాడు తన తండ్రి అని చెప్పుకోవడం నామోషీ,– దగ్గరుంచుకోవడం నామోషీ – తాను పెట్టడు,– ఆ నౌకరీ చేసుకోనివ్వడు: తనకింకో పని చేతకాదు– పైగా యీ జన్మకు ఆ నౌకరీ చెయ్యరాదని తల్లి పేరుమీద ఒట్టెట్టాడు – దూరంగాపోయి బ్రతికితే ఓ పదిరూపాయలు పంపుతానన్నాడు: తాను,– సరేనన్నాడు: ఔను మరి,– బిడ్డలకు గ్రాయకం వచ్చినాక, – మనం వాళ్ళ మనసు కష్టపెట్టకూడదు: తప్పుగాని, ఒప్పుకానీ,– చెప్పినట్లు వింటే సంసారంలో రొష్టు ఉండదు: అంతేగా,– ఫలానా కోరటు గుమస్తా తండ్రి పూర్వాశ్రమంలో కప్పులు కడిగేవాడంటే నామోషీకాదూ! పోనీ,– మన కుర్రవాడు కనుక సరిపెట్టుకుపోతాడే అనుకున్నా, అవతల

వియ్యాలవారి కుటుంబాలన్నీ ఘరానావి: ఆ యింట పెరిగి వచ్చినపిల్ల,- నేను కంటబడితే సహిస్తుందనుకోవడం, అస్వాభావికం!- తరతమ భేదాలు లేకపోవడానికి, యిదేం రామరాజ్యమా।-- నా బాదరబందీ వాళ్ళకు లేకపోవడమే,- వాళ్ళ ప్రాణానికి హాయి: ఆ పది రూపాయలంటారా? - వాళ్ళు పడుచువాళ్ళు,- అచ్చటకో ముచ్చటకో కానరాని లక్షఖర్చులుంటాయి: రాముణ్ణి తలచుకుంటే,- రోజుకో పట్టెడు ముద్ద పుట్టకపోతుందా?- ఉన్నవాడిని ఉన్నట్టు బయలుదేరాను:

మా వాడి అభిప్రాయం, నేనిలా దేశాలుపట్టి పోవాలని కాదు సుమండి। నాకో వేలువిడిచిన పినతల్లి కూతురుంది: అదీ ఒంటరిదీ. ఆట్టే అంత జరుగుబాటులేనిదీ! - నేనుపోయి అక్కడుంటే, దానికీ కొంతసాయం జేసినట్టవుతుందని, మా వాడు, అన్నీ ఆలోచించే యీ ఏర్పాటు చేశాడు: కాని,- నాకే ఎందుకో మనస్కరించలా! బిడ్డదగ్గిర ఉండటం పడకపోయినాక, -- వాళ్ళనడుమనుండటం, మంచిదికాదనుకున్నాను: యిలా తిరుగుతూంటే,- నలుగురితీరూ చూస్తూ ఉంటే, - నా రాత యిలా ఉంది కాని,- దేశంలో అపేక్షా, అంతఃకరణా యింకా ఉన్నాయికదా అనే ఆనందం కలుగుతుంది-

నేను ఏమైపోయినానో అని అక్కడ మావాడు గాభరాపడతాడేమో అంటారా?- అహఁ - తగినకట్టుదిట్టం జేశాగా! - నేను తక్కువ దినలేదండోయ్ - మావాడు ఆ ఏర్పాటు జేసినప్పుడు - సరే అన్నా, - బట్టాపాతా సరుదుకున్నా। - బత్తెఖర్చులను ఓ అయిదు రూపాయలివ్వమన్నాడు,- కోడల్ని, చెప్పేసి ఆఫీసుకు వెళ్ళాడు: నేనూ భోంచేసి కూచున్నా -కోడలు ఎంతకూ తెమిలిరాలేదు. చివరకు ఓ పొద్దువేళకు, రెం-డు- రూపాయలు తెచ్చి నా చేతిలో పెట్టింది: మరి చిల్లర లేదంది - పోనీ అమ్మా - యిది చాలు - అని కదిలా! - చూశారూ, - మా కోడలు, - లోభికాదు- పొదుపరి: రైలు టిక్కెట్టుకు బేడ తక్కువ రెండు: అక్కడనుంచి, - నేను పోవలసిన ఊరు,- ఓ క్రోసెడుంటుంది-బండికి, మనిషికి ఆరణాలు మామూలు: నిజానికి,- ఆ నాలుగు బారలూ ఆడుతూ పాడుతూ పోవచ్చు! - మా తాతనా డెక్కామా యీ బళ్ళు! - మొగాడికేం.- చేరెడేసే చోట సోలె డియ్యమంటాడు: ఆడకూతురు నేర్పుగా,- దిద్దుకుపోవాలి!- అలా అయితేనే,- ఓ కానో వీసమో వెనకేసుకునేది, మా కోడలు మాంచి తెలివితేటలు కలది. ఆ కాపురం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉంటుంది-

నేనూ దుబారా మనిషిని కాను: కోడ లిచ్చిన రెండు రూపాయలూ, భద్రంగా అలాగే ఉన్నాయి: ఓ పూట తిండికి దొరక్కపోయినా,-వాటిని కదల్చను:

ఆనాటినుంచి యీనాటివరకూ, కాలినడకే! - బయలుదేరిన ఓ పదిరోజులకు, కార్డు వ్రాయించాను, మీలాటి అయ్యను బ్రతిమాలుకుని- నాకు అ ఆలు రావులెండి - నేను తీర్థాలు సేవించబోతున్నాను-అప్పుడప్పుడు ఉత్తరం వ్రాస్తూ ఉంటాను- అని వ్రాయించాను: అలాగే నెలకో రెండు నెలలకో, ఓ కార్డు పడేస్తాను: మరి,- వాళ్ళ క్షేమం నీకు తెలియనక్కరలేదా అంటారా? -వాళ్ళకేం: పొద్దున్న లేవంగనే రాముణ్ణి తలుచుకుని, నా యిల్లు చల్లగా చూడు తండ్రీ అని మొక్కుకుంటాను: ఆ పూచీ వాడిదే,- యిల్లు విడిచి,- యీ వైశాఖానికి- అయిదేళ్ళు-

ఒక్కసారి యింటికి వెళ్ళి, - పిల్లవాడిని చూడాలనిపించదా?- అంటే, మనలోమాట, అనిపించేమాట నిజమే: యీపాటికి, మనవడో, మనవరాలో, యింట

పొరాడుతూండాలి! ఖాయం! అది రాముడి కృప: కాని,– వాళ్ళకూ తలిదండ్రుల గుణాలే అబ్బి–వీడు మనకు తాతేమిటని, చీదరించుకుంటే?– యిప్పుడు ఎందుకులెద్దురూ,– నా మనవడు దైవం రక్షించి పెరిగి పెద్దవాడై,– ఏ గవర్నరో కలకటేరో చేస్తూ,– సభలో నిలబడితే,– నేను ఏ మూలనుంచో తొంగి చూసి, చక్కా వస్తాను: అంతే,– నా గాలి సోకకుండా,–వాళ్ళు ఉన్న స్థితిలో చల్లగా ఉండాలి!–...

తాత కబుర్లు వింటూంటే నవ్వూ వచ్చింది కోపమూ వచ్చింది,– అయ్యో పాపం వీడెంత అల్ప సంతోషి! అని జాలీ వేసింది: ఆ కొడుకన్నవాడిని, నడివీధిలో బండకొయ్యవేయాలనిపించింది– కొడుకు ఎలాటివాడైనా,– కన్న కడుపు కనుక, తండ్రి సర్దుకుపోతాడు అన్నమాటేగా?–తన తండ్రి,– అక్కడ మూలుగుతూ పడున్నా– తనని తలచుకుంటూ బిడ్డను చల్లగా చూడమని దేవుళ్ళకు మ్రొక్కుతున్నాడా? – తాత సొద విన్న మీదట,– తనకు తండ్రి విలువ తెలిసి వచ్చింది–

యింత కాలమూ, తన తప్పు తెలుసుకోలేక, – నెపం తండ్రి మీదికి నెట్టేశాడు: తనది ఎదిగే యీడు: ఆయనది ఒదిగే వయసు! కనిపెట్టి చూడాల్సిన బాధ్యత,– తనది!–

తన తల్లికి ఆయన దేవుడు!–

మరి,–తనకు?–

– ఇక తాత్సారం చేయలేదు:

తన చేతిక్రింద అందరూ నమ్మకస్తులే–

ఓ నెల్లాళ్ళపాటు లేకపోయినా ఫరవాలేదు–

వ్యాపారం దానంతట అది, నడచిపోతుంది–

తాను ఫలానా గ్రామం వెళుతున్నాననీ,–అంతగా మరీ అవసరమొస్తే, కబురు చేయమనీ,– గల్లాలో కూర్చునే, శేషయ్యతో చెప్పి, కదిలాడు! బస్సుమీద కాదు– మదారు సాయేబు బండీమీద:

సాయేబు ద్వారానే తనకు ఆ గ్రామం భోగట్టా తెలిసింది:

అతగాడు, మాంచి మోతుబరి–మర్యాదస్తుడు:

భూవసతి విశేషంగా ఉంది:

ఆ గ్రామమే సాయేబుల పుట్ట–

గల్లా అంతా బెజవాడ మార్కెట్టుకు బట్వాడా:

సాయెబు తరుచు వచ్చేవాడు:

ఆవడలంటే ప్రాణం: ఊరులో ఉన్న రెండు మూడు రోజులూ అన్నం మానేసి,– వాటిమీదే ఉండేవాడు:

ఆవడలు తయారు చేయడంలో,– తాను రాష్ట్రపతి పతకం పుచ్చుకోవలసిన ఘనుడు:

అలా వస్తూ పోతూండటంతో పరిచయం అయి– ముదిరి, స్నేహమయింది: సాయెబు మాటల్లో,– గ్రామం కన్నులకు కట్టినట్లు అవుపించేది:

నేనూ నీతో వస్తా పద–అన్నాడు తాను:

అచ్ఛా! అంతకంటెనా,– బండెక్కు భాయీ, – ఒక నెల రోజులు కనీసం– మకాం–

అన్నాళ్లూ నీవు అన్నం మానేస్తావన్నమాట!

ఔను భాయీ,-అన్నం, ఎక్కడన్నా దొరుకుతుంది-

ఎవరన్నా పెడతారు: కాని, -ఆంవడలు!- మిన్‌పపప్పు, రోలులో వేసి గునాయించడం, - నెయ్యిలో కాల్చడం, ఎవడన్నా చేస్తాడు: కాని ఆ రుచి,-గెడ్డ పెరుగులో, గుమ్‌గులాలాగా, నీవు మసాలా తాలింపు వేస్తావే, - ఆ చిట్కా ఎవడికి తెలుసు!- నీవు, భగవంతుడి అవతారం: నవ్వుతా వెందుకు భాయీ,- భలాచంగా బాత్‌చీత్ కాదు: మన ఖురానులో మాట అనుకో: కాశీలో అన్నపూర్ణమ్మ చేసేపని ఏమిటి? బేటా అని పిలిచి పాయసం పెడుతుంది- నీవూ అంతే! మనిషికి తినిపిస్తే మస్తాన్ అవుతాడు: మస్తాన్‌కి తినిపిస్తే మహమ్మదు వారవుతాడు:

నేను, ఆవడలు అమ్ముకునే వాడిని,-

అన్నపూర్ణమ్మ తల్లి డబ్బుచ్చుకోదుగా,-

లేనా దేనా అంతా ఖేల్ భాయీ,-

ఆ తల్లి ఉందే,- మా, అని పిలిచిన వాడి హ్రిదయం ఉందే,-హ్రిదయం అంటే తెలుసుగా-అది తన స్వాధీనం చేసుకుని,- అప్పుడు తినిపిస్తుంది- మా ఖాజామోదీన్- అంటే మా చిన్నాయన కొమారుడు - చెప్పాడయ్యా, ఆయనకి మీ పురాణాలన్నీ తెలుసు: సముస్క్రూతం తెలుసు!- భగ్‌వద్ గీతా చదువుతాడు: భలేవోడు: అందరూ మావోడిని, సాయేబు శాస్తుర్లంటారు: మన భోజనం చేయడు-మీలాగానే పప్పూ-నెయ్యీ-పెరుగూ- అంతే!- నీ ఆవడల మజా వాడికి చెప్పాను: కాని, ఏం ఫాయదా? వాడు యిల్లు కదలడు: ఏడాదికి ఓసారి మస్తానయ్య ఉరుసుకు,-గుంటూరు పోతాడు: కాని,- బయట భోజనం చెయ్యడు: చక్కరకేళీ, - లేత కొబ్బరీ తింటాడు: నిన్ను చూశాడంటే-రుచి, చూశాడంటే- వదలడు: ఉహుఁ- కదలనియ్యడనుకో-

తనకు,- నవ్వు వచ్చింది:

అభిజాత్యమున్న వాళ్ళు ఎంతటి అమాయకులో యిప్పటికి అర్థమయింది: వాళ్ళు అల్ప సంతోషులు: అమ్మకూడా-అంతే!-

సాయేబూ-వచ్చినవాణ్ణి-వచ్చాను గనుక,-మీకు మొగం మొత్తేంతవరకూ వండి పెడతాను: ఓ నాలుగు రోజులపాటు ముప్పొద్దులే అవే తిన్నారో,- వెక్కసమై,- నన్ను తక్షణం వెళ్ళగొడతారు-

-వెక్కసమా? - కోనయ్య భాయ్-మూడు జన్మలు తిన్నా, మొగం మొత్తదు: దేవతలు, అమ్‌రుతం త్రాగినట్లు,- మేం ఆంవడలు పుచ్చుకుంటాం: మీకు, - పెరుగూ సంద్రం ఉందిటా! దాన్కి, తాలింపు మసాలా యేసి, - గారెల్ తగిల్పించావో,- వాహఁ - మనకీ యెగ్ సాయం, ఫల్‌సాయం జరూరీ లేదు: మనం-అక్కడే మకామ్ చేస్తామ్: మనమ్ కాదు, తమామ్ భూ ప్రపంచం అక్కడే: ఒక్క కూడు తింటే ఒక్క మాటమీదుంటాం! ఒక్క గూటిలో ఉంటాం!...

ఓరి పీడిల్లు బంగారంగానూ,- ఎన్ని ఊహలున్నాయ్!- అవును, దేశం ఏలిన జాతి! ఆ చూపే వేరు! ఆ దర్జాయే వేరు! చేత్తో గులాబీపువ్వు పుచ్చుకుని, సింహాసనంమీద కూర్చున్న ప్రభువులు: దేశాన్ని, అత్తరువూ పన్నీరుతో, ముంచెత్తి, గుమ గుమలాడించారు: దానిమ్మరసం దాహం పుచ్చుకున్న ఘనులు: అన్నం పరబ్రహ్మ స్వరూపమని తెలుసు

కున్నటువంటివారు. కనుకనే, ముద్ద ముద్దకూ బిస్మిల్లా అంటారు!–... యిలా, అనుకుంటూ–అనుకుంటూనే ఎప్పుడో తెలియకుండానే కునుకు తీశాడు: మెలకువ వచ్చేసరికి,– సంజె వెన్నెలొచ్చింది: వెచ్చవెచ్చని లాల బోసుకుని,– అమ్మ ఒడిలో జోగుతూ,– పాల్రాడివి, ఒక్క నిద్దుర తీసిన పసివాడికి మల్లే, – నవ్వుతూ మేలుకుని,– బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని,– కూనిరాగం దీసి,– కుదురుగా కూర్చున్నాడు: రావిచెట్టు క్రింద బండి ఆగింది: 'ఎక్కడున్నాం?'–అన్నాడు: 'వుయ్యూరొచ్చాం!' అని,–మదార్,– బీడీ ముట్టించుకుంటూ, పళ్ళ బిగివిన పలికాడు:

'యిక్కడ మకాం జేద్దామా?–'

'బారెడులెక్క రాలేదు: అప్పుడేనా? – అడుగడుక్కీ మజిలీ చేస్తూ పెళ్ళి నడకలు నడిస్తే,– మూణ్ణాళ్ళకుగాని, యింటికి జేరుకోం!– భాయీ! పామర్రులో బండీ దింపడం రివాజు: అక్కడో కునుకుతీసి,– కోడి కూత యిని బండెత్తితే,– జామ్ ప్రొద్దెక్కేసరికి మనూరు!–'

'సరే,– అలాగే చేదాం!–'

యిప్పుడేకాదు: యింకో గెంట తాళి! – యిక్కడ సుల్తాన్ అని, మన చిన్నాయన శిష్యుడున్నాడు: ఆయనగారు – హాజీ,– అంటే, మక్కా వెళ్ళి వచ్చారు: మీలో పెద్దల్ చెప్తారే, కాశీకి వెళ్ళినవాడి కాల్‌కి మొక్కితే, – కాకి కలహంస అయిందని,– మన్‌కీ అదే శాస్త్రం: ఒక్కపాలి వారి మొగం చూస్తే, మన్‌కి పుట్టెడు పున్నెం–

వారు ఫకీర్లా,–?

ఫకీర్లు కారు–పాదుషాలూ కారు: వారి తరహాయే వేరు! చూద్దువుగానిగా!–

మామూలుగా సలాంజేస్తే చాలా!– దానికేమన్నా కమామీషుందా?... మదార్ ఆ మాటకు నవ్వి ఊరుకున్నాడు, కాని సమాధానం చెప్పలా!– ఒక్క గట్టి గుక్క లాగి, బీడీ మునివేలితో చిలుకొట్టి, నొగలెక్కి కూర్చున్నాడు: బండీ, కొబ్బరితోట దగ్గిరకు వచ్చింది: ముందంతా మెరాబా: ఎడమ చెంపను నాలుగైదు నిట్టాళ్ళ పాకలు: కలప అడితీ,– బళ్ళ కార్ఖానా, భారీ వ్యాపారమే: యీ చెంపను ఖాళీ జాగా: అందులో తగుపాటి తాటాకు వసారా: చుట్టూ తడికె లేదు: రెండు లాంతర్లు జోతులల్లే–బండి రావడం చూసి, పడుకుని ఉన్న మనిషి లేచి యివతలకు వచ్చాడు: చెంగావి పంచె గుత్తంగా కట్టుకున్నాడు; మనిషి కాటుక సిద్దే! కుదిమట్టపు భీముడికి గడ్డం మీసం పెట్టినట్టున్నాడు:

తాను బండి దిగి పక్కగా నిలుచున్నాడు: ఆ మనిషి మదారుకు సాయం వచ్చి, చెరో యెద్దునూ విడిచి బండి దించారు: యెద్లను కట్టెయ్యలా: వారు మీదికి వేసి, వది లేశారు! అక్కడ గడ్డిమేటి దగ్గరకు పోయినాయి! అక్కడే నీటి తొట్టిలున్నాయి: అంతవరకూ ఎవరూ ఏమీ మాట్లాడలేదు: బండిమీదనుంచి,– ఓ చిన్న గంప తీసి,– మదారు, – దాన్ని పాకలో పెట్టి వచ్చాడు:

తాను,– దిక్కులు చూస్తున్నాడు:

పైన, చుక్క రాలింది:

చిన్న మతాబా కాల్చినంత వెలుతురు,–

చేతకానివాళ్ళు ముగ్గుగర్ర వేసినట్టు–

ఈ మనిషి,– తన పక్కకు వచ్చాడు–

పోత విగ్రహమల్లే-

మొహంమీద మొహం పెట్టి చూశాడు:

ఆ కళ్ళు కావిలించుకున్నట్టనిపించింది-

తన చేయందుకున్నాడు-పండు వేసంగిలో పానకం త్రావినట్టుండి,- తనివి తీరినట్టయి,- అంతలో తపన పుట్టుకొచ్చింది:

తనమీదికి నవ్వుతున్నాడు:

ఆ నవ్వు, - కనకదుర్గాంబకు కప్పుర హారతెత్తినట్టనిపించింది- ఒళ్ళు ఝల్‌మని- కళ్ళు మూసుకున్నాడు:

మన-కోనయ్య, ఆంవడల కోనయ్య,- అంటున్నాడు మదారు: ఉహుఁ-అన్నాడా మనిషి!

ఆ మనిషే, సుల్తాన్ - ఎవరో చెప్పినట్టు తెలిసింది - ఈయనే సుల్తాన్ అని, - భుజం తట్టుతున్నాడు, మదారు: తనకీ నవ్వొచ్చింది, బడిలో అయ్యవారికి,-పిల్లకాయ పాఠం చెప్పినట్టనిపించింది: తనకు ఎప్పుడో తెలిసింది, - వీడిప్పుడు చెపుతాడేం,-

మనిషి జన్మకు మరుపు జాస్తీ - తెలిసింది, - మరచి పోవడం-మామూలు: ఒకడికొకడు తెలియచెప్పడం,- అహంకారం కాదు- అజ్ఞానం కాదు-అలవాటు:

పీర్ మొహిద్దీన్ వారు, ఏమని కవిత్వం కట్టారు?- 'ఎక్కడెక్కడ వెదకి చూసిన- ఒక్కడని వేదములు పలుకగ నిక్కమిది యని తెలిసియును, మరి, మక్కువతో పాషాణ ప్రతిమకు మ్రొక్కెదరు ఎటువంటి తెలివన్నా!'... ఔను... అంతటా వారే,-అంతా వారే, కాని, యిదిగో యిక్కడ యీ పేరుతో వెలిశారు: అక్కడ ఆ పేరుమీ దున్నారు - అనడం దేనికి,- అది,- మన రాదారికి, కొండగుర్తులు: అందుకనే,- 'తారకము సూటెరుగవలె నన్నా, సద్గురుని కృపచే తారతమ్యము తెలిసి మనరన్న!' - అంటున్నారు! - తారతమ్యం దేనికి?-

నీకూ, - అద్దంలో నీ బొమ్మకు!-

నీవు మట్టుకు - నిజం-

అద్దంలో బొమ్మ-? నీవు- కాని-నీవు-

అదే, -సంసారంలో, ఆత్మావై... అన్నాడు:

అంటే-నీ బిడ్డ, మూడుమూర్తులా - నీవే-

కాని, - అచ్చంగా, - నీవు - కాదు:

కాకపోలేదు:

ఏమిటది?

షేక్‌హుసేన్‌గా రేమన్నారు: 'తాను చెపుతాడంట- తత్వజ్ఞానమ్ము

తనకసలు లేధంట - లోకజ్ఞానమ్ము'

నేను వాగేదీ, అంతే!-

ఎదుట మనిషిని చూస్తే, - మనమాటలు ఎగిరిగంతేస్తాయి.

మన నోరే మనమాట వినదు:

కారణం?-

తాను, తానైయుండంగా - నేను - నేననుకోవడం-

బందరులో గురువులేమంటున్నారు–
తానే దైవంబను తత్త్వజ్ఞానములేక,
'తానుకాదని, కాశీ తరలిపోతున్నారే–
యింతకంటెను వింతకలదే – ఓయక్క! భువిని!
అంతరంగుని మరచి అల్లాడుచున్నారే!'–

కోనయ్యాభాయ్: యీ పదంలో మంచి లబ్జ్ వేశారు ఆయన! – ఏమంటున్నారు! – అంతరంగం – అంతా, – రంగమ్, – రంగడిమయమ్: అంటే హ్రిదయం: మన మకామ్‌కి, – ఒక పెద్దమనిషి వస్తే, – వారినెక్కడ కూర్చోపెడతాం?– మన యింట్లో ఉన్న మంచి జముఖానా వేసి!– అలాగే, – మనదేహం హోల్ మొత్తంమీద హ్రిదయం అనేది, – మఖ్‌మల్‌సెల్లా! – ఒరే, – వారువచ్చి, నీ హ్రిదయంలో, – కూర్చుంటే, – అది తెలుసుకోలేక, – అల్లా!– అల్లా! అని అరుస్తావెందుకురా!– అంటారు! – ఔను భాయీ,– అది తెలిసినవారికి, – ఆనందంలో, మాటరాదు: తెలియని యీ సుల్తాన్‌భాయి, –– యిలా వాగుతాడు!–– సాబ్ జాన్‌గారు ఏమన్నారు: ఘాస్ – అంటే, మన గడ్డి, – అది తినే ఆవుకు పుట్టిన బిడ్డ అంబా అంటే, – గర్భం వచ్చినప్పుడు, కాజా, బర్ఫీ, ఫేణీ తిన్న మనిషికి పుట్టిన బిడ్డ– ఉంగా, – అంది: క్యం?– అది, గడ్డి మహిమ!– మన వేదమ్‌లో,– ఎలా చెప్పారు: పరమాత్మ ఎంత సూక్ష్మరూపం అంటే, – వరిముల్లు మొన అంత అన్నారు! – గన్‌కనే, – గడ్డిపరక మంత్రిస్తే, బ్రహ్మాస్త్రం! రావణాబ్రహ్మను ఖడేరావ్ అన్నది ఎవరు? – గడ్డిపరక. వాడికి యింత గడ్డి పెట్టు అంటే ఏమిటి?– గ్నానం రానీ, – అన్నమాట: ఖసమ్ ఖాకర్ అంటే అదే అర్థం। వెనకటికి, – రంగూన్ సాలార్ అని, – – ఒక జ్ఞాని, మన చిన్న తనంలో ఉండేవారు: వారికి భూక్ లగాయిస్తే,– గుప్పెడు వడ్లగింజలు తీసుకుని, – పేట్‌మీద వేసేవారు: అవి, – క్షణంలో పేలగింజలయేవి: పొట్టు ఊదేసి, అది భోంచేసేవారు:

నీరు పేరుకుపోతే – ఉప్పు–కడలి నీరు కూరుకుపోయి, – కూ కూ లాడితే– నిప్పు–, పండు నిప్పు!–

అ– ఉప్పంటే– నిప్పుకు– కస్సు
ఆ, నీరంటె నిప్పుకు – బుస్సే!
సంసారమని యేటి సాగరంలోన,
తల్లీకి బిడ్డాకు దాయాది పోరేర, – సాలారూ!

షేక్ సాలారు!

సుల్తాన్,– మాటలు, పాటలూ మానేసి, – నవ్వులో పడ్డాడు: సంగీతం పాడినట్టు నవ్వి నవ్వి– అంతలో ఆపేసి,– అతి నెమ్మదిగా,– లాలనగా,– కోనయ్యా భాయ్! పసిపిల్లకు కితకిత,– పడుచువోడికి పకపక,–పనీ పాటా లేనివోడు పకపక లాడితే,– కనీ పెంచని తల్లి– అంటె ఎవరు,– యీ భూమీ దేవి– ఆకలెరిగి అన్నం పెడుతుంది!– అని గురువుగా రంటారు: తియ్యని బువ్వా,– కమ్మని దాహం: మసాలా, తాలింపూ మనసూతో యేసేసి, – అన్నం నేనే, – అన్నం తినేవాణ్ని నేనే, – అనుకో...'

ముద్ద జీడిపప్పు,– ఖుజ్జురుపండు,– చక్కెరకేళీలు, చిక్కని పాలూ, – అందరూ పుచ్చుకున్నారు: తిన్నకొద్దీ,– ఆకలి వేస్తూంది: యింతలో, – మరో మనిషి, లేత మొక్కజొన్న

కండెలు సెగ జూపించి పట్టుకొచ్చి పడేశాడు: చూస్తే, – నోరూరింది: చే జాపేదాకానే మొగబిడియం: ఒకటికి రెండు,– ఒలిచేశాడు: యిలాంటివి,–కంఠందాకా తిన్నా, కడుపునిండటం ఉండదు: యింకా ఒకటో అరో కుక్షిలో ఉంచేయవచ్చు,– అనుకున్నం తలో, – వేడి వేడి వేరుసెనగ గింజలు వచ్చి పడ్డాయి: నంజుకునేందుకు బెల్లం ముక్కలు। – తెల్లవార్లూ యిలా యీ తిండి సాగుతుండవలసిందేనా?–అనుకున్నంతలో,– ఔను భాయీ,–

'నారూకు నీరు మేత,–పైరూకు గాలి మేత,
ఊరికి పైరు మేత,– వుస్తాదయ్యకు హుక్కా మేత,–
నీతేరా నీకు మేత, సాలార్!–

అంటున్నారు: కాని, సుల్తాన్‌వారు తినే తిండి, సుబేదార్ తింటాడా?– అయితే,– ఆకలి అందరికీ సమానం!–యీ నోటితో తింటూ, ఆ చెవితో వింటూ – వయసు వెంబడి పోతూంటే, ఏ డొంక నెళ్ళినా ఏటుకూరే జేరుకున్నాడు అన్నట్టు–

ఆ,– అన్నట్టు,– ఏరా మదార్,– మన ఊరిలో,– మొగం మచ్చ వెంకట్రామయ్యను – మరిడయ్య గిత్త గల్లింతా యిచ్చిందట!–

ఆ– తాను ఉలిక్కిపడ్డాడు–

నాన్నను గిత్త కుమ్మిందా?–

దెబ్బ మోపుగా తగిలిందా?– అడుగుదామని, నాలిక చివరిదాకా వచ్చింది। కాని మదారు. మాటకందుకున్నాడు.

తాను, ఎందరికి గల్లింతా లివ్వలేదు?

ఈ మాత్రం తాపు యిప్పుడన్నా తగలాల్సిందే?

యిన్నాళ్ళూ: మనుష్యులకు చేతకాకపోయింది–

పసువులన్నా బుద్ధి చెప్పద్దూ?–

కాని,– అదన్నా – బాగుపడేట్టు చెప్పలా?–

పై చేలోంచి పక్క బెదురుతో వచ్చి,– కొమ్మిసిరింది– మనిషి, పక్కకు దూకాడు: కాని, గట్టు తగిలి,– పల్టీకొట్టాడు: కొంచెం డీలా మీదున్నాడుగా, యీ మద్దిన,– కాల్ మెలిపడ్డది: అంతకన్న విశేషం లేదే? – మరేమన్నా తబ్సీలు ఉందా?–

లేదులే,– మన, బడేమియా అల్లుడు లేడూ, యాకూబ్,– వాడు,–కంకిపాడు పోతూ,– తెల్లవారి,– మన కార్ఖానాకాడ బండి దింపుకున్నాడు: భోజనం దగ్గిర, – ఆ మాటా యీ మాటాలో,– యీ కబురు చెప్పాడు: ఆ కాల్ అట్లాగే పరాఖత్‌గా విడిచేతలికి,– అది మోరు కట్టింది: పైగా, వంట్లో కొంచెం దుర్ రక్తం ఉందేమో,– కాలు,– దూలంలాగా,– తయారైంది: పోటూ సలుపూ; అంత బాధ వచ్చినప్పుడన్నా, రామా! అన్‌కోడే మనిషి!– ధూత్ ధూత్ అంటూ పంటకారు కూతలు కూస్తుండెనే! అభిమానం చంపుకుని,– ఆ భార్యా, – ఆ గుడిసె కాడికి పోతే,– రామ్ రహీమ్! ఆ నోటి మాటల్‌కి,– ఆ సుబ్బాయ్‌కీ షరమ్ వచ్చి, – మళ్ళీ నోరెత్తితే నోటిమీద కొడ్తాన్ అని,–గొడవ చేసిందట:– ఆ కొడుకు,– ఆ గోపాలం,– వాడు దేవుడి మొఖంలాటి మనిషి కనుక, – ఆ మాటల్ పడుతూ వైద్యం చేయిస్తున్నాడు: ధూత్! జాన్‌వరకు ఉన్న జ్ఞానం,– ఆయనకి లేదు!– యిప్పటికైనా,– యింటికి పోందే!–...

తా నిహ మాట పట్టలేక,– కలిపించుకున్నాడు!–

భార్య, గయ్యాళా?–

మదారు ఛెళ్ళున అన్నాడు–'అయితే,–ఊరిలో ఉండనిచ్చేదా?–

అంత తలవంపుల్ మారి కాపురం – ఆ తల్లి కనుక చేస్తుంది: ఆ అమ్మ మొఖం చూసి,– ఎవరూ కలిపించుకోరు కాని,– లేకుంటేనా,– పందిర్ మే చొప్పకట్ట యిసిరేసినట్టు,– యేసెయ్యం?–మున్‌పూ, ఆ తల్లీ తండ్రీ మొగం చూశామ్,– యిప్పటికీ ఆలూ బిడ్డా మొగం చూశామ్– ఆ యింట్లో,– అందరూ మంచోళ్ళే భాయీ,–అందాకా ఎందుకూ, – వెంకట్రామయ్యా నేనూ,–గోలీలాడుకున్నాం కాదూ। నాకు, – తెలియదూ, వాడి హ్రిదయం మంచిది, కాని, దిమాగ్‌కే అదేం గాచారమో ఖరాబ్ పట్టింది! ఆయన మళ్ళీ మనుషుల్లో మనిషీ అయితే,– మనూరికే కళ!– కోనయ్యా భాయ్,– నీ, ఆంవడలూ,– తినిపిస్తే'–

తాను,– నవ్వాడు:

అది నవ్వడం కాదు: కళ్ళ నీళ్ళు ఆపుకోవడం!–

నిజమే,– అమ్మ,– ఆయన్ని ఆదరించి,– అన్నం పెట్టింది:

ఆయనా చేతనైనంతలో,– దయగా చూశాడు.

తాను కలిగాడు:

తన చేతిమీదుగా,– వండిపెడితే,–

మారుతాడేమో,– తన కాపుణ్యం ఉందేమో?–

మదారు లేచి వెళ్ళి బండి కట్టాడు: తనకోసం కేకవేశాడు: కాని సుల్తాన్‌ను,. వదిలి వెళ్ళాలనే లేదు: మదారు కేకలేసినా,– తాను వినిపించుకోనట్లు, అలాగే కూర్చుని పోయినాడు:

సుల్తాన్, నవ్వుతూ ఏమన్నాడూ?–

కోనయ్యా భాయీ,. నీవు శకుంతలా నాటకమ్ చూడలేదు కాదూ?– ఇందర్ సభాలో కంచన్ మేనకా,–అని, ఆమె బేటీ శకుంతల, తండ్రీ, – ఒక రుషి! అయితేనేం, – పెంచే ప్రాప్తం వారికీలేదు: కణ్వుడూ,– అని మరో రుషి, – వుస్తాదోంకే వుస్తాద్,– ఆయన పెంచాడు! రాజా దుష్యంతుడు,– యీ ఆశ్రమాన్కి వేటకువచ్చి, – మెళ్ళో మల్లెపూల దండవేసి, పెళ్ళి చేసుకున్నాడు: శానాళ్ళకు, – తాను పెంచిన బిడ్డ,– అత్తవారింటికి వెళుతుంటే కణ్వుడు ఏమన్నాడూ,– బేటీ,– నీవు మీ రాజ్యానికిపోయి,– సుఖంగా రాజ్యం చేసుకోని,– మీ పిల్లవాడికి తఖ్త్ అప్పగించి,– నీవూ,– నీ తాలూకు ఆ నౌజవాన్‌వచ్చి, – శాంతంగా మన ఆశ్రమంలో ఉండి పోవాలా। – అదీభాయ్, – యీ సుల్తాన్ గాడనేదీ।– నీకు బస్తీమీద మొహం మొత్తితే, – సబ్ ఛోడ్‌కర్, – వచ్చేసెయ్యి, – వందేళ్ళు బ్రతుకు। అని వెన్ను చరిచాడు:

తాను, ఏం చేస్తున్నదీ,– తెలియకుండానే,– అన్నా। అంటూ సుల్తాన్‌ను కౌగలించుకున్నాడు! అన్నా! నీవుకూడా మాతో వచ్చేయరాదూ – తొందర పనులేం లేక పోతే– నాతోబాటు నాలుగు రోజులుండి రావచ్చు, పోనీ–, వెంటనే రాలేకపోతే–

సుల్తాన్, పెరుగుకడవ తొణికినట్లు నవ్వుతూ– సాలార్ భాయ్‌ని – ఎవరో,– దోస్తు తనవెంటరమ్మన్నాడు: ఆయన, ఏమన్నారు? అరేమియా,– దారినిపోయే పొరుగూర్

వాడికి,- దారిపక్కన వృక్షం నీడ యిచ్చింది,- అది,- మనూరు రమ్మంటే వస్తుందా?- మన గురువుల కటాచ్ఛంలో,- యీ సుల్తాన్‌గాడూ అంటే,- యీ మాను, యిక్కడుండాల్సిందే,- మునుపు మనం కాల్ నిలపలేదు - యిప్పుడు - కదల్చడం లేదు: అది ఒక దశ - ఇది ఒక దశ:- సంజెకాలంలో శివుడు, నటరాజు - మిగతా టైమ్‌లో శిలాకారం!- మన ఆకారం చూశావ్‌గా - పోయిరా భాయ్!- అని మళ్ళీ ఒకసారి వెన్నుతట్టాడు: తాను, వల్లమాలిన ఆనందంతో- బండీ ఎక్కాడు:

అప్పటికి వెన్నెల ముదిరింది-

బండీ, - బద్ధకం దీరి, పడుచు నడక అందుకుంది: ఓ అరమైలు సాగేసరికి, - సుల్తాన్ ఒక్క పరుగునవచ్చి అందుకున్నాడు: తనకో చేతికర్ర అందించాడు: అరె మదార్ - మాటల్లోపడి మరచిపోయినావ్‌రా!- చెప్పవలసినవారికి సలామ్‌లు చెప్పు,- అని, మరోమాట లేకుండా, - వెనుతిరిగి పోయినాడు:

టూకి చేవకర్ర - గిలకలు - గిలకలుగా తరిమెనపట్టి, కాగితంకొట్టి, - మైనం మెరుగెట్టాడు: మహాముచ్చటగా ఉంది!- యిది, ఎవరికోసమో?-

-వాడి గురువుగారి కోసంలే!- అన్నాడు మదారు.

యింక రెండు మూడు రోజుల్ తాళి,- ఆయనగారి పుట్టిన్ రోజ్ - హరేక్‌సాల్, - వీడు,- మొక్కుబడి, యిది!-

అవాళ వచ్చి దర్శనం చేసుకోడా?

ఎప్పుడూలేదు: గాలీ తిరిగితే,- ఒక మాసంలో,- ఒకటికి నాలుగుసార్లు వస్తాడు: ఒక్కొక్కపాలి,- మాసంపైచిలుకు ఉండిపోతాడు: మరొకపాలి, - ఒక పావుగంట! - మా చిన్నాయన కొడుకు, - ఉన్నాడే, - ఆయన కూతురు ఉందే,- ఆం- నీకు చెప్పలేదు: వారి చేనుపక్క పుంతలో,- ఏ తల్లో విడిచేసి పోయింది: నిన్న మొన్న పుట్టినబిడ్డ - మా మోదీన్ చూసి,- తెచ్చుకున్నాడు: చెప్పానుకాదూ, నాటకంలోలాగా,- యీ ఆశ్రమంలో ఒక శకుంతల!- బిడ్డపేరు, - అంబ!- నీకు ఆశ్చర్యంగా ఉంది కదూ?- మా మోదీన్ అంటాడుకదా!- అరే, - మన మతం లెక్క ప్రకారం, - మనం అందరం, తల్లిలేని, - బిడ్డలం! - మనవారి మతంలో, - జగన్మాత, - సర్వేశ్వరి, - అంబ! - ఎక్కడికి అక్కడే, - ఎప్పటికి అప్పుడే, ప్రత్యక్షం - ! - అందుకని ఆ పేరు పెట్టుకున్నాడు: యిప్పటికి పదిమీద ఎన్మిది సంవత్సరాలు పెంచాడు: అంబా! అంటాడు! - అన్నా! అంటుంది!- అందరినీ అన్నా అంటుంది- ఒక్కడిని తప్ప! - యెంకట్రామయ్య కొడుకు గోపాలంలేడూ,- వాడు, - మా రాజా దుష్యంతర్ - దానికి,- కథవుంది:

యెంకట్రామయ్య, - మా మోదీన్‌కు, ఒక సంచీ రూపాయల్ ఇస్లాచేశాడు: అప్పుడే - అయిదారు సంవత్సరాలయింది: అప్పటినుంచే మనిషి, - సుబ్బాయ్ గుడిసెలో మకాం పెట్టాడు: అసల్ అడిగేవారికే జవాబులేదు: ఈయన అడ్డలా - ఆయన యివ్వలా!- నిరుడు సరిగ్గా యీ రోజుల్లో,- గోపాలం మోదీన్ దగ్గరికు వచ్చాడు: చేతుల్ కట్టుకుని, - సాయేబుగారూ,-మా నాయనగారు, - మన గ్రామంలో,- ఆసాముల దగ్గిర కొంతసొమ్ము వాడుకున్నారు: ప్రస్తుతం తీర్చేందుకు తగిన స్థితిలో వారు లేరని మీకు తెలిసిందే!- మీ చేనుపక్క చేను మాకున్న, ఆ చెక్క, విడుదలపెట్టి,- వచ్చిన సొమ్ము బాకీలకు సరిపెట్టి తల ఎత్తుకు తిరుగుదామని ఉంది! మన గ్రామంలో అందరూ మమ్మల్ని

ఎంతో దయగా చూస్తున్నారు: వాళ్ళ పిల్లలకు నాకు వచ్చిన చదువు చెప్పుతూంటే యిల్లు గడచిపోతూంది: మా అదృష్టం బాగుండి మా నాయన, యింటికి తిరిగి వచ్చినా,- యీ సంపాదన చాలును: మీరు పెద్దలని,-మీ దగ్గరకు వచ్చాను!- అన్నాడు: మోదీన్: ఏమన్నాడంటే,- ఏమయ్యా,- మీ నాయన,- స్నేహితంలో వాడుకున్నాడు కాని,- చేబదులు తీసుకోలేదు: మిగతావాళ్లూ అంతే,- ఆయన మన గ్రామంలో,- ఒక్క కానీ ఎవరికీ రుణం లేదు: నీ కెందుకీ అజ వచ్చింది- గోపాలం కంట నీర్ ఓడింది. వెంటనే మితిమించిన ఆవేశం వచ్చింది. మీ అందరూ మంచితనంతో మమ్మల్ని కాల్చుకుతింటున్నారు: మా నాయన, పనికిమాలినవాడని, - మౌనంగా, - చాటింపు వేస్తున్నారు: ఆయనకు చీమ కుట్టినట్టు లేదేమో కాని, - మీ దయా ధర్మానికి దాసోహమంటూ, - పడి ఉండటం, భరించలేకపోతున్నాను:

నిజంగా, దరిద్రంపడితే, పిడికెడు బిచ్చం వేయమని యాచించటానికి, బిడియపడను:

మీ నాయనకన్న మంచివాడవనిపించుకోవాలనా యీ ఎత్తు? అని మీరనచ్చు:

నా ఊహ అది కాదు:

నిన్న మొన్నటివరకూ,- మా నాన్న,- మీ అంతకాకపోయినా,- సాటి ఆసామి: ఈనాడు మీరెంతకాదన్నా-మీరు రుణదాతలు,- ఆయన రుణగ్రస్తుడు!- యీ విషయంలో- మా నాయనకూ, మీకూ లేని కించ నాకెందుకూ - కాని, మా అమ్మ-యిది తలచుకుని, - తలఎత్తలేకుండా ఉంది:

మా అమ్మవంకవారూ, - అయ్యవంకవారూ,- ఉపాదానం చెయ్యలేదు: ఊళ్ళేలనూలేదు: కాని-...

మొదటినుంచీ - వీరికున్నది - కలిమికాదు-

గణ్యత!-

అది - దక్కించండి!-...

- ఐసా ఐసా, - చెప్పుకుంటూ పోయేసరికి, - మోదీన్ భాయ్ ఏమన్నాడు?- ఒక్క ఛణం, ఏమీ అనలేదు: అచ్ఛా! అచ్ఛా!- అని మనలోమనంగా అనుకున్నాడు: తనకు తను, నవ్వుకున్నాడు: అప్పటికి ఏమన్నాడంటే- ఏమయ్యా!- పరగడుపున బయలుదేరి వచ్చినట్టున్నావ్! - పాలు పుచ్చుకుంటావా? - యిలా అనేసరికి - గోపాలం ఝోర్‌గా తల ఒక్క విసుర్ విసిరి - అలవాటులేదు! అన్నాడు: మావోడు - మనం ధాన్యం తూరుపారపడతాం చూడూ, - ఆ, వజాలో నవ్వి, రాజగోపాలం!-- అనుకోకుండా' అబద్ధం ఆడుతున్నావ్! - పుట్టినప్పటినుంచీ పప్పూ బువ్వా తిన్నావా?- తల్లి దగ్గిర పాలు త్రావలేదా? - కాళ్ళా గజ్జానాడు, కన్నతల్లీ - కలకాలం, గోమాతా, అని మనకు శాస్త్రం ఉన్నదయ్యా! - ఆవుపాలు చురుకూ, బర్రెపాలు బలుపూ- అని పెద్దలు చెపుతారు: అనుభవం మీద!- మన ఎన్నికలో అయినా, పాడీ-పంటా అంటాం చూడు!- ఏదిముందు?- మనిషికి, ఏదిముఖ్యం?-

ఏదిముందు?- ఏదిముఖ్యం?-

మాటలు, ఉయ్యాలూపుతున్నాయి,-

బడిగంటలు చిచ్చి కొడుతున్నాయి-

ఆలో,– ఎప్పుడో నిదురపట్టింది!–

ఒక్కపిసరు కల అనేది రాకుండా, నిండుగా నిదురపట్టింది: అల్లంతలో తెల్లవారింది.

ఎప్పుడో తెల్లవారింది–

ఎండపొడ ముదిరింది:

బండీ తనదోవను నడుస్తూంది:

మదారు – వెంటనడుస్తున్నాడు: తీరుబడిగా–

ఒక్క ఊపున లేచి కూర్చుని, – కలయజూసి,– ఆవలింతమడతవేస్తూ,– తెల్లవారిందన్నమాట–! అని అర్థం లేకుండా సణిగినట్టు గొణుక్కుని, – బారసాచి బద్ధకం మెలిపెడుతూ,– మదారు సాయేబూ,– మనం ఎక్కడున్నాం?– అని కూడబలుక్కుంటూ న్నట్టు అడిగాడు: 'వచ్చేసాంగదయ్యా? ఒక్క అరమైలులోపు!– నీవు ఊఁ కొడుతూనే, గుర్రేసుకున్నావ్: మంచి నిదరలో ఉన్నావని– పామర్రులో,– వాల్తీ పెకారం బండిప్పలా...'

'పేట కొచ్చాకన్నా,– లేపకపోయినావ్?–'

'నిదుర సుఖం ముందు,– ఆ యిడ్డెన్లో లెక్కా?–'

'అయితే,– నీవూ ఏం పుచ్చుకోలేదా?–'

నాకేం గాచారం?– వెనకటికి, షాద్‌షావారు, తురక బిడ్డా! దూల్! అన్నారుట– పహిలే దూద్! అన్నాట్ట వీడు! మనకు తిండి పడందీ బండీ నడవదు।– ఉడుకుడుకు యిడ్డెనలు, రెండు పుంజీలు కడుపులో పడేసి, రెండు గుక్కలు చాఁ పుచ్చుకున్నా!– యిల్లు జేరుకునేదాకా, అవి పనిజేస్తవి।– యింటికి జేరుకోంగనే, యింత పెరుగూ వణ్ణం తింటే, – మజ్జాన్నానికి,– నీ ఆవడలు అందుకుంటాయి।–...

తాను నవ్వుతూ బండీదిగాడు:

ఏమయ్యా! స్నానం కానిచ్చుకుని,– కాస్త శుచిగా, – ఊళ్ళోకి వెళ్ళడం మంచిది కాదూ,– అని తానన్నాడు:

జరూర్! – అలాగే చేద్దాం!– యిదిగో, – యీ తోపు మళ్ళితే, – బత్తుల సుబ్బయ్య బావేగా, – బారెడు తాడు – గొబ్బెర నీరు।–...

తాను,– అంగవస్త్రము కట్టుకుని, చెంబు చేత అందుకుని, – కిత్తనార సంచీ లోంచి, – పలుదోము పుల్ల ఏరుకున్నాడు:... తీరుబడిగా పక్కా ఝూం స్నానం కానిచ్చుకుని,– అలవాటు ప్రకారం, కృష్ణా రామా అనుకుని, పొడి బట్టలు కట్టుకున్నాడు – మదారూ తనతోబాటే స్నానం జేశాడు: కోనయ్యా భాయ్!– ఓ విచ్చు రూపాయ్ చేత బట్టుకో, – అమ్మోరి కుంకు మెట్టుకుందువుగాని; అన్నాడు మదారు: తనకు ఆ విషయం ఏమిటో అర్థంకాకపోయినా, – అదేమిటని అడగలా– బండీ ఉన్న చోటే వదిలి, – ఎదురుగుండా కనబడే తోటవేపు నడుస్తున్నారు: మదారు యిలా చెప్పుకొచ్చాడు:

మా తాతగారికి తాతగారు,– రహిమాన్ సాయెబుగారు: యీ భూమంతా ఆ రోజుల్లో– వారిది:

అప్పుడూ, యిప్పటి మాదిరిగానే, – తోటా, చుట్టూ ఖాలీ జాగా– కుంఫినీ దొరలు పేటలో ఉండేవారు!–

ఒకనాడు,– ఒక దొర, – గుర్రం యేస్కొని వచ్చి, – సంద్రం వెంపు దౌడా

యిస్తూ ఉంటే, - అదే సమ్‌యానికి బత్తుల సుబ్బయ్య కూతురు,- సీతమ్మ-పేర్‌కు సీతమ్మ,- ఆకారం బంగారం బొమ్మ,- కనిపించింది: దొర చూశాడు: గుర్రం దుమికాడు: యికిలింపు చేస్తూ,- నగద్ సంచీ చూపించినాడు: యీ యమ్మకి గుస్సా వచ్చిందిః కాని, షాంతంగా,- 'తెల్లాయినా!- యీ దేశంలో ఆడకూతుళ్ళు, - యింత మాట పడరు: నాకు తోడబుట్టినవోడివనుకుని,- వదుల్తున్నాను: నీ దారిన నీవు పో'- అన్నదట-వాడు మనిషి కాడుగా,- హాత్ లిపటాయించాడు: ఆయమ్మ నాగసర్పం అయింది: కాని,- వెంటనే కాటేయకుండా, తమాయించింది- జాలిపడి నవ్వింది: అందుకు దొర - మరో అరదం చేసుకుని, - పట్టిన చేయి విడవకుండా,- భుజంమీద చేయి వేసి తన వెంపకు లాగాడు: సీతమ్మ మరో వెంపు లాగింది- 'దొరయ్యా, బరిమీదకెక్కితే పరువుండదు:నీడకొస్తే, నీకో ఊసు చెపుతా' రమ్మని,- తోట ఆ కాడికి తోడుకపోయింది:

ఎక్కడికి తోడుకుపోయిందంటే-

అక్కడన్నీ మందార మొక్కలు-

రగతం చిమ్ముతున్నట్టు,- కొమ్మ కొమ్మా పువ్వు మీదుంది: ఆ చెంపనే, వాళ్ళుండే తాటాకుల యిల్లు-

యింటి ముంగల మామిడిచెట్టు-

ఆ నీడ నా మనిషిని నిలవేసింది:

తాను, లోనకు బోయి, కుంకుమ డిబ్బీ,- చేతబట్టుకు వచ్చింది. ఆ నీడకు మూడడుగులు యీవలగా నిలుచుంది: ఏమయ్యా! తెల్లాయనా!- నీ కులం ఏమిటి,- గోత్రం ఏమిటి!- దర్జా ఏమిటి!- అంది: దొర, జవాబుయిచ్చాడు: ఆయన్కి ఘరానా ఉంది: మాంచి విద్య ఉంది: అధికారం ఉంది: తల్లికి తానొక్కడే కొడుకు- పుటక మంచిదే, - కాని,- ఆ ఛణంలో పరువు తక్వ అయింది: ఎంతా ధనం కోరితే,- అంతా యిస్తాన్ అన్నాడు: ఆ, దిమాగ్‌లో షైతాన్ అలా పలికించాడు!- అందుకు, సీతమ్మ ఏమంది?-

నవ్వింది- అలా, నవ్వులాటగానే, గోరుముద్దల్ తినిపించింది-- 'తెల్లాయనా!- - పుట్టి పెరిగిన దేశాన నూకల కరువొచ్చి,- మా గడ్డమీద రూకలేరుకుందామని,-- వచ్చిన జాతోడివి,- ముల్లెజూపించి, మురిపెం జేస్తున్నావా?-

ఆకడ అటు కనకదుర్గమ్మ,- యీకడ శ్రీకాకుళం స్వామి,- చల్లగా చూస్తూన్న సీమలోకొచ్చి,- చేయరాని పని చేశావ్!-

నా దుఃఖం చూసేందుకు, నాకు తల్లిలేదు: మా అయ్యకు,- నామీద యీగ వాలిందని తెలిస్తే, ఒళ్ళు తెలియదు: ఊరివారికి తెలిస్తే,- నిన్ను ముద్దచేసి,- బండికేసీ,- మీ బారకాసుకు తోలిపెడతారు: మీయమ్మ నీమీద ఎన్ని అసలు పెట్టుకుని, ఏటికాకడ బతుకుతూందో!- చేతులారా ఆ ముత్తైదువకి కడుపుశోకం తేబోకు, తెల్లాయనా,-

మా దేశంలో,- యింటబుట్టిన ఆడకూతురంటే, ఆదిలక్ష్మి- అత్తింటి కోడలైతే, శ్రీ మహాలక్ష్మి!

అమ్మా అని పిలవక, అలపబుద్ధికిపోతే,- ఒకటికి పది శిరసులున్నా, నేలకొరుగుతాయ్-

యింతకుముందొక పాలి,- అంత చేటు జరిగింది: ఆ కథ,- పెద్దల్ని అడిగి తెలుసుకో,-

అప్పటికే - ఆ పాక నుసి చల్లార్చి,- మనోళ్ళు,- సీతమ్మతల్లి సొరగానికి పోయిందని తెలుసుకున్నారు.

వాళ్ళ నాయన, సుబ్బయ్య,- ఆయన ఒక వేదాంతి: యింత జరిగిందని,- ఏమీ బిగలా పడలా!- పైగా - ఏమన్నాడు: బంగారానికి,- అగ్గిసెగలో మేలిమికాంతి వస్తుంది: కనకదుర్గమ్మ నా బిడ్డను మేలిమి చేసింది. అన్నాడు:

దొరలందరికీ ఒకటే ఆశ్చర్యం!-

వాళ్ళకు, ఓ పళానికి కాని మాటపెగలలేదు: పెద్దదొర ఉన్నాడే - ఆయనపేరు రైడర్,- సుబ్బయ్య రెండుచేతుల్ పట్టుకున్నాడు- ఆయనకు మనభాష శానా బాగా వాల్తీ- కాని, మాటరాందే!- ఒకటే రోదనం।- దీనికి-శిక్ష-చెప్పండి- అన్నాడు!

సుబ్బయ్య పలికింది ఏమంటే-

దొరగారూ।- శిక్షించినా, రక్షించినా,- దైవం- మనంకాదు:

వెనకటికి,- సతీదేవమ్మవారు,- యిలాగే అగ్ని కల్పించుకుని,- అవతారం చాలించారు!-

యీ కాలంలో, పెనుగొండలో, షావుకార్ల ఆడపడుచు- అంతపనే చేసింది: మాలో,- అభమైనా, శుభమైనా అగ్నిసాక్షిగానే జరుగుతుంది:

మా మతంలో,- పాపకర్ములు లేరు:

అందరూ ఎవరిపుణ్యాన వారు పోయేవారే!

మా తోటలో పువ్వు పూసింది:

కొండమీద అమ్మవారు కోసేసుకుంది!

ఎందుకండీ విచారం!-...?

ఆ దొరలు శిరసులు వంచుకుని,- సలాములిచ్చి, వెళ్ళిపోయినారు: యింక, యాదూ పరియాదూ లేదు-

సుబ్బయ్య, సంగతి ఏమిటి?

మామూలు మనిషే-

చింతాలేదు-విచారమ్ లేదు,

ఒక్కడు-

తోటలోనే ఉండేవాడు-

ఆ యేడు,-

తోట విరగ కాసింది--

అదివరకు యిన్నూరు అయివజు వచ్చేది.

ఆ ఏడు, అది యిబ్బడి అయింది:

ఆశ్చర్యం ఏముంది?-

యీ భూమ్మీదుండగా,- సీతమ్మకు ఎండతగలకుండా నీడపట్టిన పుణ్యం,- ఊరికే పోతుందా?-

రహమాన్‌గారు,- ఆ దస్తు,- తాను ముట్టుకోలేదు: మన గ్రామంలో పేదవారింట పెండ్లి అయితే,- అందుకు ఖర్చు చేయాలని ఖరారు చేశారు: బేషక్!-

సీతమ్మ మశానం అయిపోయి,- ఏక్‌సాల్ అయింది:

గ్రామంలో వారు - ఉత్సవం చేయాలన్నారు-

సుబ్బయ్యకు, సమ్మతం కాలా!-

పువ్వుపూసిందే గురుతు కాని, రాలింది గుర్తుంచుకోవాలా?- అన్నాడు- ఆ మనిషి. పైకి అలా సాదాగా ఉన్నా,- మనసులో, ఎంత దుఃఖం ఉందో,-

మరి,- ఎవరూ ఆ ఊసు ఎత్తలా!-

ఆ ముల్లె ముల్లెగానే ఉంది:

అది. అమ్మోరి సొమ్మని - ఎవరూ ఆసపడలా!-

-మూడు సంవత్సరాలైంది-

ఆ దొర ఉన్నాడే,- ఎవరు?-

ఆ మనిషే,-

యిక్కడికి వచ్చాడు- ఎలా?

మరో జన్మ ఎత్తి వచ్చాడు-

సన్యాసి రూపం-

సన్యాసి వేషం-

వెంట దొరలు వచ్చారు,-

బళ్ళమీద సరంజామా వచ్చింది-

ఏమిటా కమామిషు,- ఆ మనిషిని - ఒక ఫాదిరీ,- దైవప్రార్థన చేసి,- మనసుకు శాంతి యిప్పించాడు: వాళ్ళ మతం లెక్కప్రకారం - ఫాదరితో,- సంకోచం లేకుండా మనం చేసిన పాపం తబ్సీలు అంతా - చెపితే,- ఆయన దేవుడికి ప్రార్థనచేసి - రక్షణ యిస్తాడు: అంటే అ రోజునుంచీ,- మన పాపం దైవం భరిస్తాడు: కాని,- మన పుణ్యం మనం స్వయంగా సంపాదించుకోవాలి!-

యీ మనిషి,- పుట్టింది మంచిపుటక-

తల్లి మంచి యిల్లాలు-

వాళ్ళ నాయన,- పెద్దమనిషే, కాని,- యీ ఖుషీ కొంచెం జాస్తీ- ఆ గాచారం,- యీ చిన్నోడిమీద ఒక్క రేజా సోకింది- ఒక్క నిండుప్రాణం,- గాలీ ధూళీ అయిపోయింది: రాస్, దాస్ అయిపోయినాడు.

అంటే ఏమిటి?-

అసలు పేరు- రాస్,-

మళ్ళీ, మనదేశంలో జల్మం ఎత్తింది- దాస్-

ఆ గోల్‌మాల్- జరిగి- మనిషికి మతి పరారి అయితే - పేటలో దొరలు,- అక్కడ వైద్యం గుణమీయలేకపోవడంతో,- జబ్బల్‌పూర్ పంపించారు: ఆ కడ దాస్ మేనమామ- ఫాదిరీ-

మంచి భక్తుడు!-

ప్రార్థన చేసి,- ఎలాటి ఖాయలా అయినా నయం చేస్తాడని ప్రసిద్ధి- వారు - యీ మనిషిని మళ్ళీ మనిషిని చేశారు!-

యీ దాస్ ఉన్నాడే - శిల్పంలో శానాలెక్క చదివాడు - వాళ్ళదేశంలో - మన దేశానికి వచ్చింది,-నౌకరీకోసం కాదట-యిక్కడ మన శిల్పం,- చూదామని:

జబల్‌పూర్ అంటే- పాలరాయి పుట్టేజాగా- తెలుసుగా,- అంతా ఏకశిల అయినా,- అక్కడ నూటికీ కోటికీ ఒక్క తపస్సు చేసేవాడికి,- గౌరు శిల కనబడుతుందట-

గౌర శిల అంటే - పాలు మరిగితే- లేత గోధుమరంగు తేలుతుందే,-దానిలో ఒక్కతళుకు రోజారంగ్ -

అక్కడ- నూరు సంవత్సరాలకు ముందు,- ఒకపాలి రాజుగారు,- పడవమీద,- మంచి నిండైన వెన్నెల్లో విహారం పోతూంటే,- నదిమీదికి,- ఒక జాగాలో కెంపుల్ జల్లినట్టు కనిపించేసరికి,- ఆ రాజావారు,- అక్కడ పూజచేసి,- ఆ శిల,- భద్రంగా,- కొండలోంచి ఊడదీయించి,- దుర్గాభవానీ అమ్మవారి విగ్రహం చేయించినారు: మళ్ళీ యిన్ని సంవత్సరాలకి,- రాస్‌కి ఆ అదృష్టం వచ్చింది:

ఎలా?- ఒక చిలుక శకునం జెప్పింది-

అది- ఎప్పుడు,-?

యీ మనిషి,- ఆరోగ్యం వచ్చిన తరువాత,. నిత్యం,- తోటలో కూర్చుని,- ఉండడం అలవాటు:

ఒకనాడు,- రేగుపళ్లు, తిందామనుకుంటే,- చేతిలో పండు,- చిలక తన్నేసింది: మరోపండు అందుకున్నా అంతే జేసింది: తన్నేసిన పండ్లు,- ఎదురుగా,- ఒకచోట పడేసి,- ఆ తావుకి ప్రదక్షిణం జేస్తూంది: యిదేమి ఆశ్చర్యం అనుకుని,- ఫాదిరీకి చెపితే,- వారు వచ్చి చూసి,- అక్కడ తవ్విస్తే,- యీ శిల దొరికింది: ఆ శిలకు శిల్పంచేసి,- సీతమ్మకు ప్రాణంవచ్చి బ్రతికినట్టు రూపంజేశాడు: రెండు సంవత్సరాల్ అది ఒక దీక్ష- అది మొదల్ సన్యాసి వేషం,-

ఆ ఫాదిరీ, కూడా శానా తెలిసినవాడు:

వాళ్ల మతం ప్రకారం,- యిసుమంటి కాఫిర్ పనులు చేయడం నరకం- కాని,- యీ మనిషి తపన అంతా తెలిసినవాడు కనుక,- నాయనా! నీకు మనసుకు శాంతి ఎక్కడ,- ఏ పని చేస్తే దొరుకుతుందో,- అది దైవం నిర్ణయం చేసింది అన్నమాట: దాన్కిమీద,- మనుషుల అభిప్రాయాల్కి విలువలేదు: యీ సాధన నీకు మోక్షం యిచ్చేది అని- ప్రభువు ఉద్దేశ్యం ఏమో!- అని,- దీవించి,- తానుకూడా,- దాసువెంట,- మన గ్రామం వచ్చి,- మనవారందరికీ,- వృత్తాంతం అంతా చెప్పి,- తోటలో ఆ విగ్రహం- ప్రతిష్ట చేశారు:

సుబ్బయ్య ఉన్నాడే,- ఆ విగ్రహం చూసి,- అంత కాలానికి,- అమ్మా, అమ్మా! అని ఒకటే శోకం,- ఒకటే నవ్వు! మా అమ్మతల్లిని,- దేవతను చేశావా?- నా బిడ్డను నాకు కాకుండా చేశావా?- తెల్లాయనా! అని విరుచుకుపడ్డాడు: యీ దాసు- ఆయన పాదాలకి నమస్కారంచేసి,- వారు, దేవతలే, యీ దాసుడు తరించాలని,- యిలా అవతారం ఎత్తారు!- వారికి సేవజేసి,- యీ జన్మ గడుపుకుంటాను! అని వేడుకున్నాడు: అమ్మతల్లికి స్నానం చేయించడానికి,- సుబ్బయ్య,- యీ బావి త్రవ్వాడు: మన ఊరిలో పిన్నా పెద్దా,- అభిషేకం జేశారు! దాసు,- తల్లిమీద కుంకుమ జల్లాడు: ఆ వచ్చిన ఫాదిరీ,- సాంబ్రాణి ధూపం పట్టి,- ఏమని చదివాడు:- సృష్టికి దైవం ఒక్కటే,- లోకానికి ధర్మం ఒక్కటే- కలకాలం సత్యం ఒక్కటే,-... ఏమెన్! అంటే మనం తథాస్తు అంటామే- అది: అలా ప్రార్థన చేసిన సమయానికి చిలకలదండు వచ్చింది చూసుకో,- ఒకటికాగ్సు,

వందకాదు,– తోటంతా అవే– అమ్మోరికి తోడుగా,– ఉండిపోయినాయి: యిప్పటికీ అంతే,– అది చిలకలతోట– తోటమీద కాపు వాటికి పలారం: దాసు,– శానా, ముసిలితనందాకా,– బతికి,– ఆ నమాజ్‌లోనే సమాధి అయిపోయినాడు– అమ్మతల్లి,– మనూరికి, మనోరికీ,– అప్పటికీ యిప్పటికీ సత్యం – అదే సత్యం,–.......

తాను అంతసేపూ కథ వింటున్నాడో, కలగంటున్నాడో తెలియదు,– దారివెంట నడుస్తున్నాడే కాని,– దారి చూసి నడవడంలేదు,– కంటిముందు రంగు రంగుల నీడలు ఆడుతున్నాయి,– నీరెండమీద కుంకుమ చల్లినట్టు,– కెంపులు రాలుతున్నట్లు,– చిలకరెక్కలాడుతున్నట్టు,– ఏదో జిలుగు– జిలుగు రెపరెప,– తోటలోకి జేరుకున్నామని తెలియనేలేదు,– కళ్ళ ఎదుట–

అమ్మ తల్లి!–

విగ్రహం కాదు–

అమ్మ–తనకోసం,– నిలుచున్నట్టుంది–

వెక్కి: వెక్కి– అమ్మా!– అమ్మా!– అనుకుంటూ అక్కడ కూలబడినాడు: వెంటనే ఒళ్ళు తెలిసింది–

అమ్మవారి విగ్రహం!– కుంకం రాసిలో ఉంది: మదార్ వెన్నుతట్టి లేవదీశాడు,–

రూక,– గుప్పిటపట్టుకునే ఉన్నాడు:

అమ్మవారి మీదుగా విసిరేయమన్నాడు–

విసిరేశాడు–

తొలిసారిగా,– అమ్మతల్లి దర్శనం చేసినప్పుడు యిది,– ఆచారం: ధనం చేసిన పాపం మనం చేయకుండా అమ్మతల్లి కాపాడుతుంది,– అని మదార్ వివరంగా చెప్పాడు:

తాము అలా నిలుచుని ఉండగానే,– ఎవరో ఒక ముసిలవ్వ రివ్వు రివ్వున వచ్చి,– అమ్మతల్లీ!– అమ్మతల్లీ,– కోడలు నీలాడే పొద్దులు,– సంజేళనుంచీ నలతగా ఉందని,– కబురొచ్చింది, పోతుండా,– పక్క సరిదేందుకు బలగం ఉందనుకో,– ఒక్క ఛణం కన్ను ఆయెంపుంచు తల్లే! – ముంతెడు నీలోసుకుని,– కొడుకునెత్తుకోని,– యీ నీడకొచ్చి కుంకమిచ్చుకుంటుందమ్మా!– నలుగు రాడపింజెల్నిచ్చినావు,– యీ పాలి,– మొక్కొదుకునివ్వాలి మాయమ్మా– కానుపు సులాకనయేట్టు సూడు,– అంటూ చిటికెడు కుంకం అందుకుని వెళ్ళిపోయింది–

తనకిది చిత్రంగానే ఉంది– మనిషి పుటకపుట్టి,– అభం శుభం తెలియకుండానే చెల్లిపోయింది: కాని దేవతై వెలిసి,– గ్రామాన్ని కన్నతల్లిలాగే వేయి కళ్ళతో కనిపెడుతూ ఉంది! ఒళ్ళు తెలియని ఆనందంతో అమ్మా!– అన్నాడు–

యింతలో ఒక సాయేబు కుర్రవాడు వచ్చి,– దోసెడు పటికిబెల్లం ముక్కలు,– అమ్మవారిముందు జల్లాడు: చిలకలు వాటిని ఎగరేసుకుపోయినాయి,–

వీడు,– మా చిన్నోడయ్యా,– మస్తాన్,–

అంబ అని చెప్పానే,– మా మోదీన్ కూతురు,– ఆ బిడ్డ,– నిత్యం,– చిలకలకి, సక్కెర వేస్తుంది... అంటూ,– ఏరా,– బండి యింటికి జేరుకుందా?– అన్నాడు,– కుర్రవాడు, తలూగించి, దోవుచ్చుకున్నాడు.

మనం కదులుదామా? అన్నాడు మదార్–తనకు కదలాలనిలేదు–కూచోవయ్యా,

పోదాంలే,- రాత్రికథ పూర్తిచెయ్,- అన్నాడు-

యింకా చెప్పడ మెందుకయ్యా,- వచ్చేశాంగా।- మనుషుల్నే చూస్తావుగా, కథ నీకే అరదమౌతుంది,- అంటున్నాడు- మదార్,-

'అది, సరేలే- చెప్పవయ్యా,-'

పాలు త్రాగుతావా?- అన్నాడు మోదీన్‌గారు-

వీడు ఊహు అన్నాడు:

ఆయన నచ్చచెప్పి,- ఏదీ ముందూ? ఏదీ ముఖ్యం- అంటున్నాడు,- ఆ తరువాత,- యిదిగో సాయెబ్భాయీ- యిప్పుడు చెప్పావో,- క్షణంలో ఆవడలు చేసి పెడతాను,-

మదార్ నవ్వుతూ,- అమ్మతల్లీ,- చెప్పమన్నావా?- అన్నాడు, చిలకలు ఒక్కసారి కిలకిలమన్నాయి-తాను ఉలిక్కిపడ్డాడు,-

ఏమయ్యా,- అంబ ఎవరు?-

అమ్మతల్లి!-

జనకరాజుకు సీతమ్మ దొరికినట్టు దొరికింది-

రాజగోపాలం ఎవరు?-

దాసు!-

అవును భాయీ।- మా మోదీన్ చెప్పాడు అది- షత్యం,- దాసు చేసిన తపస్సుకు మెచ్చి దేవతల్ యీ పుట్టుక యిచ్చినార్-అది, దేవరహస్యం అనుకో. మన మనస్సులకీ తెలుసు- పైకి చెప్పం-

ఆవాళ,- రాజగోపాలం వచ్చిన సమయానికి అంబ- తులసిదేవికి పూజచేసి- పాయసం నైవేద్యంపెట్టి,- తీస్కువచ్చింది-

నిత్యం అంతే,-

విస్తరి ఆకులో అందరికీ వడ్డించింది,-

నీకు తెలియదేమో,- మన గ్రామంలో అంతా ఒక కుటుంబం,- పరదా గిరదా లేదు-, కాని,- అంబను,- అదివరకు, ఒక ఊరిలో ఉన్నా,- గోపాలం చూడలేదు,- చూడటం పడలేదు! యీ బిడ్డ ఆశ్రమం విడిచి బజార్‌న రాదుగా:-

ఒకర్ని ఒకరు,- చూసి చూడంగానే- యిద్దరి నేత్రాలూ మెరుపుల్ మెరిసినట్లు అయిపోయినాయి,- వెన్నెల్లో నిలుచున్నట్టు అయిపోయినారు। అంబ అక్కడనుంచి వెళ్ళిపోయింది,- గోపాలం తలొంచుకుని కూర్చున్నాడు- పుచ్చుకోవయ్యా గోపాలం।- అన్నాడు మోదీన్‌భాయి।-కళ్ళకు అద్దుకుని,- తీసుకున్నాడు! వెళ్లిపోయినాడు! వచ్చిన కబుర్ మరచి పోయినాడు:

బిడ్డ,- ఆనాడు జరఫ్‌గాలేదు-

మందమతిగా,- పరధ్యానంగా ఉంది.

ఎంతో చాలాకీగా,-: ఎప్పుడూ నవ్వుతూ ఉండేది! మోదీన్‌కు అరదం కాలా!- బిడ్డను పలుకరించినాడు! సమాధానం రాలా!- అమ్మతల్లిని వచ్చి,- అడిగాడు,- తెలిసిపోయింది,-

అంటే,- యీ జన్మలో అయినా వాళ్ళు సుఖంగా ఉంటారా?- యిది తనకు

తోచిన ప్రశ్న–

సుఖం అంటే,– ఏమిటి భాయ్?

పెళ్ళీ పేరంటం చేసుకుని పిల్లాజెల్లా ఉంటారనా?–

మా మోదీన్‌భాయికి,– యిదే ఆలోచనవచ్చి,– శకునానికి యిక్కడకి వచ్చినాడు। మాపటేళ!–

ఆలోచనమీద ఉండి– పైకి ఆకాశంలోకి చూసినాడు: దాఖలా కనిపించింది. చంద్రుడు,– నక్షత్రాలూ ఉన్నాయి,– సృష్టి మొదల్‌నుంచీ, అలాగే ఉన్నాయి! ఎలా, దూర దూరంగా,– చంద్రుడికి,– ఒక్కర్‌కాదు గదా,– యిరవై ఏడు జనానావారు; యీయన యిక్కడ తళుక్ తళుక్‌మంటూంటారు: వారు – ఉన్న జగానే ఉండి జిగేల్ జిగేల్ మంటారు! కాని,– దగ్గిరకిరారు,– రాలేరు,– అది,– ఏమంటామ్,– ఆ సంసారం ఏమంటాము?– వారి నసీబ్ అంతే,– యిక్కడా అంతేనేమో!– అంతే అంటాడు,– మోదీన్!

నేను చెప్పింది,– నిన్న మొన్నటికథ కాదు భాయీ,– ఏక్‌సాల్‌కి పైమాట!–

అప్పుడు,– రాజగోపాలం వెళ్ళిపోయినాడా?–

మళ్ళీ వస్తాడు కదా అని,– మోదీన్, తాళి చూశాడు! ఒకమాసం తాళి,– తానే కలుసుకుని,– ఏమయ్యా,– ఆ సమాచారం ఏమిచేదాం? అన్నాడు! మరచిపోదాం అన్నాడు,– గోపాలం,– అదేమయ్యా? అంటే– అదో అజ్ఞానం సాయేబుగారూ,– యింతకాలం, మా నాయన, తెలివితక్కువతనంవల్ల,– జీవితం అలా చేసుకున్నాడనుకున్నాను– అహంకారంవల్ల,– ఎవరినీ లక్ష్యపెట్టకుండా, యీ స్థితికి వచ్చినాడు, అనుకున్నాను! అదే,– నా పొరబాటు।– మా నాయన, దగాబాజీకాడు,– ధర్మదేవత!... అన్నాడు:

తాను హూంకరించాడు–

తన తల్లిని,– అలా కూల్చినవాడు,– ధర్మదేవతా?–

ఈ గోపాలం– తండ్రిలాటి తిక్క శంకరాయా?–

ఆఁ ఆ తండ్రికే తాను పెద్దకొడుకు,–

తానూ,– ఆ తీరేనా?–

ఛస్!– పైకి కసిరాడు: మదారు నవ్వుతున్నాడు–

ఎవరో యెంకట్రామయ్య,– కొడుకుచేత మంచోడనిపించుకుంటే,– మధ్యను మనకి కోపం ఎందుకు భాయ్।– రాజా గోపాలం–మాట ఫిరాయించే మనిషికాదు! యిక్డ మన మోదీన్‌తో ఆ వెవహారం మాట్లాడి, వెళ్ళి,– వాళ్ళ నాయనతో సంప్రదింపుచేశాడు,– అదివరకు వెంకట్రామయ్యకు,– కొడుకు మీద, ఆపేక్షాలేదు, కోపంలేదు! కాని,– తన మరియాద నిలిపేందుకోసం అతనికి ఎంత తపన ఉందో, తెలుసుకున్న మీదట,– యీ మనిషికి, ఎంతో దయా కలిగి,– నాయనా, సదర్ వృత్తాంతం యిదిరా,– అని, సొంత విషయం, అంతా, దాపరికం లేకుండా,– స్నేహితుడికి చెప్పినట్టు చెప్పాడట,– అంతా విని, మన మోదీన్‌కూడా గోపాలం అన్నమాటే అన్నాడంటే!–...

ఆహా!– పోన్లే– మనిషి జన్మంటూ ఎత్తినాక, ఒక్క సారన్నా మంచి వాడనిపించుకోవాలిగా।– ఎవళ్ళ ఊసో,– మనకెందుకుగాని,– యిక ఊళ్లోకి పోదాం పద!– అంటూ, తలవంచుకుని దబదబా నాలుగడుగులు వేశాడు: అంతలో సంశయంవేసి,– ఆగి– అటువంక చూశాడు: మదారు కూచున్న చోటనుంచి కదిలేందుకు

యత్నం చేయకపోగా,- మరింత కుదురుగా చదికిలపడి,- తనవంక ఓరగా ఒక్కపరి చూసి,- నవ్వేసి,- యిటుకేసి రమ్మని తల ఊగించాడు! తాను- ఎందుకేం? అన్నట్టు తల ఎగరేసి- సహజమైన మంచితనంకొద్దీ, అడుగు అటువేసి- అలాగే నిలుచుండిపోయినాడు-

మదారు,- లేచి నిలుచుని,-

అమ్మతల్లీ,- స్నేహితంమీద వచ్చినవారు- బంధుత్వం మీద నిలిచిపోయేట్టు చూడమ్మ,-

కోనయ్యకు-తనవారు లేరు!-

ఒక్కడూ।-

మన గ్రామంలో,- మనతోబాటు- ఉండమని- చెప్పమ్మ-... అంటున్నాడు- తనకు ఒళ్ళు ఝల్లుమన్నది,- ఏమిటి యిక్కడి మనుష్యుల తీరు,- ఏమిటీ తల్లి మహిమ? గ్రామానికి అంతటికి పెద్దదిక్కు-యీ కన్యాకుమారా? యీ కనకదుర్గమ్మా-

అమ్మా!-

ఆ మొగంలో,- ఎంత సహనం!-

సహనం ఉన్నచోటే సాహసం।-

పదితలల పరమమాహేశ్వరుడు- చేజేతులారా,- తనకు అశోకవనంలో,- పూజలిచ్చినప్పుడు,- సీతమ్మతల్లి,- బిడ్డముచ్చట తీర్చే తల్లి।- సహనంగా పదిమాసాలు ఆ నీడను కూర్చున్నది: కాని, నూరు తలలవాడు,- రామయ్య తండ్రిమీద కాలుదువ్వి, ఆగడం చేసినపుడు- ఒక్క ఱెప్పపాటు, ఆదిశక్తి అయి,- వాడిని అంతంచేసింది- ఆ తల్లి చిరునవ్వులో ఆగ్రహమూ ఉంది,- అనుగ్రహమూ ఉంది: ఆపేక్షా ఉంది,- అదమాయింపూ ఉంది!-

'ఏవయ్యా మదారూ: యిక్కడ అమ్మదగ్గిర ఉన్నట్టే- అరమరికలేకుండా-అందరూ ఆలయంలో స్వామిని, సేవిస్తారా?-'

'-తల్లి,-తండ్రి అని తేడా ఏముంది భాయ్!-

కాని,- తల్లి దగ్గిర చనువు తండ్రిదగ్గిర ఉంటుందా?

పైగా వారు- రాజగోపాలస్వామి!-

పేరుకు తగినట్టే- పెద్దఫాయా!-

వారికి,- ఏ వేళకావేళకు, ధూపం దీపం - నైవేద్యం,- అంతా లెక్కప్రకారం సాగాలి!- చీటికి మాటికీ వారి ఎదుట పడటానికి బిడ్డలకీ భయం: ఉత్సవంలో ఊరేగుతూ వస్తారే- అప్పుడు,- మనిష్టం!- ఆలయంలోకి పోయే అలవాటులేదు మన్కి- కాని ఆటంకంలేదు: మన మోదీన్‌భాయి- కూడా స్వామివారికి ధర్మకర్త!-'

బాగుంది,-... అంటూ నడక సాగించబోయి- అంతలో వెన్ను చరచినట్టయి,- చప్పున అటు తిరిగి,-

అమ్మతల్లీ!- ఒంటిమీదికి, మూడు పదులు వచ్చినాయి: పుట్టినచోటే పెరిగాను,- కాని,- అడుగెటూ వేయలేదు: యిన్నాళ్ళకు, ఒకందుకని- బయలుదేరాను: కాని,- వచ్చింది యిందుకనీ-నీవు రప్పించావనీ,-యిప్పటికి అర్థమైంది: అమ్మా, నీవు నన్ను ఎప్పుడూ కనిపెట్టే ఉన్నావు: అది కానలేకపోయినాను: అమ్మ తల్లీ,- నా మనసు యిప్పుడు తుడిచిన

పలకలాగా అయింది: మరి దానిమీద మరో పొల్లు మాట ఎక్కదు:... అని నమస్కారంచేసి, కదిలాడు: యిద్దరూ మళ్ళీ రోడ్డెక్కారు: ఆ రహదారి,– అటు మంగినపూడి పోతుంది: ఎగువనుంచి – ఉప్పుమూటలు వేసుకుని,– బళ్ళు వస్తున్నాయి. వాటిని పోనిచ్చి,– అటు వెంపుకు పోవచ్చని,– నిదానించాడు: కాని,– మదారు చేయందుకుని,– నవ్వుతూ,– 'మధ్యాహ్నానికి కాని దారి తెరిపీయదు,– అ చీమలబారట్లా పోతూనే ఉంటుంది,–' అని నాలుగడుగులు అటు వేశారు:

ఎదురుగుండా,– గ్రామం,–

తనకు,– ఎన్నడూ చూడకపోయినా,–

ఊహించకపోయినా,– క్రొత్తగా కనిపించలేదు:

యిన్నాళ్లూ ఎక్కడెక్కడో తిరిగి తిరిగి,– యిప్పటికి యింటి పట్టుకు చేరు కున్నట్టనిపించింది:

–పదిబారలు జొరబడేసరికి,– అక్కడన్నీ బాదంచెట్లు,– వాటి మయాన,– ఓ పెద్ద సావడి। దాంట్లో,– ముప్పై నలభై మంది పిల్లలు,– కూర్చుని,– పలకలమీద వ్రాసుకుంటున్నారు: ఓ రద్దీ రవ్వాలేదు: నిశ్శబ్దంగా ఉంది: బస్తీలో బడి అల్లేలేదు,–

'అయ్యా వారేడీ?–'

అయ్యవారంటూ లేదు: ఎవరికి తీరుబడి ఉంటే వాళ్ళు కాస్సేపు వచ్చి చదువు చెపుతారు: పిల్లలు,– ఓపికున్నంతసేపు చదువుకొని,– యిళ్ళకు పోతారు. మధ్యాహ్నం,– చేలమీదకు వెళ్ళి,– మన పనిపాటలు ఆకళింపు చేసుకుంటారు: యిది,– చదువులకి మొదటిమెట్టు,– యిలా నాలుగు సంవత్సరాలు: మరో నాల్గుఏళ్లు,– ప్రొద్దున చేనుపని,– మధ్యాహ్నం,– చదువు! చదువంటే ఏమిటి?– మన వ్యవసాయం సంబంధించిన వివరాలు: యింకొక నాలుగు సంవత్సరాలు,– చేయి బాగా తిరిగేందుకు,– చేలమీదే తరిఫీయదు: అంటే, భూమీ, భూసారం, నాణెం తెలుసుకోవడం,– పంటాపైరూ కనిపెట్టుకోవడం,– పశువులకి పోషణ చేయడం,– యిలాటివి,– పిల్లకాయల్లో,– అభిలాష ఉన్నవారు,– వడ్రంగం,– కమ్మరం నేర్చుకుంటారు: యిలాగా,– పన్నెండు సంవత్సరాల్కి చదువు పూర్తి! అక్కడనుంచీ,– అనుభవం–

నీకొక సంశయం అనిపించవచ్చు!

చిలకవాలే దూరంలో బస్తీ ఉంది!–

అక్కడ దొరల్ చెప్పే చదువుల బడి ఉంది,–

ఆ చదువుల్ నేర్చుకుంటే–సర్కార్ యిలాకా పెద్ద నౌకరీ వస్తుంది!– యీ గ్రామంలో వాళ్ళు మూర్ఖులా? అని నీవు అనుకోవచ్చు!– కాదు భాయీ!– మనకీ లోకజ్ఞానం,– ఉంది: అందుకే– పెద్దలందర్ జేరి– గ్రామం యిలా,– యిన్ని తరాలుగా,– ఒక కట్టడిమీద కాపాడుకుంటూ వస్తూన్నారు: మునుపు, మూడు నాలుగు తరాలు,– మన గ్రామంలో మగోళ్లందరూ,– పటాలం కొలువు చేశారు: సెబాస్ అనిపించుకుని,– నన్నూరు, ఐనూర్ పింఛన్ తీసుకొని – భూములు సంపాదించుకున్నారు. యీ కుటుంబాలు వృద్ధి అయినా,– ఫలసాయంకూడా వృద్ధి అవుతూ వచ్చింది: భోజనానికి లోటు లేదు: మరి,– నౌకరీ ఎందుకు?

పటాలంలో కొలువు అంటే, అది,– బహదూరీ! కాగితం కలం చేత పట్టుకుని

నెలకు ముప్పైరోజులు.– దఫ్తర్‌లో పడి ఉండే అవసరం మనకేమిటి భాయీ,–

అయితే,– మన గ్రామంలో వాళ్లు,– లోకజ్ఞానం లేని వాళ్ళనుకున్నావా?– కొంచెం రెక్క ముదిరిన తరువాత,– కుర్రవాళ్ళు దేశంమీదికి పోయి,– అక్కడ వారు వ్యవసాయం ఎలా నిభాయించుతున్నారు,– వారి మంచి చెడ్డ, వీలూ సాలూ ఏమిటి?– అని వివరంగా చూసిరావడంలేదూ?– అంతకన్న ఏమి కావాల?– ఎక్కడో నౌకరీకి కుదిరితే ఆ సదుపాయం ఉంటుందా?– ఏమంటావ్!–

సరేనయ్యా!– నీవు చెప్పింది బాగుంది– చేసిన నిరవాకం బాగుంది,– కాని,– మీ ఉరుదూ మాట ఏమిటి?– అంగ్రేజీ సంగతి ఏమిటి?– యిక్క చదువు అంతా తెలుగు జబాన్‌మీదే నడుస్తున్నట్టుందే అంటావా?– చిలకపిల్లకి ఎగరడం నేర్పేందుకు ఎంతసేపు పడుతుంది? మనకీ,– మనవాళ్ళ నడుమను ఉన్న భాష రావాలన్నా అంతే! మన మోదీన్ చెప్పినట్టు భాష ముఖ్యంకాదు,– భావం ముఖ్యం! మంచితనం,– మంచిగుణం నేర్చుకునేందుకు,– భాష ఏది అయితేనేం?– అలాగని,– మనం ఉరుదు మరచిపోలేదు: అంగ్రేజీని కాదనడంలేదు: వయసువచ్చిన కుర్రవాడు కాని,– ఆడకూతురు కానీ,– అలాటి చదువుమీద సరదాపడితే, మారాజులాగా నేర్చుకోవచ్చు: మనూళ్లో, ఆ భాషల్లో మున్షీలు ఉన్నారు: అంగ్రేజీలో ఉరూదూలో, పత్రికలు,– గ్రంథాలూ,– మనూరు వస్తుంటాయి: యింక సంస్కృతం, తెలుగు అంటావా? చూస్తావుగా,– మన మోదీన్‌భాయి ఆశ్రమంలో లేని కితాబ్ లేదు...'

బడి మొగదలకు వచ్చారు:

చదువుకుంటున్న పిల్లకాయలు ఒక్కక్షణం,– చదువు ఆపి,– యీవంక చూశారు: అందరిలోకీ కొంచెం ఉషారుగా ఉన్న కుర్రవాడు,– తమ దగ్గరకు వచ్చాడు: రంగన్నా!– వీరు, కోనయ్యగారు,– బెజవాడ కాపురం,– మనకి స్నేహితులు,– మన గ్రామం యిదే రావడం,– అన్నాడు మదారు: రంగన్న కళ్ళనిండా నవ్వుచేసుకుని–చాలా సంతోష మయిందండీ! మీరు మా గ్రామంలో ఉన్నంతకాలం,– మాకు పండుగలాగా ఉంటుందండీ! రండి దయచేయండి,– అంటూ చేయి పుచ్చుకుని,– లోపలికి తీసుకు వెళ్ళి,– అక్కడ వేసి వేసివున్న చిరిచాపమీద కూర్చోబెట్టాడు! ఏమండీ,– ప్రయాణం చేసి వచ్చారు,– కాసిని పాలు పుచ్చుకుంటారా!– చిటికెలో తెప్పిస్తాను– అని బహు లాలనగా అడిగాడు: తనకు,– కళ్ళనీళ్ళు తిరిగినాయి: తన గీత బాగుండి ఉంటే, తానూ వీళ్ళందరి లాగా, యీ బళ్ళో చదువుకుని,– యీ మాటా మర్యాదా నేర్చుకుని ఉండేవాడు కదా!–

–'ఏమండీ,– బెజవాడలో,– ఎన్ని దేవాలయాలు ఉన్నాయ్!–' ఆ ప్రశ్నకు నవ్వొచ్చింది,– అక్కడ ఎన్ని హోటళ్ళున్నాయంటే ఏదో ఉజ్జాయింపున పది అటూ యిటుగా చెప్పచ్చు కాని,– తనకెప్పుడూ ఆ ఆరా రాలేదే!–

ఉన్నాయి – చాలానే ఉన్నాయి!– అదీ,– పెద్ద బస్తీ కదా!– అంటూ నసిగాడు:

'శివాలయము లెక్కువా? – విష్ణ్వాలయములు ఎక్కువా?–'

'దానికేముందీ?– ఎవరి ఎక్కువ వారిదే,–'

'అవునండీ: కానీ సంఖ్యలో, ఏ ఆలయాలు ఎక్కువ?'

'నేనన్నది అదే–కుడి ఎడంగా చెరి సమానమే!–'

'అలాగా అండి!– దుర్గా క్షేత్రం కనుక,– శివాలయాలు ఎక్కువ ఉంటవని

అనుకున్నాం!- స్వయంగా - మీరు చెపుతూంటే, యింకా ఏం?-'

-యీ భడవ!- తన భరతం పట్టించడం లేదు కద!-

'- ఏమండీ,- మేమింతవరకూ కృష్ణా స్నానానికి రావడం పడలేదు: మాకు దుర్గామ్మవారిని గురించి చెప్పరూ?-'

చెప్పడానికి తన కేం దెలుసు?-

తెలియదనడానికి, నోరు రావడంలేదు-

తాను తల్లి మొగమెరుగునుగాని,-

దైవం మొగం ఎరుగునా?-

యీ బిడ్డలందరికీ తండ్రి మాలిమి- పెంపకం కనుక,- అడిగి తెలుసుకోవలె అనే- ఉబలాటం అబ్బింది,-

తన కా గీత లేకపోయెనే,-

తండ్రి!-

తండ్రీ!- హరి జేరుమనియెడి తండ్రి. తండ్రి!...

హిరణ్యకశిపుడు,- కన్నబిడ్డకు, గరళం పట్టించాడు.

తన తండ్రి,- గాలిలో వదిలేశాడు।-

తెగిన గాలిపటంలా।-

కాని,- ఎటో ఎగిరి - ఎక్కడో రాలకుండా,-

సూత్రం అమ్మ ఒడిసి పట్టింది,-

తన బ్రతుకు, నేల విడిచిన సాము కాకుండా,- ఆ చేతి చలువను,- ఆ కంటి చలువను,-...

అమ్మా!- అంటూ కళ్ళు తెరిచాడు,- అమ్మ,- వెన్ను తట్టింది. ఒళ్ళు తెలిసింది,-

తెలిసింది,- ఒళ్ళుకాదు,

తెరిచింది కన్ను కాదు,-

కనుబొమల మయాన - మిన్ను విరిగి, - ముత్తెమంత వెన్నెల రాలింది: రాలిన ముత్యం, గాలి పోసుకున్నట్టు, పవడమై - పర్వతమై,- అలా దిగి దిగి, కుదురుకుపోయి- కణకణ లాడింది,- కనులు విచ్చింది:

కన్ను విప్పిన తల్లి కనకదుర్గమ్మ-

వెండికొండ శిఖరాన భమిడిజ్యోతి,-

గోరు వెచ్చని వెలుతురు,-

లేత జేగురుపూత వెన్నెల- వెన్నెల వేయి తీవెలేసి,- తీవెకొక్క పూవుబూసి - పూసిన పూవులు రాసిగా ప్రోగువేసి, కానరాని కమ్మ తెమ్మెర,- కరపున బట్టినట్టు నరుణ్ణి జేసింది: నరుడి ముందడుగు అహంకారం,- మారడుగు,- సర్వజ్ఞత్వం,- అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చిన అర్జునుడు,- ఆ తల్లి కళ్ళలో మెదిలాడు: బిడ్డ తపస్సు చేసుకునేందుకని,- అంత మేర పుప్పొడి చల్లించి,- యింత మేర పూవులు చల్లించి,- కలయజూచినంత మేర,- కనుపండువగా,- చిగురు వేయించి,- ఆ తల్లి రారా తండ్రీ! అని చేతులు జాపినట్లు,- కొమ్మలు ఊగుతూండగా,-

వందిమాగధుల కైవారములు, దివ్యచిత్రాన అవధరించే,- రారాజు ఠీవితో,-

ఆ గోరోచనం ముద్ద అర్జునుడు,– కొలువుదీరినట్టు కూర్చున్నాడు: ఎవరైనా వేలుపులు,– వచ్చి వరాలు సమర్పించుకొనే పక్షంలో,– స్వీకరించి, కటాక్షించు వారమన్నంత ధీమా మీద,–

అలా బాసెన పట్టుమీద అతగాడు ఉండగా,

పైనుంచి చంద్రవంక తొంగి చూసింది:

కెంపులు జడకట్టు,– కేకి పింఛమల్లె విప్పారింది.

నాగ కంకణం, వలయం దిరిగింది,–

గజ చర్మాంబరం,– కాసె బిగింపుకు కట్టుపడ్డది,– తెప్ప చాటున నిప్పు తునుక,– నివురేసింది,–

నందికేశ్వరుడు ఘణేల్‌మన్నాడు:

గగనం కంబుగ్రీవమై,–

ప్రణవం పరవడించింది–

అర్జునుడి మౌనం, పంచాక్షరి మననం జేసింది– గునుగు నాదం, రోదసిని కలయ దిరిగింది,– రూపొందిన వారాణి, కాలు ద్రువ్వింది: కిరీటిని ఢీకొన్నది,–

ఒకసారికి– ముమ్మారు:

తపోమూర్తి– తామసమూర్తి అయినది.

అహంకారము అమ్ము విడిచింది:

వరాహం ఒరిగిపోయింది–

హాశ్శరభ!– శాంబరీ భిల్లుడు ముందుకు దుమికాడు: మోరకించాడు: పార్థుడు, పలుకాడి బదులు చెప్పక కలియబడినాడు: కంట కనిపెడుతూన్న తల్లి,– ఉలికిపడినది. ఎదిరి నిలిచిన భిల్లుడు – వెనుకంజ వేసినాడు అర్జునుడు, ఆ అడుగులకు సాగిలబడి మ్రొక్కినాడు:

నిన్ను దెలిసిన సంబరాన, నన్ను మరచినాను దేవరా! వీనికి, తొలిసారిగ జయమీయ దలచి, దయచేసిన దయామయుని,– తనివితీర కౌగలించు తమకము నన్నా వరించ,– కనుదమ్ముల నిలిపికొన్న జనని దీవెనలు ఫలించగా,– ప్రణవమునై నిను పెనగొన నోచితినో మహేశ్వరా!–

యిలా యిలా పలుకుల పూజించినాడు:

ఆది దంపతుల సన్నిధిలో తానో పసివాడైనాడు: అరుణ జటా జూటము, అంబరమై విచ్చుకున్నది,– అంతటా ఒక మెరపు మెరసి అదే పాశుపతమైనది!

అర్జునుడు, అంతకంతగా ఉప్పొంగినాడు,– పైనగ్రమ్మిన కెంపుల తళుకుపైన, వెన్నెల వెల్లువ గట్టినది! గగనం కనకాంబరాలు కురిసినది! గిరి కొమ్మున, కనకదుర్గ, వెలసినది! ఆనాటి సత్యమే, యీ నాటికీ నిలిచినది।...

అంబా!– అని, తాను పలికినది,– తా నాలకించి,

కనులు తెరిచాడు!

ఎదురుగుండా, చిన్నవాళ్ళందరూ,–

ధ్యానంలో ఉన్నారు–

–తానూ. పిల్లవాళ్ళలో, ఒక పిల్లవాడు।

తండ్రి యీ బడిలోనే చదవేశాడు- ఆ క్షణంలో,- అన్ని యేళ్ళుగా,- తీరని కోరిక తీరింది.

తనకు విద్యాబుద్ధులబ్బింది, యీ నీడనే,-

అలా, అనిపించడం కాదు,-

అదే నిజమన్నంత ధీమా కలిగింది-

-పిల్లలందరూ కళ్ళు తెరిచారు:

రంగడంటున్నాడు-

అర్థమయిందండీ!- కనులు మూసుకోగానే- కథ కనిపించిందండీ।- యికనుంచి- మాకు ఏమన్నా తెలియకపోతే,- యిలా కూచుని తెలుసుకుంటామండి।-

వాడు అంటున్నది ఏమిటో, తనకు అర్థం కాలేదు. కాని, అంతటితో పోనీయకుండా,- తాను నోరు మెదిపితే, వాడు మరింకో ప్రశ్నవేస్తే,- తన బండారం బయటపడుతుంది: యిప్పటికి అమ్మ తల్లి వెన్ను కాచింది,-

మంచిదిరా అయ్యా- మీరందరూ, బుద్ధిమంతులు. వృద్ధిలోకి వస్తారు!- అంటూ లేచి నిలుచున్నాడు! పిల్లకాయలందరూ తనతోబాటూ లేచి నిలుచుని నమస్కారం జేశారు: తన జన్మ తరించినట్టనిపించింది! వాళ్ళని కూర్చోమని సైగచేసి- తాను యివతలికి వచ్చాడు:- కాదు, యివతలపడ్డాడు:

యిద్దరూ, ముందుకు సాగారు।

తాను మదారు వంక జూశాడు!

ఏదో ధ్యాసమీదున్నట్టు గంభీరంగా ఉన్నాడు: బస్తీ రద్దీలో పెరిగాడేమో,- తనకు చుట్టుపక్కల రణగుణమంటూ లేకపోతే- తోచదు: పైగా, యింతసేపూ,- అదో మాదిరిగా ఉండి తెప్పరిల్లాడేమో,- నిశ్శబ్దంగా ఉండటానికి మనసొప్పుకోవడం లేదు- ఏమిటా ఆలోచన? అని అడుగుదామనిపించింది కాని- మరియాదగా ఉండదేమో అని, మాట జారలేదు-

ఏమయ్యా! యిక్కడికి ఆలయం ఎంతదూరం? అని మటుకు పలుకరించాడు।

ఊరు మొత్తం బారెడు లేదు, అందులో దూరం కూడానా,- గాలిగోపురం కనబడుతూనే ఉందిగా,- అదిగో అ మొగ తిరిగితే- ఆలయం!- కాని- యిప్పుడు లోనకు వెళ్ళడానికి వీలుండదు-

అదేం?

జాం పొద్దెక్కిందికా।-

ఎక్కితే, తలుపులు వేస్తారా?-

ఆలయం తలుపులు మూయడమంటూ లేదుభాయ్,- కాని- ఆ దారిని నడిచేందుకు వీలుండదు- సీతారామయ్యా,- రాత మొదలెట్టి ఉంటాడు:

అంటే-

చూస్తే తెలుస్తుందిగా!- అడుగు జోరుగా పడనీ!-

మలుపు తిరగగానే- ఎదురుగుండా ఆలయం!

స్వామివారు అక్కడికే కనులనిండుగా కనిపిస్తున్నారు: ఆలయం ముందు- ఓ బక్కచిక్కిన చింపిరి జుట్టు మనిషి- అద్దం అల్లే చేసిన నేలమీద,- శ్రీరామా-శ్రీరామా

అంటూ వ్రేలితో వ్రాసుకుపోతున్నాడు: వరుస వంకరలేదు - ఎగుడు దిగుడు లేదు: ఆ పొందిక, ముగ్గువేసినట్లుంది: అదేం తపస్సో-

వారు-నిత్యం యిలా తపస్సు చేస్తారు- అంటున్నాడు మదారు: ఆయన రాములవారి భక్తుడు,- చాలా పెద్దమనిషి- ఒక్కడే కొడుకు - శ్రీరాములని।- బుద్ధిమంతుడే,- కాని,- స్వతంత్రం జాస్తి- బస్తీలో చదువుకున్నాడు - పెద్దచదువే చదివాడు! అక్కడ - ఒక నాయుడుగారి కుమార్తెను వివాహం చేసుకున్నాడు: కులం ఒకటి కాదుగాని- వారూ కులం తక్కువ వారుకాదు! పైగా చాలా పెద్ద ఫాయా. ఆయన, సీమకుపోయి, బారిస్టర్ అయి వచ్చాడు! వారి ఆలోచనలు అంతా దొరలపద్ధతి: మరొక ఆసామి అయితే, బ్రాహ్మణపిల్లవాడికి పిల్ల నియ్యడానికి, వెనకాడేవాడు లేకపోయినా,- వీరికి తెలియపరచి అంగీకారం తీసుకునేవాడు - అదేమీ చేయలా! - శ్రీరాములు చాలా తెలివిగలవాడు - తనలాగా సీమచదువు చెప్పిస్తే,- చేతికి అందుకుంటాడు! అని యోచన చేశాడు.

మన సీతారామయ్యది అంతా పూర్వకాలం పద్ధతి,- శ్రోత్రియం జాస్తి- ఆ సంబంధానికి తెలిస్తే ఒప్పుకోడు! ఆ నాయుడికి, కుర్రవాడిని వదులుకోవాలనిలేదు: అందుచేత అక్కడే మచ్చిక చేసుకుని - సరేననిపించి,- మనకు తెలియకుండానే, సలక్షణంగా వివాహం చేశాడు! అనుకో, అది పెద్దమనిషి చేయాల్సినపనికాదు. నిజానికి,- తనకి ఒక్క కూతురు! వీరికీ ఒక్కడే కొడుకు, వీరి మనసు ఎంత బాధపడుతుందో అని ఆలోచన లేకుండా,- తండ్రికీ బిడ్డకూ వేరు చేశాడు! అది పాపం కాదూ,- దానికి ఫలితం అందరూ అనుభవించారు:

వివాహం అయిన వార్త మన గ్రామంలో, తెలియకుండా ఉంటుందా?- కాని, ఎవరూ చొరవచేసి, సీతారామయ్య చెవిని వేయలా! ఒక మాసం రోజులు తరువాత,- శ్రీరాములు వచ్చాడు।- యిదిగో, యిక్కడే తండ్రీ కొడుకూ కలుసుకున్నారు: వాడు వస్తుతః మంచివాడే కాని, పెళ్ళి అయిన తరువాత, కొంచెం పెళుసుదేరాడు,-

ఎదుటపడటంతోనే, సంకోచం, నదురూ బెదురూ లేకుండా,- నేను వివాహం చేసుకున్నాను।- అన్నాడు: ఈయన ఒక్కసారి వాడి మొగంవంక చూసి ఊరుకున్నాడు; వెంకటరత్నం నాయుడుగారి కుమార్తెను చేసుకున్నాను!- అన్నాడు: ఈ మనిషి,- చెంపదెబ్బతిన్నట్టు మెలిదిరిగి, తేరుకున్నాడు: మాటా పలుకూలేదు: 'నాకు అ అమ్మాయి నచ్చింది!- చేసుకున్నాను,- నాన్నా!' అన్నాడు: అంతసేపూ మెదలకుండా ఉన్నవాడు,- ఎప్పుడైతే యీ కుర్రవాడు నాన్నా! అన్నాడో,- గజగజ వణికిపోయినాడు। కాని, అతి మృదువుగానే,- 'అయ్యా,- నాయుడిగారి అల్లుడుగారూ!- తమరు, నేను ఎవరినో అనుకుని,- పరాకున, అలా పిలిచి ఉంటారు: నన్ను సోమయాజుల సీతారామయ్య అంటారు: మా నాయనగారు శ్రీరామచయనులుగారు; మా తాతగారు,- లక్ష్మీపతి సోమయాజులుగారు,- మేము పేదబ్రాహ్మలం,- నాకు బహుకాలం క్రిందటనే,- భార్యా వియోగం కలిగింది,- ఒంటరివాణ్ణి,- నా అన్నవారు లేరు-' అన్నాడు: దాంతో,- యీ కుర్రవాడు, బెంబేలెత్తి, 'నాన్నా! నాన్నా!' అంటూ కాళ్ళమీదపడ్డాడు,- యీ మనిషి,- చటుక్కున కాళ్ళు యివతలికి తీసుకుని,- కుర్రవాణ్ణి లేవనెత్తి,- 'నాయనా,- నేను మూర్ఖుణ్ణి!- యెన్నెమ్మ కథలో చెప్పినట్టు - 'బ్రాహ్మడి కూతురే మాదిగాడి పెళ్ళాం!' అన్నట్టుంది యీ వరుస. అవతలివారి కులాన్ని నేను నిందించడం లేదు,- కాని,- యీ

బాంధవ్యం నాకు అర్థంకాని విషయం!- మారుజంధ్యం వేయక పోయినా,- నీ మామగారే మారట తండ్రి - వారిచేత యోగ్యుడవనిపించుకుని,- ఆ శ్రీరాముని చలువను వర్ధిల్లు! వెనుకటి పుట్టుపూర్వోత్తరాలు మరచిపో!- నీమీద నాకు, యవ్విధమైన కావేషం లేదు నాయనా,- కాని,- అల్పప్రాణివి కనుక అక్కసు పట్టలేక అంటున్నాను: అన్యథా భావించకు: యింతకాలమూ- నీవు పెద్దరిగి ప్రయోజకుడవైతే చూసి సంతోషించేందుకు, మీ తల్లి లేకపాయెనే అనే చింత బాధిస్తూ ఉండేది: యిప్పుడు నిశ్చింత: ఆ ఆడకూతురు, నాకన్న అజ్ఞానురాలు!- నీ నిర్వాకం, అర్థంచేసుకోలేక,- కంట తడిపెట్టిందో అది శుభం కాదు గద!- ఏ అగచాటు లేకుండానే కన్ను మూసింది. పుణ్యాత్మురాలు!- నాయనా! యిక క్షేమంగా పోయిరా!-' అన్నాడు: నాన్నా! నాన్నా! అని,- ఆ కుర్రవాడు ఒకటే ఏడుపు!- సీతారామయ్య,- పొమ్మని చేతితో సైగచేసి-శ్రీరామా! అంటూ కళ్ళుమూసుకు కూర్చున్నాడు: శ్రీరాములు కుర్రతనం కాదూ, రోషంవచ్చి,- నా మొగం చూడటం నీకు అంతకష్టమయితే,- యింక కనపడను,- యీ జన్మకు కనపడను; అనేసి ఒక్కక్షణం నిలువకుండా బస్తీకి వెళ్ళిపోయినాడు: అంతే,- తెలియకుండా తనకి తను శాపం పెట్టుకున్నట్టు అయింది:

ఒక్క సంవత్సరం, బస్తీలో కాపురం చేశాడు: ఆ తరువాత సీమకు ప్రయాణం అయినాడు: అది ఏం గ్రహచారం! జర్మనీ వాళ్లు ఓడకొట్టేసినారు:

యిక్కడ, తవిసిపూడిలో పుట్టిన, సీతారామయ్య కొడుకు,- ఎక్కడో ఆనవాలు లేనిచోట సముద్రంలో కలిసిపోయినాడు,- ఆ కబురు ఎప్పుడు మనకి తెలిసింది?- ఎన్నో మాసాలకి!- యీ పాటికి కుర్రవాడు - సీమలో ఉంటాడు అని మనం అనుకుంటూంటే, అప్పటికి-యిదీ వర్తమానం!-

అప్పటికి,- అక్కడ ఆ అమ్మాయి - నీళ్లు పోసికొని ఉంది - మరి నాలుగు మాసాలకి మొగపిల్లవాడు పుట్టాడు- కాని,- అరటిచెట్టు మాదిరి అయింది. ఆ బ్రతుకు!- తల్లి బిడ్డను చూసుకోలేదు:

నిన్నా, మొన్నా కాదు భాయీ - యిప్పటికి సరిగ్గా,- యిరవైరెండు సంవత్సరాలు: ఆ కుర్రవాడు బాగున్నాడు,- బస్తీలో,- లక్షణంగా ఉన్నాడు: ఆయనకి యీ తాత అంటే చాలా భక్తి - వచ్చి చూస్తూ ఉంటాడు- కుర్రవాడికి వివాహం అయింది,- ఆ రోజులు కావుగా,- బ్రాహ్మణుల అమ్మాయినే కావాలని, కోరి చేసుకున్నాడు: వాళ్ళకి ఒక మొగపిల్లవాడు- తాత పేరు పెట్టుకున్నాడు: యిదీ వీరి వృత్తాంతం - కుమారుడు అలా అయిపోయినాడని తెలిసిన రోజునుంచీ,- యిదే తరహా!- ఆలయంలో ఉదయం అందరూ దర్శనం చేసుకుని వచ్చేసిన తరువాత,- యిలా వ్రాసుకుంటూ కూర్చుంటాడు: యిది,- మతిచలనం కాదు: అతి వివేకం! అనాడు,- నా బిడ్డవచ్చి... నాన్నా అని పిలిచాడు: నేను మూర్ఖుణ్ణి కనుక నాకు బిడ్డలు లేరన్నాను: శ్రీరామచంద్రుడు మాకు యిచ్చిన వరాన్ని కాదన్నాను: వారు సన్నిధికి రప్పించుకున్నారు: నా అహంకారంలో - యిచ్చినవాడు - ఆ దైవమన్న మాట మరచి,- ప్రవర్తించాను: నా శాపం, నాకు తగిలింది,- నా పాపం,- ఒక ఆడకూతురికి కుంకుమలేకుండా చేసింది: కాని- నా రాముడు దయామయుడు కనుక,- యీ క్షుద్రుడిమీద జాలి దలచి,- యిలా నామజపం చేసుకోరా,- అని తరణోపాయం జూపించినాడు-' అంటాడు,-

మదారు,- యిలా చెపుతూండగానే,- సీతారామయ్య వ్రాత పూర్తి చేసి,-

శ్రీరామా!- అని గర్జన చేసి,- సమీపించాడు: మదారు,- పరిచయం చేశాడు,- 'నాయనా,- యిక్కడున్న నాలుగు రోజులూ నా చేతిమీదుగా పట్టెడన్నం తిందువుగాని,- ఒక్క క్షణంలో వంట చేస్తాను తండ్రీ,- వస్తావు కాదూ!- నా బిడ్డవుకాదూ!-' అని రెండు చేతులూ పుచ్చుకున్నాడు, సీతారామయ్య: తనకు నోట మాటరాక, కళ్ళనీళ్ళు తిరిగినాయి: అలాగే అన్నట్టు తల ఊగించాడు: నాయనోవ్!- నీకు ఏ కూర యిష్టమో చెప్పు- నా బిడ్డలాటి వాడవు, బిడియపడక, చెప్పరా తండ్రీ,- అంటున్నాడు: తనకు కంట నీరోడుతూంది: ఎలాగో గొంతు పెగల్చుకుని,- పెట్టిందే- ప్రసాదం!- అని నమస్కారం చేశాడు: మదారు నవ్వుతూ,- మామా,- మనవాడుకూడా నీలాగే వంట చేయడంలో సర్దార్,- యివాళ నీవు చెయి,- రేపు యీయన చేస్తాడు: అది రుచిచూస్తే,- నీవు వదలవ్!- అంటున్నాడు: సీతారామయ్య ఆహా! అని సంబరపడి,- గునగునా నడిచిపోతున్నాడు,-

సీతారామయ్య, మనిషి తోడులేందీ భోజనం చేయడు. పొరుగూరునుంచి ఎవరైనా వస్తే సరేసరి, లేదా, మన గ్రామంలో వారే, వంతులు వేసుకుంటారు:

బ్రాహ్మణులే అని,- నియమం లేదు: నేనూ, మా మోదీనుకూడా అక్కడ ప్రసాదం తీసుకున్నాము...

'అక్కడలా రామకోటి వ్రాస్తున్నారు కదా,- అది, చెరిగేదాకా అటు ఎవ్వరూ నడువరన్నమాటేగా-'

'ఆఁ- బాగా ఒకటి రెండు జాములు అక్షరాలు స్పష్టంగా కనిపిస్తూనే ఉంటాయి: తరువాత సాధారణంగా,- గాలివాటుకు చెరిగిపోతాయి. సంజెపడేవేళకు, అక్కడ నీళ్ళు జల్లి, ఏకం చేస్తారు: అప్పుడందరూ నడచిపోతారు: అటు వెళ్ళే- ప్రతి ఒక్కరూ,- అంతలెక్కా, శ్రీరామా!- అంటూనే ఉంటారు,...'

'వానాకాలంలో?'

-'మంటపంలో కూర్చుని, అంతసేపూ జపం చేస్తాడు:'

'బాగానే ఉంది;- ఏరోజు కారోజు మొదటికొచ్చే బదులు,- ఒక నియమంగా కాగితం మీద వ్రాసి, భద్రాచలం తీసుకువెళ్ళి,- శ్రీరాముడికి సమర్పించవచ్చునుగా!'

అది, వారికి తెలియదనా?-

ఈ సందేహం, మన వాళ్ళకి ఎన్ని సంవత్సరాల క్రిందనో వచ్చింది: సలహా యిచ్చారు: సీతారామయ్య ఏమన్నారంటే,- అది సంసారపక్షమయ్యా!- కాగితం కలం దస్త్రం, తయారైతే-బుద్ధి లెక్కల మీదికి పోతుంది: యిప్పుడంటావా, ఆ బాదర బందీ లేదు: వాడి చిత్తం వచ్చినంతసేపు,- నాకు ప్రాప్తమున్నంతసేపు, స్మరించుకోవచ్చు!- ఈ పద్ధతే మా ఉభయులకీ నచ్చింది: యిలాగే జరగనివ్వండి!-

అదీ సంగతి! వారిని అలా అడగటం, అపచారం అని మనవాళ్ళకి అప్పటికి తెలిసి వచ్చింది: ఆనాటినుంచీ భాయీ, మన గ్రామంలో,- ప్రతి ఒక్క మనిషీ,- దైవం మొగం చూసి,- తన బుద్ధికి మంచిదని తోచినట్టు చేయడమే కాని,- ఎదుటివాడికి సలహా యివ్వాలంటే జంకుతాడు: సీతారామయ్య పుణ్యమా అని,- దైవభక్తి నిత్యకృత్యం అయిపోయింది,- అహంకారం అసలు రూపులేకుండా పోయింది...

అంతా, వింతగా అనిపించింది,- తనకు,-

కాశీ మజిలీ కథలో మెలగుతూన్నట్టుంది-

యిటునుంచి,– ఎటు,–

అడగదలచుకోలేదు–

తలవంచుకుని,– నడవటమే,–

రాజగోపాలస్వామి వారికి మరొక్కసారి, నిండు నమస్కారం చేసి,– 'అయ్యా,– మాపటి వేళకు వచ్చి, నిన్ను సేవించుకుంటాను తండ్రీ!– అని మౌనంగా మనవి చేసుకుని,– సాగిపోతున్నాడు,– తిన్నగా, మదారు ఇంటికి వెళుతున్నామేమో అనుకున్నాడు: ఔను మరి,– ఊరికి జేరుకుని ఏ జామాయె, నాలుగు రోజులనుంచీ ఊళ్ళో లేకపోవడంతో,– అదీ యిదీ అజ చూసుకోవలసి ఉంటుంది,– తనకూ కాస్సేపు,– భోజనం వేళదాకా నడుం వాలిస్తే, హితవుగా ఉంటుంది–

భోజనం మాట తలచుకోగానే,– యింతసేపూ అడుగున పడిపోయిన ఆకలి,– ఝూం మంది: సహజమే,– ఉన్న చోటే ఉంటే యీ పాటికి రెండు మూడుసార్లు గొంతు తడుపుకుని ఉండేవాడు– పుట్టి బుద్ధెరిగిన తరువాత,– పరగడుపంటే ఏమిటో యివాళే అనుభవానికి వచ్చింది– మదారుకు– అతని కడుపు చల్లబడ్డది కనుక తన తపన గమనించినట్లు లేదు,– తనకు. నోరు విడిచి అడిగేందుకు బిడియం!– యిదివరకెప్పుడూ ఉన్న చోటు విడిచి, పదచాలనం చేసినవాడు కాదేమో, యీ పద్ధతి యిరకాటంగా ఉంది! లెక్క ప్రకారం తనది యీ గ్రామం: ఆక లనిపించడంతోనే, నాలుగడుగుల్లో యిల్లు జేరుకుని,– అమ్మ నడిగి అన్నం పెట్టించుకోవలసిన యోగం,– లేకపోగా,– పరాయివాడి లాగా,– దిక్కులు చూస్తూ నడవాల్సిన ప్రారబ్ధం ఏమిటి?– నిజానికి,– తానిక్కడికి రావల్సిన అగత్యం ఏముంది?– తన ఉనికే ఎరుగని,– ఆ వెంకట్రామయ్యను చూడాలని,– తనకీ మధన ఎందుకు?–ఛస్,– తెలియక వచ్చినందుకు,– తెలివిగా తప్పుకోవడం మేలు,– ఆయనకు దయొచ్చి పెట్టినప్పుడు,– ఆ సీతారామయ్యగారి యింట్లో నాలుగు మెతుకులు నంజి, మదారుకు నచ్చజెప్పి, పేటకు పోయి, రైల్లో పడితే, ప్రజల్లో పడినట్టుంటుంది– అంతే,– మరోదారి లేదు,–

యిలా అనుకుంటూండగానే,– వెన్ను వెంబడి వణుకు పుట్టుకొచ్చింది,– కాని, ఒళ్ళు ఆవిర్లు గ్రక్కింది,– కళ్ళకు కట్టినట్టు– కుంకుమ పూజల్లో,– అమ్మ తల్లి!– శంఖం పూరించినట్టు శ్రీరామనామం మార్మ్రోగిస్తూన్న సీతారామయ్య మౌనం,– రప్పించింది వారు! వచ్చినందుకు, అనుక్షణమూ అడుగడుగునా, ఫలంపోటు!– యింకేం కావాలి!–

ఈ గజిబిజి ఒక్క తెప్పపాటు!–

అంతే–

'కోనయ్యా భాయ్, కాఫీ పుచ్చుకుందామా?–' అంటున్నాడు, మదారు,– ఆ తరుణంలో,– తనకు కాఫీ అన్నమాటే యెబ్బెట్టుగా తోచింది: స్వాములవారి ఆశ్రమంలో సాని మేళం వినిపించినట్టు– దేవాలయం చుట్టూ ప్రదక్షిణం చేస్తూంటే, ఎంగిలి బీడీమీద కాలేసినట్టు,– ఉహు ఉ– అని తల విసిరాడు,–

'అదేమిటయ్యా!– తెల్లవారి లేస్తే,– అందులో మునిగితేలేవాడివి!–'

'అందుకే,– ఆట విడుపు!– మళ్ళీ బస్తీకి పోయి,– ఆ కామాటంలో పడితే,– యధాప్రకారమే,– యిక్కడున్న నాలుగు రోజులూ,– అదంతా కట్టిపెట్టి,– వేళ పట్టున భోంచేద్దామనిపిస్తూంది–'

'మంచిదే,- కాని,- ప్రయాణం బడలిక మొగంమీద కనబడుతూంది,- యీ పూటకి మట్టుకు, కొంచెం తగిల్పించు: దాఁ- యిలా కూర్చుందాం!-'

కుడిచేతి వేపున, యిల్లు,- ముందర బాగా మెరాబా ఉంది,- ఉన్నంత మేరా శుభ్రంగా ఉంది.- ఓ పక్కను గన్నేరు మొక్కలు,- కోరడేసినట్టు గుబురుగా, పెనేసుకుని ఉన్నాయి,- ముందర,- పాతకాలంనాటి వేపచెట్టు,- మాంచి బ్రహ్మాండమైన నీడపట్టు,-

ఆ నీడను కూర్చుందామంటావా?-

'అహఁ- అరుగుమీదే,- యీ చల్లదనం,- అక్కడా ఉంది,- యీ యింటికైన, అమ్మగారే,- మా చల్లని తల్లి!-'

' ఎవరిదీ లోగిలి!-,

'వెంకట్రామయ్య అని చెప్పానే,-'

ఆఁ- అంటూ ఆగిపోయినాడు! అడుగు కదలందే,- యిదా యిల్లు,- నాన్న యిక్కడ పుట్టి పెరిగాడా? - ఆ యిల్లాలు అంత చల్లని తల్లా?- అమ్మకూడా,- యిక్కడ కాపురం జేసుంటే,- అలాగే పేరు తెచ్చుకునేది కదా!- తాను,- యీ నీడను పెరిగి ఉండాల్సిన వాడు కదా,- ఆలా,- రాసి పెట్టలేదు,-

తలుపు తీసుకుని,- ఆ తల్లి గుమ్మంలోకి వచ్చింది,- చేతను బిందె ఉంది,- బంగారంలాంటి ముత్తైదువ,- మొగం సిరి ఓడుతూంది,-

వీళ్ళను చూడగానే,-

ఆ చూపు,-

తల్లి బిడ్డలను చూసినట్టుంది,-

ఏం నాయనా,- అబ్బాయితో పనుందా,- అని పలుకరిస్తూ చేరువకు వచ్చింది,-

పార్వతీ అమ్మవారు, ఊరేగుతూ వస్తున్నట్టు ఉంది,- యీ యిల్లాలినా, ఆయన చిన్న చూపు చూసింది.

గోపాలం ఉన్నాడా అమ్మగారూ,- అని మనవి చేసుకున్నట్టు అడిగాడు మదారు-

'రాత్రి ప్రొద్దోయేదాకా మేలుకున్నాడు. తొలికోడి కూసిన తరువాత కాని, నడుం వాల్చలా?- ఏదో చదువుకుంటున్నాడు, ఓ రవంత పొద్దెక్కి లేచాడు,- యిప్పుడే సంధ్యావందనం జేసుకుని,- కాఫీ కాచుకుంటున్నాడు,- యిన్నాళ్ళనుంచి చూస్తున్నా, ఆ కాచి వడపోయడం, నాకు,- చేతగాక పాయె!- నాయనా, మనదే గ్రామం,-...

అమ్మా!- నేనా, నేను- ఆవిడ ఆ ధోరణిలో చెప్పుకుపోతే,- చటుక్కున అలా, పలుకరించేసరికి,- తాను తబ్బిబ్బు కావడంతో, మాట వెంబడి మాట తెమిలిరాక, పెదవులు తడబడినవి. తనకు తెలియకుండానే, గొంతు నిండుగా,- అమ్మా!. అంటూ వచ్చినమాట, కోటి గుణితంగా,- మనసులో మార్మోగుతూంది-మదారు,- మాట అందుకుని,- తన సంగతి మూడు ముక్కల్లో చెప్పాడు- ఆవిడ చిరునవ్వుతో ఆలకించుతూ,- తనవంకే, అలా చూస్తుంది,- తనలో తాననుకుంటూన్నట్టుగా, పలుకుతూంది,-

ఏమిటో యీ దైవమాయ,-

బిడ్డను చూసుకున్నట్టే ఉంది!-

దైవం తిన్నగా చూసి ఉంటే,- యీపాటికి, యింతవాడు: వాడే,- ఎదురొచ్చాడనిపించింది,-

ఏమిటో భ్రమ! – తొలిచూలుబిడ్డ దక్కకపోతే,– జన్మంతా శోకమే కదా, నాయనా! చిన్నతనంలోనే, కడుపు కోత, అనుభవించాం,– యిద్దరం అనుభవించాం!–

ఆడపుటక అధమస్తం గనుక,– ఏ అగచాట్లు వచ్చినా గుండె రాయి చేసుకుని పడి ఉంటాం।–

కాని, మగవారు అలా కాదుగా,–

నా మొగం చూస్తే,– వారికి జాలేసి, వల్లమాలిన దుఃఖం వచ్చేది. నాలుగైదేళ్ళు,– యిల్లు పట్టకుండా తిరిగేవారు, ఎవరి పనోమీద వేసుకుని, ఆ ఊళ్ళో ఆ ఊళ్ళో,– కాలం వెళ్ళబుచ్చేవారు– దైవం,– అన్నాళ్ళకు మమ్మల్ని ఓ కంట జూసి,– మా గోపాలుణ్ణి యిచ్చాడు. అయినా ఆ లోటు– లోటే– నిన్ను చూడగానే,– మాకు, శాపం తీరినట్లయింది నాయనా!...

ఒళ్ళు తెలియని ఆనందంలో,– ఆ తల్లి కంట నీరుబికింది– చేతనున్న బిందె క్రిందకు జారవిడిచి,– కొనగోటితో కళ్ళు తుడుచుకున్నది–మొగం మరింత విప్పారింది,–

ఏ తల్లి కన్న బిడ్డవో,– నా తండ్రీ! నీ పరువు మర్యాదలు ఎలాటివో?– ఎవరో ముక్కూ మొగం తెలియని, ఓ పేద ముత్తైదువు, నడివీధిలో గుమ్మంముందు నిలవేసి,– ఏమిటింత స్వతంత్రంగా మాట్లాడుతుందనుకునేవు!– అనుకోవు గద నాయనా!–

ఆవిడలా అంటూంటే, ఆదికాలంనాడు మర్రాకుమీద పవ్వళించి ఉన్నటువంటి, ఆ బాల పరమాత్మ తొలకరి నవ్వల్లే అయిపోయింది మనస్సు–అమ్మా అని, వేయి జన్మలుగా– వేయి గొంతులతో,– వేయి తీరులుగా,– ఒక్కటే మమతగా,– తాను పిలుస్తూన్నట్టు,– ఎల్లకాలమూ అలాగే పిలిచే అదృష్టమున్నట్టు ముక్కోటి దేవతలు తనకా వరదాన మిచ్చినట్లు,– అనిపించింది,– తన ఆనందం,– తనకే వినిపించింది! ఆ విద్దూరంలోనే, అంతలో తెలివి తెచ్చుకుని,...

అమ్మా!– అమ్మా!– అలా అనకండమ్మ,–

నేను, మీ బిడ్డనేనమ్మా!–

అంటున్నాడు,– ఆవిడ,– శిరసున అక్షతలు వేసినట్లు నవ్వి,. నాకు తగిన వెర్రివాడవేరా తండ్రీ!– నీ ఆపేక్షకూ అంతఃకరణకూ, వెయ్యేళ్ళాయుస్సు!– అంటూ ఆ దీవెన మననం జేసినట్లు పలికి, మదారయ్యా!– అలా పోయి కూర్చోండి నాయనా!– ఒక్క పరుగున యిట్టె వచ్చేస్తాను!– అని ముందుకు నడచిపోయింది: ఆవిడవంక చూశాడు,– ఆ యింటివంక చూశాడు,–

ఆవిడ,– మనమ్మే!

యీ యిల్లు–మనిల్లే!

వెనుకటికి తాను పుట్టి పెరిగిన,– ఆ మైనమంతా– కలలో,– తాను కన్ను తెరిచింది, తనలో!–

వెనుకటికి,

అమ్మ–అప్పుడేనాడో పదహారేళ్ళ క్రిందట. కనకదుర్గమ్మ పాదాల కలసిపోయింది. ఆ క్షణంనుంచీ ఆ రూపు మళ్ళీ తన కళ్ళకు కట్టలేదు. మనసులో మెదులుతూండేది,– అంతే,–

ఈ నాటికి!–

అమ్మతల్లి - కనిపించింది! అమ్మే అనిపించింది!

అది, ఓ ఊహ!-

యీ క్షణంలో,-

ఏనాడూ,- అమ్మ, యీ బిడ్డను ఏమరి ఉండలేదు- అని.- అనిపించడం కాదు,- అర్థం అయింది:

అవ్వదగ్గిర తనను దిగవిడిచి,- తాను వచ్చి యిక్కడ నాన్నను కనిపెట్టి చూస్తుంది,- హమ్మా!-

అనుకుంటూన్నంతలో ఒళ్ళు తెలిసింది!-

అమ్మకోసం మొగం వాచిపోయే కుర్రతనం తనను కానరాకుండా,- యీ జన్మంతా యిలా పట్టి పీడిస్తూనే ఉంటుందా ఏం,- అని అనుకోంగనే,- పక్క బెదురుపుట్టింది- కాని, చేతికి మీసం తగిలి ఫెళ్ళున నవ్వొచ్చింది,- ఆ నవ్వు, నీరెండ సోకినట్టు మదారు మొగంమీద పడ్డది! బుద్ధితక్కువతనం తెలిసొచ్చింది: ఆవిడ చేదస్తానికి తాను నవ్వుతున్నా ననుకుంటున్నాడు, సాయేబు!- తనమీద తాను సణుక్కున్నాడు!- నాన్న చిన్నప్పటినుంచీ ఒళ్ళు వాయగొట్టి పెంచకపోవడంతో,- తాను కోతీగాక కూనలమ్మా కాక నూతిలో బొక్కెనల్లే తయారయినాడు!... మదారు తన చేయందుకుని,- దూడను నడిపించుకు వెళ్ళినట్టు,- అరుగు మొగదలకు చేర్చాడు: కూర్చున్నారు: తలుపు తీసుకుని,- గోపాలం వచ్చాడు: తాను కళ్ళప్పగించాడు: వాడు!- తమ్ముడు-

తనకు కావలసిన తమ్ముడు!-

వాడి వెనకాతల,- గుమ్మంనిండా,- తన బలగం,- అంతా, అమ్మకన్న సంతానం!-

గోపాలం!- అని కేకేసింది- తనేనా?- ఔను,- తెలియనివాడు అంత చనువుగా పలుకరిస్తే,- ఎదుటివాడు, తెల్లబోడూ? తననీ అపేక్ష దయ్యమైపట్టింది: యిది వదిలించుకోందీ.- నలుగురిలోకి రావడం తప్పు!- తనవాలకం చూస్తే వీళ్ళకు మతిపోతుంది!-

జలస్తంభన చేసినవాడు,- తెమిలి బయటపడ్డట్టు ఒక్కసారి ఒళ్ళు కుదించుకున్నాడు: సకిలించినట్టు నవ్వి,- మాట పెకలించి,- యీయనేకదూ గోపాలం!- అని మదారును అడిగే మొగం పెట్టాడు:

ఔను! నేనే అన్నా!- అంటూ వచ్చి పక్కను కూర్చున్నాడు: మదారు,- కందులగోతాంకు టాకాలేసినట్లు,- నాలుగు ముక్కల్లో పరిచయం చేశాడు,- మనకి కాఫీ కొంచెం పట్టించు! అన్నాడు:

'కాఫీయా?- ఏమిటి యింతవరకు మూతి తుడుచుకోలా?- బస్తీవారిని యింతదూరం తీసుకువచ్చి, పరగడుపున తిప్పితే,- మన పరువుంటుందా?- కాఫీయే కావాలంటే మరోక్షణం ఆగాలి! పాలైతే సిద్ధం!- ఏం అన్నా!-

క్షణంలో మించిపోయేదేముందీ?- ఏదో అనవాయితీ అయిపోయింది: కడుపులో కాఫీపడితేనే సమశీతోష్ణంగా ఉంటుంది: పాలుచ్చుకుంటే బద్ధకం వేస్తుంది:-

అహః ఏ పొళంలో పుచ్చుకోవడం అలవాటు? అంగట్లో చేదులా అంటావా?-

అది ముఖ్యం,- కషాయం గుత్తంగా,- పాలూ చక్కెరా, అభిషురించి...

అయితే.- ఆలస్యంలేదు: మా నాన్నదీ, అదే పట్టూ-... అంటూ ఒక్క అంగలో లోపలికి వెళ్ళి,- అపు గోరా పట్టుకొచ్చి అందిచ్చాడు: తనకు అందుకునేందుకు చేయాడందే,-

నాన్నగారికోసం - చేసింది,- నేను పుచ్చుకోవడం,-...

అదో ప్రాప్తం అన్నా!

పుచ్చుకో!-

గుమ్మంలోకి రావడంతోనే, బంధువులు ఎదురుకావడం ఎంత పుణ్యం అన్నా!-

ఆ ఆపేక్షకు, తనకు ఒళ్ళు మండుకొచ్చింది: నందనవనంలో అయినా నాగుపాములుండచ్చు కాని, యీ గ్రామంలో దేవతలు తప్ప, మనుషులంటూ లేరా ఏం?- లేక, యిదో నటనా?- కానరాని గడుసుదనమా?- ఎన్నడో ఓనాడు యీ మారుమూలన చెదురువాటుగా పరాయివాడొస్తే- చెవులు పట్టుకు ఆడించడం,- వీళ్ళకు ఓ కాలక్షేపమా?- అర్థంకాని అక్కసుమీద, గుక్క తిప్పుకోకుండా,- పుచ్చుకున్నాడు: నమిలి మింగినట్టు,- త్రాగేశాడు: కడుపులో నులివెచ్చన సోకి,- కళ్ళల్లో చురచుర పరుసుకుపోయింది... దివ్యంగా ఉంది అన్నట్టు గోపాలం వంకచూసి, తల ఊగించాడు: లోపలికి వచ్చి కూర్చోండి,- కబుర్లు చెప్పుకుంటూ కాఫీ కలిపేస్తాను. అమ్మ రాంగనే,- అలా వెళదాం!-...

లోపలికి వెళ్ళారు:

లో సావడి,- మాంచి విశాలంగా,- శుభ్రంగా ఉంది: బయటనుండి కానరాలేదుకాని,- భవంతి పెద్దదే,- ఒకప్పుడు వేసీవేయనట్టుంది. యిప్పుడు లోజెడ్డట్టు అలాటి లక్షణాలేమీ ఏ మూలా కనిపించలేదు: ఆభరణాలతో నిమిత్తంలేని ఐదువరాలికి మల్లే,- ఆలయం ముఖమంటపమల్లే,- అల్లా ఉంది: తాను లోపలికి నడచివెళ్ళినట్టు లేదు,- అమ్మ,- చటాలున,- చంకనేసుకున్నట్టుంది: ఎక్కడో ఆటలు మరిగి, అన్నంమాట మరచిపోయి, అవ్వ వెదుక్కుంటూ రాగానే,- అందకుండా పారిపోయి తిప్పలుపెడితే- అందుకుని - రొమ్ముకు అదుముకుని, బలంకొద్దీ,- భడవా!- అని బుల్లి చరుపు చరచి, తెచ్చి, అమ్మ ఒళ్లో కూలేసినట్టుంది!- అమ్మ,- ఒళ్ళు దులుపుతూ,- మాటామంతీ లేకుండా,- ఒక్కమూపులో ఒళ్ళంతా కూకలేసినట్టుంది: అలా కళ్ళముందు నిలవేసి,- నాన్నా,- ఎండలో తిరగద్దురా!- అన్నట్టుంది-

ఏమిటో, అడుగడుక్కీ- అయోమయం!-

ఛస్-

నేనెవరిని,- కోనయ్యను!-

కూనయ్యనూ,-గుజ్జయ్యను కాను-

నేనో గడ్డిపరకనే కావచ్చు,

కల్పవృక్షాన్ని కావాలనే కోరికలేదు,-

నాకు,- ఏ దేవతలూ,- యిప్పుడు దిగొచ్చి వరాలియ్యవలసిన అగత్యంలేదు:

తనకు కోపమూలేదు,- యీ క్షణంనుంచి, కోరికాలేదు!- అంతే,- యీ జన్మకు,- యిక అంతే!-

గోపాలం కాఫీ కలుపుతున్నాడు,-

చెయిదిరిగినవాడే,-

మదారు కూచుని కునికిపాట్లు పడుతున్నాడు.

అన్నా!- మరొక్క చుక్క! అంటున్నాడు గోపాలం: అందించాడు: తాను పుచ్చుకున్నాడు: మదారు,- ఆకలి మీదున్నవాడికళను-పుచ్చుకున్నాడు:

ఏం,- నీవు పుచ్చుకోవేం?- నౌకరిని గదమాయించినట్లు అడిగాడు:

పుచ్చుకుంటే ఓ చిక్కుంది!- వెంటనే ఆకలేసుకొస్తుంది: విస్తరిముందు జేరేదాకా,- మరోపని చేయలేను: నాలుగైదేళ్ళ క్రితంవరకూ చద్దన్నం తిన్నవాణ్ని - అందుకు మా శేషయ్యమామ అడ్డం వచ్చాడు: ఏంరా బడితెలాగా ఎదిగావు,- కాస్సేపు కృష్ణారామా అనుకోకుండా నిద్దురలేవడం చద్దికూటి కెగబడటమేనా?- అన్నాడు: నిజమే అనిపించింది: బుద్ధి కుదిరితే,- ఎన్నడన్నా నాలుగు రోజులు సంత చెపుతాడు: కాని ఏకబిగివిని సాగదు- యీ దెబ్బతో చద్దన్నం మటుకు మూలడ్డది-...

ఒరే గోపాలం!- అంటు ఓ పొల్లు కేక!-

అంభస్యపారే భువనస్యమధ్యే- నాకస్యపృష్ఠే- నాలుగాసులూ నీవే వేసుకో... లోపలికి వచ్చేసింది గొంతు,- మరో అడుగులో- మనిషి,

ఒరే మదారు,- దస్తు ఏ మాత్రం ఉందిరా?-

దస్తుకేం తక్కువ మావాఁ. మనకి 'ఆటలో అవసరం వస్తుందని, బస్తీపోయి బండి కేసుకు వచ్చాగా,- ఎక్కీ దక్కీ-

అయితే డొక్క చీల్చానే!-

అరేయ్, ఆ తేభ్యంగాడికి ఒక్క ఆటెక్కలా! కుప్ప నూర్పుడే అనుకో! హాఁ కాళ్ళూ చేతులూ కడుక్కుని ఆచమనం అఘోరించి వచ్చి కూచున్నాడు- ఆటెత్తుకున్నాడు- ఓ ఆటేశాడు- ఊఁ, మనదొహటి- నాలుగువేతలు వేసి గేటు! అన్నాడు యిల్లాకొడితే మనం పడతామా?- ఎక్క దోశాను!- వాడి చేతులో ఏముందో మనకి తెలియదూ!- అంతవరకూ అనుకుంటూ కళ్ళ జూడలా,- ఏ జాకీ, క్రీంచా జోకరో పెట్టుకుని,- మూడాసుల ముద్ర వేసుకు కూచున్నాడు: తాను ధర్మరాజుల వారి ననుకున్నాడేమో మీటుకు మీటు టొకాయిస్తున్నాడు: మనం చాప తడుముకుంటే చేతికి రస్మి తగల్లా- ఊఁ నాదోటి! అన్నాను: గాత్రం ఒప్పుకోనన్నాడు: అట్టాగేం? అని లేచాం. ఒరేయ్, ఎంత ధనం కావాలన్నా ఏనుగుమీద వేసుకు వస్తారా, కాసుకో అన్నాను- ఎహె అన్నాడు:... ఎహె అన్నావు కాదురా!- యిప్పుడు రారా నా రంగా,- తాతయ్య తమ్ముడి మనవడా, - మన తడాఖాఁ - తద్ధి తప స్తద్ధి తపః ఆఁ- ఆఁ డావు తన్నుకు పోతావా పుంఛాకోర్... పటుకో... పటుకో- ...

-గొంతు, పరుగెత్తింది-

నాల్నెల్లయింది కాదూ - అన్నాడు మదారు

ఆఁ- అన్నాడు గోపాలం:

క్రమంగా వెనకబడుతూంది!-

పడక, పట్టి పీకుతుందా?- గ్రహచారం మట్టుకు ఎన్నాళ్ళుంటుంది?-

గోపాలం కాఫీ అపుగోరా చేత పట్టుకున్నాడు: తలుపు గొళ్ళెం వేసి. - వీధి మీదికి వచ్చారు:

ఆయనే. – శేషయ్య మామ అంటే–అన్నాడు గోపాలం: తాను యాదాలాభంగా తల ఊగించాడు:

వేదపండు,–మంచి గృహస్థు
కావలసిన వసతి ఉంది:
చీకూ చింతా లేని బ్రతుకు,–
కాని, – ఓ చిటికెడు వ్యసనం–
అంటే పట్టి పీడించేది కాదు,–
కేవలం కాలక్షేపమే!– అదిగో అదే,– పేకాట!– ఉదయం రెండు ఝాములు దాకా,– మడీ, నిష్ఠ,–వేదం చెప్పడం.––

భోంచేసి, చేయి తుడుచుకున్నప్పటి నుంచీ, – యిహ మన మనిషి కాదు,– యింకో ధ్యాసలేదు: ఈయనకో తైనాతీ ఉండేవాడు ముష్టి గంటయ్య అని, – మేనమామ కొడుకు!– ఎప్పుడూ వీళ్ళిద్దరే. – యింకోడికి చోటెట్టేవాళ్ళు కారు, – యింకొహాళ్ళతో జేరేవారు కారు : యిద్దరివీ ఎదురు బదురు యిళ్ళు– యిటు వీళ్ళరుగుమీదో, అటు వాళ్ళరుగు మీదో, రెడ్డిగం వేసేవారు: అలా, భోజనం వేళదాకా ఏక టాకీని ఆడి,– ఆ మొక్కు తీర్చుకుని వచ్చి,– ఎవరి అరుగుమీద వారుండి,– తవ్వి తలపోస్తూ, నిద్ర వేళదాకా యుద్ధం చేసేవాళ్ళు.– మున్నూట అరవై రోజులూ యిదీ తంతు!– యిలా అయిదారేళ్ళు ఆడారు; ఓడూ గెలుపూ అనేది, – మాట పట్టింపుకే కాని, – ఎవరికీ కాసు ఖర్చులేదు: చెరో బస్తా చింతగింజలూ నిలువజేసుకుని – వాటితో ఆడేవారు : కాని. – ఏరోజు కారోజు – లెక్కా డొక్కా, – రూపాయిల క్రింద పద్దేసుకునేవారు : వీళ్ళు క్రమంగా, యిదో పిచ్చనుపడిపోతున్నారేమోనని ఊళ్ళోవాళ్ళు అనుకున్నా– ఎవరూ అంత పెద్దగా, పట్టించుకోలేదు: యిరుగు పొరుగు వారికి యిదో వేడుకగా ఉన్నా, – యింట్లో వాళ్ళకు రాను రాను యిది కంటగింపై పోయింది. దానికితోడు, వీళ్ళ ధోరణి కొంచెం శ్రుతిమించింది. ఉదయాన్నుంచీ మొదలుపెట్టేవారు:

గంటయ్యది ఓడు చెయ్యి, నిత్యం ఓడుకుంటూ రావడంతో, యిన్నేళ్ళ మింజుమలె, శేషయ్య మామకి కొన్ని కోట్లు యివ్వదేలాడు: యిహ నిత్యం అదో పారాయణ! యిహ దీని పని యిట్లా కాదని రెండిళ్ళవాళ్ళూ: కూడబలుక్కుని– ఒకనాడు ఆటలో ఉన్నప్పుడు ఆ గింజల బస్తాలు మాయం చేశారు, కొంత రొఖ్ఖం పట్టుకుని కూర్చోవడం, అయిపోయినప్పుడల్లా మళ్ళా ఖజానాలోంచి తెచ్చుకుంటూండటం – అదీ రివాజు: గింజల మూటలకోసం వీళ్ళు దేవుళ్ళాడుతూంటే – ఒకళ్ళమీద ఒకళ్ళకు చాడీలు చెప్పారు. చెప్పింది పరాయి వాళ్ళు కారు,– శేషయ్య కొడుకే! – కొడుకంటే పెంపుడు కొడుకనుకో– దొడ్డి త్రోవను వచ్చి నీ దస్తు ఎగరేసుకుపోయినాడని, యిద్దరికీ చెప్పాడు– దాంతో వాళ్ళు వీధిన పడి జుట్టూ జుట్టూ పట్టుకున్నారు: అప్పుడు కాని, – అసలు కీలకం బయటపడలేదు: అదేదో – యిద్దరూ కలిసి కట్టుగా చేసే జపమట: యింకో నెల్లాళ్ళపాటు సాగితే పరిపూర్తి అయ్యేదట– అవాంతరం రావడంతో – గంటయ్య గుక్కతిప్పుకున్నాడు కాని, శేషయ్య– మరీ లోతుకు మునిగాడు: మూడురోజులు అమ్మతల్లి తోటలో.– కట్టిపడేసి అట్టే పెడితే కాని, – ఆ ఎక్కు తగ్గలా! యిద్దరి తరఫునా తాను దీక్షపట్టి – ఆ సాధన ఏదో పరిపూర్తి చేయడానికి గంటయ్య కాశీ వెళ్ళాడు: అక్కడ అది పూర్తి అయితే, – యిక్కడ యీయన

మామూలు మనిషి అవుతాడుట: యిది జరిగి ఏణ్ణర్థం అయింది: మనిషిలో క్రమంగా మార్పు వస్తూంది: ఎప్పుడో ఓనాడు, ఉన్నట్టుండి– ఓ క్షణం యీ ఆలాపన: అది తప్పిస్తే మామూలు మనిషే.– వెనుకటి కథేం జ్ఞాపకం ఉండదు... అన్నాడు గోపాలం –

బాగుంది! – అన్నాడు తాను:

ఆ అనడం,– చిరాకుగా,– నిర్లక్ష్యంగా,–

గారడీవాడు, మూట విప్పినట్టు,– పొరుగూరి వాళ్ళను భ్రమ పెట్టడానికి, – యీ గ్రామం అంతా కట్టుకట్టినట్టుంది!–

పేకాటలో దివాళా అయిపోయి, – వెర్రెత్తినవాళ్ళు లక్షలు, – అలాటివాడే శేషయ్య, – దీనికీ కథ అల్లాడు గోపాలం!– అనిపించింది:... తండ్రిని వెర్రి వెధవాయను చేయడం యీ ఊళ్ళో కుర్రాళ్ళకు పరిపాటన్నమాట– వీడూ–

యింతసేపూ యీ మాట లేకితనంలో పడి, – ఎటు నడుస్తున్నదీ గమనించలేదు. కాని– వచ్చేశారు–

ఓ చిన్న తోట: ఓ చుట్టు గుడిసె, – ఓ చెట్టునీడను నులక మంచం మీద ఓ మనిషి!–

నిఖార్సయిన సోమరి,–

వెరిపించుకు తినే రకం,–

తన సుఖమే చూసుకొనే తత్త్వం–

యిలాటి వాళ్ళను తాను, శానామందిని చూశాడు: అవో రకం రెక్కల పురుగులు, – వీళ్ళు మనుష్యుల్లో జమకాదు–

'మా నాయనగారు!–' అంటున్నాడు గోపాలం: ఆ మనిషి యిటు చూశాడు: కాఫీ ఓ గ్రుక్కెడు త్రాగి,– 'ఎవ రీ ఆసామి?' అంటున్నాడు: ఆ గొంతులో మర్యాద అంటూ ఏ కోశానా లేదు: మదారు, తన సంగతి చెప్పాడు. – ఆయన త్రేణ్ఫులో కలిపి, – ఆహా! అన్నాడు, – వెంటనే తాను, – వెళ్ళొస్తానండీ! అనేశాడు:

పొదువుగాన్లే,– కూచో,–

కాసిని బెజవాడ కబుర్లు చెప్పు!–

యిటీవల దానికీ మనకూ సగమెరిక గాని–

కొన్నేళ్ళు,– మనకు హోటలు తిండే–

అప్పట్లో,– అఖిలాండమ్మని ఉండేది–

బహుశః నీవు వినుండకపోవచ్చు!

దాని తస్సాదియ్యా– అదో జగజ్జంత్రి!

ఒక్కతె పదిమంది మొగాళ్ళ పెట్టు !

మళ్ళీ,– ఆ లాలన! ఆ వగలూ!–

ఓహో!

కాకీ నక్కా కథల్లో పేదరాసి పెద్దమ్మేననుకో!–

ఆ పెట్టుపోతలు! భరద్వాజ విందే ననుకో – భరద్వాజ విందంటే... అర్థమయిందా?–...

అర్థమయింది–అసహ్యం వేసింది: మళ్ళీ కలుసుకుంటానండీ,– అని,– యిటు

తిరిగాడు - ఆ మనిషి, మాట్లాడలేదు.- తాను అటు చూడలేదు - గబగబ నడిచి వచ్చేస్తున్నాడు.

మా నాన్నది, అదో తరహా- అంటూ గోపాలం నసిగాడు: తనకు కసిగా నవ్వొచ్చింది! - తాను, యిలాటి మొగాలని ఎన్ని చూడటంలేదు?-

మనం, ఎటు?- అని మదారుని అడిగాడు:

మనింటికే!- భోంచేసిన తరువాత, ఆశ్రమానికిపోదాం,- అన్నాడు.- నీవు కూడా అటుకేసి రారాదూ?- అని గోపాలంతో అన్నాడు: అతగాడు తల ఊగించాడు! అక్కడ చీలిపోయినారు!

మదారు లోగిలి,-సలక్షణంగా ఉంది,-

యింటిముందు వసారా,-హాయిగా, కావలసినంత విశాలంగా: చల్లగా ఉంది,- యీతాకుల చాపలు వేసి ఉన్నాయి! ఓ దానిమీద నడుం వాల్చాడు-మదారు లోపలికి వెళ్ళాడు:

పడుకుంటే కునుకు వచ్చేట్టుంది- లేచి గోడకు ఆనుకుని కూర్చున్నాడు! ఆవలింతలాగా - ఆ ధ్యాస!-

చింతలతోపులో పడుకుంటే చీమకుట్టలేదు కాని- ఏటి పాయలో నడుస్తూంటే ఎదురుదెబ్బ తగిలిందిట!- అని అవ్వ అంటూండే సామెత జ్ఞాపకం వచ్చింది.

దూరపు కొండను నునుపనుకునే వెఱ్రివాడు కాడు తాను: అయినా భ్రమలో పడ్డాడు! తెలియకుండానే గొంతెమ్మ కోరికలు కోరాడు:

కొన్ని సంవత్సరాలు,- యీ మనిషి రాక్షసు డనుకున్నాడు: చివరకు శత్రు సంహారానికి బయలుదేరినట్లు, ఉమ్మసుమీద కదిలివచ్చాడు : మళ్ళీ అంతలో, నికృష్టపు బ్రతుకు బ్రతుకుతూన్న యీ మనిషిని,- దయాధర్మ బిచ్చంవేసి కాల్చుకు తిందా మనుకున్నాడు, కాని, ఆ కసీ నిలవలేదు:

యీ మనిషి,- ఒక ఆడకూతుర్ని అన్యాయం చేస్తినే అనే దుఃఖంతో, యిలా అయిపోయినాడు: తాను కంట పడగానే,- తల్లి పోలికలు చూసి, - నాయనా! అంటూ కౌగలించుకుంటాడు-తాను, ఎంతటి పాపకర్ముడైందీ ఏకరువు పెడతాడు- యిలా, యిలా అనుకున్నాడు-

అనుకున్నట్టు జరగలేదు,-

తన జన్మ-ఆయన సవాలక్ష నిద్రమత్తుల్లో ఒకటి,- బహుశః అమ్మ పేరు కూడా గురుతుండకపోవచ్చు,-ఎన్నడన్నా,- కొంచ గురుతుగా, వెకిలిగా జ్ఞాపకం రావచ్చు, అవును: అంతే!-అయితే, మనకూ యీ మనిషి - ఎవడో వెంకట్రామయ్యే!- అంతకు మించిన ఏ సంబంధమూ లేదు!

అప్పటికి ఒళ్ళు తేలికపడ్డది,-యిన్నాళ్ళ నుంచీ సలుపుతూన్న గుంజాటన తుడిచేసినట్టు మాయమైంది. తానేమిటి,- ఎవడో తలకుమాసిన వాడికోసం యింతదూరం రావడమేమిటి- అని నవ్వు వచ్చింది:

అంతలో మదారూ వచ్చాడు,- దగ్గిర కూర్చుంటూ 'ఏం భాయ్!- వెంకట్రామయ్యను తలచుకుని నవ్వుకుంటున్నావా?-' అన్నాడు: తాను ఔనని తల ఊగించాడు:

ఎలా ఉన్నాడు?-

జంతువల్లే!-

ఒక్క చూపులో పోల్చుకున్నావే!- మన అభిప్రాయమూ అదే:

యిలాటివాడిని ఊళ్ళో ఎందుకు ఉండనిచ్చారూ?

అదేం మాట భాయ్!- గ్రామం అన్న తరువాత- మనుషులతోబాటూ కుక్కా నక్కా కూడా ఉండాల్సిందే,- వాడిని ఎవరూ మనిషి క్రింద జమకట్టరుగా!- కాని, ఆ గోపాలం మొగంచూసి ఊరుకున్నాం గాని- కుర్రవాడు మంచివాడేనంటావా?-

అదేం మంచి?- వాడో దద్దమ్మ!- యీ తండ్రిని మెడనుకట్టుకు తిరగడ మెందుకూ?- గుడిసెలో కూడు తినేవాడికి కాఫీ జారవేయడమెందుకు?-

గుడిసె కూడు దిగదు భాయ్!- యింటికాడ నుంచి పోవలసిందే!-

ఆహాఁ!- అయితే ఆ యింటికి జన్మ శని! వీడికి రేపో వేళ పెళ్ళీ పేరంటం అయినా- ఆ పిల్ల చేత కూడా తండ్రికి ఊడిగం చేయిస్తాడన్న మాటేగా-

ఆ- పైకి అనా ఉన్నాడు కాని,- గోపాలం అంత తెలివితక్కువవాడు కాదు: తండ్రిమీద జాలీ దయా భక్తే కాదు,- మంట!- యిన్నేళ్ళొచ్చి యింత సిగ్గుమాలిన బ్రతుకు బ్రతుకుతున్నాడు కదా?- చేసిన పాపాలకి యింతే కావాలని-రోజుకు ఓ సారి ఆ మనిషిని చూసి కసి తీర్చుకుంటూ ఉంటాడు: అసలు లోపం అక్కడ కాదు. ఆ అమ్మ సత్తెకాలం మనిషి - ఆవిడ మనసు నొప్పించడమెందుకని వీడీ నాటకం ఆడుతున్నాడు కాని,-

అయితే, వీడికీ చెర తప్పిస్తే-

వాడికి-చెరకా దిదో చెలగాటం! తన మేలు- తనకు- తెలియనివాడు, కాదు: అవసరం వచ్చినప్పుడు వాడియిల్లు, వాడు చక్కదిద్దుకోగలడు! అప్పుడు-అయ్య ఊసూ అక్కరలేదు- అమ్మ ఊసు అక్కరలేదు,- తనదారి తనదే! అః! వీడు- అంతవాడు కాదనుకున్నావా?- నలుగురిచేతా మంచివాడనిపించుకునేందుకు,- కానరాని యత్నం చేసేవాడిని, ఓ కంట కనిపెట్టి ఉండాలంటాడు,- మా మోదీన్!...

అయితే,- యింతకు మునుపు, గోపాలం, యింద్రుడూ, చంద్రుడూ అన్నట్టు చెప్పావేం?-

లేదు భాయ్!- కుర్రవాడు మంచివాడన్నాను: అది యిప్పుడూ అంటాను: మా మోదీనుతో నడచిన కమామీషు,- పూసగుచ్చినట్టు చెప్పిందెందుకు?- నీవు, లో వైనం గ్రహించుతావని,- మన సుల్తాన్ అంటాడులే, - భూమ్మీద దేవతలుండరు: ఒకవేళ ఉండటం తటస్థించినా,- మనకు అలా నిదర్శనం యిచ్చినా,- రాయీ రప్పగా ఉంటారు కాని నరరూపంలో ఉండరు: మనిషయినవాడు,- మామూలుకన్న కొన్ని సుగుణాలు అధికంగా ఉన్నా, - ముప్పాతిక ముప్పీసం మనిషే- అందాకా ఎందుకు,- మన సుల్తాను భాయి మటుకు అంటీ ముట్టకుండా అల్లా ఉన్నా - వ్యాపారం ఓ కంట కనిపెట్టే ఉంటాడు: మన మోదీన్ మాత్రం - నూటికి తొమ్మిది పదులు,- వేదాంతంలో ఉన్నా,- ఆ పదిపాళ్ళూ,- అణా పైసలు మనిషే! - ఒక్క మాట గురుతుంచుకో - నేల విడిచి సాము చేసేవాడు, - జన మధ్యంలో ఉండడు, - ఉండవలసి వచ్చినా, - తామరాకుమీద నీటిబిందువు అంటారే - అలా ఉంటాడు: మాటవరుసకు, - మన సీతారామయ్య, చూడు-

యాధాలాభంగా, వీధికేసి, చూశాడు- ఆ బ్రాహ్మడు, అతి హడావుడిగా-

వస్తున్నాడు: రొట్టె నోట కరచుకొని, ముందు గున గున పోతూన్న పాండురంగని బ్రతిమాలుతూ వెంటాడుతూన్న నరసింహ మెహతాలాగా ఉన్నాడు: కనుల ముందు కేరింతలాడుతూ, – అందకుండా చెంగున ఎగురుతూ ఒక్కొక్క చిందుకు ఓ రకం నవ్వుగా, తిప్పలు పెడుతూన్న కిశోరమూర్తిని తరుముకు వస్తూన్న యశోదమ్మలాగా, – ఉన్నాడు: అదేం సాపత్యమని,– అంతలో నవ్వు వచ్చింది కాని,– అలా తేరిపార జూడగా,– రవంత బొద్దుగా, కానుపులు ఎడబడ్డ, అయినింటి కోడలల్లే–ఉన్నాడు: అంతలో, విదురుడల్లే,– మరో అడుగులో ఉద్ధవుడల్లే– మత్తుమీదున్న యాదవుడల్లే,–గుహుడల్లే–ఆ అచ్చంగా గుహుడికిమల్లే – ఉన్నాడు: ఏరా నాన్నా! – ఆకలిమీదున్నావా తండ్రీ!– దా– బువ్వ తిందువుకాని రా–మ్మ! అని బుజ్జగించుతూన్నవి,– ఆ కళ్ళు–!

అయ్యా!– అయ్యా!– వీడికోసం – మళ్ళీ తమరు రావడమా?– అంటూ చేతులు జోడించి– మదారు వంక చూడకుండానే ఆయన్ని వెంబడించాడు: మదారు– వెంట వస్తూన్నాడని,– అనిపించింది:

సీతారామయ్యగా రేం మాట్లాడలేదు. – కాని అలా సరసను నడుస్తూంటే సప్తాహంలో భజనపాళీలో ఉన్నట్టుంది–

వారి యిల్లు, అట్టే దూరంలేదు. – వీధి మళ్ళడమే! – చెరువుగట్టు – దానికి, కాస్త విసిరేసినట్టు – శ్రోత్రియులు తలో చెంపనా జపం మీదున్నట్టు – ఓ నాలుగు యిళ్ళు,– చివరి భవంతి – వీరిది,–

చెరువులో – వేదం స్నానం చేస్తూన్నది: ముగించుకుని – ఒడ్డుకొచ్చి, – యిటు సాగి వస్తూన్నది, – అదేం గొంతు? – ఆలయంలో ఉత్సవాలప్పుడు, – మేళతాళాలూ – గజ్జెలూ మువ్వలూ, గంటలూ కలసి మ్రోగుతూన్నట్టు,– ఉంది! – ఆయన,– శేషయ్యగారిలాగా – ఉహు లాగా ఏమిటి,–ఆయనే, – కాని – యింతకుముందు వాలకం?– అదో కల!– సిసలు మనిషి,– ఈయన– దగ్గిరకు వచ్చి,– మరింత దగ్గిరగా చూసి,– అబ్బాయ్! నిన్నెక్కడో చూసినట్టుంది?– అని పలుకరించాడు: తాను,– చిత్తం,– చిత్తం!– అన్నాడు:

నీ పేరే మన్నావ్?–

ఫలానా!–

కో–నయ్యా?–అహఁ–మనింటి పేరు?–

–చటుక్కున జ్ఞాపకం వచ్చింది. అవ్వ పుట్టింటివారి పేరు–

ఏమిటీ?– వేదులవారా?– ఆరి నీ యింటిముందు పెళ్ళిపందిరెయ్యా! వేదుల కోనావధాన్లంటే మా మేనమామ: కొండపల్లి,– మనిషి కలభం! – అంటే ఏనుగు గున్న,– తెల్లారి లేస్తే – శాలువ బుజానేసుకుని చిటుకూ చిటుకూ యిట్టె నూజివీడు వెళ్ళి వస్తూండేవాడు: మేకావారు ఘనంగా కనిపెట్టేవారులే! నువ్వు ఎవరబ్బాయివి?–

సీతారామయ్యగారి–

సీతారామయ్యా?– మనకెప్పుడూ తగల్లా! మీది ఏ ఊరు వేదుల?–

తెలియదు: తాను పుట్టి బుద్ధెరిగింది బెజవాడలో–

బెజవాడలో,– నాకు తెలియని–వేదులవారెవరు?– ఆ తలకుమాసిందుందనుకో – అది – వేదుల ఎట్లా అవుతుంది?– చూడు, – అఖిలాండమ్మని, – పూటకూళ్ళు

పెట్టేది! – పేరు విన్నావ్!–

వారి చేతి ప్రసాదం తిన్నానండీ!–

నీ వేమిటి?– నేన్ దిన్నానయ్యా।– అది– దాని రాత అలా అఘోరించింది కాని,– నా మేనమామ కూతురు: నూజివీటి ప్రభువులు అడుగులకు మడుగులొత్తిన వేదమూర్తి కడుపున పుట్టింది: కావడం నాకన్నా చాలా పెద్దదనుకో– అంటే నా ఉపనయనం నాటికే దానికి అన్ని ముచ్చటలూ తీరిపోయినాయి: మా మేనమామ – కావడానికి వేదశాస్త్రాల్లో ఆరమగ్గిన ముండావాడే, కాని–

ఆయన మాటకు సీతారామయ్య అడ్డం వచ్చి–

ఒరే నా తండ్రీ నీ మాటలు వింటూంటే, మన్వంతరాలు గడచిపోయింది తెలియదు। ఆకలిమీదున్నాడు: రెండుముద్దలు తినేదాకా.. రవంత నిదానించవూ.. అని బ్రతిమాలుకున్నట్టు అడిగాడు,–

శేషయ్య– ఎగిరి గంతేసినంత సంబరంతో– ఆహా?– వీడు మేస్తూన్నంతసేపూ నేను కూస్తుంటా ననుకున్నావేం?– పదరా అబ్బీ– అన్న ప్రయత్యభిసంవిశంతి – సరే నీ పక్కనే నా విస్తరి – ఒరే రాముడూ నీకు వండుకున్నది నేను మింగుతానని బెంగెట్టుకునేవ్? రెండు గోరు ముద్దలు పెట్టు చాలు!–

...యింటిదాకా.. వచ్చిన తరువాత గడప ఎక్కుతూ– అప్పుడు మదారు మాట జ్ఞాపకం వచ్చి– చూస్తే! – లేదు: వెంట రాలేదు: బహుశ! తానూ యీలోగా నాస్తాచేసి వద్దామని ఉండిపోయినాడేమో?

యిల్లంటే– బయటికి నదరుగానే ఉన్నా,– లోపలికి వెళ్ళగానే తెలిసిపోయింది: ఒంటరిగాడు,– తనపోషణ చూసుకోనివాడు, – ఉండే యిల్లు ఎలా వుంటుందో, – ఎలా ఉండాలో అలా ఉంది: ముందు చిన్న నలచదరపుసావడి, – గాలీ వెలుతురూ బాగా ఉన్నాయి! బూజూ బుట్రా లేవు: ధూళి కమ్మిలేదు: అలుకూ ముగ్గూ లేకపోయినా,– నరసంచారం ఉండేచోటల్లేనే ఉంది! కాని, – ఒంటరితనం ఓడిపోతూంది: ఏదో దిగులుగా గోడకు చేరగిలబడి, ఓ తంబురా, ఓ యీతాకులచాప,– గోడకో తగుపాటి కిత్తనారసంచి, చిన్న చందుగా పెట్టి, – చిరతలు, కాసిని పుస్తకాలు...

అక్కడ నుంచి, తలుపు త్రోయగానే,–పడమటిల్లు,– అది యిల్లుకాదు: దేవాలయం! – ఆలయం అంటే బస్తీలో, జనమధ్యంలో కోలాహలంతో కూడిన ఆలయం కాదు! హంపీవిరూపాక్షంలో,– కోణార్కంలో,– వేసంగిలో మల్లెతోట మీది పైరగాలిలాగా, ఆదమరపించే ఆనందం, – అద్గదీ!... శ్రీరామచంద్రుడు, సీతా సమేతుడై,– అదిగో అక్కడ ఉన్నాడు: అంతకుముందే పూజలు అందుకున్నాడు: అరుద్రా నక్షత్రమల్లే దీపారాధన, కానరాని గాలి తాకిడికి రవంత కళలు బోతూంది! శేషయ్య గొంతు జమిలి వీణెలు మ్రోగినట్లు,–పనస మీటుతూంది! అలా ఒక్కక్షణం!... చిటికెలో వడ్డన జరిగింది: పదార్థాలేమిటి? గుర్తులేదు,– అసలు గమనించనేలేదు: చిన్నప్పుడు– వేసంకాలంలో సంజెవేళ, చల్లబాటున అమ్మ తలంటిపోసినప్పుడు, – మాంచి ని'స్వరొచ్చి,– ఏదో వేళకు అమ్మ నిద్రలేపి అన్నం బెట్టినప్పుడు,– క్రమంగా మెలకువవచ్చి, – హాయిగా ఉన్నట్టు,– అచ్చంగా అలాగే ఉంది: తిండిమీద ధ్యాస తెలియలేదు,– కన్ను నిండేట్టు, ఎదురుగుండా, – రాముడు కనబడుతూన్నాడు, రామా లాలీ!... అంటూ తల్లి పాడుతూంటే, అద్దాలలో

పసిపాప అయినా – కాళ్ళూ చేతులూ, గిలగిలలాడుతూండటంలో ఉన్న పరమానందం – 'అంతా రామమయం!' అన్న మాటను – వేదవాక్యమల్లే తంబుర చిరుతలు రెట్టిస్తూంటే, వినేవాళ్ళను కమ్ముకునే పారవశ్యంలో ఉన్నటువంటి పరమార్థం, తనకు అప్పటికి అర్ధమయినట్లనిపించింది:

తాను, – శేషయ్యా, – కాళ్ళేతులు కడుక్కొనివచ్చి సావడిలో కూర్చున్నారు! ఒరేయ్ వేదులవారి చిన్నవాడా,– అడుగుదామనుకుంటూండగానే, వాడు, – మాటకు అడ్డంవచ్చాడు,– నీకు ఏమిటి వ్యాపకం?– పౌరోహిత్యమా,–

కాదు!–

అది నీ మొగం చూస్తేనే తెలుస్తూందిలే – నీడనుమేసే కోడిదూడల్లే ఉన్నావు: వెనకాతల పెద్దలు సంపాదించిన లప్ప ఏమన్నా ఉందా?–

లప్ప లేదు కాని– పెద్దల దీవెనఉంది!–

ఉంటే ఉంది– కాని – దాని సిగదరిగిరి – ఒరేవ్– అది– కుంటికాలు లాంటిది: మన్ని అంటిపట్టుకుని వేళ్ళాడుతూంటుంది కాని, దాని వల్ల రవంత ప్రయోజనం లేదు – మరి పొట్ట గడవడం ఎట్లా?–

భక్ష్యభోజ్యాలు విక్రయించడమనే మహాపాపం చేస్తూ తద్ద్వారా సంక్రమించే ఐశ్వర్యములో మునిగి తేలుతూన్నాం:

ఆఁ ఆరిభడవా?– దోరగా వేగిన గారెముక్కలాంటి ముక్క అన్నావు గదరా!– యింతకూ నీది అమ్మ పెంపకమా– అబ్బ పెంపకమా?–

అవ్వ పెంపకం?–

ఎవరా పుణ్యాత్మురాలు?–

–చెప్పడానికి కొంచెం తటపటాయించాడు: అవును – కావడానికి – వీరికి ఆవిడ మేనమామకూతురే అయినా, – వారి వారి అపేక్ష అంతఃకరణలు ఎలాటివో?– పేరు చెప్పగానే తుపుక్కున ఓ పొల్లు మాటంటే–...

ఆవిడ పుణ్యాత్మురాలే అంటారా?

అనటం– అల్లా యిల్లా కాదు,– భూనభోంతరాళాలు దద్దరిల్లేట్టు– అంటాను! ఓ మిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత... యీ పాకంలో గొంతు పలకాలి: లేకపోతే వినబడదు.– ఆ దేవతలున్నారే వాళ్ళకు బ్రహ్మచెవుడు! – ఆ తేజోమూర్తులకే కాదు – దేవాలయంలో పూజలు మరగిన ఆ పాషాణ ప్రభువులకూ అంతే– తంబుర తాళ మృదంగనాదములు దద్దరిల్లితేనే కాని, – వారి చెవికి ఆనదు– సరిలేస్తూ– దీనికేం గాని, ఆ– నే నింతకూ చెప్పవచ్చింది– అహఁ–ఆవిడ పుణ్యాత్మురాలే– తల్లీదండ్రీ పెంపకం తుడిచిపెట్టి దైవం వాడి బతుకు దగబోలుచేస్తే–పుట్టెడు దుఃఖమూ దిగమ్రింగి,– పసివాడిని మెడకు కట్టుకున్న మనిషికి త్రికాలములయందూ నమస్కరిస్తేచాలు,– వేరే జపతపాదులతో నిమిత్తం లేదు,– యింతకూ అవ్వంటే,– మామ్మా?– అమ్మమ్మా?

ఏదీ కాదు: ఆవిడకు సంతులేదు: మా అమ్మ దిక్కు లేక – ఆవిడ పంచన చేరింది: ఆదరించింది: మా అమ్మ,– గతించిన తరువాత, నన్నూ తన బిడ్డను చూసినట్టే చూసింది:

ఆహాఁ! ఉంటారురా! అయ్యా!– శిబి దధీచులను మించినవాళ్ళు,– యీ

దిక్కుమాలిన కలికాలంలోనూ ఉంటారు! మీ అమ్మ,- దిక్కులేక అక్కడ చేరిందన్నావ్!- అంటే,- నా అన్నవారు లేకనా?-

ఏమో - తన పుట్టు పూర్వోత్తరాలు, మా అమ్మ ఎన్నడూ చెప్పలేదు:

నీవు అడగనూలేదు! అంతేకాదూ?-

అడిగేంత గ్రాయకంలేదు!

అల్లాగా!- చిన్నతనంలోనే ఆ కరువూ వచ్చిందన్న మాట!- మీ నాన్నవంక వారి సంగతి?- అమ్మ చెప్పకపోతే మానె,- ఆ అవ్వ అయినా చెప్పలా!-

చెప్పలేదు: తెలియక చెప్పి ఉండదనుకుంటాను: ఒకవేళ తెలిసినప్పటికీ,- చెప్పే పరిస్థితీ లేదు।-

అనగా?-

అనగా,- అయ్యా, మీరు వేదమూర్తులు,- మీ వద్ద మాట దాచను।- అబద్ధం ఆడను!- కాని ఒక్కందుకు నాకు అభయహస్తం యివ్వాలి!- నేను మనవి చేసేది,- విని, వెంటనే మరచిపోండి।-

అదేం?-

అది- అంతే!-

ఓరి! ఓరి! చేదస్తం కొద్దీ కొండాడి,- నీ మనసు నొప్పించి నట్టున్నాన్రా! మనకున్న అవలక్షణాలకి తోడు- కొస వెర్రికూడా కద్దు।- కొన్ని సర్వసాధారణంగా మరచిపోవడమే అలవాటైంది,-కాని,- ఆ వేదమాత ఒక్కతే... అన్నప్పుడల్లా పలుకుతూంది- పోన్లే!- అది నాకు చెప్పనేవద్దు, ఏమో కళాకళల మనిషిని, బుద్ధి జాడ్యం!- మరచిపోదామని గట్టిగా అనుకున్నానో,- అది బుర్రలో ఎదురు తిరిగి- పనసచెప్పినట్టు బయటకు దూకితే?- నా మాటా పోతుంది।- నీ మనసు చివుక్కుమంటుంది।- ఎప్పుడో పుష్కరంనాడు, షష్టిపూర్తి చేసుకున్న యీ పుంధాకోర్, నేనింత చెప్పినా చివరకు యిట్లా చేశాడేమా అని నీవు అనుకోవడం మంచిదికాదు! కాని, ఒరేయ్! అనుభవం మీద చెపుతున్నాను కాని, మరొకటికాదు - కాలకూట విషం ఛప్పగా మింగేయడం,- ఆ సర్వేశ్వరుడికే సాధ్యం కాలేదు! గొంతులో నిలుపుకొంటే - బుర్ర వేడెక్కిపోయి- గంగను నెత్తినెక్కించుకుంటేనేగాని- మళ్ళీ దోవకు రాలేదు: అప్పుడన్నా, ఖాయంగా స్తిమితపడ్డట్టు దాఖలా లేదు: మధ్య మధ్య అది కుప్పిగంతులేస్తూనే ఉంటుంది: కనుకనే దారుకావనంలో చేసిన రభస - సముద్రమథనం వేళ, ఆ మహావిష్ణువును చూసి ఆడకూతురని భ్రమసి పెట్టిన రొష్టు,- వగయిరాలు,-మన చెవినిపడే దుర్యోగం పట్టింది! మహాదేవుడికే కాదు- మామూలు మనుష్యులకు కూడా,- ఆ విధివ్రాత తప్పడంలేదురా?- పై చూపులకు అందరూ మనుషులే,- కాని, సముద్రగర్భంలో బడబానలం ఉన్నట్టు, నీలాటి వాడికీ,- నాలాటివాడికీ, యీ కాలకూటం భరించడం తప్పడంలేదు- అవునురా! - నా బాధ నాకూ ఉంది:

పైకి,- వేదపండునేం-

కాని,-వివేక శూన్యుణ్ణి,-

జాలీ దయా లేని ఛండాలుణ్ణి।-

రాక్షసుణ్ణి! రౌరవాన్ని!-...

చబుకుతో కొట్టినట్టు మాటలేసి బాదుకుంటున్నాడు: మనిషికి వేళమారిందా

అనుకున్నాడు తాను,– సీతారామయ్య గారిని కేక వేద్దామని లేవబోయినాడు: కాని – ఆయన చేయొడిసి పట్టి– యివి వెర్రి చేష్టలనుకున్నావా?– కూచోఁ– కూచోఁ– ఆవేశం వచ్చినమాట నిజమే,–కాని కారణం ఉంది: ఎన్నేళ్ళుగానో రగులుతూంది,– ఎప్పుడో భగ్గుమనాలి కదా?– మీ అమ్మ, దిక్కులేక, – ఓ అవ్వ పంచను జేరిందన్నావు!– దిక్కుమాలడానికి కారణం,– ఆవిడ తండ్రేనేమో?– ఏం ఎందుకు కాకూడదూ?–

యిదో లాకాలూకీ మాటకాదు!

నా బ్రతుకే నిదర్శనం!

ఏయ్! మాట కడ్డం రాక!–

నా సొద,– విను!–

ఎందుకు వినాలంటావా?– నీ ప్రారబ్ధం!– త్యాగరాజంతటి వాడికి–బొబ్బిలి కేశవయ్య పాట వినాల్సి వచ్చింది,–

యిన్నాళ్ళయింది,– ఎన్నడూ గొంతు విడలేదు :

ఏటి కట్టుకు గండి పడ్డది,–

వస్తూంది,– ప్రవాహం!

నాకు,– ఒక్కర్తే కూతురు: మరి సంతులేదు! అక్కరలేదనిపించింది!– పుట్టి బుద్ధెరిగింది,– నట్టింటి శ్రీమహాలక్ష్మి–పెళ్ళీడు వచ్చింది,– మంచి సంబంధమే కుదిరింది– మంచి అంటే నా దృష్టిలో–మంచి,–చురుకైనవాడు, చూడచక్కని వాడు– కాని– అంగోస్త్రం మినహా ఆస్తిలేదు! వాడి నాయనా, నేనూ ఓ చోటే చదువు అఘోరించాం! వాడొచ్చి,– నా పిల్లవాడిని ఓ యింటివాడిని చేయరా!– అన్నాడు! సరే అనక ఏమంటాను?– కాని, నా చేత మెడకు ఉచ్చు వేయించుకున్న అర్ధణా అంత కుంకంబొట్టు ఆడకూతురుందే,– ఆవిడ ససేమిరా!–నా కూతుర్ని–సంభావనకు వెళ్ళేవాడికి యిస్తావా? ఉపాదానం చేసేవాడి గుమ్మం ఊడిపిస్తావా?– అని శివమెత్తి కూర్చుంది!–

నా కూతురు!– అని ఆవిడ రెట్టించడంలో, – ఓ చిన్న మడతపేచీ ఉంది!– అవును!–

ఏమిటే నీ వాగుడు!– నీ కూతురికీ నీ ఆనవాయతే వచ్చిందనుకోరాదూ?– నన్ను చేసుకుని, నీవేం చెడ్డావా?– రాణీలాగా సుఖపడ్డావా?– అంటూ నోరు చేసుకున్నాను: తన మాట నేను ఎలాగూ లక్ష్యం చేయనని,– మా బలగాన్ని ఉసికొలిపింది : నాది, రట్టమతమని అందరికీ తెలుసు!– అయినా, వాళ్ళు కలుగజేసుకుని,– అవతల లక్షణంగా ఆస్తిపాస్తులున్న ఆసాములు మేం జేసుకుంటామంటే–మేం జేసుకుంటా మంటూ ముందుకు ఉరుకుతూంటే– నీకీ మొండితనం ఏమిట్రా అన్నారు– నా చేత, తిన్నారు:

నా దొక్కటే జవాబు– నా పెళ్ళి నాటికి నాకేముంది?– నా ఆస్తిజూసి పిల్లనిచ్చాడా మామగారు? నాలో ఏ యోగ్యత ఆయనకంట పడ్డదో,–పిలిచి పిల్లనిచ్చాడు: పిల్లతోబాటు,– వారికున్న ఆస్తీ ధారపోశాడు! నేనూ అంతే,– ఎదుటివారి ఆస్తులమీదికి ఎగబడాల్సిన ;ం మాకేంబట్టింది?– మనకున్న ఆస్తి, వాళ్ళ పోషణకు చాలు!–

యిదీ మన వాదం!–

సలహా చెప్పవచ్చినవారు ఆపై నోరెత్తలేదు:

పెళ్ళి–జరిగిపోయింది.

పెళ్ళికూతురు తల్లి, – ఆ నాలుగు రోజులూ, చాటుగా మాటుగా కన్ను తుడుచుకుంటూనే ఉంది: అంపకాలప్పుడు,– యిహ ఉండబట్టలేక,– మీ నాన్న నీ గొంతుకోశాడే అమ్మా! అంటూ నా ఎదటనే బావురుమంది. పిల్లది,– నవ్వి ఊరుకుంది!

కుర్రవాడిని,–యిల్లరికం ఉంచుకోవలెనని మొదటి నుంచీ అనుకుంటూన్నదే।– తీరా ఆ తరుణం వచ్చేసరికి, వాడు బిర్రబిగిశాడు: అది తనకు పరువు తక్కువ అన్నాడు: యిక్కడ,– యిక్కడంటే యిక్కడ కాదనుకో,– మా ఆవిడ,– వాడు ఏనాటికైనా లొంగిరావలసిందేకాని,– పిల్లను మటుకు పంపేదిలేదని గుమ్మానికడ్డంగా కూచుంది: దీని జన్మ యింతేనా,– అడుగడుగునా రభసేనా అనిపించింది. పెళ్ళి విషయంలో స్వతంత్రించినవాడిని,– అప్పుడెందుకో బెల్లం కొట్టిన రాయల్లే ఊరుకున్నాను!– పిల్లది కళ్ళ ఎదుట ఉండాలని నాకూ అంతర్యంలో లేకపోలేదు– నెపం మా ఆవిడమీద పడినా,– ఉభయుల ముచ్చటా తీరుతుంది కదా అని ఊరుకున్నాను: అది శుద్ధ తప్పు!–

మూడు మాసాలైంది,–ఆరుమాసాలైంది:

ఎవరిపట్టుమీద,– వారున్నారు:

పిల్లది ముభావంగా ఉంది:

చివరకోనాడు,–

అంటే అవాళ శుక్రవారం–

ఎప్పటిలాగానే– తెల్లవారుఝామున, అమ్మవారిగుళ్ళో పూజకు వెళ్ళింది: వచ్చే వేళకు తిరిగి రాలేదు: కాస్సేపటికి, – కబురు తెలిసింది: దాని పెనిమిటివెంట అది వెళ్ళిపోయింది!– సందు దొరికితే, ఎంచులెట్టడానికి కాచుక్కూచునే సన్నాసులు,– ఆనాడు,– రుక్మిణే చేసింది,– యీనాడు యీవిడే తెగించింది! అని కొందరూ,– ఆ పేరు పెట్టినందుకు,– ఆ పాటు తప్పలేదు: పెనిమిటివెంట, అరణ్యవాసానికి వెళ్ళిందని కొందరూ,– పుట్టింది బ్రాహ్మణపుటక కాదా?– ఎంత, ఆలూ మగలైతే మటుకు, యింత అఘాయిత్యమా,– వాడికి ఎగ్గులేకపోతేమటుకు దీనికెలా సిగ్గులేకపోయింది?– అని కొందరూ,– పనసజెప్పడం మొదలుపెట్టారు: మనుష్యులనైజం అంతేగా మరి! నేనవేవీ పట్టించుకోలేదు: కాని, బయట పోరు తప్పినా, యింటిపోరు తప్పలేదు: పోయి, – వియ్యంకుడికింత గడ్డిపెట్టి, అల్లుడిని పట్టుకుని, ఆ చెంపా యీ చెంపా వాయించి,– యిద్దరినీ జుట్టట్టుకుని యీడ్చుకురమ్మని, హుకుమిచ్చింది : చెవులో జోరీగవతు– నిలవనీయందే,– పస్తులుంటానని బెదిరించింది: ఉంటే ఉండు – నేనుమటుకు ఉండలేను, – నీ వ్రతం ఉద్యాపన అయేదాకా, మళ్ళీ మన యింటో అన్నపూర్ణ తల్లి, ప్రత్యక్షమయే దాకా, – నేను తలో యింటా వారాలు చెప్పుకుంటాను: అని విన్నవించుకున్నాను:

అనడమే కాదు,– ఓ రెండురోజులపాటు,– అదో యోగం,–

అవయోగం!–

మూడోనాటికల్లా, మా ఆవిడ అన్నదాతలమీద విరుచుకుపడ్డది!

ఈయన ఆడిన ఆటకు తాళంవేసి,– మా కాపురానికి,– నీళ్ళు తోడుతున్నారంది!– అదో రద్దీకాదు!–...

పుణ్యానికి పోతే,– పూర్వజన్మలో కర్మ మెడకు చుట్టుకుందని,–

యీ పాదిత్యం మాకెందుకు?

సిగపట్లు పట్టుకోవాలంటే, యింటిపట్టున ఆ ముచ్చట తీర్చుకోవడం మంచిది: ఆలూమగల తగవుల్లో – అడ్డం వెళ్ళినవారు చెడ్డారు: అని పెద్దలు అనుభవంమీద చెప్పారు: అయినా,– ఎలాగూ వీధికెక్కారు గనుక,– యీ ముక్కలు అనక తప్పదు,– నిష్ఠురమే అయినా,– నిజం పలుకుతున్నాం:

మీ యిద్దరి వాలకమూ,– మాకు బాగుండలేదు:

ఉన్నది,– ఒక్క ఆడపిల్ల,–

దాన్ని కళ్ళల్లోపెట్టి చూసుకోవడానికి బదులు,– మీ రగడతోనే సరిపాయె,– బుద్ధి తెలిసిన పిల్ల కనుక,– మీ పుణ్యానికి మిమ్మల్ని వదిలి, దానింటికి అది, వెళ్ళింది: యిహనన్నా,– యింగితం తెచ్చుకుని,– చేసిన తప్పు దిద్దుకోండి,– లేదా,– జన్మంతా ఎడమొగం పెడమొగమే,– అంటూ అందరు తలో మాటా, అన్నారు: అనడమే కాదు! మీరు యిలా చేయడం– మన గ్రామానికి తలవంపులు!– అని కూడా మొగంమీద అనేశారు. అప్పుడన్నా, నేను కళ్ళు తెరవాల్సింది: లేకపోగా,– మా ఆవిడ నా కళ్ళ ఎదుట నలుగురిచేతా మెత్తగా చివాట్లు తినడం,– నాకేదో కనకాభిషేకం జరిగినట్లుంది:

ఆవిడ,– ఆపూటే ప్రయాణం కట్టింది:

ఎక్కడికి?– వియ్యాలారింటికి!–

అక్కడ నోటికొచ్చినట్టు పేట్రేగింది:

నా బిడ్డను నాకు కాకుండా చేసినవాళ్ళు,– బాగుపడరు!– అనరాని మాట అంది: ఆ కుటుంబంవారు సద్ధర్ములు: కనుక అంత మాట పడినా, మాట మిగలలేదు: కాని.. అమ్మాయే,– అనవలసిన ముక్క అనేసింది,–

నీవు తల్లివికావు,– నేను బిడ్డనుకాను:

యీ జన్మకు, నా కంట పడద్దు–పొమ్మంది!–

కాని,– యీవిడ కదిలితేనా,–?

అంతటితో,–దానికి ఒళ్ళు తెలియని శివమొచ్చి, తన్ని తరిమికొట్టింది:

యిహ నే నెలా తలఎత్తను?

బిడ్డమొగం ఎల్లా చూడను?

యీ నిత్యాగ్నిహోత్రాన్ని, ఎంతకని భరించను?–

ఆవిడ సిగ్గుమాలిన శిఖండికనుక,– యింటికి తిరిగివచ్చి,– ఆఁ ఆవిడ నోరెత్తేలోపల నేను ఊరువిడిచి పారిపోదామనుకున్నాగాని – ఊరి పొలిమేరనుంచే పొల్లు కేకలెట్టుకుంటూ,– జనాన్ని పోగుచేసుకుని, యింటిమీద పడ్డది. అదో అమ్మవారి జాతర!– నేను పిడచగట్టుకుపోయి, వినాల్సినవన్నీ విన్నాను– పడాల్సినవన్నీ పడ్డాను: దారుభూతో మురారిః,– అన్నట్టు కొయ్యబారిపోయినాను: కాశీలో– కొన్నాళ్ళకుగాని,– మనిషిని కాలేదు:

అల్లా అయిదేళ్ళు,

ఏటా బదరీయాత్రకు వెళ్ళేవాడిని,–

ఆ ఏడు, – ఓ సన్యాసి,– తగిలాడు!–

ఎవ రాతడు?– అల్లుడు!–

మా ఆవిడ చేసిన రభసతో,– మనసువిరిగి–వచ్చి; గంగలో దూకాడు – కాని – విశ్వనాథుని ఆజ్ఞ కాలేదు: ఎవరో సన్యాసి – కొట్టుకుపోతున్నవాడిని, – పట్టుకున్నాడు:

వాడికి అలా రాసి పెట్టి ఉంది: వాడి ముక్తి వాడు చూసుకున్నాడు:

మరి నా బిడ్డ గతేమిటి?–

అది–ఏమైంది?

ఒక్క పరుగున వచ్చి దేశంలో పడ్డాను– కాని–

నాకు ప్రాప్తం ఉండద్దూ?–

కొడుకాతీరైతే–కోడల్ని,– అమ్మా తల్లీ,– అని ఆదరించేందుకు, వాళ్ళేం ఋషులా?– ముందు తెలిసింది కాదు కాని, – అవతల ఆ బ్రాహ్మడిదీ నాలాటి సంసారమే!– ఆవిడది కానరాని గడుసుదనం!– అయితే ఒక్క సుగుణం!– ఏమాటకు ఆమాటే చెప్పాలి!– మంచికొస్తే– మహా మంచిది, – యివతల వాళ్ళు బిరుసెక్కారో, – ఆ పెళుసు అంతా యింతా కాదు: కొడుకు నిజంగా గంగలో కలిసిపోయాడనే అనుకుంది ఆ యిల్లాలు: నిజానికి పర్యవసానమూ అంతేగా –పిల్లవాడి కోసం – వాడి జాడ తెలియడం కోసం – తలకు మించిన ప్రయత్నమే చేశారు! వాళ్ళకు ఉన్నదల్లా – ఎప్పటిదో తాతలునాటి ఓ యిల్లు – అవసరానికి అమ్మజూపినా, – ఆ గుల్లను ఎవరు కొంటారు;– ఎంతకు కొంటారు;– వాళ్ళమీద జాలిపడి– గ్రామంలో నలుగురూ– తలోకాస్తా రాలిస్తే,– అది చేత పట్టుకుని;– అతగాడు– కాశీ వెళ్ళి– ఓ ఏణ్ణర్ధం దేవుళ్ళాడి,– చివరకు గుండె రాయి చేసుకుని కాళ్ళీడ్చుకుంటూ యింటికి చేరుకున్నాడు: అవును, – పోయినవాడు పోగా, యింకా కూనా గుజ్జూ ఉన్నారు: వాళ్ళకి పోషణ?– జోలె కట్టుకోవలసిందేగా?–

ఆయన తిరిగి వచ్చేసరికి,– యిక్కడ కోడలు లేదు!– ఏమైంది?–

చూడు నాయనా, – మంచికి పోతే, – చెడు ఎదురౌతుంది।

తాను – అలా – విడ్డూర్యంగా – కాపురానికి వెళ్ళడం – తల్లి వచ్చి లంకాయాగం చేయడం – తాను అలా ప్రవర్తించడం – ఒక్కమారు ఒళ్ళుతెలిసి పారజూసుకునేప్పటికి ఏమిటీ పుటక?– ఏమిటీ బ్రతుకు అని – ఎవళ్ళకన్నా – అనిపిస్తుంది। అందులోనూ నా బిడ్డ ఒకరంటిది కాదు: మా పెద్దలు చేసిన విద్యాతపస్సుకు,– నాకు లభించిన ఫలరూపం!–

జరిగిన దానికే,– వాపోతూండగా–మరో అవాంతరం వచ్చింది: పిల్లదాని ఆవేశం – ఆ కుఱ్ఱవాడు అపార్థం చేసుకుని, కన్నతల్లి మీదనే చేయి చేసుకున్నది – నన్ను మన్నిస్తుందన్న నమ్మకం ఏమిటి? – తిక్క తిరిగితే – పట్టుకు బాదేస్తుంది।– యీ మనిషితో, పొత్తే నాకు వద్దు! అని పట్టు పట్టాడు. పిల్లది కాళ్ళావేళ్ళా పడ్డది!– మా వాళ్ళ అవకతవకలు నాకు అంటకట్టద్దు– వారి కోప తాపాలతో నిమిత్తం లేకుండా,– మీరు నన్ను కోరి తెచ్చుకున్నారు: మిమ్మల్ని, – అంత మాట అనేసరికి, నాకు ఒళ్ళు తెలియక ఏం చేశానో, – నన్ను అంత మాత్రానికి ఓ రాక్షసి క్రింద కట్టకండి! – అజ్ఞానురాల్ని – బుద్ధులు చెప్పి దిద్దుకోండి!– అని పాదాలు పట్టుకుంది: కాని,– మనిషి మనసు మారలా!– మా ఆవిడలా చేయడం,– నేను ఆ చాయలకన్నా తిరిగి చూడకపోవడం– దానా దీనా– మా తరహాయే యింతేనని వాళ్ళు అనుకుని పోవడం కూడా– జరిగి ఉండవచ్చును: ఏమైనాగాని– ఆ దంపతులు– కలుగజేసుకుని సర్ది చెప్పి ఉండవలసింది. వాళ్ళు చూస్తూ ఊరుకున్నారు: వాడు, మొండికేసి పిల్లదాన్ని రెచ్చగొట్టాడు: దాంతో,– వీడు గంగలోన్నా దూకుతాను కాని, – నీతో కాపురం చేయలేననడం, – యీ పిల్లది గంగలో దూకినా కొంగట్టుకునే ఉంటానని మోరకించడం – దాంతో – వాడు,– ఏ నిశిరాత్రి వేళో,– దూసుకోనగ్గ

జరిగింది: అప్పుడు తెలిసొచ్చింది,- మా వియ్యంకుడిది,- ఎంత దొడ్డబుద్ధో! పిల్లదాన్ని పల్లెత్తుమాట అనకపోగా,- ఏదో,- మూర్ఖత్వం కొద్దీ అలా అన్నాడు కాని,- నిండు ప్రాణం తీసుకునేంత నిర్వేదం వాడికేమొచ్చింది? నిన్నగాక మొన్న - నిన్ను విడిచి ఒక్క క్షణం ఉండలేనని- నిప్పులు తొక్కిన కోతికిమల్లే - అలా చేసి ఎగనేసుకొచ్చినవాడు - ఎక్కడికి పోతాడు?- నేను పోయి రేపీపాటికి చెవి మెలేసి తీసుకురానూ? అని పిల్లదాన్ని బుజ్జగించి,- బయలుదేరాడు: వియ్యపురాలికి అంత ఓరిమి లేకపోయింది: వాడు తిరిగి వచ్చేదాకా,- మీ పుట్టింటికి వెళ్ళి ఉండమందిట!- ఈ పిల్ల వినలేదు: ఆవిడా రెట్టించలేదు: కాని,- మరో కుత్సితప్పని చేసింది: అని- నా అంచనా సుమా,- పాపం పుణ్యం నాకు తెలియదు: ఊళ్ళో ఓ ముసలమ్మ,- దీన్ని వెంటాడి, చెవి క్రింద సలుపు మొదలెట్టింది: నీ పుట్టింటివారు నిన్ను రొమ్ముమీన కట్టుకోక తప్పదు: నిజంగా నాడు అన్నంత అఘాయిత్యమూ చేసి ఉంటే:- అప్పుడు ఉన్న అగచాటుతోబాటు ముసుగేసి తరిమి కొడతారు,- కాని,- నిన్ను యిక్కడ ఉండనిస్తారా?- నిన్న మొన్నటిదానవు- నీ బతుకెలా తెలవారను?- ఎత్తింది మనిషి పుటకైనాక- పురుగూ పుట్రలాగా గాలి పోసుకునీ, ధూళి పోసుకునీ రోజులు వెళ్ళమార్చుకుంటామా?- కంట నీరోడుతూన్నా కడుపు తిండి కోరుతుంది,- ఒళ్ళు తెలియని దుఃఖంలో అయినా, ఒంటిమీద బట్ట తొలిగితే,- ఛెళ్ళున కొట్టినట్టు- సర్దుకుంటామా లేదా?- నేను,- యింతకిన్ని అగచాట్లు పడ్డదాన్ని గనుక,- చెపుతున్నానే తల్లీ - నే నొచ్చి మీ వాళ్ళకు అప్పగిస్తాను; దైవం రక్షించి నీ పసుపూ కుంఖం- చల్లగా యింటి పట్టుకొచ్చిందా,- అప్పుడు ఫెళ్ళుమంటూ మేళ తాళాలతో, సారె, చీరే పట్టుకుని ఊరేగుతూ వద్దువుగాని!- యిలా దువ్వి, బుజ్జగించి-ముల్లుకర్రపెట్టి పొడిచినట్టు- మాట నమిలి - ఎలాగైతేనేం కదిల్చింది: బండీ కట్టించుకుని రెండో కంటివాడికి తెలియకుండా బయలుదేరారు:

ఆ ఊరుకు- మన గ్రామం- నాలుగామడ పైచిలుకు:

సాయంత్రం ఓ ప్రొద్దు వేళకు - సగం దూరం వచ్చి - సత్రంలో పంచ చూసుకుని,- నడుం వాల్చారు: తెల్లారి చూస్తే,- పిల్లలేదు!-

ఆ ముసలమ్మ - కాస్సేపు లబలబలాడి: తన్ను తిట్టుకుని, - దాన్ని తిట్టి,- బండి వెనక్కు తిప్పించింది: అక్కడికి బెజవాడ మూడు క్రోశుల లోపు: ఒకవేళగాని- అటు పోయిందేమో అన్న ఆలోచనే రాలేదు. ఆవిడకి: ఒకవేళ వచ్చినా - ఎక్కడ వెతుకుతుంది - ఎవరి నడుగుతుంది?- యింతకూ,- ఆవిడకేం అవసరం?- యిలా కొంప మునిగినా, - అప్పుడన్నా మాకు కబురు చేయించలేదు:

నేను దేశం తిరగొచ్చేసరికి,- ఏముందీ?- యిదీ కథ-

అప్పటికి, - అయిదేళ్ళయింది,- ఎక్కడని ఆచోకీ తీయను?-

నేను, కాశీ నుంచి బెజవాడ చేరుకోంగనే,- కృష్ణరేవులో,- ఆ గ్రామం మనిషి తగిలాడు: ఆతడు యీ వైనం యావత్తూ చెప్పాడు: ఒక్కొక్క మాట వింటూంటే, లోతు చూసుకుని, అక్కడే మునుగుదా మనిపించింది - కాని - బిడ్డను ఎప్పటికైనా - కళ్ళ చూస్తానేమోననే ఆశ ఓ పక్కను పీడిస్తూంది! దాంతో మళ్ళీ ఒడ్డు పట్టాను:

అయితే పిల్లవాడి విషయం,- వాళ్ళకు కబురు చేయడమా మానడమా అని- కొంత మీమాంస పడ్డాను: ఛస్ - నా బిడ్డ బతుకు యీ తీరు జేసిన వాళ్ళమీద - నేను

జాలిదలచడం ఏమిటి?– అని ఓ మారు అనిపించింది, – కాని, అంతలో – ఆ పిల్లవాడు ఉన్నా లేనివాళ్ళలోనే జమ కావడానికి ముఖ్యకారణం–మూలకారణం నా చేతగానితనమే కదా,– యింకా యీ కపటం కావేషం ఎందుకు? ఎక్కడున్నా – వాడు బ్రతికి ఉన్నాడని తెలిసినా– కొంత ఉపశమనం కలుగుతుంది!– వాళ్ళకీ ఒక్కగానొక్క మొగపిల్లవాడు– అని– అనిపించింది: ఆ మనిషితో యీ కబురు చెప్పాను: అతగాడు – వాళ్ళకు చెప్పనంటాడే!– ఆ తలిదండ్రులిద్దరూ,– శాన్నాళ్ళు, నేలకంటుకుపోయి– యిటీవలే– మళ్ళీ మనుషుల్లో పడుతున్నారు!– యిదేం శుభ వర్తమానమని– మోసుకెళ్ళను: యిలా అయిందని తెలిస్తే– మరీ రంపకోత కాదా?– మీరూ, యీ సంగతి మనసులోనే మాపుచేసుకోవడం మంచిది!– అన్నాడు: నాకూ నిజమే ననిపించింది!

కాని,– నా బిడ్డసంగతి ఏమిటి?–

వారం రోజులపాటు పట్టణం అంతా గాలించాను:

ఆడకూతురు కనబడటం వ్యవధానం, మొగంలో మొగంపెట్టి చూశాను: దారినిపోయేవారు, వీడెవరో పిచ్చివాడనుకునేవారు: పవలంతా,– అలాతిరిగి, సంజెవేళకు,– కొండమీదకు వెళ్ళి – ఆ తల్లి దర్శనం చేసుకుని, మొరబెట్టుకునేవాణ్ణి, – తెల్లవార్లూ, అక్కడే పడుండి,– తెల్లవారి దిగివచ్చి,– కృష్ణలో మునిగి, – మళ్ళీ త్రిప్పట మొదలు!–

ఓనాడు, కృష్ణరేవులో,– మా అఖిలాండమ్మ కనిపించింది:

అఖిలాండమ్మ అంటే – మా మేనమామ కూతురని చెప్పానుగా,–

ఆఁ అన్నట్టు,– నీవూ అక్కడ భోంచేశావని అన్నావుగా!–

ఆవిడను చూసి,– అప్పటికి పుష్కరం దాటింది–

ఫలాని చోట ఉంటూంది,– ఫలానా పని చేస్తూంది అని,– బంధువులు యావన్మందికీ,– తెలుసు!– కాని,– ఆ రోజుల్లో అయినింటి ఆడకూతురు,– అలా చేయడం అనేది కనీవినీ ఎరుగని సంగతి!– ఆ మనిషి అలా తెగించడంతో – అందరికీ దూరమైపోయింది: నేనంటే పాపం, ఎంతో అపేక్షగా ఉండేది,– ఆవిడ మంచితనం, ధైర్యసాహసాలూ, నాకు తెలుసును.– కాని,– మా గీతలు అలా ఉన్నాయి!–

ఆవిడ– కనిపించడంతోనే,– కృష్ణకు వరదొచ్చినట్టు,– కన్నీళ్ళు కట్టలు తెగినాయి, – ఆవిడ, వెన్నుతట్టి,– యింటికి తీసుకువెళ్ళింది–

నా సొదంతా, ఏకరవు బెట్టాను:

అంతా,– సాంతం విని, బాగానే ఉంది!– అని,– అంటూ,– 'సరేరా!– నీ పుణ్యం బాగుండి,– అది,– కనిపించిందే అనుకో,– ఏం చేస్తావు?–' అంది!– 'పెళ్ళిచేస్తాను!' అన్నాను: ఆనాడు ఏలేశ్వరోపాధ్యాయులవారు చేయలేదా?– అని గొణిగాను: ఆవిడ ఒక నవ్వు నవ్వి, – 'ఓరి దద్దన్నా, – నీవు అంతవాడవు కావడానికి, – ఎన్ని జన్మలెత్తాలిరా!' – అని,–

ఒరే,– నీ నిర్వాకంతో నిమిత్తం లేకుండా,– ఒకవేళ, దాని మంచి– అది చూసుకుని ఉంటే, – అంది.

అంటే?– అని– ఉలికిపడ్డాను:

అంటే,– మాట వరుసకు, – గంతకు తగిన బొంతనే చూసుకుని, మనువు

చేసుకుని,– కడుపు ఫలించి,–

అక్కమ్మొదినా! – కథలల్లి – నా కన్నీళ్ళు తుడవకు, – నిజం తెలిస్తే, చెప్పు! – అని గొల్లుమన్నాను:

అయితే,– చేతులో చెయివెయ్యి,– అంది.

ఎందుకూ? అన్నాను:

చెప్పింది వినడం,– ఆపైన తరచకపోవడం– అందుకూ!– అన్నది. నేనప్పుడు నిప్పులుగుండంలో దూకమన్నా సిద్ధంగా ఉంటినాయెను: నా బిడ్డ క్షేమం తెలియడం కన్న నాకు మరేం కావాలి?–

'ఒరే,– నేను మాటవరుసకు అని, అంటినే,– అదంతా వాస్తవం!– నీ కూతురు, – ఆ ముసలమ్మను తప్పించుకుని, – రావడం, – యీ ఊరే వచ్చింది: పడాలనే పడ్డదో, – లేక,– ప్రమాదమో తెలియదు కాని, – నేను యివతల యీ రేవులో, స్నానం చేస్తూంటే, – అవతల అల్లంత దూరాన, – రెప్పపాటులో ఆ గొడవ జరగడం,– ఎవరో ఒడ్డుకు జేర్చడం జరిగింది,– తీరా పోయి చూద్దునుకదా– యిదీ–

ఫలానా అని అప్పటికి తెలియదనుకో,–

మరి, – మన సయోధ్యలు అలా మండినాయిగా!–

నలుగురూ మూగడం, – తలో మాటా అడగటం,– ఆ పిల్ల బెంబేలుపడటం చూసి– నేను బుజ్జగించి, వెంటపెట్టుకొచ్చాను: దానికి, – ఎంత అభిమానంరా?– మొదట అసలు పెదవి విప్పందే,– చివరకు ఎలాగో, – సంగతి యావత్తూ రాబట్టాను: నేనెంత నల్లరాయినయినా, నాకూ దుఃఖం వచ్చిందిరా! ఒక్క కుదురులో పుట్టినందుకు,– మా గీతలు ఒక్కలాగే కావాలా అనిపించింది: మెట్టుకం ఒప్పించాను,. నా దగ్గిరే ఉంచుకున్నాను: నా బిడ్డే అనుకున్నాను: ఔనురా,– నా వెనక ఎప్పుడో పదేళ్ళకు భూమ్మీద పడకుండా, – ఓ రవంత ముందు అఘోరించి ఉంటే, – నన్ను నీకిచ్చి కట్టి ఉండేవారు! అప్పుడు, నీకూ నాకూ ఆ రాత తప్పేది కాదు: కాని,– అది తప్పినా, – నాకు యిది తప్పలా!– నన్ను అమ్మా అని పిలిచేదిరా,– తల్లిలాగానే,– చూసుకునేదిరా!– ఉన్నట్టుండి,– కొండకువెళ్ళి,– తల నీలాలిచ్చి వచ్చింది– నా బతుకులో నాకు ఏదీ విడ్డూరం అనిపించదనుకో,– అయినా, – యిదేమిటమ్మా, మనలో సిగపాయమటుకు యివ్వడం ఆచారం. అంతకన్న స్వామివారు కూడా– ఎక్కువ ఆశించరే,– అన్నాను: నన్నో అయ్యకిచ్చి చేశారు! ఆయనకు సుఖం లేకుండాపోయింది,– చివరకు, ఆయన గంగలో దూకే స్థితి వచ్చింది : స్వామిదగ్గిరకుపోయి ఒక్కటే కోరుకున్నాను: నా మూలంగా,– ఆయన ఏ అఘాయిత్యమూ చేసుకోకుండా, నన్ను మరిచిపోయి, తన బ్రతుకు తాను బ్రతికేట్టు అనుగ్రహించమన్నాను: నేనూ – నిన్నటివరకూ జరిగింది, మరచిపోయినాను : యిది మరో పుటక అంది! ఆ మాట నాకు నచ్చింది! దాని ధోరణే నాకు నచ్చిందనుకో!– తరువాత మీ అయ్యను చేపట్టడం,– ఓ మొగపిల్లవాడు కలగడం,– అంతా పునస్సృష్టే– దానికి రాసి పెట్టిన సుఖం, దానికి దక్కిందనుకో!– యింతవరకే– నేను చెప్పినా,– నీవు విన్నా!–వాళ్ళు ఎక్కడున్నారు,– ఎలా ఉన్నారూ,– నీకు అనవసరం!– అంటే, తెలియజెప్పడం అనవసరం! – దైవం ఎవరిని చూసే తీరున, – వాళ్ళను చూస్తాడు: మనం లోపం చేసినా, తాను చేయడు!– అని గురుతుంచుకో – యిహ యింటికిపోయి, – ఆ వెర్రిబాగులదాన్ని కనిపెట్టి చూసుకో!–

అంది:

అక్కడే,– ఓ పదిరోజులపాటు పడి ఉన్నాను. మనసంతా ఒకటే సముద్రమథనం అనుకో– లజ్జా అభిమానం విడిచి, – ఆవిడను బ్రతిమాలాను: కాని– ససేమిరా?– మరో ముక్క చెప్పలేదు:

తిరిగి వచ్చాను, యింటివద్ద– ఆవిడలేదు!

యిక్కడ ఓ ముసలమ్మ తాలూకు,– కొంపాగోడూ,– కొంతభూమీ,– వారసత్వంగా, – సంక్రమించింది: దాంతో– యిక్కడ స్థిరపడి,– ఓ ప్రేలెడు కుర్రవాడిని పెంపకానికి తెచ్చుకుంది: నవ్వనా ఏడవనా?– సరే మన కర్మం యింతే, – అని ఒక చోటే పడి ఉంటున్నాం: పిల్లదాని సంగతి– ఆవిడ అడగలేదు; నేను చెప్పలేదు,– లేదు– కాని, నా బాధ నాదే,– వాళ్ళు ఎక్కడున్నారు? ఎలా ఉన్నారు;– ఉన్నారా, లేదా, – వాళ్ళు పిల్లా పాపా ఏమైనారు: ఒరేయ్,– యివన్నీ తలచుకుంటే,– నాకు పిచ్చులూ వెర్రులూ ఎత్తవూ?– నీకు తెలియదేమో, – ఊళ్ళో ఎవరిని అడిగినా చెపుతారు! కాని,– అసలు విషయం– అమ్మతల్లికి తెలుసు, ఈ క్షణాన,– నీకు తెలుసు!

యిదిరా,– నా తండ్రీ– నా ఘోష–

నిన్ను చూసీ చూడటంతోనే– నా మనవడు యీ పాటికి వీడంతై ఉండాలి!– అనిపించింది, దాంతో యిక ఆగలేకపోయినాను: విన్నావు కదా, – ఒరే – నేనూ ఓ మనిషినే అంటావా?–

–శ్రీరామా!– శ్రీరామా!...

సీతారామయ్యగారు,– లోగుమ్మంలో, నిలుచున్నారు: శేషయ్యగారి దగ్గిరకు వచ్చి,– పసివాడిని చేరదీసినట్టు,– పొదివి పట్టుకుని – ఒరే శేషూ– మనం మనుష్యులమే,– ఆ తండ్రికి మనమీద ఎంతోదయ– ఎంతో ప్రేమ– వాడి ఆటలూ, ఆ ఆగడమూ మనకు అర్థంకావు: ముద్దుచేసినట్టే– చేసి– బుద్ధి వచ్చేందుకు– ఓ గుద్దు గుద్దుతాడు– మల్లెమొగ్గలతో – సూదులు గుచ్చినట్టు గుచ్చుతాడు!– వాడు ఆది మధ్యాంతరహితుడైనందువల్ల మనకీ– మన ప్రాప్తంకొద్దీ అంతవాళ్ళని చేస్తాడు– శ్రీ–సిరి,–: రా– రాజస తామసాలు: మ– మమకారం– వీటిని తొలగిస్తాడు: పెంపుచేస్తాడు! వారు,– ఏం చేసినా– మన మేలుకే – పాల పొంగుమీద, – గాలిపింజెమీద,– కాలు కదల్చకుండా,– పవ్వళించి ఉండేటటువంటి నాయన,– అవతారాలెత్తి, – అగచాట్లు పడటం ఎందుకు?– మనతో కలిసి మెలిసి ఉండేందుకు!– ముచ్చివాడు,– తాను చేసిన బొమ్మలు,– గంపకెత్తి,– ఊరిమీద అమ్మజూపుతాడు: ఈ పరంధాముడు,– తాజేసిన బొమ్మలతో గురువులతో,– తానాడుకుంటూ వాటికీ– ఆట నేర్పుతాడు:...

శేషయ్యగారు,– సీతారామయ్యగారి మొగంవంక చూసి– పకాలుమని నవ్వి,– 'ఈ ఊళ్ళో యింటికో వెర్రివాడు!' అంటూ చివాలున లేచి నిలుచుని,– 'ఏడ్చేవాడికి వేదాంతం చెప్పమని– ఎవడ్రా నీకు చెప్పింది? యిన్ని కబుర్లు చెప్పేవాడవు– నీవు చేస్తున్న దేమిట్రా? శ్రీరాములవార్ని,– అహర్నిశం,– దుమ్ములో ధూళిలో రాపాడుతున్నావు!– వా దంత అలుసై నాడుట్రా భడవా!– సవాలక్ష కోతుల్లో ఓ కోతి,– దానికి తెలిసినపాటి నీకు తెలియకపోయింది గదరా నా తండ్రీ!– ఆకాశమంత పారిజాత వృక్షం: దానిక్రింద ఓ బంగారుకొండ,– ఆ మేరుపర్వతం– మౌనంగా రామనామం గీ పెడుతూండగా– ఒక్కొక్క

నామానికి ఓ పూవు పూజగా,- శాశ్వత బ్రహ్మకల్పంగా,- రాలుతుందిరా!- అలా స్మరించరా!- అలా తరించరా,- నాయనా,-

హనుమా।- నీ బంగారు తళుకు, రవ్వంత మా మీద సోకనీ,- ఒక్కపూవు మామీద రాలనీ!...

శ్రీరామదూతమ్ శిరసా నమామి... సీతారామయ్యగారిచేత, తంబుర చిరతలు పలుకుతున్నాయి,- వెలపల మదారుకూడా-అదే ఉరవడిమీదున్నాడు: అలా,- హారతిచ్చినంతసేపు!- సీతారామయ్య,- విన్నవించుకుంటున్నాడు- శ్రీ మదాంజనేయ మూర్తికి,- తెలిసినపాటి నాకు,- ఎలా తెలుస్తుంది శేషూ,- అపారమైనటువంటి సముద్రంలో,- ఆకాశంలో జ్యోతులన్నీ ప్రతిఫలిస్తాయి,- కాని, ఏ చెరువో దొరువో,- అంతటి భాగ్యానికి ఎలా నోచుకుంటుందయ్యా!- సీతమ్మ తల్లి,- భూదేవి కుమార్తె!- చివరకు,- అవతారాంతమందు,- కనుచాటైనది. భూగర్భంలోకేకదా!- శ్రీరామునికి,- అలా ఒంటరితనం సంభవించినప్పుడు,- 11 వేల సంవత్సరాలు,- వంచిన తల ఎత్తకుండా,- భూమివంక చూస్తూ,- సీతా,- అని,- అదేపనిగా తలచుకునేవారని వ్యాసులవారు సెలవిచ్చారుకదా!- అంతకాలం,- వారి కటాక్షం ప్రసరించినందువల్ల,- భూదేవికన్న పుణ్యం చేసుకున్న వారెవరున్నారు।- అలా వారి నామం గుణించుకోవడం అపచారం కాదు,- వారు అనుగ్రహించిన విధానమేనురా, నాయనా!- ఆకాశమంత వృక్షం నీడను,- రామస్మరణ పేరుకుపోయిన ఆ మేరుపర్వతం ఒక్కటేకాదు: యీ గడ్డిపరకలూ ఆ నీడనే ఉన్నాయి...

శేషయ్యగారు,- అంత మనిషల్లా, యింత మనిషై,- చేతులు జోడించి,- తల ఊపిన ధోరణిలో చేతులు ఊపుతూ,- కళ్ళకు దిద్దిన కాటుక మొగమంతా పులుముకున్న పసివాడిలాగా,- మొగమంతా నవ్వుచేసుకుని,- ఔను!- అన్నట్టు తల ఊగించారు: ఒరే రాముడూ,- కాస్సేపు ఆ గుళ్ళో వాడిని తలుచుకుందామురా,- అన్నాడు.

కాస్సేపంటే,- ఎంతసేపు?-

ఏమో?- తెలియలేదు:

రాజగోపాలస్వామి వారిమీద కీర్తనలు।-

అన్నీ పనసతొనలు।- ఆ మాటలు తేనెచినుకులు,- ఆ పద-కట్టు,- స్వామివారి మెడలో వేసిన దొంతర- మల్లెల దండ।-

'ఈ కవిత్వం,- మా రాముడు కట్టినదే,-' అంటున్నారు శేషయ్యగారు: ఔను,- చెప్పనక్కరలేదు,- మల్లె తీవెనే,- మల్లెపూవు పూస్తుంది:

'ఒరే అబ్బాయి,- యిక నా దోవ నాది।-

ఊళ్లో ఉంటే కనపడు।-

లేదా,- మళ్ళీ వచ్చినప్పుడు కనబడు-'... అంటూ అక్కడి అడుగు, వీధిలోకి వేశారు:

మదారు,- లోపలికి తొంగి చూశాడు!-

'వచ్చి, ఎంతసేపైంది భాయీ-' అన్నాడు తాను:

'యింతకు,- ముందే।-'

'ఎంతకు ముందు?-'

మదారు నవ్వాడు,– 'పెద్దలు ఏదో సెలవిస్తూంటే,– మధ్దిన, మనం రాకూడదు భాయీ,– మామా,– మేము అలాపోయి,– మోదీన్‌దగ్గిర కాస్సేపు కూర్చుంటాము: నేను అటునుంచి,– పొలం పోయొస్తాను. మనవాడు,– దేవాలయానికి వస్తాడు!–'

'వస్తావుకదూ నాయనా,– కాస్సేపు వాడిని సేవించుకుందాం!–'

తాను తల ఊగించాడు.

'ఔనుగాని,– రాత్రికి,– ఏం పుచ్చుకుంటావు?'

'రాత్రికికూడా,– మిమ్మల్ని యిబ్బంది పెట్టడం–'

'అదేమిటి నా తండ్రీ!– నీవు యీ ఊరిలో ఉన్నన్నాళ్లూ,– నిత్యమూ,– యీ యింట శ్రీరామ నవమే!–'

'అయ్యా,– నేను మట్టిబెడ్డను,– మాణిక్యాన్ని కాను!– ఏనాటికీ,, యీ యింట నిత్యోత్సవమే,–'

ఒరే నాయనా,– వెలిబూడిదెకూ విభూతికీ ఏమిటి తేడా?– ఏం లేదు!– వినియోగానికి వచ్చినప్పుడు కాని దాని విలువ తెలిసిరాదు: నీవు నా కంటికి మాణిక్యానివే! ఒక్క విషయం చూడు,– నిన్ను చూడగానే, శేషయ్య,– యిన్నేళ్లుగా,– పడుతూన్న మూగబాధ;– బుడగ విచ్చుకున్నట్టు – పోయింది: ఆ జన్మకు,– అదే శాంతి!– అవునయ్యా,– యిన్నేళ్ళుగా,– ఒక్కచోట పడి ఉంటున్నామే కాని,– వాడి మనసులో యింత క్షోభ ఉందని,– ఎలా కలగంటాం? – వాడు ఉపాసించేటటువంటి ఆ వేదమాత, యిప్పటికి అనుగ్రహించింది కాబోలు!– నిన్ను చూసీ చూడటంతోనే,– యిక మనసు దాచ లేకపోయినాడు: ఏమోరా తండ్రీ!– నీవు యిలా రావడంవల్ల,– ఎందరికి ఎన్ని విధాల మేలు కలుగనున్నదో!– రాముడికి తెలుసు!– రాజగోపాలుడికి తెలుసు!– యింతకుముందు, తంబుర చేతబట్టి వారిని తలచుకుంటూన్నప్పుడు,– ఏదో లీలగా అనిపించిందిరా!– నిన్ను,– ఏవో కొన్ని, సంశయాలూ,– సందేహాలూ,– బుద్ధి తెలిసినప్పటినుంచీ వెంటాడుతున్నాయి! అస్తమానమూ వేధించకపోయినా,– అవి,– అలా అంటిపట్టుకుని, ఉండనే ఉంటున్నాయి!– నీవు యిక్కడకు వచ్చింది,– వాటి నివారణకోసమే!– నిన్ను వారు రప్పించింది,– అందుకోసమే!– అలా అనిపించింది నాయనా!– అది నిజమే అవుతుంది!– అయి తీరుతుంది!...

చిత్తమని ,– వినయానికి మరింత మొగ్గింది, తన తీరు–

'ఊఁ కదులుదాం,. పదండి!...' సీతారామయ్యగారు,– అదే,– నీర్కావి ధోవతి,– పైన అంగవస్త్రం,– వాటితోనే, బయలుదేరబోతున్నారు: వేరే నీమా జామా లేదు: తాను కూడా,– యిహనుంచి అల్లా ఉంటేయేం?– తినడానికి వచ్చినవాళ్ళు తన యిస్త్రీ మడతలు చూసి వస్తున్నారా–

తలుపు దగ్గిరసా లాగి,– గొళ్ళెం పెట్టారు:

తాళం అవసరం లేదు: లోన ఉన్నవాడు,– శ్రీరాముడు!–

ఒరే నాయనా!– ఒక్కమాట చెపుతాను!–

అది– నా మాట కాదు!–

వాడు నా చేత దిద్దించినదే!–

మనిషికి,– సంసార జంజాటన,– బంధు ప్రేమ – తన వారిమీద మరింత

మమకారం,– యీ తాపత్రయం ఉన్నదే, దాన్ని, సంయోగ వియోగాలనే కాకాసురుడు– సీతమ్మ తల్లి మీద చేసినంత ఓగాయిత్యమూ చేస్తూ ఉంటుంది! ఆ బాధ,– ఎవరికైనా తప్పదురా తండ్రీ!– అయితే,– మన మనసు,– వేసగిలో మజ్జిగ తేటలాగా,– శ్రీరామనవమినాడు,– ఆ నాయన నివేదనగా స్వీకరించేటటువంటి,– పానకంలా, ఉంచుకుందాం! వాడి చలువను,– క్రిందికి, గసి అంతా దిగిపోయి,– పైన తేటగా ఉంటుంది: అలాటి మనసు,– ఆ నాయన దయచేశాడని,– మొగం వంక చూసిన ప్రతి ఒక్కరికీ అట్టె తెలిసిపోతుంది: శ్రీమంతుల యింట పెళ్ళి పందిటిలో సదస్యంనాడు, క్రిక్కిరిసి ఉన్నవారందరికి,– సుష్టు అయిన సత్కారం జరిగినట్టు, నీ కన్నుపడ్డచోటల్లా,– కల కల్లాడుతూ ఉంటుంది!– అదే,– జన్మకు సత్యం,– ఈ జన్మకు నిత్యం,–

ఆదిశంకరులవారు ఏమన్నారు,–

చిరునవ్వు మోసులెత్తిన మోముతో,

ఆ మన్మధుడికన్న ఎన్నో కోట్ల రెట్లు చక్కదనంతో

వెన్నెల తళుకుదేరే కెంపుల జడలతో,–

వటవృక్షం మొగదల కూర్చుని ఉన్నటువంటి ఆ దయగల తండ్రిని, కనుల కట్టుకున్నాను!– అని కదూ!–

చూపు,– అక్కడ నిలిపితే,–

కనుల ముందున్నప్పటికీ,– యింక మరేదీ కనిపించదు: అంటే దేనిమీదనూ,– చూపు ఆనదు: మనసు ఆకట్టుకోదు! మరి ఏ ధ్యాసా ఉండదు!

ఏదో నా ధోరణిలో, తికమకగా, అంటున్నానేమో,– నేను చెప్పవచ్చింది,– అహఁ– వీడిమీద జాలిదలచి,– వాడు,– అంటే ఎవరు?– తామర రేకల కన్నులవాడు,– తళుకు చెక్కిళ్ళ వాడు,– రవల తళుకు పలువరుసవాడు,– నాణెమైన చిరునవ్వువాడు,– వేసీవేయని వేడుకలవాడు,– వెనుకంజలేని మొనగాడు,– గుహుడి పాటకు మెచ్చినవాడు,– శబరి తనం; తీయదనం,– కనుల కద్దుకొన్నవాడు,– పర్వతాల రెక్కలు నరికిన బల్లిదుడికి తమ్ముడై యుండి,– రెక్కలు తెగిన,– అక్కుపక్షికి,– తన తండ్రి చెలికాడని తర్పణ మిచ్చినవాడు– అడవుల వెంబడి తిరిగి తిరిగి,– ఆశ్రమ పదాల కమరత్వమిచ్చి,– సురలకు లొంగని పది తలల వానిని చులకనగా, గోట మీటి,– భగభగలాడే యింగలం కొలనులో సిగపూవు వాడక క్రీడించిన,– జనక రాజ రుషి తనయకు కైదండయిచ్చి,– భువనమ్ములు మేల్మేలని పొగడగ,– పూర్ణకాముడై,– సాకేతమ్మున సదా ప్రసన్నుడై,– కలకాలము కొలువుండేవాడు,– వాడు,– నా వాడు,–

శ్రీరామా!– శ్రీరామా...

మదారు ఎలుగెత్తి,– నామస్మరణ చేస్తూండగా,– సీతారామయ్యగారు,– గాలి మందగించినపుడు,– గాలిపడగ, ఆడుతూ క్రిందకు దిగినట్టు,– ఆ ఆవేశం క్రమంగా,– తగ్గుకుంటూ రాగా,– పసివాడు నిద్రలో కలవరించినట్లు,– శ్రీరామా అనుకుంటూ,– ఒళ్ళు తెలిసి,– కళ్ళు తెరచి,– అతిలేతగా, నవ్వారు:– 'మధురాధిపతేరఖిలం మధురమ్!–

ఒరే నాయనా,– చూశావుగా,– చూశావుగా,–

వసంతకాలంలో,– మామిడి తోపులో,–

చిగురుకో చిలుక,– కొమ్మకో కోయిల,–

రెమ్మకో తుమ్మెద,- వెరసి శ్రీరామ!-
నులివెచ్చని పుప్పొడి సేసలు జల్లంగ!-
పలువ గల గుమ గుమలు,- బరాబరులు సేయగా,
ఊరేగుతున్నారు, శ్రీరాములు!-

ఉత్సవంలో కలసిపోరా!- వాడి వెంట పడి పోరా!- సీతారామయ్యగారు - తన వెన్ను తట్టినారు:

ఆగితే,- ఆశలు పట్టి పీడిస్తాయి:
ఆలోచిస్తే,- సంశయాలు చెలరేగుతాయి:
అదీవద్దు,- యిదీవద్దు,- అలా సాగిపోతూండు!
రాముడి పరివారంలో జేరినవాడిని,
రాగద్వేషాలు - ఏం జేస్తాయి నాయనా!-

యిల్లు విడిచి,- నాలుగడుగులు వేశారో లేదో,- అంతే,- నడక సాగలేదు: సీతారామయ్యగారి ధోరణి ఆకట్టుకుని,- నిలవేసింది: యింతసేపూ చెరువుగట్టుమీదే ఉన్నారు:

'సరేగాని,- రాత్రి భోజనం మాట?'- అంటున్నారాయన!- మునుపైతే,- నవ్వొచ్చి ఉండేది: కాని, యిప్పుడు నవ్వులేదు,- చిరాకూలేదు:

ఆట విడుపు!-

అంటే!-

మా ఊళ్ళో ఉంటే,- తెల్లవారు ఝామునుంచీ,- చెంబూ తప్పేలా చప్పుడే- శ్రీరామ స్మరణైపాయె!-

పళ్ళు తోమినవాడూ,- తోమనివాడు,- నిద్రమొగం వాడూ,- ఆవులించేవాడూ, దగ్గేవాడూ, - తుమ్మేవాడూ, కాండ్రించేవాడూ, త్రేన్చేవాడూ,- తెల్లవారిలేస్తే,- కళ్ళకు కట్టేది,- యీ దేవతలు: గల్లాపెట్టిమీదే కన్ను కాని,- ఎదురుగుండా,- బల్లల ముందు రెడ్డిగం వేసిన మనుషులూ,- ఎంగిలిమీద మూగే యీగలూ మాకు ఒకటే,- వాములదొడ్లో అయినా కాస్సేపు రద్దీ రవ్వా ఉండదు: మూగజీవాలంటివి,- వేళ జూసుకుని కాని ఎగబడవు!- మనజాతి అట్టాకాదే,- వీటికో వేళా పాళా అంటూ లేదు: ఎప్పుడూ మేతే!- ఎదురుగ్గుండా బల్లవేసుకు కూచున్నందుకు,- ఎంగిలి పళ్ళేలవంక చూస్తుండటం మేం జేసుకున్న పాపం!- ఓ రబ్బ! యింత గ్రంథం చదువుతున్నావేగాని,- మరి దాన్నే పట్టుకు ఎందుకు ప్రాకులాడుతున్నావ్!- పుష్కలంగా డబ్బొచ్చి ఒళ్ళో పడుతూంటే,- ఎంత కశ్మలమన్నా భరిస్తావ్! అంటారా;- అంత ఊహ లేకపోయినా,- అది కొంతవరకు నిజమే!- డబ్బు పోగుచేసి,- ఏవో ఘనకార్యాలు చేయాలనే తెలివితక్కువతనం కొద్దీ,- యిన్నాళ్ళూ,- యిన్నేళ్ళూ,- కాళ్లా చేతులా ప్రోగు చేశాను: రశ్మి రాగోరుతుందని,- పెరిగిన కొద్దీ యింకా పెంచాలనే అనిపించేది:

నా తెలివితేటలూ,- నా అనుభవం,- అంతే!-

అంతవరకే!-

పూట కూటింట పుట్టాను!- పుట్టినప్పటినుంచీ,- యిప్పటిదాకా ఒక్కతీరునే ఉన్నాం! నాకు లోకజ్ఞానం అంటూ ఏదీ?- అంటూ సొంటూ లేకుండా,- ఎంగిళ్ళమధ్య

బతకడంలో, అన్నద్వేషం మటుకు పుట్టింది కాని, అసలీ పుట్టకలోనే, ఏ మూలనో పిసరంత పుణ్యముందేమో, డబ్బంటే కాపీర్నం లేదు: పోగుచేసిందంతా కట్టుకుపోదామని కాదు,- మేడలూ మిద్దెలూ కట్టి,- ఓ వెలుగు వెలగాలనీ లేదు: కాని,- యీ బ్రతుకు ఎలా దిద్దుకోవాలో,- తెలియదు, అంత యింగితమూ లేదు: అలా,- గుడుగుడు గుంచంగా,- గడిచిపోయింది- యిక్కడికి-యిన్నాళ్ళకు.-రాగలిగాను: అహఁ నేను రావడమేమిటి నా మొగం! నడ్డి నీలుగువాణ్ణి!- వాడు,- రప్పించాడు!- మీ చేత చెప్పిం చాడు:

నాకు, యిప్పుడు,- సంశయాలు లేవు,- సందేహాలూ రావు!- ఉత్సవంలో కలిసిపోయినాను।- నాకు ఆ ప్రాప్తము ఉంటే,- ఊరేగింపు వెంటనే ఉండిపోతాను!-

అయ్యా,- యిది ఆవేశం కాదు.

అతి వినయం కాదు!-

యెన్నడో పూసిన పూవు, యిన్నాళ్ళకు పరిమళించింది:

యీ క్షణంనుంచీ, నేనూ ఒక మనిషిని!

అనవసరమైన వాటిని, అర్థం చేసుకునేందుకు పెనుగులాడటం,- ఎంత అవసరమో, యిప్పటికి స్పష్టంగా తెలిసొచ్చింది!

'ఆ రాముడి, నీడనున్న, యీ రాముడు- వీడిని ఉద్ధరించాడు,'- అంటూ తాను నవ్వుకుంటూ నమస్కారం చేశాడు!

ఆయన,- తనవంక చూడటం లేదు:

సూర్యుడికి నమస్కారం చేస్తూ, ఆత్మ ప్రదక్షిణం చేస్తున్నారు: మదారు,- తనకు సైగ చేశాడు,- 'మనం పోదాం' రమ్మని- 'వారుకూడా వస్తారుగా',- అని తాను మరో సైగ- ' ఉహుఁ- రాడు:' అని అతగాడు, విసురుగా మారు సైగ చేశాడు!

సరే,- ఆలయంలో, ఎలాగూ కలుసుకుంటాంగదా, అనుకుని,- అడుగు, తీసి అడుగువేశాడో, లేదో,- దూరాన్నుంచి, ఖంగ్ - ఖంగ్ మంటూ వినిపించింది: ఆలయం వేపునుంచోమోననుకున్నాడు,- కాని,- అట్టె ఆలకించగా అలా అనిపించలేదు! గుఱ్ఱపు సారటుకు ఉండే గంట: కాలితో నొక్కితే ఖంగ్ మంటూందే- అది! పదే పదే,- అదేపనిగా మ్రోగుతుంది: అటు ఎటో ఎగువకు పోతున్నట్టుంది, అంతలో ఆగిపోయింది:

ఓ నాలుగుబారలు నడిచారో లేదో,- మళ్ళీ, మొదలైంది: చేరువకు వస్తూన్నది!

'సీతారామయ్యగారి మనుమడు వచ్చాడు: వారి సొంతబండి: ఆలయం దగ్గిర ఆగి, నమస్కారం చేసి,- యిటు వస్తాడు: అదే అలవాటు!-' అంటున్నాడు మదారు:

'ఎన్నాళ్ళకోసారి వస్తూంటాడు!-'

'తరచు!- ఎప్పుడు బుద్ధి పుడితే-అప్పుడు!-

చేతిలో అలాటి బండే ఉంటే,- అక్కడికిక్కడికి,- కూతవేటు దూరం! మనం చాలాసార్లు పేటకు పోయొచ్చామ్‌గా!- ఆ కుఱ్ఱాయన చూడవలసినవాడు!-'

'తాతా మనుమల నందున మనమెందుకు లెద్దూ!'

'అయితే,- తాత తెమిలి వచ్చేదాకా,- మనమడు, యివతల నిలుచుని జపం చేయాల్సిందే,- మనం ఉంటే,- కాస్త కాలక్షేపం!-'

'అలా యింకెంతసేపు, ఆ జపం!'

'నిమిషం కావచ్చు,- గంట కావచ్చు!-'

'అంటే దానికో పద్ధతి అంటూ లేదా?-'

'ఉండే ఉంటుంది- ఆయన బతుకే అదో పద్ధతిమీద నడుస్తూంది: కాని, మనకి ఆకళింపు కాదు-'

'పలకరిస్తే-?'

'భజంత్రీలు మోగినా,- అంతే,-'

'నిత్యమూ,- యింతేనా?'

-బండీ,- మలుపు తిరిగింది,-

బండీ,- సీమబండీ,- దంతప్పెట్టెలాగుంది!

అది, గుర్రం కాదు, హంసే!-

మాడుపట్టున,- నెమలికున్నట్టు, తురాయి! బండి ముందు,- ఎలిసెకట్టినట్టు ఉంది, దానిమీద, బండివాడూ, వాడి పక్కన దిక్కులు చూస్తూ మరోహాడూ,- బంట్రోతు కాబోలు,- కూర్చున్నారు:

బండి, తమకు - అంతదూరంలో ఆగింది:

బంట్రోతు ముందు దిగి,- తలుపు తీశాడు:

ఆయన,- బయట కాలుపెట్టాడు!- వయసుకు మించిన ఉషారుగా ఉన్నాడు,- అయినా, కుర్రవాడు...! ఆ లేతదనం, ఆ బుగ్గలు చూస్తేనే తెలుస్తూంది!- ముమ్మారు, వాసన సబ్బుతో తోముకుని,- పన్నీరుతో తొరిపిన గోరువెచ్చని నీళ్ళతో, స్నానంచేసి,- సంపంగి నూనె మెరుగున తల దువ్వుకుని,- అత్తరువు సుతారంగా, చెంపలకు రాసుకుని,- కస్తూరి తిలకం దిద్ది-... కుడితినీ వేసుకున్న భామ వేషగాడల్లే ఉన్నాడు: వాళ్ళ తల్లి, ఆడపిల్లకు మొగం వాచినందువల్ల,- ఆ పోషణ మీద వీడిని పెంచడంతో,- వయసుతోబాటు,- వంపులు దేరకపోయినా,- ఆడుపోడిమి- ఆ మొగాన కొట్టొచ్చినట్టు కనబడుతూంది!- ఛస్,- వీడా,- సీతారామయ్య మనవడు! ఆయన దగ్గిరకు చేరదీయని కారణం,- యిదన్నమాట!-

ఏమండీ మదారు సాయేబుగారూ!- అని పలుకరించాడు: భామవేషం,- ఏమో, ఓయమ్మా!- అని సాగదీసుకున్నట్టు,- వీడిని,- మన ఊరు తీసుకువెళ్ళి,- మోకాలు దిగని అంగవస్త్రం కట్టించి,- ఓ యేడాదిపాటు,- పప్పు రుబ్బిస్తేనేకాని ప్రజల్లో పడడు:

'ఏమిటి విశేషాలు!- తాతగారు,- యిటు దయచేసేదాకా,- కాసిని కబుర్లు చెప్పండి!-' మేళతాళాలు మినహా,- మేజువాణి గొంతు!-

మదారు,- మునిపళ్ళతో,- యికిలించాడు:

'మన గ్రామంలో,- మీకు నచ్చే, కబుర్లు ఏమి ఉంటాయి అండీ?- వానాకాలంలో,- బురద,- ఎండాకాలంలో దుమ్మూ ధూళీ- అంతేకాదండీ!- మీరు,- తాతగారు ఉన్నారు కనుక,- తప్పనిసరిగా, వస్తూన్నారు కాని,-'

'ఏమండోయ్,- సాయెబుగారూ!-'

గొంతు మారింది: కవళికే మారింది।

బ్రాహ్మ్యం,- క్షాత్రం,- రెండూ తూచినట్టున్నాయి!-

'మీకు,- కళ్ళముందు ఎప్పుడూ కనబడేవి,- గడ్డి పరకలు కాబట్టి,- వాటితో

మమ్మల్ని జమచేయకండి!– నేను,– బస్తీలో ఇస్త్రీ చాక్కావాడిని కాను,– మీ సీతారామయ్యగారి మనవడిని,– మీ వాడిని!–

నేను,– తప్పనిసరిగ్గా,– ఏదీ చేయను:

నా మనసుకు మంచిదని తోచిందే – చేస్తాను!–

మీ శ్రీరాములు కొడుకుని!– అది మరచిపోరుకదూ?

నాది,– యీ ఊరు: బందరు కాదు:

మా నాన్న,– ఆ యింట్లో పుట్టాడు:

ఆయన చేతుల్లో – పెరిగాడు.

మీ కళ్ళ ఎదుట – పెరిగాడు:

ఔనా?–

ఏవండీ, సాయెబుగారూ!–

మీరందరూ,– చాలా మంచివారు!–

ఆ మంచి,– అంతా యింతా కాదు!–

ఆ మంచితనమే,– మా కుటుంబాన్ని యిలా చేసింది,–

సీతారామయ్యకీ,– శ్రీరాములికీ, మాటా మాటా వచ్చింది!

యిద్దరూ,– మొండికేశారు!–

తండ్రీ కొడుకుల తగాయిదాలో!– మనం తలదూర్చడమెందుకని మీరు చూస్తూ ఊరుకున్నారు।– సరే, పోనీండి.

ఆ కొడుకు అర్థాంతరంగా అంతరించాడు:

కొడుకుతోబాటు, కోడలూ పోయిందా?–

ఒక్కసారి వచ్చి పలుకరిస్తే– తనకు పరువు తక్కువా?– బ్రాహ్మణీకం తగులబడిపోతుందా?–

ఆయనకు జాలీ దయా లేవని కాదు:

కాని, ఆ దుఃఖంలో ఆయనకు మతిపోయింది–

అయినా,– ఆ పట్టు – పట్టే!–

వీరి ధోరణి,– మీకు ఎలా వుందో కాని,–

ఏడవటానికి బిడియపడి,– సంగీతం పాడినట్లుంది!–

తుమ్మొచ్చినా దుఃఖమొచ్చినా,– ఆపుకోడం మంచిదంటారా?–

అదో, మహా ఘనకార్యమంటారా?–

మదారుసాయెబుగారూ,– యిది, తలబిరుసుతనం అనుకునేరు!– తపనండీ!–

మనిషై పుట్టి, మనుషుల్లో మెలుగుతూన్నందుకు,– తానూ,– మామూలు మనిషల్లే,– అయినవాళ్ళకు, అందుబాటులో ఉండటం మాని,– రాముడిమీద వంకబెట్టి, యిలా గుంట ఓనమాలు దిద్దుతూ, ఉండటం బాగుందంటారా?– తానొక్కడు కాదు టండీ,– మాకు మిగిలిన పెద్దదిక్కు!– 'మాకీ పుట్టువునను పాండుక్ష్మాపాలుడు నిన్ను చూపి చనియె మహాత్మా।–' అని భారతంలో చెప్పలేదుటండీ!–

తాను, ధర్మదేవత కొడుకు,– సకల ధర్మ స్వరూపుడు,– మిన్ను మీద పడినా చలించనటువంటివాడు,– అలాటి వాడికే,– కష్టసుఖాల్లో కనిపెట్టి చూసేందుకు

పెద్దదిక్కంటూ అవసరమైందే,– ఆ విధంగా శ్రీకృష్ణుడితో విన్నవించుకున్నాడే,– మేం, అతి సామాన్యులం: మాకు ఆదరించేవారంటూ లేకపోతే,– ఎలా, గడిచి బ్రతుకుతామండీ!– నేను మా తాతయ్యను బజారున పెట్టి పంచాయతీ చెయ్యడం లేదండోయ్! యిదీ, నా బాధ!......

కన్నీరు,– ధార కట్టింది!...

తాను,– అలా కళ్ళప్పగించి చూస్తున్నాడు:

సీతారామయ్యగారు,– సరసనే ఉన్నాడు: వెర్రిగా నవ్వుతున్నాడు: వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు:

'తాతయ్యా!–' అంటూ అతడు కౌగలించుకున్నాడు:–

'నేనూ మనిషినే - కాని,– గుండె,– రాయి– నల్లరాయి!– నాయనా!–' అంటున్నాడు ఆయన:

'కాదు,– నవనీతం: నీ బిడ్డ అక్కడే పెరిగాడు: పసివాడు ఆడుకునే చోట రాయీ రప్పా ఉంటుందా, తాతయ్యా!– మళ్ళీ ఆ సుఖం కోసం,– మూడు రోజులనాడు,– దిగొచ్చాడు,– నీ కొడుకు!'

సీతారామయ్యగారు,– రావాకుమల్లే ఊగిపోయినారు!–

–'అవును తాతయ్యా!– యివాళే పథ్యం పెట్టారు:

మీ మామగారేనే అమ్మాయ్!– అంది మా అమ్మ–

బుల్లి సీతారామయ్యగారు,– నిన్ను రమ్మన్నారు:

వచ్చి,– నామకరణం చేయించు!–

అమ్మతల్లికి,– విన్నవించాను: రాజగోపాలస్వామి వారికి మనవి చేశాను: నీవు నా వెంట బయలుదేరి రావాలి!–

మనకోసం, బుల్లివాడు,– గుమ్మంలో కూర్చుని ఉంటాడు: నిన్ను చూస్తేకాని,– బువ్వ దినడు? ఔను వాడిదీ,– నీ అంత గట్టిపట్టే!–

తిథి వార నక్షత్రాలు అన్నీ బాగున్నాయి:

వర్జం లేదు:

మనకు ఉభయులకూ క్షేమతార,–

పురుడు వెళ్ళేదాకా,– యిక్కడ దేవతార్చన మన వాళ్ళెవరైనా – చేసేట్టు, ఏర్పాటు చేయి:

పిల్లవాడికి మూడో నెల జొరబడగానే,– మంచిరోజు చూసి మమ్మల్ని యిక్కడకి రప్పించు,

రప్పించూ. అని ఎందుకంటున్నానంటే,– నిన్ను అన్నాళ్లు అక్కడ ఉండమంటే ఉండవు: ఒకవేళ నిర్బంధించినా,– నీ మనసంతా,– రాముడిమీదే,– రాజగోపాలస్వామి మీదే ఉంటుంది:

నీకు అలాటి నిర్బంధం ఏమీ లేదు!

బారసాల కావడంతోనే, నీవు యిక్కడికి వద్దువుగాని: యీలోగా మన వాళ్ళెవరైనా,–యింటికి సున్నం కొట్టించి, పుణ్యాహవాచనం చేయిస్తారు:

యింటికి స్వల్పమరమ్మతులు ఏమైనా ఉంటే,– నే నిక్కడికి వచ్చిన తరువాత,

చూసుకోవచ్చు,– యిహ ఆ బాదరబందీ యావత్తూ, నాది–

అంతేకాదుటండీ,– సాయేబుగారూ,–

ఆఁ– యింతకూ,– వారెవరో చెప్పారు కాదు। – అని,– మాట ఆపి తన వంక చూశాడు:

'మనవాడే,– బంధుకోటిలోవాడు!' అన్నారు సీతారామయ్యగారు:

'అయితే,– మన యింటిముచ్చట–'

ఆయనకి తెలుసు। మీరు, ఏమీ సంకోచం లేకుండా, తాతగారితో కబుర్లు చెప్పుకుపోవచ్చు–' అన్నాడు, మదారు:

'మీ పేరు,– తెలుసుకోలేదు–' అంటూ అతగాడు, తన వంక అట్టె చూశాడు: కొంచెం ఠీవిగా,– రవంత గీరగా,– చూశాడు: ఆ కుఱ్రవాడు అంతకుముందు కులికిన కులుకు తలచుకుంటే నవ్వొచ్చింది: అలా నవ్వుతూనే,– 'నాపేరుకేం గాని,– మీ పేరు, రాజగోపాలం కాదూ?–' అన్నాడు తాను!–

'అలా కలగన్నారా?–'

'అనుకున్నాను। –

ఓహోఁ– ఆలయంలో స్వామివారిపేరు పెట్టారనుకున్నారా?– లేదండీ,– నేను లక్ష్మింపతిని,– మా తాతకు,– తాతను,–

కాని,– మాది తాతా మనవళ్ళ వరుసకాదు,–

నేనేం కోరినా,– యీ పసివాడు కాదనడు:

అంతేకాదూ, తాతయ్యా–'

'అంతే నాయనా,– రమ్మన్నావ్!– వస్తున్నాను!– నీ మాటను ఎన్నడూ కాదనను: ఎవ్వరి మాటా కాదనను!–

ఆ పొరబాటు – జన్మకు ఒక్కసారే!–

దైవం, ఆ చిద్విలాసంలో కటాక్షించిన గర్భశోకం అనేది, తండ్రి ప్రసాదించిన యజ్ఞోపవీతం లాటిది: దేహాంతం వరకూ వంటబట్టే ఉంటుంది:

సుఖదుఃఖాలు, సూర్యచంద్రులలాటివి:

వాటికి,– అతీతులు కావాలనుకునేవారు,– కాపురుషులు: అయితిమనుకున్న వారు,– అవివేకులు:

జనకరాజు,– యోగమూర్తి–

యాజ్ఞ్యవల్క్యుడంతటివాడికి,– గురువు!

సకలమూ,– తెలిసినవాడు:

కాబట్టే,– కూతుర్ని అల్లుడు,– అడవి పాల్జేసినపుడు,– ఆ మాటలు యిప్పుడెందుకు గాని,–

యిది,– ఆనందంగా ఉండవలసిన తరుణం:

అలాగే ఉందాం!–

ఒరే తాతా!– గ్రామంలో, పదిమందితోనూ చెప్పిపోదాం,– చెప్పడం అంటే,– మరి,– మదారయ్యా,–

మావా! నీ మనమడు,– కట్టుదిట్టంమీదే వచ్చాడు: కల్‌కండా ఖజూర్‌పండూ,–

ముందు యిటు తోలించి,– వెనుక తాను బయలుదేరాడు: బండి,– అమ్మతల్లి తోటలో దిగి ఉంది: యీపాటికి, మన పాఠశాలలో పిలకాయలు, గ్రామం మీద పంచిపెట్టి ఉంటారు: శుభవర్తమానం, యింటింటా తెలిసింది:... అంటున్నాడు, మదారు:

'ఉహూం– యీ నిర్వాకం అంతా నీదన్నమాట!–' అన్నాడు సీతారామయ్యగారు: గునుపుగా!–

–'మామా!– నా నిర్వాకం ఏముందిలే!–

నీకూ నీ మనవడికీ ఎదటున్నవాడు– లోకువ! నీవు,– బువ్వ పెడతావ్!– ఆయన పని చెపుతాడు!– అంటూ నవ్వాడు, యీతడు:

'యివాళ,– గ్రామంలో యిదొహ వింత!–' అంటూ పసిపిల్లవాడు సణిగినట్టు సణిగాడాయన!–

మదారు అందుకున్నాడు– 'మామా। మన గ్రామమే ఒక వింత!– యిక్కడ ఒక్కరోజుంటే,– కాశీ మజిలీ కథలు,– చార్‌దర్‌వీష్,– హాతింతయ్,– మరియాద రామన్న కథలు, కంఠోపాఠం చేసినంత కడుపు నిండుతుంది: పొరుగూరివారికి,– వింత విడ్డూరం అనిపించేది – మనకి సహజం!–

యిందులో,– వింత ఏముంది?–

గోపాలస్వామి వారి ఆలయంలో ఉత్సవం జరిగినట్టు మీ యింట్లో శుభకార్యం జరుగుతూంది! యీ వేడుక, యిహ మీద, యేటేటా జరుగుతూ ఉండవలసిందే–'

మదారు ధోరణికి, లక్ష్మింపతి అడ్డంవచ్చాడు:

'మదారు మామా।– మీకు వేడుక అయితే యేటేటా, మా తాతకు పుట్టిన రోజు పండుగచేసి, భోగిపళ్ళు పోస్తాం,– గాని, సాల్‌సాలుకూ, పురుడు,– రావాలని మట్టుకు దీవించకు!–'

ఆయన కలిపించుకున్నాడు– 'భడవా! అదేం కూతరా!– లింగు లిటుకూ మంటూ యిద్దరు మొగనలుసులు ఉంటే,– సరిపోతుందా,– యింటినిండా కలకల్లాడుతూ ఆడపిల్లలుండాలిరా!– అప్పుడుకాని,– శోభాయమానంగా ఉండదురా!–'

'తాతయ్యా!– దైవానికెంతో,– తనకూ అంతే,–!– ఏమిటి?– రాత!– అయోధ్యా వాసుడికి యిద్దరే మగపిల్లలు– మనకూ అంతే– ఏలకాకూడదూ అంటా!–

మన కుటుంబంలో!– మీ తాత దగ్గిరనుంచీ, నాదాకా లెక్క వేసుకువస్తే తరానికొక్కరు! అటు మా అమ్మ వంక తీరూ, అంతే,– ఎటొచ్చీ, నీ మనుమరాలు మన యింట కాలుపెట్టింది, వెనకటి ఆనవాయిత తారుమారు చేసింది: యీ తామర తంపర, కొలనంతా వ్యాపిస్తుందేమో,– మా అత్తవారి తరపున – అటూ అటూకూడా,– సంతానం దండి!– మనమూ, ఆ కూటంలో జేరేట్టున్నాం– యిప్పటి పద్ధతి చూస్తే,. తాతయ్యోవ్,– మరో చిత్రం,– నీ మనుమరాలి పేరేమిటి?'

'చిట్టితల్లి , కాదూ?'

'అది–ముద్దుపేరు కాదటయ్యా?– అసలు నామకరణం?–'

'నాకేం తెలుసు?– నేనేం,– ఆనాడు వారింటికి సంభావనకు వెళ్ళానా?'

'వెళితే,– సంబరపడేవాడివి! దీన్ని నా మనమడికి చేసుకుంటున్నానని,– అప్పుడే చంక నేసుకుని వచ్చి ఉండేవాడివి!– యిప్పుడు మటుకు కొంచెం కుడి యెడంగా,–

అంతే జరిగిందనుకో!- అంటే,- నేను,- అంత ఘనకార్యం జేశానని- కాదు- నీ మనమరాలు ఘటికురాలు: వోణీ చెంగున కట్టేసుకుంది!...

'వారెవా!- అది,- ఏమి మాటయ్యా!- లోకంలో,- మగమనిషిని చూసి ఆడకూతురు గజగజ లాడుతుంది: అది రివాజు: కాని,-' అంటూ మదారు చిరాకు పడినట్టు నటించాడు:

'కాని,- సాయేబు మామా!- అదో మగసిరి అంటావా?- మగవాడు కంటపడితే,- యిల్లాలికి, వెన్నెల వచ్చినట్టుండాలి కాని,- యింటిమీదికి రోహిణీకార్తి వచ్చిపడ్డట్టుంటే,- అవేం బ్రతుకులు!-

మన రాజగోపాలస్వామివారు,- సత్యభామకు విధేయులు కారా?- మహమ్మద్ వారు- భార్య గీచిన గీటు దాటేవారు కారనీ,- వారి కుమార్తె, అల్లుడూకూడా,- అంత అన్యోన్యంగానూ ఉండేవారని,- ఆయనకు 'షేరే ఖుదా' అనే బిరుదు ఉన్నప్పటికీ, భార్య కంటపడేప్పటికి పిల్లికూన అని- పెద్దలు చెపుతూండటంలేదా? పెద్దలంటే మరెవరో కాదు - నీవంటి వారే!-

అంతదూరం దేనికి మామా,- నీ సంగతేమిటి?

ఊరిమీద కొచ్చినప్పుడు,- మీసం మెలేస్తావ్,- చేలమీద, రంకెలేస్తావ్, ఎరగని వాడికి,- లేస్తే మనిషిని కాను! అన్నట్లు కనిపిస్తావ్!- యింటికి జేరుకున్నావో,- మా అత్త చిటికేస్తే,- జీ బేగం సాహెబా! అని తారంగం పడతావ్!- అలా, భార్య కనుసన్నలలో మెలగుతూ ఉండటంలో ఉన్న ఆనందం,- ఆ హాయి-అనుభవిస్తూన్నవాళ్ళం గనుక,- మనకి తెలుసు!- అందుకే ఆ పోషణలో,- యిలా నునుపుదేలాం!...'

'నాన్నా,- యిలా ఆషామాషీ లల్లుకుపోతూంటే, యిక్కడే తెల్లారుతుంది:'

'అంతకన్న ఆనందం ఏముందీ?-'

'అవునే అనుకో!- మనం వేగిరం వెళ్ళాలి కదా!-'

'అదిగో బండీ :- బయలుదేరు! నేను,- తీరుబడిగా వస్తాను,-'

'అదేమిట్రా?-'

'ఆత్రం!- ఎప్పుడు పోయి బందరులో ఉరుకుదామా అని ఉన్నావు! పద - నాకు అవన్నీ పాత మొగాలేగా!-'

'ఒరేవ్!- నీకులేని ఆత్రం నాకు దేనికిరా:- యివాళ అనుకున్నది రేపవుతుంది: కాకపోతే,- ఎల్లుండికన్నా జేరుకుంటాం! అప్పటికీ తెమలకపోతే,- కబుర్లు చెప్పుకుంటూ కాలినడకను పోదాం! అడుగడుక్కీ- మేజువాణీ చేస్తూ పోయినా - ఆవేళకన్నా,- జేరుకుంటాంలే।-'

'తాతయ్యోవ్!- కూత ఘనంగా ఉందే।'

'ఉండక!- సోమయాజులవారింట పుట్టిన వారందరూ ఘనాపాఠీలే,- మనలో మాటలు రానివారెవరోయ్-?-'

'అహా!- ఆ మాటసొంపుకే ముచ్చటపడి,- ఆ తాత,- నీ కుమారుడికి,- ఉన్న ఒక్క ఆడపిల్లనూ కట్టబెట్టాడు।-'

'రామా - శ్రీరామా,-'

సీతారామయ్యగారు,- ఆక్రోశించారు: కంట నీరు లేదుకాని - నిలువు నిలు

వునా దుఃఖం కళపెళలాడుతూంది।

'తాతయ్యా!-' లక్ష్మింపతి,- ఒక్క ఉరుము ఉరిమాడు: 'శ్రీరాముడు మాకు దైవం।- ఉత్సవాల్లో వారు ఊరేగుతున్నారు! కనుచూపుమేరదాకా మాకు దర్శనం యిచ్చారు! కనుచాటైనారు! కాని,- వారలా ఊరేగుతూనే ఉన్నారు: మేము దుఃఖించడంలేదు!-

వారిని తలచి, మనం- దుఃఖించరాదు...

సీతారామయ్యగారే, చేయి పైకి విసిరి -

'ఏమిట్రా కూశావ్?' అని అరిచారు! లక్ష్మింపతి,- తొణక్కుండా,-

'మేసిందే,- కూశాను।-

నేను మా నాన్న నెరుగను గదా?-

బుద్ధి తెలుస్తున్న రోజుల్లో,- బొమ్మను చూసి,- ఎందుకో వెక్కి వెక్కి- అప్పుడు మా అమ్మ అలా చెప్పింది: అర్థంకాకపోయినా,- మళ్ళీ కంటతడి పెట్టలేదు: యిప్పటికీ నాన్న యిల్లు దిద్దుకుపోతున్నట్టే,- ఉంటుంది: అది తప్పంటావా,- తాతయ్యా!' అని ఆయన్ను దగ్గిరకు తీసుకుని-యిదిగో, మనవడా! ఏదీ,- ఆ పాలబుగ్గలు సొట్టడేట్టు. ఒక్క బోసినవ్వు నవ్వు!- నవ్వమ్మా!...' అంటూంటే, ముందు నవ్వింది, మదారు,- తానూ అతగాడికి జతైనాడు! సీతారామయ్యగారి మొగం విప్పారింది: ఆఁ అల్లాగే, ఎల్లకాలం, మా కళ్ళ ఎదుట ఉండాలి బుల్లివాడా:- యింతకూ,- మా ఆవిడపేరు. చెప్పనిచ్చావు కాదు: మీ అమ్మపేరు, -రావమ్మ... మా నాయనమ్మ పేరు,- లక్ష్మమ్మ, వెరసి,- రామలక్ష్మి- తాతయ్యోవ్! మా నాన్నకు- బందరమ్మాయిని కట్టబెట్టింది, ఆ రాములవారే అనిపిస్తూంది: అటు జానకి రామయ్యగారు,- రామాలయం కట్టించాడుగదా,- ఆయన కొడుకూ,- జానకిరామయ్యే - వారి కుమార్తె - జానకమ్మ!

మా అమ్మ జనకుడి కూతురు:

మా తండ్రి- శ్రీరాముడు:

కాని,- వీడు వర్థి లక్ష్మింపతి!- లవుడూ కుశుడూ కాదు! తాతయ్యా.. నీవు ఏనాటికైనా కాస్త దయతలిస్తివో,- సోమయాజుల్నవుతాను: కాదు,- నీవు అప్రాచ్యుడివి పోరా అంటివా?- మీసాలకు సంపెంగనూనె, ముప్పొద్దులా మర్దన చేయించుకుంటూ...'

'షష్టిపూర్తి అయేదాకా అలాగే అఘోరించు:'

'అలాగే,- నీ సెలవైతే - కాని అప్పుడన్నా నీవు నడుం కట్టాల్సిందే!-

'అప్పటికి,- నాకు నూరేళ్ళు...'

'ఉంటే ఉండచ్చు! - పండబారి జహంగీరులాగా - గుండ్రంగా ఘుమ ఘుమలాడుతూంటావ్!-'

'యీలోగా నిండితే!-

'నిండటం అనేది,- ఎప్పుడో వెయ్యేళ్ళ తరువాత మాట!- అప్పటికైనా రూఢిగా చెప్పలేం,-

'కల్పాంతమందు కూడా,- మీ వంటివారు,- తేజోమూర్తులై ఉండి,- ఆ ప్రళయం తాకిడికి తట్టుకుంటారని భాగవతంలో ఉంది కదూ?- శ్రీరాముణ్ణి హృదయంలో భద్రపరచుకున్న వారందరూ,- చిరంజీవులే!- ఆంజనేయుల వా రెంతో,- యీ సీతారామయ్యగారూ, అంతే!-' అంటూ చేతులు జోడించాడు లక్ష్మింపతి: అంతలో,-

పాఠశాల పిల్లకాయలు,– ఓ పదిమంది,– యిటుకేసి వచ్చేశారు: 'అన్ని యిళ్ళకూ పంచాం; అందరికీ చెప్పాం!–' అని– ఒక్క గొంతున అనేశారు:

'పొట్లాలు సరిపోయినాయా?–' అన్నాడు లక్ష్మింపతి:

ఓం– ఎక్కీ దక్కీ!– పసిపిల్లలకుకూడా తలోటీ యిచ్చాం:

యింకా,– ఓ పది చేతులదాకా మిగిలిపోయినాయి:

వాటిని ఏం చేయాలి?–

రోడ్డుమీదకు వచ్చాం:

ఉప్పు బళ్ళోస్తున్నాయ్–

వాళ్ళనోరు తియ్యబడేశాం!–

ఫలానా సంగతని చెప్పాం!–

వాళ్ళందరూ:– ఆవాళ పప్పు బువ్వకు వస్తామన్నారు. అందరూ తలొక మాటా కూతపట్టినట్టు అప్పగించారు:–

'రానీయండర్రా! వీధులు కట్టి విస్తళ్ళేస్తున్నప్పుడు. మరో వందమంది వస్తే మటుకు, వడ్డన కలవకపోతుందా?– అన్నశాంతి ఎంత దండిగా జరిగితే,– అంతకంత, వెన్ను కాస్తుంది: ఒరే నాయనా!– నా పేరెట్టుకున్నవాడి భారసాలప్పుడు,–'

'అన్నదానం ఘనంగానే జరిగింది,–

కాని– సమారాధనమటుకు సాగలేదు:'

'ఆహా!– బ్రహ్మిగాళ్ళ పేచీయేనా?–'

'పేచీకాదు,– బెట్టు కాదు: ఆ పద్ధతి అంతే!– దక్షిణ పుచ్చుకునేందుకు అభ్యంతరంలేదు కాని,– భోజనం చేయడానికి బెదురు!–

'ఓహోఁ!– వారేం– నెత్తిమీది దేవతలా?–

ఆకలి అనేది,– సకల ప్రాణులకూ: సహజమైన,– సరిసమానమైన ధర్మం–

మనకు వివేకమూ, యోగ్యతా ఉంటే,– గుమ్మంలోకి వచ్చిన అన్నాతురుణ్ణి – ఆదరిస్తాం!–

మరో పిసరు సుకృతం జేసుకుంటే,– యీ పూట మనతోబాటు పట్టెడు మెతుకులు తినేందుకు, ఎవరు దయచేస్తారా అంటూ; ఎదురుచూస్తాం!–

శుభకార్యం జరుగుతూన్నదంటే,– ఒకరికి పదిమంది రావడంతో,– మనసుకు మరింత ఆనందంగా ఉంటుంది: గృహ–పావనం అవుతుంది:

అందుచేతనే,– బొటా బొటీగా జరిగే సంసారాల్లో సైతం,– అక్కరొచ్చిందంటే – దంపలు – దుంపలు చేసుకుని,– సమారాధన చేస్తారు: సమారాధన, అంటే ఏమిటి?– అవతలి వారి ఆకలెరిగి,– ఆప్యాయంగా ఆదరించడం! అంతేకాని,– జంధ్యాల పస,– విభూతి పెండెకట్లు చూసి, పెద్ద పీటవేయడం కాదు:

యీ లొగ్గిడి,– ఏనాడు ఆరంభం అయిందోకాని,– అయినవారికి ఆకుల్లోనూ,– కానివారికి కంచాల్లోనూ అన్నట్టు,– ఒక్క కబళం పెడితే, దాంతోనే కడుపు నింపుకుని, జన్మంతా దీవించేవాళ్ళ మొగాన – ఎంగిలాకులు, తిన్నంత తిని,– పారేసేంత పారేసి – సంభావన చాలదని,– గొడవపెట్టి తోరణాలు తెంపే ఓగాయిత్యం గాళ్ళకు,– సభా మర్యాద!– యిది, మన బుద్ధి తక్కువా,– మరొహటా?–

పాయెపో,– మీ మీంచి బలాదూరు!

మీరు కావాలనుకున్నవాళ్ళే,– మీ యింటికొస్తారు:

రారూ, బిసాత్!–

కోపతాపాలు ముక్కు మీదుండే మామూలు మనిషికిమల్లే,– ఆయన అంగవస్త్రం ఒక్క దులుపు దులిపి,–

'ఏమర్రా!– మీకు కాళ్ళు తిప్పటేనా,– తలో రవంతా మిగుల్చుకున్నారా?–' అంటూ పిల్లవాళ్ళ మధ్యకి,– వెళ్ళాడు:

వాళ్ళు మొహ మొహాలు చూసుకున్నారు.

వారిలో ఒక్కడు,– పెరుగుదుత్తలాటివాడు,– చిక్కని మీగడ నవ్వు నవ్వి,– 'ఎందుకూ?–'...

'తినేందుకు!–'

–తాను, కుర్రవాళ్ళ వాలకం కన్నార్పకుండా కనిపెడుతున్నాడు: పాఠశాలలో చూసినప్పుడు,– ఒక్కొక్కడు, ఒక్క కొమరయ్య; ఒకడు,– క్రౌంచ పర్వతము మీదికి ఒంటిబాణాన లేచిన దేవ సేనాపతి; ఒకడు తిరుచందూరు బాలసుందరుడు: ఒకడు, పళని బ్రహ్మణ్యుడు: వెరసి,– అందరూ అయ్యసిగపూవైన జాబిలి రేకలు: వాళ్ళందరూ – తల్లి పోషణలోవాళ్ళు!– కొండమీది బంగరు తల్లీ,– తల్లీ తోడూ లేనివాడిని కానని తెలియజెప్పేందుకు యిక్కడికి రప్పించావా అమ్మా!– నిత్యమూ నీ సన్నిధికి వేలాది ప్రజ వచ్చి సేవించుకుంటుంది: ఎవరికి వారికే ఎదుట కొలువున్నది మా తల్లి!– అనిపిస్తుందే,– నేనున్న చోటికి వందలాది ప్రజ వస్తుంది: వాళ్ళు కాసిచ్చే వాళ్ళే కాని,– కావలసిన వాళ్ళని, ఎన్నడూ అనుకోలేదు: ఎవ్వరినీ అలా చూడనూ లేదు.

ఎవరి యోగక్షేమమూ నిజానికి విచారించనూలేదు. అన్ని బాధలతోబాటు ఆకలీ పట్టుకు పీడించగా,– అరువడిగిన వాడిని, అయ్యో పాపం, మనలాటి మనిషేనే,– ఎంత అభిమానం చంపుకుని అడిగాడో కదా పాపం,– జాలి దలచలేదు: 'నాయనా,– కష్టాలకు కాలు నిలకడలేదు: అవి మన్ని ఎల్లకాలం అంటిపట్టుకుని ఉండవ్ – వస్తూంటాయ్ పోతూంటాయ్– అవి అందరికీ సహజం: కోటీశ్వరుడికి కూడా ఒక్కొక్క తరుణాన చేత కానీ ఆడదు: యిందులో బిడియపడవలసిన దేముంది? యిబ్బంది వచ్చినప్పుడే,– మనిషికి మనిషి సాయం!– పదో పాతికో పట్టుకెళ్ళి వాడుకో – అంతే అనికాదు – అవసరమున్నంత వాడుకో – సాటివాడికి యిన్నూరో నన్నూరో చేబదులిచ్చినందువల్ల నాకింతలో దరిద్రం రాదు:' అని అనడానికి నోరు రాందే!– యిన్నాళ్లూ,– కళ్లు మూసుకున్నందువల్ల,– మూసుకుపోయినందువల్ల– తనది,– కానరాని సంపాదనే అయింది: చేసిన కాసువీసపు ధర్మాలు,– ఏదో చెలగాటం క్రింద జమకాని, అందులో చిత్తశుద్ధి అంటూ లేదు: దినసరి రాబడిలో,–వెచ్చంపోను,– మిగిలింది,– కట్టకట్టి, పెట్టె అడుగున పారవేయడమే కాని,– యీ సొమ్ము – యింత సొమ్ము అలా చీకటి గుయ్యారంలో పడి మూలుగుతూందే,– దీనికి మోక్షం చూపించవద్దూ?– అందుకు,– యిదే,– యిప్పుడే మొదలు,–

సీతారామయ్యబాబూ అమ్మతల్లికి,– ధర్మకర్త లెవరు?– అని అడిగాడు: అందుకు మదారు సమాధానం చెప్పాడు–

'కొమ్మలమీదున్న చిలకలు!'

అవు భాయీ!- జమాఖర్చులున్న చోట ధర్మకర్తలు: ఆ తల్లికి జమా లేదు- ఖర్చూ లేదు-'

'ఎవరన్నా,- రొఖ్ఖ రూపంగా,- సమర్పించదలచుకుంటే?-

ఎవరి అనుజ్ఞా అక్కర్లేదు: అమ్మతల్లి మీదికి విసిరి వచ్చేయడమే!- ఎవరికి దాంతో అవసరముంటే - వారికి అవిడే ముట్టచెపుతుంది: ఏం, నీకేమన్నా అలాటి అభిప్రాయం।-

తాను, నసిగాడు,-

ఉంటే, అమ్మతల్లిని తలుచుకుని,- చేతికి వచ్చింది,- ఒక సందూక్‌లో పడెయ్: దాని మనిషి,- తానుగా వచ్చి పట్టుకుపోతాడు: యివాళ మొదల్జేసుకో,-

సీతారామయ్యగారు, ఎగిరిగంతేసి,- మాట అందుకున్నారు: 'నీవు చేసుకున్న పుణ్యం నాయనా!- యివాళే- ఆనాడు,- అమ్మతల్లి యిక్కడ మళ్ళీ వెలిసింది: యీ గడ్డమీద,- యింతమందిమి పుట్టి పెరుగుతున్నామా,- ఎన్నడూ అదేం చిత్రమో,- ఏ ఒక్కరికి,- యిలాటి ఊహరాందే।- నీవు పరాయివాడవుకదా,- అని ఆ తల్లి,- యీ చిలిపితనం జేసింది: లేకపోతే - యిక్కడ మోతుబరులందరూ ధర్మతంద్రులేకదా,- ఎన్నడన్నా,- యింత కలకండ చిలకలకి,- జల్లడం- అమ్మతల్లికి కుంకుమసేవ చేయడం తప్ప,- మరో మాట తలచరే,- ఒరే నా తండ్రీ!- నీ సుకృతం,- ఏ తీరున రాణిస్తుందో,- కానీ చూదాం।-...' అనేసి, కుర్రవాడి వేపు తిరిగి,- 'ఏంరా భడవా! అడిగిందానికి సమాధానం రాదేం-?-' అని బుగ్గ పట్టుకోంగా,- ఆ మీగడ నవ్వువాడు,- మాటకు తడుముకోకుండా,- 'తాతయ్యబాబూ!- ఎక్కడో పండగైతే,- ఎగిరి గంతేయమంటావేం?- మదార్ మామ బనాయించిన పని, చేశాం కాని మాకు బత్తాలెందుకూ?- బందరు పాపాయిని మన బళ్లో చదవేసిన్నాడు,- మాకు పప్పుబెల్లాలు,- ఎల్లాగూ తప్పవు-' అనేసి,- 'మామా,- మేం పోతున్నాం,- దప్పికౌతూంది।-' అంటూ పరుగందుకున్నారు.

-' ఎదురుగుండా,- చెరువుంటే,- వీళ్లెక్కడికా పరుగు'

'అమ్మోరి భావికి।' అన్నాడు మదారు: మనవాళ్ళు మరో నీరు త్రాగరు భాయ్,- విన్నావుగా ఆ చిలకపలుకులు,- అమ్మతల్లి పచ్చని-చలవలో మెట్టుభాగం వాళ్ళది,-

యింతకూ రంగడేడీ?-

'మనకు తగుల్తాడులే,-' అన్నాడు. మదారు। 'మామా,- అనుకున్న తరువాత,- యింకా ఆలస్యం ఎందుకూ? మీరు కదలండి- నేను చీకటితో, బండి కట్టుకు వస్తాను,...'

'బండిమీద ఏం తెస్తావ్?-" అన్నాడు మనవడు:

'ఏమ్ తెస్తాములే,- మన గ్రామమ్‌లో,- వజిరాలు పండుతయ్యా,- కాయా కూరా, పండూఫలం,- పూవూ పత్రీ - ఆ రోజుకు కావలసిన పాలూ పెరుగూ,- మామా,- మన మోదీన్ వంగచేను,- కాపుకొచ్చింది: పిందె లేరిస్తాను,- రెండు గంపలు కావచ్చు!- మాపటికి ముప్వోంకాయ్!- యింకా వ్యవధానం ఉంది కనుక - రాయమందిరం ఒక కానీ కార్డు వేస్తే - మన దావూద్ భాయ్,- పనసపండ్లు తోలించి పెడతాడు,- ఏవయ్యా బందరబ్బాయ్ - పప్పూ పాయసం ఎలాగూ వడ్డిస్తారు సరే - కాలక్షేపానికి కాస్సేపు గానాబజానా ఏర్పాటు చేయిస్తావా?-'

'నేను చేయించేదేముంది పెద్దలే - అమర్చి పెట్టారు: కోనయ్యగారూ,- మీరు

మా బస్తీకి రాకపోయినా,- ఖ్యాతి వినే ఉంటారు: వంట యింట్లో పూర్ణం వేస్తే,-వీధి సావట్లో- పాత రామన్న పేట బంగారక్కలు గజ్జె కట్టవలసిందే!- అది ఆనవాయిత: అది, ఓ ఘనత!- అంటే, దేశంమీద అనుకున్నట్టు,- మొట్టమొదట యిలా ఏర్పాటు చేసిన, గ్రామ-పెద్ద, బడాయికి పోయుండచ్చు,- కాని,- ఆది, రాను రాను తప్పనిసరి అయింది:

పొరుగూరివారు,- యిలాటివి వినడం - మాకు అంత పరువుచేటు కాదు,- కాని,- ఉలక్కుండా,- ఉన్నమాట చెపుతాను:

మా బస్తీలో,- బొమ్మలపెళ్ళి చేసినా,- బోగం మేళం ఉండాల్సిందే!- అయితే - సామాన్య సంసారులకు,- యీ ఖర్చు,- యిద్దంమీద పందుం కాదా,- అంటారా?- ఎబ్బే- నూనె సరుకూ,- నేతి సరుకూ రెండూ దొరుకుతాయ్:

అద్దైతే బహు కిఫాయతు,-

యిది,- రవంత ప్రియం-

అంటే జొన్నల రాశి కాయలకూ,-

జహాంగీర్‌లకు,- ఉండే ధర తేడా:-

చౌకబారన్న మాటేకాని, జబ్బు సరుకు కాదు!

ఏమిటి నవ్వుతున్నారు!-

మాటలో చమత్కారం తగిలిందనా?-

స్వానుభవం అనుకునేరు!- అది పూజ్యం,- పెద్దలవల్ల విన్న కబుర్లు-

పెద్దల్లో అయినా,- యీ చిరుతిండికి అలవాటుపడిన వారు,- బహుకొద్దిమంది: తతిమ్మా వారిదంతా,- మాట సరసమే!-

- ఆ మాటల్లో పడి తాను గమనించలేదు,-

యిద్దాం బస్తాలాటి మనిషి,- కోక కట్టుకున్న, భీముడు,- గొంతు తంబుర మోగినట్టు,-

ఏం బస్తీ మనవడా,- మళ్ళీ మొగమారాజేనా?- యీ మాలెన్నా,- నాలాటి ఒక్క మా కూతుర్ని కనవయ్యా, అని,- చెంపలు దువ్వింది:

ఎవరా యీ మనిషి?

తాను మదారు వంక చూశాడు!

మదారు,- ఆ చూపందుకోలేదు-

మనవడబ్బాయి,- 'ఏం సుబ్బాం!- కులాసాగా ఉన్నావా?' అని, నవ్వుతూ పలుకరించాడు:

ఆహా!- యీ మనిషేనా సుబ్బాం?- మనిషి చూడబోతే;- రాక్షసే,- కాని,- ఆ గొంతు!- ఆ కళ్ళు,- వాటిది మట్టుకు దేవతా పుటక నవ్వు నవ్వితే,- వెన్నెల పెళ్ళ విరిగినట్టుందే!

ఏం కులాసా?- ఎందుకొచ్చిన కులాసా?- నాటకంవోళ్ళు పలికినట్టు- అటు అశోకవనం గాకపాయే-యిటు,- అయోధ్యా గాకపాయె,- చూడచుట్టం లేకుండా జూసుకొని,- సుట్టు గుడిసెలో కాపురం బెట్టావా సుందరాంగీ!- గదిదాటి అడుగేయవే,- కావిటేసుకుపోతాను,- అని రావణాబ్రహ్మ బతిమాలుకోంగా,- కోటలొద్దు గోపురాలొద్దు,-

హా సీతా! అని నావా డల్లుడిపోతాడు: పల్లకుండ పోవయ్యా పది తలకాయల మొగాయనా!– అన్నదంట.

హా సీతా అనడంలో,– మా రాములోరూ బల్ మొనగాడు: కాని,– ఆరో మనువుగందా పోన్లే అని,– అయ్యోరిని కట్టుకుంటే,– కూలి నాలి మానిపించి వాలు మొగ్గేయించినాడంట: ఆ మొయినుంది,– మా సంసారం: ఏదో ఆయనకూడు ఆయన తింటాడు– నా గెంజినీలు నేన్దావుతాను: ఎంత చెడ్డా,– జంజెం వేసుకున్న పుటకగందా అని, ఆ ఒక్క నులకుక్కీ– ఆ మడిసికిచ్చి,– కాల్నొచ్చిందా, చెయ్‌నొచ్చిందా,– అని అస్తమానం– అజ కనుక్కుంటూ,– ఎంతలెక్క సేవజేస్తే ఏం,– ఆ మనిషి,– యింటిముంగల యింగువ చెట్టు,–

యింతకాలమైంది,– నేనాయన్ని కట్టుకున్నానో నన్ను చూసి జెమలేసి,– తానే మా నీడకు జేరుకున్నడో,– కాని బగవంతుణ్ని సాచ్చీకం జేసుకుని,– యిదో కాపురంగానే జూసుకుంటూ,– నువ్వు గింజంత పాపం గట్టుకున్నా నూలువాసి పున్నెం జేసుకున్నాననే లెక్కమీదుంటూండం,– మీరెరగరూ?

సాయేబయ్యా,– పొద్దుటేల మీరు,– ఆకడకు సుట్టం సూపొచ్చి నారంటగా?– బెజవాడనుంచి మనూరొచ్చిన అబ్బాయి,– యీరేనా?– మీరటెళ్ళినారంట,–నేనిటొచ్చినా,– యింక సూస్కో,– కూకుంటే లేవలేకపోయినా మొగరేగుడు రేగాడు: నేనేం అడివిలోపుట్టిన జంతువునా,– పొరుగూరోడిని సోద్దెం సూపించేందుకు యెంటేసుకొస్తాడా?– సిన్నప్పుడు,– కలిసి గంతులేశాం– ఏంరా– అంటే– ఏంరా– అనుకున్నాం,– అసుమంటి ప్రాణం యిచ్చే వోడే,– నన్నకటా వికటం జేస్తే,– నేనీ గడ్డమీదెట్టా ఉండను?– అంటూ, అదో రొష్టు కాదయ్యా: యింక మనూళ్ళో ఉండడంట: నన్ను సేపట్టబట్టి,– యింత పాపకర్మం బట్టుకుంది గాని,– యెనకటికి యెన్ని ఆటలాడినా,– ఎవుడన్నా వేలొంచినాడా?– నాలో ఏందో కుచ్చితం ఉంది గనుకనే,– తాను యీ కాడికొచ్చినాడంట – ఒకటేంది?– యేతామెత్తినట్టు,– మాటలు మడుగ్గట్టినయి,! కాశీకి పోతడంట!...'

బత్తె ఖర్చులు?– మదారు, మాటవరుసకు అడిగినట్లడిగాడు:

నేనే,– యిచ్చుకోవాలంట!–

నువ్వు ఏమన్నావ్?

ఆ రెండోకాలిరగేస్తానన్నాను!–

–సీతారామయ్యగారు పకపక నవ్వుతూ,–

సుబ్బాం!– పొరబాటున అంతపనీ జేస్తివో,– గ్రామంలో కొందరన్నా సంతోషించే మాట వాస్తవం! కాని,– వాడు,– యీ వంకజూసి,– చంకకెక్కుతాడు : ఎల్లకాలం ఎత్తుకు తిప్పాలి!

రామయ్యబాబూ– యింతకాలం కంఠానికి కట్టుకుని తిరగలా?– నాకే రాత తప్పినా, ఆ మోత తప్పదు గందా,– అదే శాన అనుకుండ!– కాని– ఆ మనిషి పోకిళ్ళు నాకు ఎరికలేదనుకున్నాడేమో?– నీడనుండి,–నునుపుదేరి, నిమ్మకునీరెత్తినట్టు పుంజు కున్నడేమో,– యిప్పుడీ తలకు మాసింది పనికిరాలే! అలా ఎగువకు పోతే,– పచ్చంగా బంతిపువ్వుల్లాంటి సింగారక్కలు ఎగబడతారేమో,– మళ్ళీ,– కుశాల్ మీదుండచ్చని,– యీ వంక బెట్టినాడు, నాకు తెలియదా?– ఏవయ్యోవ్, ఆడకుబోయి,– అట్టిట్టు యెర్రి

పనులు జేస్తివా,- ఆళ్లూరుకోరు: బొడ్డున కత్తులుండే జాతి! ఒక్కపోటొడుస్తే,- నాలిక తడిపేందుకు నా అన్న వోళ్ళుండరు! జాగరత! కాదు,- నికరంగానే,-' బత్తి కుదిరి పోతూండాను: నా పున్నెం నేను జేసుకుంట నంటవా,- గుడి ముంగల నిల్సుండి సత్తెప్పెమానకంగా జెప్పు!- మనకున్న సెక్కా ముక్కా కిరియంజేసి,- దమ్మిడి మిగుల్చుకోకుండా,- సొమ్ము నీకిచ్చుకుంటాను: ఈ గటమున్నన్నాళ్లూ,- ఏదో శాకిరి-బోకిరి సేసి,- నెల్దిరిగే తలికి, పదో పరకో,-నీకు ఆకడ ముట్టేట్టు-పంపించుకుంటాను! అన్నాను బాబుగారూ?- నాసేతైందంతే!- అంతే గంద!...'

సీతారామయ్యగారి కన్నుల్లో,- ఆనందం వరదెత్తింది! అమ్మతల్లీ- యిదంతా,-నీ చలవేకదమ్మా!- నీ నీడను పెరిగినవాళ్ళకు- తక్కువ బుద్ధులు కలలోకైనా రావమ్మా!-రావమ్మా-! అనుకుంటూ,- 'సుబ్బాం!- మన గ్రామంలో ఒకరికొకరు పరాయి వాళ్ళు కారు: అందరూ,- కారణవశాన ఏ యింటబుట్టనీ,- అమ్మ తల్లి సంతానమే! వేంకట్రాముడు కాశీలో ఉండటానికి,- నీ చేనమ్మి యియ్యాలిటే వెర్రిదానా? నీవు అమ్మజూపినా కొనేదెవరే?- మునుపటి రోజుల్లో,- కానీ ఖర్చులేకుండా,- కాలి నడకను పోయి,-యాత్రాఫలం దక్కించుకుని,- కావడేసుకు గంగ తెచ్చేవారు! యీ వేంకట్రాముడి తాత, ముమ్మారు కాశీయాత్ర జేశాడు:- ఆయన తండ్రి,- విశ్వేశ్వర సన్నిధానంలో నలభై రెండు సంవత్సరాలున్నాడు: వీడు, ఎన్ని వెర్రి తలలు వేసినా,- ఆ తీవెను పూసిన పూవే కద!-వాళ్ళ సుకృతం వీడికి,- వారసత్వం- పోయి రానీ,- నీవుకూడా వాడి వెంటవెళ్ళితే, మరీ మంచిది, యిటు నిన్నూ,- అటు వాడినీ సేవించుకుంటూ, నిశ్చింతగా వెనుకచూపు లేకుండా ఉంటాడు: ఏవంటావ్?...'

సుబ్బాం, బిక్కమొగం పెట్టింది:

అయ్యగారూ,- నేనింకా ఎన్ని జలమ లెత్తాల్సుందో,- ఏదో ఒక్క జలమలో మీ కడుపున పుడతా, కాని, - నా మనవి యినుకోండి!- ఆ మనిషి,- నేను - కాశీవెడతానన్నడు కాని,- మనం,- పోదామనలేదు: తానే వేరడ్డాడు: ఆ గడియనించీ,- ఆయన, నా మనిషి కాదు: యింక నా సంగతంటారా?- ఏదో,- గాలివాటుగా వచ్చి,- యింతకాలం ఒక నీడ నుండాం! యిక ముందు తనదారి సూసుకుంటానన్నప్పుడు,- దారి బత్తెం యిచ్చి పంపడం, మన మరేద!- అంతేకాని,- బెమత తీరక కాదు: యీ జలమకు,- తొలినుంచీ ఒక్కటే కోరిక,- బిడ్డలు-పాపలు కలగాలని కాదు: మిద్దెల్లో కాపురం బెట్టాలని కాదు: ప్రొద్దున్నే లేచి,- ఓ సిట్టెడు కుంకం, అమ్మతల్లి మీద జల్లి,- ఆ సిలకలతో బాటు ఆ తోటలో ఉండిపోవాలని,- కాని ఆ తల్లి,- సాగనివ్వలా?- కోడిగం బట్టింది! నాకు కొండిసిగ జుట్టింది,- మనువుమీద మనువు కట్టబెట్టింది! అయితేనేం నన్ను ఒక్క ఛణం ఏమారుతుందా?- యిప్పటికి జాలిదలచింది కామోలు,- ఆ మనిషిని అటు పంపుతూంది: నా సంకిళ్లూడదీసి, ఓసి అబిసీ,- యింక నా పాదాలకడ పడి ఉందువుగానిలే,- అంది! రామయ్య బాబూ,- మీలాటి,- దేవతామూర్తులున్న యీ గడ్డమీద పుట్టబట్టి,- అమ్మతల్లి,-యీ పనికిమాలిన దానిమీద జాల్దలిచింది...'

ఆనందమూ దుఃఖమూ ముంచెత్తుకొచ్చి,- ఆపై మాట రాలేదు: సీతారామయ్యగారు,- ధుమ ధుమ లాడినట్లు,- పై అంగవస్త్రం, విదిలించి,- ఎదుటున్న మనిషిని బుజ్జగిస్తూ,- సుబ్బాం,- శుభమా అంటూ వర్తమానం వచ్చి,- అందరం సంబరం

మీదూంటూండగా,- ఊరికి ఆడపడుచువు,- అలా కంటతడి పెట్టవచ్చునా?- నిన్ను కూడా,- బందరు తీసుకువెళదామని ఉంది - కాని,- వాడితో నీకు వంతాయెను!- ఆయన,- కదిలి వచ్చే ఘటం కాదని తెలుసుననుకో,- కాని,- కదలేసి చూస్తాను: తాను రాకపోతే మానె, పోని నిన్నన్నా రానిస్తే,- ఓ పదిరోజులు అక్కడ నాతోబాటే ఉండి తిరిగి రావచ్చు...'

సరిపోయింది లెగుండీ!-

పదిరోజులే!- పదిగడియలన్నా,- ఒప్పుకోడు!-

అనుమానం మనిషి!- మీకా నైజం తెలియదు!

సిగ్గువిడిచి, చెప్పుకుంటున్నాను:

యిన్నేళ్ళుగా, ఓ నీడనుంటున్నా,- ఏ రోజు కారోజు గండమే-

తనలాగా,- మీసం దువ్వుకుంటు,- నులక్కుక్కిలో కూకుంటే,- నాకు జరుగుతుందా?- సేనుకో సెంగలికో,- పోక తప్పదుగందా:- పొద్దస్తమానం,- రెక్క లిరుసుకోంధీ, ముప్పొద్దులూ,- బువ్వ ఏదది!- అయినా,- గడియకోపాలి యిటు తొంగి చూస్తూనే ఉంటా?- నేను కంట పడంగనే,- ఆ మనిషికి శివమెత్తుతుంది: యింతసేపు,- ఎవుడితో పగలబడుతున్నావే అంటూ,- ఓ కూత కూస్తాడా?- ఆ నోటికొచ్చిన బండమాటలు,- మనసుట్టుపక్కల ఎన్నడూ యినుండం:- దేశం తిరిగాడేమో,- సదువు నేర్చుకున్నట్టు,- ఆ ముక్కలు నోటబట్టుకొచ్చినాడేమో,- నామీదిసురుతాడు : అయ్యగారూ,- ఆయన లెక్కలో,-మనూరిలో నా సెంగట్టుకోని మనిషిలేదు : అందాకా ఎందుకయ్యా,- ఏ తల్లి సేతులోంచైనా పిల్లగాడ్ని నే నెత్తుకుని ముద్దులాడితే,- ఏఁయే- యిప్పటినుంచీ వాడికి పాచికేస్తుండవే అంటాడు! ఎన్నడన్నా,- మనసిరిగి, నా దోవను నేను బోతాను పోఁ అంటినో,- పసివాడికి మల్లే బావురుమంటడు। నిన్నిడిసి బతకలేనే అని,- కాళ్ళకల్లుకుపోతాడు: ఆమూరాపోణ్ణి ఏం జెయ్యనయ్యగారూ!- సరే, నా రాతింతే గావుల్లనుకున్నా! యిప్పుడు,- కాశీ పోతానంటూంటే,- నిజం చెప్పొద్దు,- నాకూ ఓ సెంపను, సెడ్డదిగులుగానే ఉంది! దేశం కాని- దేశం,- ఎవురు కనిపెట్టి చూస్తారు?...

'ఆ విశ్వనాథుడే!'-'

'ఏందుకు జూస్తాడు?- ఏం పున్నెం జేశాడని!-'

'ఏం పుణ్యం జేసుకోకపోతే,- యింతకాలంనుంచీ కాలుమీద కాలేసుకుని ఎలా బ్రతుకుతున్నాడే!- నీచేత ఎలా సేవ చేయించుకుంటున్నాడే?- సుబ్బాం!- కాశీమీద ఎప్పుడైతే బుద్ధి మళ్ళింది, వాడు అప్పుడే తరించాడే!- యిక నీవు నిశ్చింతగా,- అమ్మ తల్లిని సేవించుకుంటూ ఉండవచ్చును: వాడు కలిపించిన యీ బంధం వాడే తీసేశాడు! యిక ఎవరికి వారే,- ఎవరిముక్తి వారిదే।-'

ఏమో అయ్యగారూ!- గ్నానంలేని దాన్ని కసురుకోకండి!- భర్త కాకుండా,- బారియకు మరో ముకితిలేదు,- మోచ్చంలేదు, మొక్క దైవంలేదు అంటారు గందా పెద్దలు!- ఆ మనిషి నన్నిడిసి,- పోతుండడంటే,- అది నా పాపం కాదూ?-

కాదే,- కంటికి దూరమైనంత మాత్రాన- మనసుకు దూరమౌతాడా?- ఎక్కడున్నా,- ఒకచోట ఉన్నట్టే!- అది తెలిసొచ్చేరోజు, మీకు కలిసొచ్చింది: ఏడు వారాల కుంకుమతో, ఎత్తుకెత్తు దయతో,- ఎండల్లో చిగురించిన ఎలమావి నీడలో,- తరిమెనపట్టిన

వెన్నెల - చికిలి చేసిన వెలిమబ్బు తునక-చిరునవ్వుల రాశి, ఆణిముత్తెమంటి బాలాకుమారి- కలకాలం కన్నె కోమలి,-

మన అమ్మతల్లి,-

అమ్మా!- ఎవరిని ఏ తీరున తరింపజేసేవో,- నీకే,- తెలుసునే మా తల్లీ,- మనవులక్కరలేదు,- విన్నపాల పనిలేదు: నీ కన్నుల నీడను మసలేవారిని,- ఎన్నటికీ,- విడనాడవు,- తల్లీ,-

అమ్మా,- సుబ్బాం, వెనుక నడచిక కథ వెయ్యేళ్ళ నాటిది- నీది కాదు! యింతకుముందు,- జన్మ ఎత్తావు,- అమ్మతల్లి పెట్టిన అర్ధణా అంత కుంకుమతో,- మరో ఊహలేక నూరేళ్ళు వర్ధిల్లవే.- పో అమ్మ పోఁ- ఎగిరిపోవే చిలకా!-

సుబ్బాం,- నవ్వుకుంటూ ఎగురుకుంటూ వెళ్ళిపోయింది- తానలాగే చూస్తూ నిలుచున్నాడు।

ఏమయ్యా,- మదారూ- మేం వెళ్ళివస్తాం అన్నారు సీతారామయ్యగారు: యితగాడు నవ్వుతూ,- అంటావేకాని- నీవో పట్టాన కదులుతావా మామా!- ఎవరో ఎదురొస్తారు!- ఆగి మళ్ళీ మేజువాణి మొదలుపెడతావు - యిప్పుడన్నమాటమీదే ఉండి,- ఎవరు పలుకరించినా, జవాబు చెప్పకుండా,- తిన్నగా,- ఆలయం దగ్గిరకి వెళ్ళి, వారికి మనవి చేసుకుని- అమ్మతల్లితో చెప్పి బండెక్కండి!-

ఏం, కోనయ్య బాబూ!- నువ్వూ రావాలి సుమా!- అంటూనే ఆయన,- అడుగు ముందుకు వేయడంతో తాను సమాధానం చెప్పవలసిన అగత్యం లేకుండాపోయింది!

అడుగడుగునా హంసపాదుగా ఉంది,- యింక ఒక్క ఊపున పోదాం పద!- అంటూ మదారు చేయందుకున్నాడు!

తాను,- కదలలేదు:

మనసు కదలనియ్యలేదు:

పైగా,- ధ్యాస అటీటో - ఆ సుబ్బాం వెంటపడి పోతూండెనే!- ఆ మనిషి చిన్నప్పుడు ఎలా ఉండేదో! కొంచెం నేవళంగా ఉండేదా?- అప్పుడూ ఆ తీరంతేనా?-

కల్లా కపటం ఏ కోశానా కనబడటంలేదు-

గురి కుదిరితే,- జన్మ ధారపోస్తుంది-

కాని, ఏం సుఖపడ్డది?-

యిది మొదటి మనువుకాదని తెలుస్తూనే ఉందిగా!-

యింతకు ముందు ఎన్ని అయినాయి?-

వాళ్ళెవరు? ఏమైనారు?-

-మనసు అనుకున్నది - పైకి వినిపించింది,-

మదారు ఆకలింపు చేసుకుని,-

అదా,- అదో కథుందిలే!- అన్నాడు:

వినాలని ఉంది!-

'ఏం?'

'అలాటి మనిషిని, ఎన్నడూ చూడలేదు-'

'అది నిజం-అలాటి మనిషి,- మరొకతె లేదు,-'

'అంటే,–'

భారతంలో, పాండవుల వారు జనానావారి, పద్ధతి: అంతకన్న కొసరు– ఒక్క చేయి ఎక్కువ: అది ఏమీ విశేషం కాదు, గాని,– కోనయ్యా భాయ్! మీ పురాణ గ్రంధమ్‌లో,– ఒక ఋషిగారు,– రేవు దాటుతూ,– వారికి కోరిన మరియాద, ఒళ్ళువంచి చేసిన,– జాలరి పిల్లకాయకు,– ఒక వరం యిచ్చారు చూడు– ఏమిటది?– ఆఁ తెలుసుకాదూ?– సుబ్బాం– లెక్కకూడా అంతే,–

అయితే, ఒక తికమక ఉంది.

పుట్టినప్పుడు – సుబ్బన్న–

బుద్ధెరిగినాక,– సుబ్బాం!–

అర్థం అయిందా?–

అచ్ఛా!–

సుబ్బన్నకి,– వివాహం అయింది:

ఆడింది,– మామ కూతురు!

భార్య నీళ్ళు పోసుకుంది!

వీడి,– బదన్‌పై నదర్ ఫిరాయించింది:

అది ముదిరి– ముదిరి,– కుర్రోడు పుట్టేసరికి,– సుబ్బమ్మ అయిపోయినాడు: మనది,– అంతా కలసికట్టు గ్రామం కనుక,– యిక్కడ పుట్టిన వింత పొలిమేర దాటలా!– మన జనాభా పట్టీలో,– సుబ్బయ్య అన్నచోట– 'మ్మ' అని దిద్దాము: అంతే;

మనందరి మాటకేంగాని– ఆ యింటి కోడలికి చెడ్డబిడియం వేసింది: మున్ పటిలాగా– మనిషీ మనిషీ కల్‌సీ, మెల్‌సీ, ఉండేందుకు,– ఖుదా అంగీకారం రద్దు చేశార్‌గా।–

సుబ్బమ్మ, ఆ మనిషితో ఏమంది?– ఏమే – మామ కూతురా।– మంచిగా వచ్చావ్!– మస్త్‌గా,– కాపురం జేశావు! బస్! చిగురేయని కొమ్మమీద చిల్‌క వాలదు: వాలకూడదు! సౌ మే సాత్,– కాస్ మే హాత్,– అన్నట్టు అయింది, మన సంసారం: నూరు సమ్‌వత్సరాల్ తాఖత్ అని– దర్‌హమ్‌మీద ఉంటే ఏడు సమ్‌వత్సరాల్‌కీ యెన్నెమ్మ కొట్టింది:

సాగినార మట్టలతో బోగి మంట వేస్తామా?

నేనా, కట్టుకోకనూ కాను సుట్టు పంచనూ కాను:

యింక,– యీకడ నీవు బావుకునేది లేదు:

నీకు, మరో నీడజూపుతా!–'

–కాని,– ఆ మనిషి,– సమ్మతం కాలేదుగా!–

చిన్నప్పుడు,– మన పెద్దలు,– నా సెంగులాగి – నీ కొంగుకు ముడేశారు!– అది,– యీ జన్మకు ఖరారు!– నీవు, పంచె యిడిసి,– కోకగట్టుకున్నా,– నా కంటికి, మా యింటి మొగాయినవే,–

మనిషికి,– కాలిరిగిందా,– కన్నోయిందా?–

యిదో అవకరం గాదు–

అదృష్టం,– అనుకో!–

కైలాస పర్వతంమీద,– ఆ అయ్యా అమ్మా,– వాటేసుకు కూకుంటే,– అందులో ఏది ఆడ,– ఏది మగ,– విడమరచి చెప్పేందుకు,– దేవతలంటోరికి,– సేతకాదంట: మనం,– పున్నెం జేసుకున్న మనుకోరాదూ?–

వాపు బలుపుకాదు;

నీకొచ్చిందో వంకర కాదు:

ఒంటిమీదికి, వరదొచ్చింది,–

ఆకడా,– ఆకడా, మిట్టేసింది:

కాని,– దిగతీసిందా?–

తీసిందే అనుకో,– నీ ఉన్న ఉనికే,– నా కుంకమనుకుంట: నిన్ను చూసి నవ్వినోళ్ళు నన్ను చూసీ నవ్వనీ,– నాకేం సెబ్బర కాదు: నిన్నటేలదాకా, మీసం దువ్వినవోడివి,– రేపూ మాపూ కోకారైకా ఉమ్మసుమీదుంటావా– ఉండు,– ఒళ్ళు సెప్పినట్టు ఒంగు కాని,– ఏ లెక్క తప్పినా,– ఈ లెక్క తప్పదు,– నేను, నీవు కట్టుకున్న ఆడకూతుర్నే! నాతో నువ్వేం సుఖపడతవే– అనొద్దు! తెలియనోడిని తెలియనట్టు నేనుండనిస్తనా?.

ఏదీ కాని వేళ,– ఎవడికి ఆలివైనా,– ఏటికి యేడాదీ నువ్వు యెంకటాం పెనిమిటివే!

యిది, ఖరారు!– అంది,– ఆ మనిషి!

అలా మొండికేసింది,– కాని,– వీడికే మొగం చెల్లలేదు:

కాళ్ళూ వేళ్ళూ పట్టుకుని,– ఎలాగైనా పుట్టింటికాడ దిగబెట్టి వద్దామనుకున్నాడు,– ఉహుఁ– సాగలేదు:

వింత జరిగినా, విడ్డూరం జరిగినా,– మనవాళ్ళమధ్య ఉంటే గుట్టు చప్పుడుకాదు: ఏం జరిగిందీ పొలిమేరదాటి పొక్కదు: ఆకడ,– నన్ను కన్నవారున్నా,– ఊరు హోల్ మొత్తం విరగబడితే,– ఎందరి కన్ను గప్పగల్రు!– నిన్న మొన్నటిదాకా,– ఏ సన్నాసైనా, నావంక కన్నెత్తి చూశాడా?– యింక ప్రతి మలపకూ అలుసైపోనూ?– నాకు, మొగదిక్కు లోటైందని వెల్లడికాంగనే,– ఏ యెదవైనా,– చొరవజేస్తాడు: ఎగబడతాడు : ఎంతకని కాచుకుంటాను? చివరకు కుక్కలు చింపిన యిస్తరవుతుంది నా బతుకు!–

నేను,– యెంటలేనా అంటవేమో!–

అది, మరింత రగడ!–

నీ ఆకారం చూడంగనే,– వాళ్ళు, రెచ్చిపోరూ?– అదో మాయదారి తిరునాళ్ళయిపోదూ?– అయినా,– నిన్న మొన్నటిదాకా,– ఫలానోరి యింటి అల్లుణ్ణనిపించుకున్న వోడివి,– యీ ఆకారంతో– ఏ మొగం బెట్టుకుని, అ గడ్డ తొక్కుతావ్!– ఉనికి మారినట్టు ఊహలూ మారితే,– కాపురం జేసుకునే యిల్లాళ్ళు నీ ఉమ్మసు కుసూరుమంటారో? ఏం జరిగినా యీకడనే అయితే,– వీధినిపడం!– యిక్కడే ఉండిపోదాం!–

అంది భాయి!–

అలాగే,– ఆకట్టింది!

యింత విచిత్రం మన కళ్ళ ఎదుట జరుగుతూంటే,– మన గ్రామంలో వారందరూ చూస్తూ ఊరుకున్నారా?– అని నీకు సందేహం కలుగవచ్చును:

ఎందుకు ఊరుకుంటారు?-

బస్తీనుంచి,- బసవయ్యాగారు వచ్చారు:

బసవయ్యగారంటే,- ముచ్చి ఆయన: భావనారాయణ స్వామివారికి- వారి ఆలయంలో,- ఉత్సవం చేసే మంటపానికి, వారు, లక్కపని చేశారు: ఒక్క చేతిమీద,- మూడు సంవత్సరాల్,- అది,- కలియుగంలో వైకుంఠం:

బొబ్బిలి గోపాలస్వామి వారికి, పొన్నవాహనం,- వారు తయారు చేసిందే,- ఏడు సంవత్సరాల్: వాహ!

ఖుదావారి ఖుద్దునకూడా అసుమంటి ఆడకూతుళ్ళు ఉండరు: మీ పరీస్తాన్‌లో రంభా ఊర్వశీ వగైరా,- వీరి ముంగలా దిష్టిబొమ్మల్ భాయీ,- పద్మూడు విగ్రహాలు,- టూకి చేవ మానుతో-చెక్కడం, చే - తరిమెన చేసి,- ఆకారం తెచ్చారు: వాటికి, ఏవో పసరులు మర్దనచేసి- నిగారం తెప్పించి, మంగళాపురం అడవిలోంచి,- చిరివేరు,- చెంగలి వేరు,- చిర్రివేరు - జెముడు వేరు,- పాలవేరు ప్రబ్బరివేరు,- భమిడిపత్రి వేరు,- అత్తపత్తివేరు,- అడ్డసరం వేరు,- నాగజెముడు వేరు, సాగినారవేరు,- రుద్రజడవేరు- భూతులసి వేరు,- లక్కాకు వేరు,- లక్ష్మణపంజివేరు,- రక్తచందనం వేరు,- కెంపు చినుకువేరు,- పచ్చవావిలివేరు,- మొగిలివేరు,- మోదుగవేరు,- యిలాగని, యిరవయ్యిన్నీ, ఒక్కటి,- వేళ్ళు తెప్పించి,- బానెడు రసం తీయించి- కదళీకంద ఆ రసంతో భావనచేసి,- అంతా కలిపి కలికెంచేసి,- రాతిమదం,- యింగువ పాలు,- దిరిసెన గుజ్జు,- కలపంజేసి,- అదీ యిదీ రంగరించి- సగానికి దిగేట్టు ఎండను మరగబెట్టి- పాళంజూసి,- పాకం జూసి,- ఆ బొమ్మలకు, లెక్క వరుసను ఏడుపూతలుపూసి,- వెన్నెలలో ఆరబెట్టి,- రంగు వాటివంటపట్టిన పదును చూసి, తేనెపూత పూసి విడిచేశారు: భాయీ,- అది పాలరాయో,- దారువో కనుక్కోవడం కష్టం- ఎండ, వాన లెక్కలేకుండా - నూరేళ్ళపాటు ఆ తళుకు,- ఆ నిగారం అలాగే నిల్చి ఉంటుందని,- వారు భరవసా యిచ్చారు: ఆ శిల్పం, సంగతి,- ఆ విషయంలో,- వారి ప్రజ్ఞ సంగతి,- అది ఒక ఎత్తు,- వారి వైద్యం ఒక ఎత్తు;- చూడు భాయీ।- నేను పైన ఆ దండకం చదివింది ఎందుకు?- అది,- జగధాభరణం అనే భేషజం- అంటే ఔషధయోగం అని వారు సెలవిచ్చారు: ఆ విగ్రహాలమీద గాలి మనకు పదే పదే సోకితే,- శ్రీకృష్ణపరమాత్మవారి హయాములో,- అందరూ ఎలాటి ఆరోగ్యమ్‌గా ఉండేవారో,- అలాగే మనము ఉంటాం అని సిద్ధాంతం చెప్పారు: శిల్పం,- వైద్యం,- వారికి రెండు నేత్రాలు! రెండు నేత్రాలకీ కలసి,- ఒక్కటే చూపు కదా!- అలాగే,- వారి వైద్యం.- అదొక శిల్పం: శిల్పంతోనే వారు చేసే వైద్యం! అదొక విచిత్రం భాయీ! వారు చమత్కారంగా అంటూంటారు: మనది గాలివాటు వైద్యమయ్యా అని: ఔను. వారు సెలవిచ్చే ఔషధానికి గాలి అనుపానం: మనకు ఫలానా రుగ్మత అని చెపితే- వారు,- ఒకరకం విసినికర్ర యిచ్చి,- విసురుకోమంటారు: దాంతో,- ఆ నలత,- చేత్తో తీసేసినట్టు పోతుంది: యిందులో యింకొక విచిత్రం ఉంది: సుస్తీ అనేది,- మన వంటిమీద మనకు లక్ష్యం తగ్గినప్పుడు,- మనసు చేసే, యిషారా అంటారు: గాలీ, వెలుతురూ, భగవంతుడు,- మనకు దయచేసిన ఘనవైద్యులు,- వారికి సిబ్బందీ,- మూలికలు!- ఆకుల్‌మీద గాలిపారి,- వేడి సోకి వెన్నెలా సోకి,- అవి మనమీదకు కమ్ముతుంటే అదే చికిత్స అని సిద్ధాంతం! బొమ్మదేవర నాగన్న నాయుడు వారున్నారే

అంటే వల్లూరు జమీందారులు,– వారికి ఒక పర్యాయం,– ఒక విషయంలో రవ్వంత సందేహం తోచి,– తమ సమక్షంలో ఉంటూన్న పండితుల్ని అడిగినారట: వారికి తెలిసి ఉండే చెప్పలేదో,– ఘరానాకు లోటు అని చెప్పలేదో,– కాని,– అందరూ ఒకేమాట మీదికి వచ్చి,– హరి వెంకప్పను ముందుకు త్రోసి,– వారు,– ఏం జరుగుతుందో అని,– వెనుక బారున కూర్చున్నారు:

వెంకప్ప అంటే' వేయిందాల మనిషి.

ఓ యిందాన పండితుడే,– కాని,– బడుద్ధాయి,– అని పెద్దలు చేసే మన్నన:

ఆయనకి ఏం తెలుసునో,– ఎవరికీ రూఢిగా తెలియదు, కాని,– అతగాడికి తెలియనిదంటూ లేదని,– పండితులకీ పామరులకీ కూడా తెలుసు: తెనాలి రామలింగం పేరుమీద చెలామణి అయే కథాకమామీషుల్లాంటివి,– ఆయన చమత్కారాలు సవాలక్ష ఉన్నవి:

ఆ మనిషి,– గొల్లల్లో చేరి సుద్దులు చెపుతాడు.

కావడేసుకుని చిందేస్తాడు:

నారసాల వేసి,– హశ్శరభ లయకట్టి అడుగేసి,– అంగేసి:– కుప్పించి గంతేసి, దిమ్మతిరుగుతూ,– త్రిపురసంహారం చెపుతాడు,–

కొమ్ముల్ దిరిగిన సొనాయివాడికి ఢోలుకొట్టి శెబాసనిపిస్తాడు: ఫిడేలల్లే వీణ పలికిస్తాడు: మద్దెల మీద మాటలనిపిస్తాడు: నూనె మానిమీద ఝూమ్‌సేపు వాలు మొగ్గలేస్తాడు: గెడెక్కి ఆడితే,– షహర్‌మీద సవాల్ జేసిన బొమ్మలూరు దొమ్మరసాని,– మూడేళ్ళాయె, దేశంమీద దండుకున్న వరాలన్నీ ముల్లె కట్టి పాదాల ముంగల బెట్టి,– 'నీదిరయ్య మొగసిరి, నీవు బాపన పుటక పుట్టబట్టి,– మేం బాగుపడి పోయినాం!– అయిన కులంగాని ఆడకూతురువైయుంటే,– నాలాటిది గెడమీద కాలుమోపేదా?–' అంటూ మెటికెలు విరిచి మెచ్చుకుంది: వెంకప్ప,– ఆ వరాలేం జేసినాడు?– వేణుగోపాలస్వామివారి ఆలయంలో,– ముఖమంటపంలో రాసిబోసి,– చీకటి తప్పులు చేయడానికి చేతకాసులేక యిబ్బందిపడేవాడెవడైనా సరే,– స్వామికి మ్రొక్కి,– కావలసింది చేబదులుగా తీసుకుని,– మళ్ళీ చెల్లగడుతూ ఉండవచ్చు।– అని శాసనం చేశాడు, ఎవరూ నోరెత్తలేదు,– కాని ఏలినవారు,– చనువుంది కనుక,– యిదేమిటి వెంకప్పా!– అన్నారు:

ప్రభువులు చెయ్యందీ।– ప్రజలకు అవసరమైనదీ!–

చిత్తగించారూ।–

ఏలినవారు తినేదీ– ఎందుకూ కొరమాలినవాడు తినేదీ,– అన్నమే,– మీకు అది ఒక ఖర్చు కాదు: కాని,– అత్తరువుకూ పన్నీరుకూ,– ఆ అనుపానాలతో సేవించే ఔషధానికీ,– సాలుసరి అయివజు చాలీ చాలకుండా ఉంది: మీకు,– ఆ దేవుడిచ్చాడు!–

సరే,– అందరికీ తరుణానికి చేతిలో రూకాడక పోవచ్చు,– అప్పుకెళితే ఎవరిస్తారు?–

అందుకోసమని,– మీ కిచ్చిన దేవుడే వాళ్ళకీ యీ సదుపాయం చేశాడను కుందాం!–

అని, జంకకుండా జవాబు చెప్పేసరికి,– ఏలినవారికి తగలాలిసిన చోట తగలడంతో,– తాంబూలం ఖర్చు చాలా వరకూ తగ్గించుకున్నారు: వెంకటప్ప పోయించిన

వరహాల రాసి యిప్పటికీ అలాగే ఉండి: ఎంత బరి తెగినవాడికైనా స్వామి వారి ఎదుట నుంచుని,– అందుకు అప్పు పెట్టమని అడగటానికి దమ్ములుండద్దూ?– ఆ ఎత్తుతో,– ప్రభువూ ప్రజలూకూడా బాగుపడినారు:

ఒకానొక సమయంలో,– ప్రభువు, మాంచి ఖుషీమీద ఉండి వేంకప్పా!– నీవేం కోరినా తీరుస్తాము– అన్నారు.

మీతరం కాదన్నాడు।– యీతడు!–

ఆఁ! అన్నారు వారు:

'ఔను మహాప్రభో!– ఏలిన వారిని,– ఎందరం కూడి పెద్దను చేసినా,– మనిషి మనిషేకాని,– మహావిష్ణువుకాడు:

నాకు,– బైరులాగా ఎగరాలని ఉంది!–

మీరు తీర్చగలరా?–

అన్ని హంగులూ దండిగా అమరిన ఆడకూతుర్నె ఉడుకుడుకు వాళ్ళను ఉవ్విళ్ళూరించాలని ఉంది?–

ఆ ముద్దు చెల్లించడం మీ తరమౌనా?–'

–అన్నాడు: ఏలినవారు పకపకలాడి,– 'యీ అవతారంతోనే మన పరగణా ఓ కొలిక్కి దెస్తున్నావు: యిక ఆ పోణిమే అబ్బెనో,– మాలాటివాళ్ళ పాట్లు,– ఆ స్వామివారికి ఎరుక!–...'

ఆహా!– ఆ స్వామివారికే యెరుక।–

ఆడా మగా కాని,– అవతారం ఎత్తబట్టే,– ఏటి ఒడ్డు పడుచులు ఎగబడ్డారు: ఆదికాలంనాడు, – మోహిని వేషం కట్టి,– సదాశివుడికి సందె గోపాలం పట్టాడనే ప్రతిష్ఠమీద పరగణా ఏలాడు! అందాకా ఎందుకు మహాప్రభో!– వీధి భాగవతంలో భామ వేషగాడంటే,– చాటుమాటు సరసాలకి,– పడుచుపిల్లలు పగలబడటం మనకు తెలియంది కాదుగా!– ఎంతకాలం మీసం దువ్వితే ఏం లాభం?– ఒక్క కులుకు కులకడం వంటపడితే,– వయసుకత్తెలు త్రవ్వి తలకెత్తరా?– తామూ ఈ యోచనమీద ఉండండి।– మన పుణ్యంకొద్దీ ఏ ఔషధసిద్ధుడో,– వచ్చి,– రవంత అంగలేపం అక్కడా అక్కడా,– అనువు చూసి పట్టించాడో,– ఆపై, మన భాగ్యమే భాగ్యము!– ఓపికున్నంత, వసరుమీదుండవచ్చు!– ఒకరికి పదిమందితో వరుస కలపచ్చు! ఉల్లిపొరలాటి పావడా కట్టి, ఉఫ్మంటే ఎగిరిపోయే పైట వేసుకుని,– బిగువుమీదుంటే,– ఫాలాక్షుడైనా బిత్తరపోడా?– కాని,– మహాప్రభూ! మన జన్మ కా ప్రాప్తం లేదేమో?–' యిలా ఎకసెక్కెం చేశాడు వెంకప్ప!–

అది– శానా రోజుల క్రిందటి మాట–

అలాటి నోటి సరదాలు,– వారికి మామూలు:

ఆనాడు రాజావారికి తోచిన సందేహం ఏమిటంటే?– పార్వతీ పరమేశ్వరులు,– ఒకరికి ఒకరు హత్తుకున్నది,– సగం సగమేకదా,– తతిమ్మా సగం ఏమైందీ– అని। పండితుల్ ఏమి సమాధానం జెప్పినా,– రాజావారు పై సవాల్– పక్క సవాల్ వేస్తే, వీరికి గుస్సా రావచ్చును: వీరి మౌనం జూసి,– వారికి ఆగ్రహం కావచ్చును: అందుకని వెంకప్పను. ముందుకు త్రోశారు:

ఆ మీద,– వారికి– కోపం అయితే వచ్చింది కాని,– ఎదుటివారు,– తాను

నిత్యం నమస్కారం చేసే పెద్దలు కావడం మూలాన, తమాయించుకుని. మన సభలోకి,- వెంకప్పే మహా విద్వాంసుడా?- అన్నారు- వెంకప్ప,- వెంటనే అందుకుని, పూరేడు పిట్టకు ఉండేలు బద్ద చాలదా!- యిది వారిదాకా వెళ్ళనక్కరలేదు- వీడు ఫైసలు చేయగలడు!-

ఆ తునకల్లో,- ఒకటి ఏలినవారు। ఒకటంటే ఆ రవంతలో-, ఓ నెరుసు, తతిమ్మా ఆ ఒకటీ,- వీడు!-

గజ చర్మంలాటి,- యీ గావంచా,- ఒంటినిండా విభూతీ,- యిది,- మన అవతారం!-

ఆ నెరుసన్నానే,- యీ తడబాటులో మొగానున్నది,- ముక్కుకు జారింది: అది,- వీరందరికీ విదితమే!-

ఏలినవారూ!- ఆది దంపతులకు నమస్కారంచేసి,- యీ ఆతతాయి,- ఛలోక్తి చేశాడు:

అసలు తత్త్వం ఏమిటి?-

అయ్య అద్దమంటివాడు:

అమ్మ- రతనాల మొలక!- వారు,- ఏకాంతంగా సరసను ఉన్నప్పుడు,- సేవించుకునే,- పరివారానికి,- అలా కనుకలి అవుతుంది: ప్రతిబింబం అలా కనబడుతుంది:

మరెలాగంటే,- రెండు అద్దప్పలకలు ఒకదానిమీదికి ఒకటి సగం జరపండి!- ఏం కనబడుతుంది:-

అక్కడా అదే తంతు।-

తునకలు అతకడం కాదు స్వామి!

బింబాన్ని మరో బింబం ఒరుసుకుంది!

వెంకప్ప యిలా అనేసరికి,- ఏలినవారు,- అందరితోబాటూ ఆహా!- అని ఆనందించారు.

# క్షేత్రయ్య

(అసంపూర్తి నవల)

---

మొదటిసారిగా ప్రచురితమవుతున్న మల్లాది వారి అసంపూర్తి నవల

# క్షేత్రయ్య

(అన్నమయ్య 'వనమాల' వలె
క్షేత్రయ్య జీవిత-కవితా విశేషాలతో
రామకృష్ణ శాస్త్రిగారు వ్రాయ సంకల్పించిన
నవల ప్రథమ అధ్యాయం.)

శ్రీః

సీమకు-తూరుపు తెలవారింది: ఊరిమీద మసక,- మాటుమణిగి పోతూంది: వెదురు పొదలోకి, వెలుతురు, జొరబడేందుకు మారాము చేస్తున్నది: లక్ష్మణ బురుజుమీదికి,- ఎండపొడ, బావుటా కొట్టినట్టూ కొట్టింది- కోట గుమ్మంలో నగారా మ్రోగింది: పారువేట వనంలోంచి, చిలకలు, చిగురులు నోటకరచుకుని, పైర గాలికి, ఉల్లిపొర ఉత్తరీయం ఎగిరినట్లు, మూకకట్టి, ఏటవాలుగా వచ్చి, నరసింహస్వామి గోపురం మీద వాలినవి: కోటలో పూజ ముగింపుకు వచ్చే వేళ: ఏలినవారు, ఆరతి పట్టారు: సేవలకు అమరిన బ్రాహ్మణ్యం,- అర్ధవలయంగా,- నిలుచున్నది: వారిలో వరదయ్య: ఉన్నాడు:

ఏలినవారు,- స్వామివారికి,- మనసుతో ఒకమారు, పలుకుతో ఒకమారు,- అరమోడ్పు కనులతో ఒకమారు,- ఆరతి ఎత్తిన వెనువెంటనే,- నాట్య-సేవకి కల్యాణి,- చెంగున ఏలినవారి సరసకు ఉరికి,- ఆరతి అందుకుని,- ఆరకుండా,- నాట్యమాడి,- వలయం జుట్టాక,- స్వామికి వెనుజూపక,- జతి ముగింపుకు తెచ్చి, తీర్మానమిచ్చి, వరదయ్య సరసను ఆగిపోయి,- ఆరతి పళ్లెర మందుకొమ్మని కనుసైగతో తెలియజెప్పి,- ఆతడు అలా సేయంగా,- బ్రాహ్మణ్యానికి,- ఆ వెలుగెత్తేసరికి,- స్వస్తి పూర్తికావడం వారు ఆరతికి మ్రొక్కి,- చేతులు కట్టుకోగా,- ఏలినవారు ఆరతి కనుల కద్దుకున్నవారై,- వరదయ్యను సమీపించి, ఠీవిగా,- చేయందుకున్నవారై,- రవంత వినయం,- పలుకులకు పొందుపరచి,- 'యిలా దయచేయాలి!' అంటూ, పట్టిన చేయి విడువకుండానే,- అడుగులు వేయించి,- తామంతకుముందు,- ఆసీనులై ఉన్న చిత్రాసనం మీద దయచేయించి,- మోహనా!? అని,- అర్థోక్తిగా,- తలఊచగా,- అందుకోసం ఆయత్తంగా ఉన్న మోహన,- వరదయ్యకు దుశ్శాలువలిచ్చి,- పన్నీరు జల్లి,- ముందుకు వేసిన అడుగు వెనుకకు వేయంగా,- శ్యామ,- పూవులూ మొహరీలూ ఉంచిన రాగిపళ్లెం, ఒకచేత ఉంచుకుని,- మరో చేత గంధం గిన్నె ఉంచుకున్నదై, వరదయ్యకు చేరవచ్చి,- చిరునవ్వున మ్రొక్కి,- ఎదుటివాడు వరుసైన సరసుడన్నతీరున గంధం, చెక్కుల చిలిమి – మొహరీలు,- ఆయనకు అందించింది: వరదయ్య,- పూవులు దోసిట పట్టి,- శోభనాచలేశా,- శ్రీనరసింహా!- అని స్మరించి,- స్వామి సన్నిధిలో,- ఆ పూవులుంచి,- మొహరీల పళ్లెం,- చేతబట్టుకుని,- బ్రాహ్మణ్యాన్ని సమీపించి,- తలకు ఒక్క మొహరీ యిచ్చుకుంటూ రాగా,- ఒక్కరికి దక్షిణ

తక్కువైంది: మ్రాన్పడి,- ఆ వైనం తిలకిస్తూన్న ఏలినవారూ,- వారి దివాన్జీ రెడ్డి పంతులుగారూ,- ఒక్కుమ్మడిగా ఉలికిపడినారు: కాని వరదయ్య, ఏ మాత్రమూ చకితుడు కాకపోవడమే కాకుండా,- పసివాడి నవ్వు నవ్వి,- 'అయ్యా!- అంతవరకూ,- ఏలినవారు నోచుకున్న సుకృతం! యిది-నా ప్రాప్తం!- మా తలిదండ్రులు,- చేసుకున్న రవంత పుణ్యానికి ఫలితంగా,- నేను, పదమూడు సంవత్సరములు కాశీలో నిత్యనివాసంగా,- విశ్వనాథుని సేవించుకోవడం సంభవించింది: ఆ పుణ్యం మీకు సమర్పించు కుంటున్నాను:- అనుగ్రహించండి!' అనగా, బ్రాహ్మణ్యము అహో అన్నది:

ఏలినవారు,- బొమముడి వేసినారు:

అది,- క్రీగంట గమనించిన రెడ్డి పంతులు,- తన ఆనందం పైకి పొక్కకుండా,- మనసులోనే అట్టె పదిలపరచుకుని రవంత ధుమధుమ కనుల కరవు తెచ్చుకున్నాడు:

బ్రాహ్మణ్యము,- పూజా మందిరమునుంచి కదలింది: ఏలినవారు, దివాన్జీ వంక జూసి, అడుగుముందుకు వేసే అంతలో,- ఖుద్దున ఉండే వెంకన్న,- అయ్యా,- సభా భవనానికి,- తోవ యిటు-' అని మనవులిచ్చుకుని,- వైదొలగగా,- ఏలినవారు, అటు దయచేశారు: రెడ్డి పంతులు, వరదయ్యతో,- 'ఏలినవారు,- తమతో, ముచ్చటించాలనే ఉద్దేశంతో ఉన్నట్టు, వారి కటాక్షంవలన గ్రహించడం సంభవించింది: మనము వారి ననుసరించడం- మనకు- మరియాద! తాము నాతోడుగా దయచేయండి.' అని, వినయముట్టిపడేలాగున ఆజ్ఞాపించగా,- వరదయ్య, 'మాంచి'దని తలఊపి,- పంతులు వెంట, ఏలినవారు సుఖాసీనులై ఉన్న అభ్యంతర మందిరానికి పోయి,- వారి ఎదుట పడగా,- వారు వంశాచారపు ఠీవిని అనుసరించి,- ఎదుటి వారివంక చూడకుండా,- ఓ పక్కగా వొదిగి నిలుచున్న రెడ్డి పంతులు వంకనైనా చూడకుండా,- ధ్యాస ఎక్కడో ఉన్నట్టు కవళిక తెచ్చుకుని, యిలా,- ప్రారంభించారు.

'రెడ్డి పంతులుగారూ! మా అభిప్రాయము ఆ పండితుల వారికి మనవి చేయండి!'- అనడమే తరవాయిగా, ఆయన చిటికెలు వేసినట్టు 'చిదం. చిదం' అనేసి,- 'అయ్యా! వరదయ్యగారూ!- ఆఁ- ఆఁ- అదేమి, అలా నిలుచునే ఉన్నారు!- యిలా దయచేయండి!' అంటూ వినయం ఉట్టిపడేయగా,- వరదయ్యా,-

పంతులుగారూ,- మందలించేందుకని పట్టుకొచ్చి, యీ మర్యాదలేమిటండీ!- అయితే,- నేను కూర్చోంది,- ఏలినవారూ కూర్చోరేమో - వారిని అలా నిలవేయడం,- అదనంగా మరో అపరాథం అవుతుందేమో,- అనే శంకకొద్దీ కూర్చోవలసి వస్తూంది!- కూర్చుంటాను!

ఏలినవారి మనసు- మీలాగే నేనూ గ్రహించాను!

మీరు వివరించనవసరం లేదు-

అందుకు సమాధానం యిది!-

మీ ఆదరణను,- నేను నిరసించలేదు-

సుమ సముదాయం దైవానికీ,- హేమం, దైవ స్వరూపులకే సమర్పించాను! మీ సుకృతం మీకే ముట్టజెప్పాను:

తరతరాలుగా, మాకు లక్ష్మీకటాక్షం లేదు-

కాని,- గ్రాసోవాస దైన్యమూ లేదు-

అంటే,- రాజభోజనం కాదనుకోండి,

ఏదో తదన్నమ్ - తద్రసమ్ - ఆ ఉన్నంతలోనే వేళపట్టున వచ్చిన వాడికి మాతోబాటు సర్దుకునేందుకు వెసులుబాటూ ఉంటూనే ఉన్నది.

యిది,- అప్పటిమాట - అనగా,- నేను కాశీకి వెళ్లకముందు విషయం!- యీ పదమూడు సంవత్సరాల కాలంలో,- మావారి వైఖరి మారిందేమో,: ఏం చెప్పగలం!-

ఏలినవారు,- నెరదాతలు:

అది,- నేను మట్టుకు కాదని ఎలా అనగలను!-

అయితే,- ఏలినవారి సంకల్పమేమో కాని, గోచీ పాతరాయళ్లను - కుబేరులను చేస్తున్నారు:

సీమకు ప్రభువు రక్ష - ప్రభువుకు బ్రాహ్మణ్యం రక్ష:

తమ చేతి చలువను,- వారిలా అనుదినం కాసులు కళ్లజూడటం అలవాటు పడిపోతే,- తెల్లవారేసరికి గాయత్రి గుర్తుకు వస్తుందా?- సంధ్యావందనం సాగుతుందా?

ఆపై, స్వామిపూజ వేళ,- శంపాలతలవంటి చంద్రముఖులు, ఒరుసుకుంటూ సరసను నడయాడంగా,- వీరి బుద్ధి, పుణ్యానబోతుందా?- యింటివద్ద యిల్లాలు కంటికి అనుతుందా?

దక్షిణ పుచ్చుకునేందుకంటే, తగుదుమని, చేజాస్తారుకాని,- దక్షిణ నాయకులు కాగలరా? ఆ రాజసం వీరికి ఎక్కడిది?

బ్రాహ్మణ్యం బాగుపడటం, తమకూ మాకూ సమ్మతమే: అది సర్వసమ్మతమే-

కాని,- ఏలినవారి కటాక్షాన బ్రాహ్మణీకానికి ఓగాయిత్యం వాటిల్లు తూన్నదేమోనని,- ఒక్కపిసరు సందేహం!

ఆలకించుతూన్నారుకద రెడ్డి పంతులు వారూ,- తప్పులెన్నుతున్నానని భ్రమ పడేరు!- తలతడివి చూసుకుంటున్నాను.

యిన్నాళ్లూ,- ఉన్నది గంగా తీరాన

తిన్నది - సత్రాల్లో-

మూటకట్టింది,- ముందుకు అక్కరకు వచ్చే చదువు!

అది,- యీనాటికి తెలిసివచ్చింది-

పోగా,- యింతకాలం నేను చేసిందేమిటి?

నూలి పోగుకు పాయలు దీయడం- ఒహటో అరో శాస్త్రం ఏకాపోసెనం పట్టి- సాధించినదేమిటి?

సేలువులు సంపాదనకు చేజాచడం-

పది గ్రంథాలు పారజదివి నానేమో కాని,- పది గరిసెల ధాన్యం పండించుకుని,- గాదెబోసి,- కాలక్షేపం చేయడం,- నావల్లనయేపనా?-

చదివిన చదువు పేరు జెప్పుకుని,- చేజాచి, ఎదుటివారి కటాక్షంకోసం,- ఎదురు చూడవలసిందేనా - ఏలేవారు, ఎందుకు మా ఒక్క కులాన్నే ప్రయోజకుల్ని చేయతల పెట్టలేదు?- యిలా అనాదిగా,- ఎందుకు వస్తూంది?- దీనికి విమోచనం ఎప్పుడు?

తమవద్ద - సెలవే తీసుకుంటాను!

పేదవాణ్ణిగా వచ్చాను: పేదవాణ్ణిగానే పంపించండి: అంతకన్న పెద్దచూపు చూడవద్దని,- నా కోరిక:

వరదయ్య, యిలా పలికినవాడు కాగా,- ఏలినవారు మౌనంగానే ఉండి

పోయినారు: రెడ్డి పంతులు, మాత్రము,– నియోగపు ఠీవిని నవ్వి, దానికేం!– మీరు సెల విచ్చింది: మహ బాగా ఉంది: మేము యీయదలచిన నూలిపోగు వాసి తాము స్వీకరించవలెనని నిర్బంధమేమీ లేదు: బ్రాహ్మణ్యం మాట శిరసావహించేందుకే,– ప్రభు వుల వంశం ఉద్భవించింది: మనవారిలోనూ,– చదువుల మాట తలపెట్టాక వ్యవసాయం జేసుకుంటూ నలుగురితోబాటూ తీరికైనవేళ కృష్ణారామా అనుకుంటూ నిశ్చింతగా కాలక్షేపం చేయడం పరిపాటిగా ఉన్నదే: చదువు లెక్కువైతే సంశయాలూ ఎక్కువవుతాయని,– మేము విన్నదే,– ప్రత్యక్షంగా తెలుసుకుంటూన్నదే: దానికేమి!–

కాని,– కొందరన్నా చదువుల కోసమని పుట్టకపోతే,– అలనాడు ఆదిమీనం ఉద్ధరించిన వేదాల గతేం కాను: వేలాది సంవత్సరములకు పూర్వం,– మహాతపస్సంపన్నులు లోకహితార్థం రచన చేసిన గ్రంథములు, భక్తితో పఠన ప్రచారములు చేసేవారు లేకపోతే,– లోకమేం కాను: ప్రభువులు ధర్మరక్షకులే! కాని,– ధర్మస్వరూపం, లక్షణం తెలియజెప్పేవారు బ్రాహ్మణులే: నిజానికి, యోచిస్తే– లోకపాలనం జేసేది, మీరు: మీకు బాసట ప్రభువులు: అంతేకాని,– యిలా మీరు భావించడం,– సంప్రదాయ సిద్ధముగా లేదేమోనని,– నా అనుమానం:

దానికేం లెండి: నేనేదో కించిత్తు లోకానుభవం కలవాడనేకాని,– పండితుడినా?– మీ వంటివారు చెప్పిన విషయాలే మీవద్ద ఏకరువు పెట్టాను: అంతే,– యిక మాకు సెలవు యిప్పించండి: మా సీమలోనే యికమీద తమ నివాసం గనుక,– ఎన్నడన్నా తమ యోగక్షేమము తెలుసుకునేందుకు అనుమతించండి.

– ఏలినవారు, వరదయ్యకు నమస్కారం జేసినవారై,– లోనికి దయచేశారు. అప్పటికి, రెడ్డి పంతులు,– యెక్కుదిగి,– వరదయ్యను,– కౌగలించుకుని, 'మహామహా వాళ్లను ఎందరినో చూశాను. కాని ఎన్నడూ నాకింతటి ఆనందం కలగలేదు: నీ తీరే వేరు: నాకు నచ్చిందనుకో!– నీ ధోరణిలోనే నీవు మసలితే ఎంతో వృద్ధిలోకి వస్తావు. దేశాన్ని బాగు చేస్తావు: ముందు ముందు ఏం చేయనున్నావో,– ఏం కానున్నావో,– యిప్పటికి నీకు తెలియకపోయినా,– ఆ దైవాన్నే నమ్ముకో!– వాడికి తెలుసు!–

'సరేగాని,– నీకు సంగీతమంటే యిష్టమేనా?–'

'ప్రాణం!–'

అహఁ– పాండిత్యముకూడా–

'అఖండంగా ఉంది – ఆలకించడంలో – ఆనందించడంలో–'

'ఆలపించడంలో,–?

అక్షరాభ్యాసంతో ఆగిపోయింది!–'

'అదేం?–'

'ఆచార్యకృప?– మా వ్యాకరణాచార్యులు, దత్తోజీపంత్ అని ఉన్నారులెండి: యిప్ప టికీ చల్లగా ఉన్నారు: పైనుంచి పాణినీ పతంజలీ దిగివచ్చినా, పై గ్రంథం వారి సన్నిధిలో చేతబట్టవలసినదే– యిహ సంగీతంలో అంటారా, ఆ మనిషి సరస్వతీదేవి వీణ: వారికి మరో ధ్యాసలేదు. భార్యాపిల్లలు– ఆ జంజాటనలేదు!– మనిషి ఒక్కడూ!– ఆయన సంగీతంలో యింతకాలం నేను మునిగి తేలాను: 'ఆలాపన పుట్టుకతో వచ్చేది– కాని ఆనందించడం బ్రహ్మవిద్యరా! అది నీకు విశ్వనాధుడు కటాక్షించాడు,– యిది, నాకూ, అది,– నీకూ తరణోపాయం,–' అని వారు సెలవిచ్చారు: మీరు ఆమోదిస్తారా?–'

'ఉపదేశంగా భావిస్తాను: తలదాయిస్తాను. వరదయ్యా!- వారన్న వాక్యం. వేదాలసారం: అది, నా చెవిన పడటం నా సుకృతం: యిది లోకానికి వెల్లడి కావాలి: అది నీ వల్లనే,- కావాలి తండ్రీ!- లోకాన,- ఆనందమే వెల్లి విరిసిపోతే,- సంగీత సాహిత్యములే సార్వభౌములైతే,- యీ భువనం అపరనందనం కాదా... ఆ సుదినం రాదా- రాదా?...'

రెడ్డి పంతులు, ఆనంద పారవశ్యములో,- పూచిన తంగేడైనాడు: నాయనా,- లోకానికి యీ వరమిస్తావా?- అని ప్రాధేయపూర్వకముగా చేజాపినాడు:

వరదయ్య ఆయన చేతులు పట్టుకుని,- పంతులుగారు,- యిక యీ జీవితము అందులకే,- అంటూ ఆయన చేతులు కళ్లకు అద్దుకుని,- వారివద్ద సెలవు తీసుకున్నాడు.

ఆ సాయంకాలానికే,- బెజవాడ జేరుకున్నాడు:

కనకదుర్గా మహాదేవి,- సన్నిధిలో నిలిచి,- మానస పూజచేసి,- 'ఆనందమయీ! కాశి' క్షేత్రాన చదువులిచ్చావు కనువిప్పు జేశావు: కనికరించి మరల సన్నిధికి రప్పించు కున్నావు: యీ జన్మ చరితార్థమయేదెలాగో,- నీవే,- ఆనతీవమ్మా!- అంబా!- రెడ్డి పంతులు చేత,- పలికించింది,- నీవే నవిపించింది : చిత్తమున ఉంచి, పూజించాను : సర్వవ్యాపినీ,- ఆ తీరునే లోకాన్ని సేవించుకుంటాను:' యిలా మనవి చేసి,- ఆ రేయెల్లా అంబ సన్నిధిలో ఉండి,- వేకువను కృష్ణా స్నానం జేసి,- దారిపుచ్చుకున్నాడు:

సముద్ర తీరాన ఉన్న బందరు గ్రామం,- అక్కడికి, ఫౌజు నడచే బాటను పోతే నాలుగామడ:

అక్కడ,. మేనమామ ఉన్నాడు:

తల్లి కన్న పెద్దవాడు: ఆయనంటే బంధుకోటిలో యావన్మందికీ కంటగింపు: కార ణం: ఆయన సుఖంగా బ్రతుకుతూ ఉండటమే: అది మరీ విడ్డూరంగా లేదా అంటే,- అందుకాయన కర్తా? అది లోకం పోకడ: ఆయన అపరాధమేమిటి?-

బ్రహ్మహత్య గోహత్యలు చేశాడా!-

చేసి ఉంటే చేసిన నలుగురితోబాటు పెద్దమనిషిగానో ప్రభువుగానో చలామణీ అయేవాడే!-

ఆయనకు,- చిన్నప్పుడే భార్యా వియోగం కలిగింది: ఒక పర్వదినం నాడు,- ఆమె కృష్ణలో మునిగిపోయింది: ఆ పిల్ల అంత రూపసి కాకపోగా,- ఎదుటి వాళ్ల దృష్టిలో అనాకారి: తల్లి కరవయేనాటికి వడసారం,- మూడోయేడు: ఆ బిడ్డను, వరదయ్య తల్లి- వరలక్ష్మమ్మ మెడకు కట్టుకుంది:

అప్పటికి, వరదయ్యకు - ఏడో ఏడు-

మేనమామ కూతురంటే- ఈ పిల్లవాడికి అదెందుచేతో, తగని మక్కువ. ఒక్కక్షణం విడిచి వుండేవాడు కాదు. చంకనేసుకుని తిరిగేవాడు.

వరదయ్య తల్లి అదోరకపు, పూర్వకాలపు మనిషి. ఆమెకు వీళ్ల కలిమిడి గిట్టలేదు. ఇద్దరూ ఒక్కచోట వుండటం ఆమె కంటపడిందో; గచ్చకాయలు చెదరగొట్టినట్టు చెదరగొట్టేది. ఆవిడకు మేనగోడలంటే వల్లమాలిన అపేక్ష లేదనా? కాని, యీ అన్యోన్యం మటుకు గిట్టదు.

వరదయ్య తండ్రి - శివరామయ్య- వస్తుతః ధూము-ధాముల మనిషి; మట మటలాడుతూ వుంటాడు. అయితే, బయటవాళ్ల మీద చిర్రు బుస్సుమనడు. ఆ యింట్లోనే

ఆ కాస్త సింహగర్జనా.

కాని పిల్లల విషయంలో మటుకు బహు స్వాత్త్వికుడు. అయితే యిందులోనూ ఒక తిరకాసు వున్నది. వరదయ్యంటే తనకొక్కగా నొక్కడు గనుక, వాడిమీదే పంచప్రాణాలు పెట్టుకుని బ్రతుకుతూన్నా, అతిగారాబం చేస్తే వాడి జాతకం యోగించదేమో అనే విశ్వాసంతో, పిల్లవాడిని బెదురుమీదే వుంచేవాడు. "మా కుఱ్ఱ సన్నాసి" అనడం తప్ప మరో ముద్దు పేరున పిలిచి ఎరుగడు. అదీ ఆ మనిషి తీరు.

ఆ యిల్లాలి వాలకం ఆయనకే, నచ్చలేదు. చూసి చూసి ఒకసారి కలగజేసుకుని అన్నాడు గదా; "అదేమే, అది, వెయ్యేళ్లు వర్ధిల్ల వలసిన అన్యోన్యం, ఈ చీదరింపులెందుకు?'

ఆవిడ వెంటనే అందుకుంది. "దొరక్క దొరక్క నాకీ కోడలే దొరకాలా."

"అయితే; నీ మనసులో మాట, మన సన్నాసికి దీన్ని చేసుకోనంటావా?"

"నడిపోయింది! ఆ నలుసు నాలుక్కాలాలపాటు బాగుండాలని లేదా"?- కనుబొమ్మలు కలిసుంటే నొష్టను కుంకం. నిలుస్తుందిటండి?"

"ఆసిపోక నీదో వెఱ్ఱి! కడుపు చలువను పుట్టాడు. కనుబొమ్మలేం చేస్తాయే?" మన వంగసాల్లో అల్పాయుష్కులు లేరు!"

"లేకపోవడం ఏమా అని నేటికీ అభాగ్యురాలు పుట్టుకొచ్చిందిగా!"

"మళ్లీ అదేమాట? తల్లిలాటి దానివి నువ్వే ఒకసారికి పదిసార్లు అలా అంటే దైవం 'తథాస్తు' అంటాడే. అదీ, పచ్చగా ఉండాలని నీకు లేదా?

"ఎందుకు లేదు? కాని, దాని మొగాన ఆ రాత లేదు. దానికి కల్యాణం బొట్టు పెట్టి, నాకన్న బిడ్డను బలేసుకుంటానా?"

"వద్దులే, ఎలా పుట్టిందో అలాగే వెళ్ళిపోతూంది."

"మీది మరీ విడ్డూరమండీ! ఆడదయి పుట్టినాక యే అయ్య చేతిలోనో పెట్టక తప్పుతుందా?"

"తెలిసీ, అంత ఘోరం ఎలా చెయ్యడం? పిల్లనిచ్చుకున్నచోట పచ్చగా వుంటే బాగుగానీ, పాలకీ ఎక్కినవాడు పరమ పదానికి వేం చేశాడంటే, ఆ పాదిత్యం నీకు చుట్టుకోదూ?"

"మీరు యతి అంటే ప్రతి అంటారు. కాలకూట మంటి దానికి విరుగుదుందండీ–"

రెండో పెళ్లి గీత వున్నవాడికి దీన్నిచ్చి చేస్తే రెండు జాతకాలు ఢీ అంటే ఢీ అనుకుంటూ యిద్దరూ సుఖంగా వుంటారు!'

'అహా!. ఆ బ్రహ్మదేవుడు, తన ఉద్యోగం, నీకు దఖలు పరిస్తే బాగుండిపోను: పాతపట్టాలు రద్దుచేసి కొత్త పట్టాలిచ్చుండేదానివి:

యింతకూ– అది– నీ–మేనకోడలు!– నీవేం జేసినా, దాని మంచికే,– అని సరిపెట్టుకుని ఊరుకోవాలి: నేను, కలుగజేసుకోను,– కాని,

నీవు వద్దన్నా– ఒక్క సలహా మట్టుకు యివ్వక మానను:

సంబంధం మనం వెదకలేం:

అందుకు నీతోడబుట్టిన వాడే తగును!

రెండో పెళ్ళి,– గీత అతగాడికి స్వానుభవంగనుక– తనలాటివాణ్ణి, మరొహణ్ణి యిట్టె వెదకి – రేపీ పాటికి పట్టుకు వస్తాడు! నీవు సరే నంటివో,– యిప్పుడే కాకిచేత

కబురంపిస్తాను:

'-పంపరూ: వాడి మొగానికి కాకులూ గ్రద్దలూ కాక: రాజహంసల్ని తెప్పిస్తారా?- మంచో చెడో వాడి బ్రతుకేదో వాడు బ్రతుకుతున్నాడు: సందులో సందుగా వాణ్ణి, యిలా ఆడిపోసుకోవడం దేనికో?-

అయినా,- ఆ మాట ఎత్తారు కనుక తెలియకడుగుతాను: వాడు యింతకూ జేసిన నేర మేమంటే- లక్షణంగా,- మళ్లీ ఓ యింటివాడైనాడు:...'

'యీ అపేక్ష ఎప్పటినుంచో!- వాడు అలా యింటివాడైన కొత్తరోజుల్లో,- మనింటి కొస్తే,- పలుకరించనన్నా పలుకరించకపోతివే- పట్టెడు అన్నం బెట్టక పోతివే!-

యింటికి వచ్చిన తోడబుట్టినవాణ్ణి కుక్కను తరిమినట్టు తరిమి కొట్టడం- నీకు ఒక్కరైకు చెల్లింది- తిరగేసి అడుగుతాను- యింతకూ,- వాడి దోషమేమిటి?-

ఒక సాని కూతుర్ని చేరదీశాడు అంతేనా-'

-'అహఁ- అదేవీణ్ణి-మాయజేసింది!- లేకపోతే,- అంతకుముందు ఎంత నిష్ఠ - ఎంత నియమం-?-'

'-వాటికేం- అవి నిక్షేపంగానే ఉన్నాయి.'

వాడేం తాగి తందనాలాడుతున్నాడా?-

ఆస్తి తగులబెట్టి ఫకీరైనాడా?-

ప్రయోజకుడు కాలా?-

-వాడేం సానిదాని కాళ్లు పిసుకుతున్నాడా?-

వేణుగోపాలస్వామి వారి సన్నిధిలో ఉండి,- ధర్మకర్తృత్వం నిర్వహిస్తూ, పెద్దల చేతా, పిన్నల చేతా అవుననిపించుకుంటున్నాడే కాని,- జులాయి తిరుగుళ్లు తిరుగు తున్నాడా? తతిమ్మా గృహస్థులకన్న ఎక్కువ నీతిగానే ఉన్నాడు - ఉంటున్నాడు-

ఆ రంగనాయకి మట్టుకు,- వీడు చేపట్టకముందు,- ఊరి బయట గుడిసె వేసుకు కూర్చుందా? ఆ సంగీతానికీ,- ఆ నాట్యానికి, నవాబుగారి చేత సలాం జేయించు కున్న మనిషికాదూ?- ఆవిడేం, వీడి కుబేర సంపద చూసి వరించిందా?- గుణం జూసి కాదూ?-

వీడు మనకు పనికి రాలేదు కాని,- కత్తిలాటి మనిషి కాదూ,- ఏ గంధర్వుడో నియ్యోగులింట తప్పబుట్టాడు కాని,- అలా వీణె వాయించడం, అలా పాట పాడటం, మరొకరికి తరమటే? వారు ఒకరినొకరు వరించడమనేది,- అపరంజి పరిమళించినట్టూ అపురూప విషయం కాదూ- మనం వాడిని వెలివేశాంగాని,- మనం అని ఎందు కంటున్నానంటే- నీవు కద్దన్నా వద్దన్నా, నీ పాప పుణ్యాలలో నాకూ అంతోయింతో హక్కు భుక్తం గనుక.

ఆ,- మనం వెలేశాంగాని,- దేవుడు వెలెయ్యలేదో? వాళ్ల కాపురం ఎక్కడ?- స్వామివారి, కళ్లముందు: ముప్పొద్దులూ స్మరించేదెవరిని?- వాడిని!- అందుచేతనే,- 'రత్నదీపంలాటి కూతురు పుట్టింది- తల్లి,- ఊరికి ఖ్యాతి తెస్తే - కూతురు దేశానికే తెస్తుంది - నేను, యివాళ యిల్లా అన్నానని గురుతుంచుకో,-

'అదేమిటండీ - నా అన్న ఘనత నా దగ్గిర వర్ణించాలా? నేనేం గుండకొయ్యనా- నాకా మాత్రం తెలియకనా?- కాని,- వాళ్ల నడుమ ఉంటూన్నప్పుడు, మన అన్నం మనం దింటున్నా లోకానికి వెరవాలి!-'

'సరే - యిది ఎప్పటిపాటే... యిక యీ స్వస్తి కట్టి పెడదాం!- గాని,- నీ మాటే చెల్లాలంటే,- యిప్పుడే వీణ్ణి దాన్నీ విడదీయడం మంచిది!- ఒక్క చోటే ఉంటే ఆనాటి కానాడు యీ అనుబంధం మరీ బలపడుతుంది... యిప్పుడే త్రుంచి వేయడం మంచిది: వీణ్ణి బందరు పాఠశాలలో జేరిపిస్తాను. ఆ ధ్యాసలోపడి,- దీన్ని మరచిపోవచ్చు-'

యీ ఆలోచన అమలు జరిగింది:

వరదయ్య,- పరిమి నరసింహదీక్షితులుగారి శిష్యుడైనాడు: గురువుగారింటోనే- ఉనికి: భోజనం మట్టుకు మేనమామగారి యింట్లో -

ఆయన, స్వహస్తం కాదు: యిల్లు దిద్దేందుకు చిట్టెమ్మగారని, అప్పగారు ఉంది: సహజంగా వెర్రిబాగులది: కాని ఆలనా పాలనా విషయంలో మట్టుకు అన్నపూర్ణ: చిన్నప్పుడే,- ఆ చేసుకున్నవాడు,- యీ పెళ్లి నచ్చక కాశీ వెళ్లిపోయినాడు: అచ్యుత రామయ్య అంటే వరదయ్య మేనమామ- ఓ పదేళ్లు ఓపికపట్టి చూశాడు! యీ పాటికి రవంత విద్యతోబాటు గోరంత బుద్ధికూడా వచ్చి ఉండకపోతుందా అని,- పనిగట్టుకు, కాశీ వెళ్లాడు! వెదికి పట్టుకున్నాడు! 'ఏం బావా! యింతవరకూ జరిగింది సరే- యికపై మాట ఏమి'టన్నాడు:

అప్పటి మాటే!-

ఆలిని వల్లకూడదని,- ముందరే నిశ్చయం జేసుకుంటే యీ పెళ్లి ఎందుకు జేసుకున్నట్టూ అని,- ఎవరైనా అడుగుతారు: కాని,- నేనలా అడగను: నీకు యీ ఉనికే సుఖంగా ఉంటే నాకదే కావలసింది:

నేను,- మా అక్కయ్య పంపితే రాలేదు:

ఊరివారు దూయబట్టుకుంటే బయలుదేరలేదు: మాలో ఒకడవు కనుక నీ యోగక్షేమం కనుక్కుపోదామని వచ్చాను: మా అక్కయ్య అంటావా - దైవం కటాక్షించి మామూలు సుఖదుఃఖాలకు అతీతురాల్నిగా జేశాడు: మనసులో ఏమనుకుంటుందో- ఆ పరమాత్మకు తెలియాలి - పైకి మటుకు నిర్విచారంగా ఉంటుంది: చూసే వారికి ముచ్చట వేసేట్టూ మెలగుతుంది- అలాటి ఉత్తమురాలి సహచర్యం, నీ కెందుకు ప్రాప్తం లేక పోవాలి?-

'చెపుతా విను!- నాకు పెళ్లి చేసుకోవడం ఎన్నడూ యిష్టంలేదు: ఆ మాట మా తలిదండ్రులకు తెలుసు,- కాని మా మామ్మ తన ప్రాణానికీ నా పెళ్లికీ ముడిపెట్టి,- రావణాగోల చేసింది: పడలేక ఒప్పుకున్నాను: ఎన్నో సంబంధాలు వచ్చినాయి: కాని, ఏరీ కోరీ మీ ఆడబడుచునే ఎందుకు చేసుకున్నాను?- ఆ చిన్నదాని మొగంలో,- విరాగి లక్షణములు స్పష్టంగా కనిపించినవి: ఆ లౌకికానందమేదో,- ఆ కళ్లలో శాశ్వతంగా కాపురమున్నట్లనిపించింది: నాకు తగినదిదీ అనుకున్నాను: చేసుకున్నాను: ఆవిడ అక్కడా,- నేను యిక్కడా,- ఎవరి తపస్సులో వారు ఉన్నాము: మాది,- ప్రణయానందము కాదు బావా - ప్రణవానందము: మా జీవితాలు పరిపూర్ణములు: నీవు మాకోసం కించపడవద్దు: నేను, సన్యాసిని కాను: యావజ్జీవం గృహస్థునే: విశ్వనాథునికీ విశాలాక్షికీ మ్రొక్కుతున్న ప్పుడు, భావనలో, భార్యా సహితుడనే - యిక లోకం దృష్టిలో ఎంటావా?- పోనిద్దూ!-

బావా - మీ అక్కయ్య నాకు భార్యగా లభించడం - నేను జేసుకున్న సుకృతం!- మరో వంగసమే అయిందనుకో - ఆ పిల్ల,

నలుగురితోబాటుదే అయిందనుకో!- నన్ను యిలా బ్రతకనిచ్చేదా?- యెన్ని

శాపనార్థాలుపెట్టేదో? కన్నవాళ్లు వారి బరువు దించుకునేందుకు తెచ్చి యిక్కడ వదిలివేసి, పోయినారనుకో – జన్మంతా ఆగమేకాదూ!– అప్పుడు, నేనీ గంగలో దూకవలసి వచ్చేది–

కనుకనే బావా!– నీవంటే నాకు గౌరవం: నా భార్య అంటే భక్తి!– యింతకన్న ఏం చెప్పగలను–'

అనడంతో,– అచ్యుతరామయ్య,– బ్రహ్మానందభరితుడై,– తిరిగి వచ్చినాడు: చిట్టెమ్మగారికి,– కృష్ణకర్ణామృతం అంధా నోటికి వచ్చు: ఎప్పుడూ ఆ శ్లోకాలే పారాయణ: అవి, దూలాలకీ వాసాలకీ కూడా పట్టిపోయినాయి:

వారికి ఓ పది పశువులున్నాయి: వాటిని మేపుకువచ్చేందుకు,– మదారు సాయేబని ఒహడున్నాడు: పడుచుతనంలో పటాలంలో పనిజేశాడు: వాడు కరుకుతురక కాదు: గంగిగోవు: యిల్లూ వాకిలీ పిల్లా పాపా ఉన్నవాడే!– కాని,– వాడికి ఎవరో సన్నాసి ఉపదేశం జేశాట్ట 'ఒరే – అబ్బాయి: గోవుల్ని కోసుకు దినే కులంలో బుట్టావు. అది నీ దోషం కాదు – ఒక్కమారు పారజూడు: తతిమ్మా కులాలవాళ్లందరూ, దాని పంచితం పైన జల్లుకుని పవిత్రుల మైనామనుకుంటారు: అది పాలిచ్చేందుకు పుట్టిందిరా– కొట్టినా తిట్టినా అంబా! అని దేవీ స్మరణ చేస్తుంది కాని గర్జించదు గాండ్రించదు: మీ యింట పిల్లలకు తల్లిపాలు నిండుకుంటే,– పాలిచ్చేది ఎవరు?– మేకలూ ఆవులూ– యీ ఉపకారం జేసినందుకు మీరేం జేస్తున్నారు: కోసుకుతింటున్నారు: కాయాగూరతో కడుపు నిండదనుకుంటే మనుష్యుల్ని తరుక్కుతినరాదూ– నోరూ వాయాలేని వాటి జోలికి పోవడం ఎందుకు?– యిది, తప్పేనంటావా?– తప్పయితే మానేయ్. నీ కులం వాళ్లు యింతకాలం జేస్తున్న పాపం పోవడానికి, గోవుల్ని కాయి–'

ఒప్పుకున్నాడు మదారు సాయేబు, కాని ఒక్క సందేహం – నేనొక్కడిని మానితే ఏమైనట్లు– మా వాళ్లందరూ మారద్దా – అని: అందుకు వారన్నారు కదా– 'అందరూ ఒక్కసారిగా కలిసి వచ్చారా,– యీ భూమ్మీదికి?– ఎవడి పుట్టుక వాడిది – ఎవడి ముక్తి – వాడిది–?

సాయేబుకు యీ మాటమీద గురి కుదిరింది– అచ్యుతరామయ్యను వెదుక్కుంటూ వచ్చాడు: 'అయ్యా మీ వేణుగోపాలస్వామి – చిన్నప్పుడు గోవుల్ని కాసినందుకే,– దేవుణ్ణి చేసి పూజిస్తున్నారట: నేనూ అలా చేద్దామని ఉంది– అన్నాడు:

'కులంలో వెలెయ్యరా సాయేబూ–' అన్నారు ఆయన– 'వెలేస్తే– మీలో కలుస్తా'– నన్నాడు. అచ్యుతరామయ్య అలాగే కలుపుకున్నాడు:

ఆ యింట్లో వాడిని పసిపిల్ల వాడిని చూసినట్లు చూస్తారు: చిట్టెమ్మను అమ్మా అంటాడు: ఆవిడ ఒరే మాధవా! అంటుంది: కృష్ణ కర్ణామృతం శ్లోకాలు అన్నీ వాడికి వచ్చు, పిల్లన గ్రోవిమీద,– అవే అంటూంటాడు: వాడికి ఒక్కటే తిక్క. పసిపిల్ల అయినా సరే– 'మీరు' అంటే ఊరుకోడు: యుద్ధం జేస్తాడు: దేవుడి జల్మకంటె నరజల్మ ఎక్కువా వాడిని 'మీరు' అనరేం!– అని లడాయి: ఎరుగని వాడైనా సరే– ఏరా! అంటే ఏనుగెక్కుతాడు: వాడి తిండీ కృష్ణుడి తిండే!– చలిది అన్నం, పెరుగు,– నంజుకునేందుకు వెన్న – గుమ్మ పాలూ: ప్రొద్దున్నే చలిది మూట కట్టించుకుని,– పోతాడు – పవలంతా,– గోవుల్ని,– బంజెర్లో,–ఒక్క అరక్రోశు మేర మేపుకువస్తాడు: మళ్లీ, వేళకు రెండు ముద్దలు తింటాడు: ఆలయం అరుగు మీద పడుకుంటాడు– ఏ కాలంగానీ: – యిక మరీ వర్షాకాలమైతే,– ఏ గోడవారనో, ఆలా వొదిగి కునికిపాట్లుపడుతూ కూర్చోవలసిందేకాని,– ఆ అరుగుమీద

తప్ప మరో చోట నడుం వాల్చడు: ఆ నిద్రన్నా ఎంతసేపు?- ఊరు సద్దుమణగేదాకా అలా శ్లోకాలు పాడుకుంటూనే ఉంటాడు: ఝాం ప్రొద్దుందనగానే మేలుకుంటాడు యధావిధిగా స్నానం జేసివచ్చి,- పిల్లనగ్రోవి అందుకుని, ఆలయంలో వాడిని మేలు కొలుపుతాడు: వాడి కులం వాళ్లు సైతం వాడిని కాఫర్ అనరు: ఎవడో కారణజన్ముడన్నట్టు చూస్తారు.

యిహ అచ్యుతరామయ్య విషయం- ఆయన తండ్రి నవాబుగారి, దప్తర్‌ఖానాలో ఉద్యోగం చేసేవాడు: అలా అప్పటికి మూడు తరాలనుంచీ వస్తూంది: ఏమిటి ఉద్యోగం- నవాబుగారు,- తమ పరగణాలో సుఖ నివాసం చేస్తూన్న యావన్మంది జనాభాలో,- ఎవరికి ఏయే విద్యలో ప్రజ్ఞ ఉన్నదో, వాకబు చేస్తూ ఉండేవారు: అలాటి వారిని,- ఖుద్దు ఉంచుకునేవారు: ఉద్యోగమంటే వారికి కొలువు జేయడం కాదు: నవాబుగారు,- ఫలానా విద్వాంసుడు, నా మనిషి, అన్నందుకు దాఖలాగా,- వారి పేరు నెలసరి పట్టీలో నమోదై ఉండేది: వారు చిత్తము వచ్చినప్పుడు దర్బారుకు దయ చేయవచ్చు: వచ్చి తీరాలనే నిర్బంధమూ ఎంత మాత్రమున్నూ లేదు:

యీ వేమూరి వారు,- వైణికులు,- అచ్యుతరామయ్య తండ్రి అనంతరామయ్య,- చిన్నప్పుడు తండ్రిగారి వద్ద,- విద్య పూర్తి చేసుకుని,- కన్నడ దేశం పోయి విద్యకు మెరుగులు దిద్దుకుని, ఘనుడనిపించుకున్నాడు: ఎవరిచేత,- రాజులచేతనా?- వారు ఏనాడో మెచ్చుకుని కంకణాలూ కడియాలూ యిచ్చారు: వారిని మించిన వారిచేత-

సిద్ధయగారని,- సంగీత సిద్ధుడు: ఆయన వైణికుడే: అనంతరామయ్య వీణావాద నం విని,- 'నాయనా!- నీది నారాయణుడు మెచ్చేవిద్య- వానికే వినిపిస్తూండు' అని సెలవిచ్చినాడట: అనుగ్రహ సూచకంగా,- తన వీణను యిచ్చినాడట:

అనంతరామయ్య బందరు జేరుకుని వారికి యిలవేలుపైన గోపాల స్వామినే సేవించుకుంటూ ఉండిపోయినాడు: మరెక్కడా కచేరిలంటూ చేయలేదు: అప్పటి నవాబు గారు,- వారంతట వారే వచ్చి,- అంతదూరాన నిలుచుండి ఆలకించిపోయేవారట-

వారికి,- శిష్యరికం జేసింది- నగరాజ కుమారి: ఆవిడనాట్యం అప్పటికే మహాప్రసిద్ధి. అది,- ఆవిడకు ఎలా అబ్బిందంటే-

ఒకానొకప్పుడు,- కేరళ మండలం నుంచి,- పంకజాక్షుడనే,- నాట్యాచార్యుడు, కాశీయాత్రకు పోతూ,- ఎందుకు వచ్చాడో,- బందరు వచ్చాడు: ఎక్కడికి వెళ్ళినా ఆతడికి దిగ్విజయమేగా,- నవాబుగారు కోరగా,- కొంతకాలం అక్కడ ఉండేందుకు సమ్మతిం చాడు: ఊళ్లో ఉన్న నాట్య విలాసినులు ఎందరో,- ఆయనకు శిష్యరికం చేదామని ఉబలాట పడినారు: అహఁ-పొసగలా! అప్పటికి యీ నగరాజకుమారి అయిదేళ్ల పిల్ల: ఒకనాడు,- యీయన,- రంగనాయకుల ఆలయంలో నాట్యం జేశాడు: యీ పిల్లది చూసింది: అలా ఆడటం, చేతులు తిప్పడం మొదలు పెట్టింది-

అది,- యీయన చూశాడు: ఎగరేసి చంక నేసుకున్నాడు: యిక- మరి ఊరుకదల్లా: పదిహేనేళ్లు అలాగే ఉండి పోయినాడు: పిల్లను తనంత దాన్ని చేశాడు:

అలాటి మనిషి, అనంతరామయ్యగారి శిష్యరికానికి వచ్చింది: అదెలా సంభ వించిందంటే- ఒక్కొక్క పండుగనాడు, ఒక్కొక్క ఆలయంలో, నాట్య సేవలు జేయడం, ఆ యింటి రివాజు; అలాగే, వేణుగోపాల ఆలయంలోనూ జేసింది- యీయన ఒక్కక్షణం ఆ నాట్యం తిలకించి,- హంగు చేస్తూన్న జంత్రాల్ని ఆపుజేయించి,- తాను వీణ

అందుకున్నాడు: చూడ వచ్చినవారు అందరూ,– ఒళ్లు మరచారు: తెల్లవారింది.

'అమ్మాయ్, ఆలయం యీనాటితో బృందావనమైంది: నా ఆనందం,– ఎలా తెలియజెప్పను!– కృతజ్ఞతా సూచకంగా,– నీకేమీయను!– అన్నారు అనంతరామయ్య గారు...' మీ శిష్యరికం చేయనీయండి: మీ విద్యలో గోరంత, దీవెనగా యీయండి–' అన్నది: అంతే:–

విద్య పూర్తి అయింది: మరి,– గురుదక్షిణ?– మా పిల్ల వాడికి నాట్యం జెప్పమన్నారు!– శిరసావహించింది:

నగరాజ కుమారి, మేనగోడలే రంగనాయకి: యించుమించు అచ్యుతరామయ్యదీ ఆ పిల్లదీ ఒక్కటే వయసు: యిద్దరూ కలసి విద్య చెప్పుకున్నారు:

అనంతరామయ్యగారు– పిల్లలు ముగ్గురికీ తన చేతిమీదుగానే పెళ్ళిళ్ళు చేశాడు: ఏ కష్టాలూ చూడకుండానే వెళ్ళిపోయినాడు:

ఆడపిల్లలిద్దరూ, వీణెజోలికే పోలేదు: అమ్మాయ్ సంగీతం చెప్పుకోవాలని ఉందా అమ్మా అని,– చిట్టెమ్మను అడిగాడట: 'చెప్పుకోవడం ఎందుకు– నాకు వచ్చేసింది. స్వామివారు పిల్లంగోరు వాయిస్తుంటే వింటున్నాంగా–' అందిట! అనంతరామయ్యగారు కూతురు వంక అట్టె జూసి,– అమ్మా నిన్ను కన్నందుకు నేను తరించానే– అన్నారట: అచ్యుతరామయ్యకు మట్టుకు ఆయన చెప్పాడా?– కేవలం వినికిడి మీదే!– యింట పుట్టిన విద్య వంటపట్టింది.

తండ్రి, వీణ అక్కడ ఉంచడం తరువాయి,– పిల్లవాడు అందుకునేవాడు: తండ్రి ముచ్చటగా ఆలకించేవాడు: పోగా, పోగా, ఆ వాదనం ఏ స్థాయికి అందుకున్నదంటే– నాయనా,– నీవు నాకు గురువు వౌతున్నావురా,– అంటూ, ఆయన కొడుకును కౌగలించుకున్నాడు:

రంగనాయకి,– మాంచి పేరుదెచ్చుకుంది. నవాబుగారు,– ఆ నాట్యం జూసి నిండుదర్బారులో ఆ విద్యకు సలాం జేశారు: పాలకీ బహుమానం జేశారు:.

అచ్యుతరామయ్యకు, సంసారంలో ఆ అవాంతరం సంభవించిన క్రొత్తలో,– అందరితోబాటు రంగనాయకీ చూడడానికి వచ్చింది: ఆ వాలకం జూసింది, పలుకరించలేకపోయింది: చిట్టెమ్మ దగ్గిర కాస్సేపు కూర్చుని వెళ్లిపోయింది: మళ్లీ కొన్నాళ్లు పోయి, వచ్చింది: అప్పుడు పలుకరించింది: 'స్వామివారి పూజ వేళ, వీణె చేబట్టటం లేదా?'–' ఆయన ఆమె వంక జూసి ఊరుకున్నాడు: తలవంచుకున్నాడు: సెలవైతే,– నేను,– మీ చేదోడుగా, ఉంటాను!–' అంది:– 'నీవా?–' అన్నాడు ఓ పళానకు–' 'కలిసి విద్య చెప్పుకున్నాం– మీ కష్టసుఖాలు నావి కావా?–' అంది– 'జాలిపడుతున్నావా–' అన్నాడు:– 'లేదు సత్యం జెపుతున్నాను:' 'అహ!' అన్నట్లు ఆయన తలఊగించాడు:

నవాబుల సన్నిధికి వెళ్లింది– 'హుజూర్,– వేణుగోపాలస్వామి ఆలయానికి అంటి ఒక లోగిలి ఉంది,– అది బ్రాహ్మణులది: వారిని,– నేను కోరితే,– గౌరవలోపం: మరో లోగిలి మీరు వారికి చూపించి,– అది నాకు దయచేయించండి!' అని మనవి చేసింది– ఏం అన్నారు వారు: 'చేరువనుండి సేవించుకునేందుకు?–

ఆ – స్వామివారినా?–

ఆ స్వామినీ– నా స్వామినీ!–

నవాబులు – అచ్చా! అన్నారు:

-అలా,- అక్కడికి కాపురానికి వచ్చింది. అచ్యుతరామయ్య నివసించేది,- ఆ యింటికి యివతల ప్రక్క-

ఆవిడ అలా చేరువనుంటూన్నదని,- అచ్యుతరామయ్యకు తెలియకనా?- పైగా- ఆలయంలో చూస్తున్నాడు కద!- ఒకరినొకరు పలుకరించుకోవడం లేదన్నమాటేకాని-

నిత్యమూ వీణె తీసుకువచ్చి,- ఉంచవలసిన చోట ఉంచేది: మొదట్లో ఆయన ఆ వంకే జూసే వాడు కాడు: కొన్నాళ్లకు,- 'ఏమిటిది?' అన్నాడు: కొంచెం పరుషంగా: రంగనాయకి కంటనీరు పెట్టింది- ఎందుకూ అన్నాడు- యీ మాటు మృదువుగా. 'స్వామి వారి మీద,- మీకు దయ తప్పినందుకు-' నాకు బుద్ధి చెపుతున్నావా?- అన్నాడు: 'బుద్ధి తెచ్చుకున్నాను- నేనెక్కడ పుట్టాను,- మీరెక్కడ పుట్టారు: మనల్ని,- యిక్కడకి జేర్చిందెవరు?- మనుష్యులా,- ఆ స్వామి వారు కాదూ: కలిసి విద్య చెప్పుకున్నాం: యిక్కడే- నేనెక్కడ ఆడినా పాడినా,- మీరు ఉన్నచోటే ఉండి,- వీణె మీటి,- కొనియాడినా,- ఎవరిని, తలచి,- ఎవరిని,- వీరినేకద!-

నిన్న మొన్నటిదాకా,- మీ యిల్లు పచ్చగా ఉంది: నేను ఉండవలసిన దూరానే ఉన్నాను: ఎల్లకాలమూ అలాగే ఉండేదాన్ని,- అదే కోరేదాన్ని-

కాని అలా జరగలేదు: అందుకు నేను సంబరపడలేదు- దుఃఖించాను:

స్వామిని యథావిధిగా సేవించడం మానుకునే పరాకు మీకు ఆవహించిందని తెలుసుకుని,- మరింత దుఃఖించినాను: యిక నిలువలేకపోయినాను:

యీ అపచారం, నేను జేసుకున్న పాపమేమోననిపించింది: మీ పదములంటి వేడుకుంటే, మరల మీరు ప్రసన్నులౌతారని, ఆసపడి వచ్చాను: ఈ సేవలకని,- మీ సేవలకని వచ్చాను: నేనిక,- గుడిసేవకిని-

కాని,- మీ ఏకాంతమునకు, అంతరాయం కాను: స్వామిని సెవించే వేళ,- ఎదుటపడను: వీవన చేతనుంచుకుని,- చేతులు కట్టుకుని చేరువను ఉంటాను: ఎన్నటికన్నా,- ఆ స్వామి అయినా జాలిదలచి,- నాట్యాన సేవించమని ఆదేశిస్తే- అందుకు మీరు, అనుమతించేరని,- ఆశ: నేను మనవి చేసింది; ఆలకించినట్లేనా?- అయితే,- స్వామిని పూర్వం కొలిచినట్లే- సేవించండి-' అచ్యుతరామయ్య,- అప్పటికి వంచిన తల ఎత్తి- నిదానంగా,- ఆమె వంక జూసి,- అతి ప్రసన్నంగాజూసి,- రవంత చిరునవ్వు తెచ్చుకుని,- వీణెను చేరదీసుకున్నాడు: అలా కొన్ని మాసాలు గడచినాయి:

అవాళ స్వామి వారి కల్యాణం-

ఆలయంలో పవళింపు సేవ ముగించుకుని అచ్యుతరామయ్య యింటికి వచ్చాడు: యింట్లో చిట్టెమ్మలేదు: అదేమా అనుకున్నాడు: ఆమె ఎక్కడికి కదలదు: ఆఖరికి ఆలయం లోకైనా రాదు: ఏమా అనుకున్నాడు: ఝాం ప్రొద్దు పోయింది- ఝాముున్నర ప్రొద్దుపోయింది,- జాడలేదు:

అనుకోకుండానే,- అటుకేసి వెళ్లాడు - రంగనాయకి యింటికి: అరుగుమీద మదాధు-

'ఏంరా యిక్కడెందుకున్నావ్- నీవు?-' అన్నాడు: అందరం యిక్కడే ఉన్నాం అన్నాడు వాడు:

చిట్టెమ్మ గుమ్మంలోకి వచ్చింది- ఏంరా యింత సేపేం జేశావ్- రా-రా- అంది- యింటికి పోదాం రా! అన్నాడు

యింట్లోనే ఉన్నాంగా,- అంది- రంగనాయకి ఎదురుగుండా వచ్చింది- పెళ్లికూతురల్లే ఉంది: ఆయన ఏమనుకున్నాడో ఏమో తలవంచుకున్నాడు-

ఒరే- కాళ్లకు మ్రొక్కింది,- కల్యాణం బొట్టు పెట్టాను: కళ్లల్లోకి చూసింది- కాటుక పెట్టాను: సిగ్గుపడి శిరసు వంచుకుంది - సిగపాయదీసి జడ అల్లాను: జవజవలాడింది- జరీ కోక కట్టుకోవే అన్నాను పకపకలాడింది- పాయసం జేశాను: పుచ్చుకో!' అంది:

ఆయనకు,- ఆశ్చర్యం వేసింది-

-'అక్కయ్యా!' అన్నాడు-

'అక్కయ్యేం జేసిందిరా- వాడూ- చేసింది-! యిది, వాడి ప్రసాదంరా!- కళ్ల కద్దుకోరా-' అంటూ,- 'ఒరే మాధవా, మనం యిక పోవచ్చునురా-' అని,- అక్కడనుంచి కదలిపోయింది:

ఆయన అలాగే నిలుచుని పోయినాడు: మదారు వేణుగానం వినిపించింది-' స్వామీ నీ ఆజ్ఞ!' అని,- ఆ యింటివాడైనాడు:

దైవం వారిని,- దీవించినట్టుగానే బాలా రుక్మిణి కలిగింది... అది ఉభయ కుటుంబాల భోగట్టా! వరదయ్య,- బందరులో,- అలా షుమారు అయిదు సంవత్సరాల పైచిలుకు చదువుకున్నాడు:

యిన్నేళ్లూ,- స్వగ్రామం,- మొవ్వ- పోలేదు:

అడపా దడపా,- శివరామయ్య,- 'పేట'కు ఏదో పనిమీద వస్తూ ఉండేవాడు: వచ్చినప్పుడు కుర్రవాణ్ణి చూడకుండా వెళ్లడు కద!- పైగా,- ఆయనకు విశాలక్షమ్మకు ఉన్న పట్టింపు లేదు: యిక్కడే దేవతార్చన చేసుకునేవాడు: అందర్నీ పూసుకు తిరిగేవాడు: రంగనాయకి ఆయనకు చెల్లాయ్- మదారుగాడు,- అన్నయ్య: యిదీ ఆయన తీరు:

కుర్రవాడు మాంచి కుశాగ్ర బుద్ధి కావడంతో,- దీక్షితులుగారు వీడిని కాశీ పంపితే బాగుండిపోను అనుకున్నారు: కుర్రవాడు అందుకు ఎగిరి గంతేశాడు: యాత్రకు పోతూన్న ఎవరి వెంటనో పంపించారు: యిలా పంపిస్తున్నానని, అచ్యుత రామయ్య, శివరామయ్యకు చెప్పంపలేదు: ఆయన మమకారం దెలుసు: తీరా పిల్లవాడిని వదిలి ఉండలేక- అడ్డం కొడితే కొట్టనూ వచ్చును: తాను, ఆయనతో శరించడం బాగుండదు కనుక,- యిలా జేశాడు:

పిల్లవాడు బయలుదేరి వెళ్లిన నెల్లాళ్లకుగాని, శివరామయ్యకు,- యీ కబురు తెలియలేదు: తెలిసిన తరువాతనైనా- ఆయన పల్లెత్తు మాట అనకపోగా,- సంతోషించాడు: 'యింతవరకూ,- ఉభయ కుటుంబాల్లో ఎవరికీ ఆ భాగ్యం పట్టలేదు- వీడి మూలాన మనం మన పెద్దలూ తరించనున్నామేమో' అన్నాడు:

తల్లి మట్టుకు,- ఎదుట ఉన్న పెనిమిటిని? ఎక్కడో ఉన్న అన్నగారినీ,- ఏమీ అనలేక,- వీళ్లిద్దరూ ఏకమై,- తనబిడ్డను తనకు కానరాకుండా జేశారుగదా, అనే అక్కసు,- యింట్లో పాత్ర సామగ్రిమీద ఓ పదిరోజులపాటు చూపించింది: క్రమంగా తనంతట తానే సర్దుకుని ఊరుకుంది:

అలా కొన్నేళ్లు గడచినాయి:

ఆపై,- పిల్లకు పెళ్లీడు వచ్చి పడిందనే బెడద ఒకటి పట్టుకుంది. కాని, ఎక్కడా సంబంధం కుదరలేదు- ఎందుచేత- అది విశాలాక్షమ్మ నోటి చలువ: ఎక్కడెక్కడి వారికీ,- ఆవిడ తన కొడుక్కు ఆ పిల్లను,- ఎందుచేత చేసుకోనందో, తెలుసును: రెండో పెళ్లి గీత

అంటూ ఉన్నవాళ్లు ఒకరో అరో,– దేశంలో లేకపోయినారా,– కాని ఒక్కళ్లూ ముందుకు రాలేదు... ఏమిటి చెయ్యడం?– ఎల్లాగో అల్లా,– దానికి పెళ్లి చేయకపోతే,– తాను గంగలో దూకుతానంది,– విశాలక్షమ్మ– శివరామయ్యకు దాంతో,– మతిపోయినంత పనై,– బందరు పోయి బావమరిదితో మొరబెట్టుకున్నాడు: ఆయన వెంటనే బయలుదేరి వచ్చాడు:

అప్పుడూ, అన్నా చెల్లెలు మాట్లాడుకోలేదు: ఒకరి నొకరు చూసుకోలేదు: తాను ఆలయంలో ఉండి,– పిల్లదాన్ని అక్కడికి రప్పించాడు: ఊళ్లో నలుగురినీ రప్పించాడు: అందరి సమక్షంలో,– పిల్లదాన్ని ఆ దైవానికి ధారపోశాడు: పిల్లదానికి తెలిసీ తెలియని యీడు: ఆ గడియలో,– మొగంలోకి,– దేవతాకళ వచ్చింది. యిహ, వంక బెట్టే వారెవరు?– ఆ సమస్య, అలా సమసిపోయింది:

వరదయ్య అంత దూరా భారాన ఉన్న,– ఏడాదికో రెండేళ్లకో,– ఎవరో ఒకరు– తానెరిగినవారు కాకపోయినా,– తాను ఫలానా అని ఎరిగినవారు,– యాత్రావశాన వచ్చి, కనబడుతూండటంతో,– తన వాళ్ల యోగ క్షేమం తెలుసుకుంటూనే ఉండేవాడు:

మొవ్వలో రుక్మిణి,– గోపాలుడికి పూజా పుష్పం– అయినదన్న సంగతి,–

బందరులో బాలా రుక్మిణి,– ఆ తలిదండ్రులకు తగిన కూతురై,– మాంచి ప్రాయాన మన్మథ మొలకలా కన్నెదేవి,– వేణుగోపాలుణ్ణి,– తన విద్యతో సేవిస్తూన్నదని,– వింటూనే ఉన్నాడు: యిహ ఒక్క ఏడాదితో,– యిక్కడ విద్య పూర్తి అవుతుంది – పరుగెత్తుతూనో, ప్రాకుతూనో వచ్చే వైశాఖ పూర్ణిమనాటికి బందరులో వచ్చి వ్రాలుతానని మేనమామకు వర్తమానం జేశాడు: అలాగే బయలుదేరాడు:

బెజవాడనుంచి,– అలా బయలుదేరినవాడు: కృష్ణకర్ణామృతం శ్లోకాలు గొంతెత్తి పాడుకుంటూ,– త్రోవలో,– ఏ గృహస్థులింట్లోనో యింత ప్రాశనచేసి,– మర్నాడు,– సంజెవేళకు కాస్త ప్రొద్దుందనగానే పేట జేరుకున్నాడు: పొలిమేరల్లోనే బంజర్లో,– మదారు కనిపించాడు: యింకా అంత దూరాన ఉండగానే, ఒరే వరదయ్యా!– అని కేకలు పెట్టుకుంటూ వచ్చి కౌగలించుకున్నాడు: వరదయ్యకు ఆశ్చర్యంవేసి,– నన్నెట్లా గుర్తు పట్టావురా– అన్నాడు:

'ఆ నడకజూసి!– 'గోవులతో బ్రతికే వాణ్ణి కాదూ?– శాల్తీని పోల్చుకోవాలంటే– నడకే నాకు గుర్తు–! అడుగు పెరిగినా అంగ పెరిగినా,– అలవాటు పెరగదురా భయ్యా,–

'ఒరే మదారూ నీవు యీ పాటికి ముసలివాడవై ఓ మూలపడుంటావనుకున్నారా!–

'భయ్యా!– గోవు పెరిగినా గోపాలుడు పెరగదురా!–'

'ఎల్లకాలం నీవిలాగే ఉంటావా?–'

'వాడున్నంతకాలం నేనూ ఉండాలి రా!– మదార్ లేకపోతే,– ఆ మహరాజ్‌కి పరగడుపే – పాలెల్లా వస్తాయ్:'

'ఒరే,– యింతకాలానికి జూశాను: నీకొక్కసారి దణ్ణం పెట్టనీయరా!'

'దణ్ణాలు పెట్టించుకునేవాడు, మీ గుళ్లో ఉన్నాడుగా,– తెల్లవారితే వాడికి అదేపని!– పదరా భయ్యా!– పోయి బువ్వ తిందాం!–'

యిద్దరూ,– యింటికి జేరుకున్నారు! లోపలినుంచి వీణె వినపడుతూంది: ముందు సావడిలో మేనమామ వీణె ముందు కూర్చుని ఉన్నాడు: వచ్చినవాడి వంక జూశాడు: ఒక్క రవంత పరకాయించి చూశాడు: మొగంలో బ్రహ్మానందం: వీణె మీటుతూనే, 'ఒరే,–

ఒరే,– నీవేనా,– నీవేనా,–' అన్నాడు! వరదయ్య తల ఊగించాడు:

ఆయన ముగింపుకు తెచ్చి,– లేచి వచ్చి,– భుజములు పట్టుకుని,– 'నేను అనుకున్నంతవాడివైనావురా!–' అన్నాడు:

'అంత వాణ్ణయే వచ్చాను: నిన్ను చూడగానే మరో గుప్పెడెదిగాను–'

'ఆహా!– తండ్రిని చూసి,– గుప్పెడెదిగితే,– కూతుర్ని చూడగానే,– క్రోశెడెదుగుతావేమో!–

అలా ఎదుగదలచుకుంటే జుట్టూ నీ చేతులో పెడతానులే!–?

'ఒరే!– నీవు నాచేత చిక్కుతావా!– సిగపాయ పట్టుకునేందుకు,– సింగారించుకుని సిద్ధంగా ఉంది: చిత్త – మనక పోతివో?–'

'అనలేకపోయినా– చిన్నబుచ్చనులే–!?

యిద్దరూ నవ్వుకున్నారు: యింతలో చిట్టెమ్మ అక్కడికి వచ్చింది: అమ్మక్కయ్యా! అన్నాడు: ఆవిడ మామూలు ధోరణిలోనే,– అన్నం దిందువుగాని,– స్నానం జేసిరా!–' అంది:

అక్కయ్యా! అసుర వేళ – అన్నమేమిటే– అన్నాడు అచ్యుతరామయ్య–

'వీడు – యింకా కాశీలోనే,– ఉన్నాడనుకున్నాను: అక్కడ పగలూ, రాత్రీ అంటూ లేదుగా,– ఎప్పుడూ అన్నపూర్ణ సత్రమేగా!–'

పెద్దనాన్న క్షేమంగా ఉన్నాడమ్మా!

ఉంటారు!

నిన్ను ఎప్పుడూ తలుచుకుంటూ ఉంటాడు!

ఉంటారు!–

ఆయన మీద నీకు కోపమా?–

కోపమంటే ఏమిటో!–

నీవూ కాశీలో ఉంటే–

కాశీలోనే ఉన్నాగా– ఉన్నాగా!– ఆవిడ పకపకనవ్వుతూ లోపలికి వెళ్లిపోయింది: మామయ్యా! యిదేదో దేవతా– పుటక!–' అన్నాడు:

యీ మాత్రం తెలుసుకునేందుకు యింత చదువక్కర్లేదురా– మామూలు మనుషులం, మాకే తెలుసునే...'

యిద్దరూ,– యిహ తీరుబడిగా కూర్చుని అ మాటా యీ మాటా చెప్పుకున్నారు: తానింత కాలమూ,– అక్కడ ఎలా మెలిగిందీ,– ఏయే విద్యలు నేర్చిందీ,– బహు, వివరంగా జెప్పి,– నూజివీడులో కథ టూకీగా చెప్పుకొచ్చి, రెడ్డి పంతులు చేసిన హితోపదేశం మాట కూడా జెప్పాడు: ఆయన అంతావిని,– అవునురా నాయనా,– ఏ జన్మ ఎలా చరితార్థం కానున్నదో!– ఎవరిని వాళ్లం ఉద్ధరించుకోవడమే పరమార్థమనుకుని, మేము ఉన్న చోటనే పడి ఉన్నాం!–

లోకాన్ని ఉద్ధరించే,– సుకృతం నీకు లభించనున్నదేమో– అన్నాడు:

అనుష్ఠానం తీర్చుకుని వరదయ్య,– ఆలయంలోకి,– వెళ్లాడు: అక్కడ బాలారుక్మిణి నాట్య సేవ చేస్తూన్నది– అదే చూడటం: చూస్తూ శిలావిగ్రహంలాగా ఉండిపోయినాడు: నాట్యం ముగిసి,– ఆ చిన్నది 'బావా!' అని పలుకరించేసరికి,– తెలివి వచ్చింది,– కాని,– ఆమెవంక చూసేందుకు బిడియం వేసింది: తన ధోరణితో నాలుగయిదు కృష్ణకర్ణామృతం

శ్లోకాలు పఠించినాడు: బాలారుక్మిణి పకపకలాడుతూ,– 'బావగారు, గీర్వాణం మీద ఉన్నారు: దేవుణ్ణి,– తెలుగులో ఎలా పలుకరించాలో,– తెలియదు!–' అన్నది,– రవంత చనువుగా,–

వరదయ్య కొంచెం చొరవగా,– 'తెలుసుకుందామనే తిరిగి వచ్చాను: అందుకు,– ఎవరి శిష్యరికం జేయాలో,– అన్నాడు:

'తొందరపడకురా అబ్బీ!– రేపోమాపో అదీ తేలుస్తాంగా!– అనినాడు మేనమామ!

'ఆ శిష్యరికం– ఎంతకాలమో!–'

'యావజ్జీవం!– ఆ విద్య సామాన్యపుదా!– తరచి చూసిన కొద్దీ తరగని స్వారస్యం ఉంది!–'

'తప్పకుండా ఉండి ఉంటుంది– ఎంత అనుభవం మీద చెపుతున్నావో?–'

అనుభవం లోపిస్తే– అంతస్థుకు విలువేముంది: బ్రతికినందుకు ఫలమేముంది!–

'ఆమోదిస్తున్నాను కాని,–'

అంగీకరించలేకపోతున్నావు: అంతేకాదూ! తగిన గురువు చేతులో పడ్డావో,– క్షణం పట్టదు–

'ముందు నీ చేతులో పడ్డాను– నన్నేం జేస్తావో!–

'చేయదలచిందే చేస్తాను:

'చేతులు కట్టుకుని సిద్ధంగా ఉండమంటావా!–?

'అనాలా? అర్థం కావడంలా?–'

'యించుమించు!'

'అయితే యికనేం– అందుకు పోతావ్!' రంగనాయకి యింతసేపూ,– తాను ఏమీ పలుకకుండా,– ఉన్నచోటే ఉండి,– ఆలకించుతూ ఉన్నది: అప్పుడు, పలుకరించింది– చిరునవ్వుతో!

మీ మేనల్లుడి మాటలు వినముచ్చటగా ఉన్నాయండీ,– అని, అయనతో అన్నది:

'యీ ముచ్చట ఎల్లకాలం,– ఉండేదేగా!' అన్నాడాయన:

ఆనాటికి ఆ సల్లాపం సరి!–

అచ్యుతరామయ్యగారి మేనల్లుడు – చిన్నప్పుడు,– యీ ఊళ్లో, చదువుకుని,– పేద్ద పండితుడై, తిరిగి వచ్చాడంటే– అతగాణ్ణి చూడటానికని,– ఓ తీర్థ ప్రజ!–

జనం, అలా యీగలు ముసిరినట్లు ముసిరి,– అక్కరకు మాలిన ప్రశ్నలు వేస్తున్నా,– ఆతడు ఏ మాత్రం విసుగు అనేది లేకుండా,– వచ్చిన వారందరితోనూ, అలా ఆప్యాయంగా ఉండటం– వాడిలో ఆ సహనం చూడగా,– మేనమామకే ఆశ్చర్యం వేసింది:

నవాబుగారి దర్బారుకు పోయి రావడం మంచిదేమో అని కొందరు సలహా యిచ్చారు: అది పాటించలేదు: మా యింటికి రమ్మంటే మా యింటికి రమ్మని,– ఎంత మందో బలవంతం జేశారు: ఎక్కడికీ కదలలేదు: సేలువలూ చాపులూ తెచ్చారు: పుచ్చుకోలేదు:

వెళ్లింది,– ఒకే ఒక్క యింటికి–

గురువుగారింటికి–

నరసింహ దీక్షితులుగారి యింటికి– వారికి వార్ధక్యం బాగా వచ్చింది: ఒంట్లో సత్తువ యింకా ఓ– తగు పాళంగా ఉంది,– కాని,– చూపు మట్టుకు ఆనాటి కానాడు

దిగనాసిల్లుతూంది:

'నాయనా! నీ కోసమే కనిపెట్టుకుని ఉన్నానురా: యీ చూపు పూర్తిగా మాసిపోకముందే,– ఆ కాశీలో వాడిని కంటజూద్దామని ప్రయాణం పెట్టుకున్నాను– యింతలో నీవు వస్తున్నావని తెలిసింది– కదిలిపోతే,– యిక యీ జన్మకు నిన్ను చూడటం ఉండదు కదా అని– ఉండి పోయినాను: ప్రయాణానికి మళ్లీ ముహూర్తం బెట్టుకున్నాను: జ్యేష్ఠ శుద్ధ తదియ: యీ పది ప్రొద్దులపాటూ కాస్త కనిపిస్తూ ఉండు నాయనా!–' అన్నారు వారు:

తనకు యీ ప్రాప్తమయినా ఉంది కదా అనే ఆనందంతో,– పది రోజులుపోతే,– యిక మరి వారు కనిపించరు కదా!– అనే శోకంలో,– మాటాడలేకపోయినాడు, వర దయ్య– అన్నాళ్లూ గురువుగారిని ఒక్క క్షణం విడిచి ఉండలేదు: యిక ఆరోజు వచ్చింది: నవాబుగారు, పాలకీ పరివారమూ యిచ్చారు:

ఊర్లో వారందరూ,– పాలకీ వెంట నడిచారు:

పొలిమేర చేరుకోగానే పాలకీ ఆపించి,– దిగి,– ఆయన,– అందరినీ పేరు పేరు వరుసగా పిలిచి కౌగలించుకున్నారు: వరదయ్య,– శిరస్సున చేయి ఉంచి– మరి మాటాడలేకపోయినారు! వరదయ్య వారి పాదములకు నమస్కారం జేసి,– చేయి ఆసరా యిచ్చి పాలకీ ఎక్కించాడు:...

ఆడుతూ పాడుతూ జ్యేష్ఠమాసం వెళ్లిపోయింది: వరదయ్యకు ఎలా కాలక్షేపం! వేళకు స్వామి సేవలకు పోవడం – తతిమ్మా వేళల్లో,– రంగనాయకి యింట్లో కూర్చోడం: వాళ్లు సేకరించుకున్న తాళ్లపాక వారి సంకీర్తనములు,– శృంగార పదములూ,– మరెందరో మహామహుల రచనలూ,– వినడం– కేవలం వినడం– ఒళ్లు మరచిపోవడం:

ఆషాఢం జొరబడింది–

మేనమామ అనుకున్న ఆ రోజు రానే వచ్చింది: దానే వచ్చింది.

వరదయ్యకు తలంటి పోయించి,–

క్రొత్త చాపు కట్టబెట్టాడు: సాయంకాలం అందరూ ఆలయానికి వెళ్లారు: సేవలు ముగింపు కాగా,– యిరుగువారూ పొరుగువారూ వెళ్లిపోయినారు: వీరే మిగిలారు:

ఎవరు?– వరదయ్యా, మేనమామా–

'ఒరే,– నా మనసులో ఉన్నమాట చెపుతాను వింటావా?–' అన్నారు: ఆయన:

విన్నాను: మామయ్యా!–

నీ ఆదరణలో – ఆంతర్యం,– పరిపూర్ణంగా అర్థంజేసుకున్నాను: పెళ్లి కొడుకును జేసినవాడవు, ఆ తరువాయీ పూర్తిజెయ్–'

–మేనమామ– అంతవాడూ, ఆ మాటతో ఉలికిపడ్డాడు:– వరదా!– నేను యింతకాలమూ తపస్సు జేసింది,– యిందుకోసమేరా!– నీవు నా వాడివేనని తెలుసును! అయినా,– మానవ చాపల్యం కొద్దీ–'

'నీది,– చాపల్యం కాదు,– మామయ్యా,– నిగ్గులుదేలే నియోగం: నాకు,– అంత యీడప్పుడే నామీద కన్ను వేశావ్– చేరదీశావ్! తరిమెన పట్టించుకుని తళుకులు తేలుతూ రమ్మని,– వారణాసికి తరిమివేశావ్! మళ్లీ, రప్పించావ్– నాకోసం అని,– యిక్కడో రత్నాన్ని సిద్ధంగా ఉంచావ్– అది నీవంటి ఘనుడు చేయాల్సిన యత్నమే–'

అయినా,– నీ వన్నట్లు; మానవ సహజంగా,– నీకు ఓ శంక ఉండవచ్చును:'

వీడు తీరా తిరిగి వచ్చాడే అనుకో,– మనమాటవింటాడా,– మన ధోరణిలోనే ఉంటాడా?– మడిగట్టుకున్నానంటాడేమో నీకు యిలా అనుమానం కలగడంలో అబ్బురంలేదు– కాని,– నీవు ఒక్క విషయం ఎందుకో మరచిపోయినావ్!–

'నేను,– ఆపేక్ష అంతః కరణలంటే ఎలా ఉంటాయే – చూసింది– మీ యింట్లో– అందాకా ఎందుకు,– మనిషి మనసారా నవ్వగా చూసింది– మీ యింట్లో,– నేను బుద్ధెరిగింది,– యిక్కడ:

'అంతకాలం పరదేశంలో ఉన్నా– ఒక్కనాడు మా అమ్మా నాన్నా జ్ఞాపకం రాలా. అలా అనడం అపచారమైతే కావచ్చునేమో కాని,– యదార్థం యిది!

అలా,– రాకపోవడమూ ఒకందుకు మెరుగే,– నాకు అప్పుడూ, మరీ చిన్నతనమే; మనిషి మొగం చూస్తే, జంతువులంటివి ధోరణి అర్థం చేసుకుంటాయ్: నాకు,– తిప్పి చెప్పలేకపోవచ్చును కాని,– అంతో యింతో ఆకళింపు కాలేదా, వాళ్ల తత్త్వం.

మామయ్యా!– మొవ్వలో ఉన్న అమ్మాయి,– నా కోసమే పుట్టిందని,– మా వాళ్లు అనుకోలేదూ? ఒక్క క్షణం నన్ను విడిచి ఉండేదా?– దాన్ని చంక నేసుకోకపోతే నాకు గంగ వెఱ్రులెత్తేది కాదూ?– అలా ఆపేక్షగా ఉన్నామనేగా,– మమ్మల్ని ఒక్కచోట ఉండనీయకుండా,– కలిసి పెరగనీకుండా,– నన్నీ ఊరు విసిరేసింది! అలా చేయడం, చివరకి, నా బాగుకే వచ్చిందని,– వాళ్లు,– అంటే అనవచ్చును:

కాని,– ఏమిటి నేను బాగు పడింది?

నీవు యే లోపము చేయలేదు:

నిజమే: కాని,– కన్న కూతురు పచ్చగా ఉండగా,– నేను మరోచోట పెరగాల్సిన అవసరం ఎందుకు వచ్చింది–?–

మొక్క,– సరైన పోషణలో పెరిగి కాపుకు వస్తే, అది సజావు కాని,– గడకఱ్ఱకు పూవులు పళ్లూ కడితే,– అది వృక్షమవుతుందా?

అప్పుడు, మరీ బుద్ధి తెలియని వయసు కనుక,– నా మనసులో బాధ విప్పి చెప్పడం చేతకాకపోయింది: కాని,– ఆ యేటి కాయేదు పైన బడ్డ కొద్దీ,– నాకూ,– మొవ్వలో రుక్మిణికీ,– మావాళ్లు కావాలని చేతులారా,– ఏ లోపం జేసారో తెలిసిరాలా?–

(అసంపూర్ణం)

# నాటికలు

❁ గోపీదేవి ❁ కేళీగోపాలం ❁ బాల

❁ అఇఉణ్ ❁ సేఫ్టీరేజర్

* గోపీదేవినుండి అ ఇ ఉ ణ్ వరకు మల్లాది వారి కేళీగోపాలమ్ అన్న నాటికల సంపుటిలోనివి. ఆదర్శ గ్రంథ మండలి ప్రచురణ, *1967*.

## పాత్రలు

మనోహరి

లలిత

కమల

కృష్ణుడు

ఉద్ధవుడు

స్త్రీ

యువకుడు

బాలిక

యోగిని

అనంగసుందరి

విజయసేన

సుమబాల

వృద్ధదాసి

# గోపీదేవి

(మొదటి రంగం)

(మధురలో, రాచనగరకు అంటివున్న ఉద్యానవనము. దట్టముగా అల్లుకొన్న సన్నజాజి పొద దగ్గర, ఇద్దరు చెలికత్తెలు నిలుచుని పూలు కోస్తున్నారు.

కొంచెము దూరములో, మందార వాటికలో కనబడుతూన్న మంటపములో మనోహరి, ఏదో ఆలోచిస్తూ కూర్చున్నది.

పూలబుట్ట నింపుకొని, సఖు లిద్దరూ, ఆమెను సమీపిస్తారు, వారి పదధ్వని ఆమె ధ్యానానికి భంగము కలిగించింది. లేచి కూర్చుని అనిమేష నయనాలతో వారి వంక చూచింది. పూలను ఆమె సమీపములో తామరపాకుమీద పోసి దూరముగా వెళ్ళి పోతూంటారు.)

మనో : లలితా! తలవంచుకొని అంత త్వరగా వెళ్ళిపోతున్నావు, ఎక్కడికి-

లలిత : నీవు దండగ్రుచ్చేలోగా, గులాబీలు, మల్లెలు కోసుకు రావడానికి-

మనో : కోసిన జాజులు చాలవూ! చక్కగా తెల్లగా కనబడే దండలో గులాబీ పూలు ఇమిడ్చి అందము చెడగొట్టడము ఎందుకూ?

లలిత : రాజకుమారీ! వర్ణ సాంకర్యంచేత నైసర్గికమైన శోభ ఏమన్నా లోపిస్తుందా?

మనో : కాదు సమ్మేళనముచేత: ఎంతో సౌకుమార్యముతో పెరిగి, ముట్టుకుంటే వాడిపోయే సన్నజాజుల దండలో వురిమిచూస్తున్న కళ్ళతో కనబడే రక్తిమ అంతా జ్ఞాపకము తెచ్చే గులాబీలు చేర్చడం ఎందుకూ? వాటిని కంటగించడము కాదూ?

లలిత : పోనీ, పొరపాటేనమ్మా! జాజికి గులాబీపొత్తు సరిపడదుకాదూ! ఈమారు కృష్ణుని పేరు తలచినప్పుడు చెపుతాను. ఇంత అల్లారుముద్దుగా పెరుగుతూన్న నీవు ఆ గొల్లపిల్లవాడికోసం రాత్రి పగలు నిద్రాహారము మానుకొని కలవరిస్తావెందుకూ? ఆ గులాబీతో జతగూడటం ఈ జాజికి యిష్టమేనా?

మనో : ఇదుగో! అక్కర్లేని మాటలన్నీ ఎందుకూ? చనువు గదా అని నీ యిష్టము వచ్చినట్లుగా మాట్లాడావా అంటే చూడు జాగ్రత్త. కమలా నేను క్రీడా సరస్సులో స్నానం చేస్తాను. నీవు వెళ్ళి కావలసిన చీరెలు తీసుకురా? (కమల వెళుతుంది) లలితా! నాకు ప్రాణస్నేహితురాలవని- నా మనస్సులోవున్న సంగతి నీకు చెప్పాను. నీవు అందరి ఎదుటా ఆ సంగతి బయటపెడితే చూసినవాళ్ళందరూ, నన్ను హేళన చేయరూ! వసుదేవకుమారుని తలచడానికన్నా నా కర్హతవుందా? ఆ మహానుభావుడికి నాలాంటి వాళ్ళు లెక్కా?

లలిత : అవునమ్మా! నిజమే పాపము నీలాంటివాళ్ళు లెక్కేలేదు. మొన్న ఈమధ్య వెంటబడి యింటికి వెళ్ళాడే- మీ బాబాయి కంసమహారాజుకి గంధము,

పూలమాలలు తెచ్చి పెట్టే మరుగుజ్జుది– అది నీకంటే చాలా అందగత్తె అన్నమాట.

మనో : ఎందుకే కాని మాటలాడుతావు లలితా! అతడెన్నడైనా అలాటి వాళ్ళను కన్నెత్తి చూస్తాడా? వికృతరూపము పోగొట్టాడని తన యింటికి రమ్మని తీసుకువెళ్ళి పూజించింది. భక్తురాలు మొగమాటపెడితే కాదనలేక వెళ్ళాడుగాని–

లలిత : నీవు జరిగిన సంగతంతా చూచినట్టుగానే మాట్లాడుతున్నావే! మన కమల నాతో చెప్పిందమ్మా. ఊరందరూ కూడా చోద్యంగా చెప్పుకుంటున్నారట. అయినా వాళ్ళ ఊళ్ళో అంతకన్న చక్కనివాళ్ళు దొరుకుతున్నారా నిత్యమును–

మనో : లోకులందరూ, ఆయన సామాన్య మానవుడని యిష్టమొచ్చినట్లు అనుకుంటారు. కాని ఆ పరతత్వాన్ని గుర్తెరిగిన వాళ్ళకు తెలుసును. ఈ లీలలన్నిటికీ అర్థమేమిటో? మాయను దాటగలిగినవాళ్ళకు అతని అమాయకత్వము చాలా బాగా విశదమౌతుంది.

లలిత : ఇవాళ మాయ అంటావు. రేపు మా కందరికీ కళ్ళు పోయినాయంటావు. చూసినవాళ్ళకంటె నీకెక్కువ తెలుసునమ్మా? నడివీధిలో నిలుచుని మెరిసి పోతూన్న తన ఒళ్ళు చూచుకుంటూ, 'మా యింటికి రండి' అని బలవంతపెట్టి అతను బదులు చెప్పకముందే చేయి పట్టుకొని లాక్కువెళ్ళింది

మనో : ఎందుకే, ఆ దేవదేవుని గురించి ఇన్ని అబద్ధాలు పలకడము. సాయంకాలము వెళ్ళి వచ్చాడని మన కంచుకి చెపుతూ ఉండగా వినలేదూ?

లలిత : అది రెండోమాటు వెళ్ళడం. మొదట వెళ్ళి కొంతసేపు ఉన్న తరువాత తిరిగి వచ్చాడో? చూచినవాళ్ళు చాలామంది ఉన్నారు. కావాలంటే తెలిపిస్తాను సరేగాని భగవంతుడని యింటికి తీసుకువెళ్ళి పూజించిందంటున్నావు గదా! బుగ్గలమీదా, పెదవిమీదా గాట్లెందుకున్నాయి? దేవుణ్ణి పూజిస్తూ భక్తులు రక్కుకుంటారా?

మనో : నేను నీ ప్రశ్నలన్నింటికి సమాధానము చెప్పలేనే మీకందరికీ ఆయన ఎంత మంచివాడో ఏమి తెలుసు? చక్కనివాడు గనుక చూచిన వాళ్ళందరితోనూ సంబంధాలు కల్పిస్తారు ఓర్చలేని వాళ్ళు.

లలిత : కల్పించడ మేమంత వచ్చింది. ఆయనకు కల్పించుకోవడం చేతగాదు గను కనా? పాపము దినమంతా తీరికే వుండదు. వచ్చేపోయే వారందరితో మాట్లాడడముతోనే సరిపోతుంది.

మనో : గొప్పవాళ్ళను చూడడానికి అనేకులు వస్తూంటారు. నీలాంటి అజ్ఞానులు ఎక్కడో ఒకరూ యిద్దరూ ఉన్నారుగాని మిగిలిన చరాచర ప్రకృతి అంతా ఆతని దివ్యమూర్తిని గుర్తించిందే.

లలిత : అమ్మా! తెలుసుకోకముందు వృథాగా నాతో వాదించడం ఎందుకూ? ఆయన్ని దర్శించడానికి వచ్చే వాళ్ళందర్నీ నేను కనిపెడుతూ ఉన్నాను. ఒకరకం వాళ్ళందరూ అడవుల్లో తపస్సు చేసుకునేవాళ్ళు – ఎవరినన్నా చావగొట్టడానికి రమ్మని బ్రతిమాలడానికి వస్తూంటారు. ఇక రెండోరకం వాళ్ళు నాలాటివాళ్ళు.

మనో : నీలాటివాళ్ళా – నందనందనుడికి కొత్త కన్నెల్నెవరినైనా తీసుకువెళ్ళి

అర్పిస్తున్నావా ఏం?

లలిత : ఇంకాలేదు. కొద్ది రోజుల్లో జరిగేదాన్ని ఇప్పుడు సూచించానన్నమాట.

మనో : అంటే

లలిత : అంటేనా – ఇంకా కొన్ని రోజుల్లో కృష్ణుడు ఏకాంతంగా ఉన్న సమయంలో ఎంతో ఆదుర్దాతో అతని దగ్గరకు వెళ్ళి – పల్లవీ పల్లవా!–

మనో : అదిగో – ఆ మాదిరి మాటలు అన్నావా అంటే నా సంగతి తెలుసుకాదూ నీకు.

లలిత : తరువాత తెలుసుకుంటానమ్మా! నేను చెప్పేది విను. అతన్ని సమీపించి అయ్యా! మా మనోహరి మిమ్మల్ని తలుచుకుంటూ తోటలో పూలపాన్పుమీద పడి దొర్లుతూంది. మీరెల్లాగయినా వీలు చేసుకుని ఊరు మాటుమూగిన తరువాత ప్రాకారాన్ని లంఘించి, పరుగెత్తుకువచ్చి, ఆమెతోకూడా కలిసి చంద్రుణ్ణి బెదిరించి ఆ మీద–

మనో : సంతోషించార్లే తెలివికి– ఇక చాలించొచ్చు. తమరు వెళ్ళి ఇన్ని మాటలుకూడా చెపుతారూ? రెండో కుబ్జ అవుతావు.

లలిత : అవును. ఎన్నడన్నా చూసి ఉంటేగాదు అంత చక్కని వాణ్ణి. ఒళ్ళంతా కాటిక రాచుకున్నట్టుగా, దానికి తోడు జుట్టులో నెమలి కన్నులు గుచ్చుకుని చేతిలో ఆవుల్నితోలే మునికోలతో నా కంటబడగానే కనపడ్డదే చాలు గదా అని కావిలించుకుంటాను. అప్పుడు నన్ను చూసినాకూడా కోపం వస్తూంది కాదూ నీకు.

మనో : నీ అందానికి తోడు ఇంకొకరిని వెక్కిరించాలికూడాను నీవు నీలమేఘశ్యాముణ్ణి కాటుకలాగా నల్లగా ఉన్నాడంటేనే తెలుస్తూంది నీ సరసత అంతా.

లలిత : ఎట్టాగైనా కాకిపిల్ల కాకికి ముద్దు. మామూలుగా చూసేవాళ్ళు కారునలుపు అనుకుంటారు. అభిమానం ఉన్న వాళ్లు, నీవు చెప్పినట్లుగా అనుకుంటారు. వాళ్ళ కళ్ళు చల్లగా నీలమేఘమేకాని, పాలమేఘమేకానీ, గొంతిక చిన్నది. గనుక బ్రతికిపోతున్నాం– మేఘంలాగా ఉరమడంకూడా మొదలుపెడితేనా.

మనో : చంద్రుడు నిప్పులు కురుస్తాడు.

లలిత : వెన్నెల కురిపిస్తూ అందర్నీ సంతోష బెడుతుంటే ఇంత మండిపడుతున్నాడు? నిజంగా నిప్పులు కురిపిస్తేనా మీరు చెప్పినట్లుగా వినరూ? ఇప్పటిలాగా ఆరుబైట పడుకుని ఉబుసుపోక తిట్లల్లోకి దిగడానికి వీలవుతుందేమో అప్పుడు?

మనో : చంద్రుడు రేపు నిన్నుద్ధరిస్తాడులే. ఏమీ తెలియని అమాయకరాండ్రు గనక తాపము సహించలేక తిట్టి ఊరుకున్నారు. నీవు అమాంతము విరుచుకు మీదపడి హనుమంతుడి చెల్లెలవుతావు.

లలిత : చేతనైతే కసి తీర్చుకోవాలి. లేకపోతే మాట్లాడక ఊరుకోవాలి. చూచి ఓర్చుకోలేక అతడిమీద కోపము వుంటే, వాళ్ళ వంగడాన్నంతా తిట్టడము ఎందుకూ? అయినా ఏమిటమ్మా ఊరుకున్న కొద్దీ, మహా చిత్రముగా మాట్లాడుతున్నావు మీలాటివాళ్ళకు విరహమెత్తిందా అంటే గంధము తియ్యలేక, పన్నీరు చల్లలేక, మాలాంటి చెలులున్నూ– త్రుంచి పోసిన చిగుళ్ళూ పువ్వులూ ఎత్తలేక

తోటమాలులున్నూ- చస్తారు మేముగూడా యీ మాదిరిగా చేస్తే ఊరుకుంటారూ?

మనో : అవేదన అల్లా అనిపిస్తుంది. నీవు ఇట్లా వెక్కిరిస్తున్నావు. ఎల్లకాలమూ ఈ మాదిరిగానే వుంటావేమో చూస్తాను.

లలిత : అలాగే చూద్దువుకాని - జరిగితే జ్వరమంత సుఖము లేదన్నారు. మీలాటి వాళ్ళకైతే కాళ్ళూ చేతులు విరగ్గొట్టుకొని పనిచేయడానికి దాసదాసీజనము, రెక్కలు పడిపోయ్యేటట్టు అక్కడి వార్తలు యిక్కడా ఇక్కడి సంగతులు అక్కడా జారవేయడానికి చిలుకలు, గోరు వంకలూ ఉన్నాయి. మేముకూడా కోయిల ఎక్కడో 'కో' అన్నదనుకోగానే విరుచుకు క్రిందపడుతుంటే ఎన్నాళ్ళు పనిలో ఉంచుకుంటారు.

మనో : లలితా నాతో ఎందుకు పోట్లాట - ఒక్కమాట అడుగుతాను చెప్పవూ.

లలిత : కృష్ణుణ్ని గురించిన మాట తప్ప ఏదైనా సరే అడుగు.

మనో : ఎందుకూ ఆతడంటే అంత కోపం.

లలిత : ఎందుకా - నీకు తెలియడంలేదూ? ఎండ కన్నెరుగకుండా అంతఃపురాల్లో పడిఉండే మీలాటివాళ్ళ నందర్నీ తోటల్లో, దొడ్డల్లో తిప్పిస్తున్నాడు.

మనో : ఆయన దోషవేముందీ అందులో - అందరిలోకి చక్కనివాడైన మన్మధుడుకూడా ఎరువు తెచ్చుకోగలిగిన అంత అందముగా ఉండి గొల్లవాళ్ళతో కలిసి ఆవుల మందలు తోలడములేదూ?

లలిత : ఆ - ఆ మందంతా యీతను తోలాల్సిందే! అందుకోసమే కాబోలు ఉద్ధవుణ్ణి పంపించాడు, మంద బెంగబెట్టుకొంటుందని.

మనో : ఏమిటీ! 'ఉద్ధవుడు తరలిపోయినాడూ! అయితే కృష్ణుడు వంటరిగానే వున్నాడన్నమాట' నా శ్రేయస్సు కోరేదానవు గనుక ఆలసించకుండా-

లలిత : వెళ్ళి ఆయిన్ని చెయ్యిపట్టుకు ఈడ్చుకురమ్మంటావు. నాకంటే యీపాటికి చాలామంది ముందరగానే వెళ్ళి చుట్టూ మూగి ఉంటారు. మేనమామగారింటికి వచ్చినప్పుడన్నా కాస్త కుదురుగా ఉండకపోతే అందరూ ఏమనుకుంటారు.

మనో : సరసు డనుకుంటారు.

లలిత : చావదన్నడానికి సిద్ధమవుతారు. రాజుగారి మేనల్లుడని మరేం గౌరవించి చూన్నూ ఊరుకోరు. ఇక్కడకూడా కనబడ్డ ఆడవాళ్ళందరితో పరియాచకాలాడుతూంటే-

మనో : ఆ విషయాలన్నీ నాకెందుకుగాని, నీవు వెళ్ళవూ.

లలిత : ప్రయోజనం ఉండదేమో!

మనో : నీకే తెలుస్తుంది గాదూ నా ప్రేమ సామాన్యమైన దనుకుంటున్నావు, ప్రేమమయుడు ఆతడు గుర్తించే ఉంటాడులే! ఆ పేరు చెప్పు చాలును.

లలిత: చెప్పక ముందే తెలుసుమలే నీ సంగతి. పూలచెంగుతో దోవపోతున్నప్పుడు కొట్టావే- ఆ గుర్తు చెప్పనా.

మనో : అబ్బా! ఎందుకూ అంత విసిగిస్తావూ. ఏమీ ఎరుగని నంగనాచిలాగా నటిస్తావేం. నీకు మాటలు నేర్పాలా.

లలిత : కావు చేతలు, నీ పాండిత్యము నా కబ్బదులే.

(కమల ప్రవేశించి)

రాజకుమారీ ! గులాబీ గుత్తులనిండా తుమ్మెదలు మూగాయి. వాటిని వదిలించడము నాకు చేతకాలేదు.

మనో : నేను వస్తానుండు నన్ను ఆనవాలు పట్టగానే అవన్నీ పారిపోతాయి.

## (రెండవ రంగం)

(వెన్నెల రాత్రి. దట్టముగా అల్లుకుపోయిన జీవజొంపాలగుండా, లేత చేతులతో దోవ చేసుకొని చందమామ చూస్తున్నాడు మందానిలుని లాలింపులకు లోగి పువ్వులన్నీ నిట్టూర్పు సౌరభాలు వెదజల్లుతున్నాయి.

కడుపునిండా చివురుటాకులు మెక్కి, బొంగురు పోయిన గొంతు సవరించుకుంటూ లే మావిగున్నమీద కోవెల కూర్చున్నది.

వెన్నెల ఒళ్ళంతా పూసుకుని, లతలన్నీ వనజ్యోత్స్నల్లాగా మెరుస్తున్నాయి.

చంద్రకాంత శిలావేదిపైన కృష్ణుడు విశ్రమించి ఉన్నాడు వీవనగొని పరిచారిక ప్రక్క నిలబడి యున్నది. సమీపములోనే ఉద్ధవుడుకూడా ఉన్నాడు.

కృష్ణుడు పరిచారికకు చేతితో సౌంజ్ఞచేస్తాడు గ్రహించి కనబడకుండా చెట్లచాటుకు వెళ్లిపోతుంది, ఉద్ధవుడు దగ్గరకు వచ్చి క్రింద కూర్చుంటాడు)

కృష్ణ : చెప్పాల్సిన సంగతులు లేమీ లేనట్లు దూరముగా పోయి మాట్లాడకుండా నిలుచున్నావేమి?

ఉద్ధ : తెలియజేయవలసిన కథ చాలా ఉంది. ఎక్కడ మొదలు పెడదామా అని ఆలోచిస్తున్నాను.

కృష్ణ : ఏమీ! ఏం జరిగినదేమిటి? యమున ఒడ్డున అందరూ–

ఉద్ధ : ఎవరికీ ఏం లోపమూలేదు. అందరూ బాగానే ఉన్నారు కాని, ఎంత గల్లంతు చేసి వచ్చావయ్యా

కృష్ణ : నేనా

ఉద్ధ : తమరు తప్ప ఇంకా ఎవరుంటారు? నీవు బయలుదేరి వచ్చినప్పటినుంచీ ఊరందరికీ పిచ్చి ఎత్తినట్లుందిట. ఎక్కడ కాస్త అలుకుడైనా నీవేనని ప్రతివాళ్ళూ ఎదురుచూస్తూంటారు. మొగవాళ్ళకేంలే ఏదో పనిపాటలు చేసుకుంటూ మరచిపోగలరు. కాని ఆడవాళ్ళందరూ, అహర్నిశలూ నీవు ఎప్పుడు వస్తావా అని కాచుకుని ఉన్నారు.

కృష్ణ : నేను చెప్పిన మాటలన్నీ చెప్పలేదూ వాళ్ళకు.

ఉద్ధ : చెప్పాను కాని, నామాట లెవరికి కావాలి. అందరూ కట్ట గట్టుకుని నావెంట వస్తామని బయలు దేరారు. ఎంతో శ్రమమీద తప్పించుకుని వచ్చాను.

కృష్ణ : అవును పాపం! నేనంటే అంత ప్రాణప్రదం వాళ్ళకి.

ఉద్ధ : లోకులందరూ మాత్రం వేరువిధంగా తలుస్తున్నారు.

కృష్ణ : ఏమని?

ఉద్ధ : నీ మీద

కృష్ణ : వాళ్ళకు మోహముందనా – అవును ప్రాకృతుల ఆలోచనలు, ఊహలూ అన్నీ నాకు తెలుసు. ఆఁ...నిజమే మోహం ఉంది తల్లికి చక్కని కుమారుడిమీద, చెల్లెలికి సుప్రసిద్ధుడైన అన్నమీద ఉన్న వ్యామోహం ఉంది. నన్నావిధంగా ఆవరిస్తూన్న వాళ్ళందర్నీ చూస్తే నాకు సంతోషంగానే ఉంటుంది.

ఉద్ధ : నీ ఆంతరంగిక భక్తులు తప్ప ఇంకా ఎవరూ గ్రహించలేరు ఈ సంగతిని. గోపికా వస్త్రాపహరణం సంగతి ఎంత వరకు నిజం.

కృష్ణ : (నవ్వి) అంతా –

ఉద్ధ : ప్రభూ, నాకు అర్థం కావడం లేదు. అందరూ నిన్ను ఆడవాళ్ళ చీరెలు ఎత్తుకెళ్ళి చెట్టుమీద దాచాడని నిందించడం వినలేకపోతున్నాను. కాదని పోట్లాడినా మన ప్రాంతాలవాళ్ళే చెప్పారంటున్నారు. నలుగురిచేత వేలు వంపించుకోవడం ఎందుకు– జరిగినదేమిటో నాకు చెప్పరాదూ!

కృష్ణ : నీవుకూడా ఇంకొకరు చెపితేనేగాని తెలుసుకోలేని స్థితిలో ఉన్నావన్నమాట. సరే, విను. మన వాళ్ళందరినీ మాయచేసి ఆడిస్తున్నాను. వాళ్ళు అది ఎరు గరు. చివరకు నాకే జాలిపుట్టి వాళ్ళని ఆవరించిన మాయను, తొలగించి అందని చోటకు తోలేసాను. గోపికలందరూ లౌకిక న్యాయానికి బద్ధులై ఉన్నట్లు అందరికీ తెలియడానికి తిరిగి మాయను క్రమ్మించాను. భ్రాంతులన్నీ: నశింపచేసుకుని పరతత్త్వాన్ని నిరూపించి తెలుసుకోగల స్థితిలోకి తీసుకు వచ్చాను. ఇంతవరకూ జరిగిన వస్త్రాపహరణం– మిగతా కథలన్నీ ఊరందర్నీ అడిగి తెలుసుకుని ఆనందించవచ్చు నువ్వు.

ఉద్ధ : మహానుభావుడవు నీ...

(ఒక స్త్రీ ప్రవేశిస్తుంది. ఆమె రావడము చూచి ఉద్ధవుడు కృష్ణుడికి కనుసైగ చేసి వెళ్ళిపోతాడు.)

స్త్రీ : గానలోలుడికి నమస్కరిస్తూన్నాను.

కృష్ణ : నీవు గాయనివా.

స్త్రీ : అంతకు నోచుకోలేదు. పాటతో మ్రోళ్ళు చిగిర్చేట్టు చేయగల నీ యెదుట ఎవరు సంగీతము వచ్చునని చెప్పుకోగలరు.

కృష్ణ : స్తోత్రము చేయడానికే అయినట్లయితే మరొకమారు తీరుబడిగా రావచ్చును.

స్త్రీ : ఉన్నమాట చెప్పాను. మహా రసికుడవు. పొరబాటేదన్నా ఉంటే మన్నించాలి. నేను వచ్చిన పని మనవి చేస్తాను.

కృష్ణ : స్తోత్ర పాఠాల్లోకి దిగకుండా–

స్త్రీ : మహామాత్యుడి కుమారిత విజయసేవ నీ కోసము పరితపిస్తూంది. నీవు కన్నుల బడకపోతే ప్రాణాలు నిలుపుకోలేదేమో అన్న స్థితిలోకి వచ్చింది. దయచేసి ఒకమారు–

కృష్ణ : తెలిసింది. నీ వెంట అక్కడికి రమ్మనేకాదు. ఎన్నాళ్ళనుంచీ ఈ విరహవేదన.

స్త్రీ : మొన్న నీవు మహరాజు ప్రక్కన రథములో కూర్చుని వెళుతుండగా చూచింది. అప్పటినుంచీ–

కృష్ణ : సరే వస్తానని చెప్పు.
స్త్రీ : ఈ పూలబంతిని కానుకగా బంపింది, అనుగ్రహించినట్లు తెలుసుకోడానికి వీలుగా.
కృష్ణ : అవసరములేదు. తప్పక వస్తానన్నాడని చెప్పుచాలును.

(వెళ్ళిపోతుంది)

ఓహో! అనుకున్నట్లుగానే జరుగుతుందే, మా మేనమామ మాతామహుడూ నన్ను వేయి కన్నులతో కనిపెట్టి చూస్తూ ఉండటమూ, ఈ మాదిరిగా వర్తమానాలున్నూ- ఏదో ఎత్తువేసి బయలుదేరాలి. ఏమిటీ, ఇంకొకరా!
(వేరొక స్త్రీ ప్రవేశిస్తూంది. ఏమీ మాట్లాడకుండానే అతని దగ్గరకు పోయి చేతికి ఒక లేఖ అందిస్తుంది.)
కృష్ణ : మౌనముద్ర వహించావేం. కనుగొనల కాటుక తుడిచి వ్రాసినట్లుగా ఉన్నదే. దండనాయకుడి కూతురా. ఓహో ఇదొక బెదిరింపా. ఇందులో నేను తన కనుసన్నల మెలగకపోతే గోపికలతో నాకున్న సంబంధం అంతా వెల్లడి చేస్తుందట-పిచ్చిపిల్ల- (స్త్రీతో) సరేనని చెప్పు.
(ఆమె వెళ్ళిన వెంటనే ఒక యువకుడు ప్రవేశిస్తాడు. చేతులో తీగలు పట్టుకుని)
యువ: భక్తవత్సలా! ఈ అత్యాచారాన్ని సహించాలి. ఒరుల కష్టాల్ని చూసి సహించలేక నా చేతనైన సహాయం చేయడానికి పూనుకోవడం చేత-
కృష్ణ : నీవల్ల తీరే కష్టాలేమీ నాకు లేవే?
యువ : కాదు, నిన్ను తీసుకుని వెళ్ళినందువల్ల. మహావీరుడైన రణధీరుడి సోదరి ఆనందసుందరి నిన్ను తలుచుకొని పడే వేదన చూడలేక ఈ కోమలలతలతో నిన్ను బంధించి తీసుకువెళ్దామని వచ్చాను.
కృష్ణ : ఏం మన్మథుడా- నీ చెరుకువిల్లూ- పూలబాణాలూ ఎక్కడ దాచావు. బాణాలతో కొట్టడం మానివేసి తీగెలతో కట్టి తీసుకువెళ్ళటం మొదలుపెట్టావా.
యువ : రూపజీవిత మన్మథుడవు. నీవు హేళన చేసినా నాకు సంతోషమే కాని, వస్తావా రావా.
కృష్ణ : ఆమె అనురాగ వల్లరే, నన్ను బంధించి లాక్కొని వెళుతూంది. వేరే బంధనా లెందుకూ – రెండో యామం దాటిన తర్వాత వస్తానని చెప్పు.

(యువకుడు నిష్క్రమిస్తాడు)

ఎంత ధీరత్వం – వీళ్ళందరూ తమ పేరు వినగానే కృష్ణుడు పరుగెత్తుకుని వస్తాడనుకుంటారు. ఇంతమందిని దర్శించడానికి ఎన్ని కృష్ణమూర్తులు కావాలో!
(ఒక బాలిక ప్రవేశిస్తుంది చేతులో ఒక బాణముంది. దానితో కృష్ణుణ్ణి పొడుస్తుంది.)
కృష్ణ : ఏమిటీ, కొత్త వింత
బాలిక : మా అక్కయ్యకూడా నీలాటిదేనా, మరి.
కృష్ణ : మీ అక్కయ్య ఎల్లాంటిదో, చూడంది ఎట్లా చెప్పనూ
బాలిక : చాలించు దొంగ వేషాలన్నీ, ఎవరమ్మ నీమదనుడట. వాడితో మా అక్కయ్యమీద బాణాలు వేయమని చెప్పావుట ఎందుకూ. బలే మాయమనిషివి లాగానే

ఉన్నావే నువ్వు. బాణాలేమిటో కనబడవు–కుయ్యో మొఱ్రో అని ఒకటే గోల తోటలో కూర్చుని.

కృష్ణ : సరి సరి! ఇదా నీవు చెప్పడానికి వచ్చింది. మీ అక్కయ్య తెలివికి సంతోషించాను కాని, నువ్వెందుకు వచ్చావు. ఎవరన్నా వెళ్ళి రమ్మన్నారా?

బాలిక : ఎవరన్నా చెప్పితే చేసేటంత తెలివితక్కువదాన్ని కాను. మా అక్కయ్య మాటల ధోరణిలో నీ సంగతంతా తెలిసింది. ఎదుటివాళ్ళను ఈలా కష్టపెడుతూండే వాడవు– ఆ బాణాలే నీకు గుచ్చుకుంటే అప్పుడు తెలుస్తుందని వచ్చాను. (మళ్ళా పొడిచి) ఇప్పుడెల్లా ఉంది.

కృష్ణ : మీ అక్కయ్య జ్ఞాపకము వస్తూంది. వాడితో వేయొద్దని చెపుతానులే.

బాలిక : ఆ మదనుణ్ణికూడా చూపించు నాకు ఒకమాటు– అతనికికూడా ఈ బాణం మొన ఎంత పదునుగా ఉందో చూపించాలి.

కృష్ణ : ఆ మాత్రానికి ఇంతదూరం వచ్చావెందుకూ– నీవు మీ అక్కయ్య ఉన్న తోట్లోకి వెళ్ళి వెదికావా అంటే కనబడతాడు. కనబడకపోతే పోని మీ అక్కయ్యతోనే చెప్పు ఇలా నన్ను బాణంతో పొడిచానని – దొంగ ప్రక్క నెక్కడో దాక్కుని వింటూంటాడు. విని బాణాలన్నీ చంకలో పెట్టుకుని పారిపోతాడు.

బాలిక : నాకు తెలుసునులే నిన్ను ఓదార్చడానికి వస్తాడు.

కృష్ణ : వస్తే ఏదన్నా చెట్టుకు కట్టివేసి నీవు రేపు వచ్చేదాకా ఉంచుతానులే. అప్పుడు కసి తీర్చుకుందువుగాని.

బాలిక : పోనీలే పాపం, కొంచెంసేపు ఏడిపించి వదలిపెట్టేయి. అయినా మరిచి పోయినాను– నీవుకాదూ ఇదంతా చేసింది.
అతనితో చెప్పి మా అక్కయ్యమీద బాణాలు వేయమని పంపించినవాడవు. అమ్మా!

నిన్నా – (ప్రొడిచి పారి పోతుంది)–

కృష్ణ : బలే యెత్తువేసింది. ఈ గంట్లు మానేదాకా ఆ పిల్ల జ్ఞాపకం వస్తూనే ఉంటుంది. (ఏదో ఆలోచిస్తూ కూర్చుంటాడు. ఒక యోగిని ప్రవేశిస్తుంది. లేచి నమస్కరిస్తాడు.)

యోగిని : ఏమని దీవించను.

కృష్ణ : మనస్సుకు శాంతి ఉండాలని.

యోగిని : ఎప్పుడన్నా లేదా?

కృష్ణ : సమస్తమూ తెలిసినవారు. నేను చెప్పడము ఎందుకూ.

యోగిని : (ధ్యానముద్ర వహించి, కొంతసేపటికి) ఓహో! ఎంత జాణవోయి నీ అభిప్రాయమిదా. సరే, ఈ మాదిరిగానే ఎల్లకాలమూ ఉండమని దీవిస్తూన్నాను.

కృష్ణ : మీరేమన్నా చెల్లుతుంది.

యోగిని : చెల్లడముకాదు, జరగాలి.

కృష్ణ : ఈ దాసుడ్ని అజ్ఞాపించరాదూ.

యోగిని : ఏమున్నది. నేనూ వెనుకటివారిలాగానే వచ్చాను. నా వెంట బయలుదేరి రావాలి నీవు.

కృష్ణ : గంతవ్యము ఏదో తెలుసుకోవచ్చునా.
యోగిని : నగరి వెలుపలి ఉద్యానవనము.
కృష్ణ : మీ ఆశ్రమమక్కడేనా.
యోగిని : నా ఆశ్రయము.
కృష్ణ : రాక తప్పదా-
యోగిని : వాసుదేవుడుకూడా, సామాన్య మానవుడిలాగు నటిస్తే ఏలా! ఎంత చిత్రముగా ఉంది లోకము. జగత్తునంతా బంధించేది ఈ అల్పసూత్రమేనా - భగవతీ వస్తున్నాను.

## (మూడవ రంగం)

(పన్నీటి తుంపరులు చిమ్ముతూన్న జలయంత్రం దగ్గర అనంగసుందరి నిలుచున్నది.

మాటి మాటికి, అతడు వస్తున్నాడేమోనని దోవవైపు చూస్తూ ఎవరూ కనబడకపోతే ఉస్సురని నిట్టూర్పువిడుస్తూ, అప్రయత్నముగానే చేతిలో ఉన్న పూలదండ తుంపి వేస్తూంది.

కొంతసేపటికి ఎవరో వస్తూన్నట్లు తోచింది. సంతోషము వెల్లిగ్రక్కుతూన్న కన్నులతో ఆ వంక నిదానించి చూస్తూ ఎప్పుడు దగ్గరకు వస్తాడా అని నిరీక్షిస్తూంది.

తెల్లనిబట్టతో శరీరము అంతా అచ్ఛాదితమైంది. ముఖము కనబడటములేదు. స్త్రీయో పురుషుడో అనికూడా తెలుసుకునేందుకు వీలులేదు. అనంగసుందరి చేతులో పూలదండ క్రిందకు వదలివైచి సంభ్రమముతో "నాథా" అని ఆ క్రొత్తగా వచ్చిన వ్యక్తిని కౌగిలించు కొంటుంది.

ఒక నిమిషమైన తరువాత, ఆగంతుకి అనంగసుందరి కౌగిలిలోంచి తప్పించుకొని. మేలిముసుగు తొలగించి కొంచెము దూరముపోయి నిలువబడుతుంది.)

అనంగ: విజయసేనా!
విజయ : ఎవరు! అనంగసుందరీ.
అనంగ: ప్రొద్దుపోయిన తర్వాత వెంట నెవరూ లేకుండా ఇక్కడికి ఎందుకు వచ్చావు?
విజయ : వెంట ఎవరూ లేకేం. నిన్ను హెచ్చరించి ఈ ఉద్యానవనంలోకి రప్పించినవాడే, నాకూ తోడుగా ఉండి తీసుకువచ్చాడు. అక్కా! నీ అభిసారికావేషం చాలా బాగుంది!
అనంగ : అభిసారికా వేషమా ? ఏమిటీ వింత మాటలు.
విజయ : ఇంకా దాస్తావెందుకు. నన్ను కౌగలించుకొన్నప్పుడే నీ గుట్టు బయలైనది. నాథా! అని ఎంత చక్కగా పిలిచావు! (కన్నులర మోడ్చి) నాథా!
అనంగ : విజయసేనా! నీవు చెప్పేదేమీ నా కర్థం కావడంలేదు. నేను నాథా! అని పిలిచేదేమిటి. ఎవరిని పిలిచాను. అయ్యో తెలివీ, ఇంతమాత్రం గ్రహించ లేకపోయినావేం. పైగా, నే నేమన్నా అంటానేమోనని, నన్నే హేళనచేయడం మొదలుపెట్టావు. తెలిసిపోయిందిలే నీ సంగతంతా ఇక వెళ్ళవచ్చు. నీ వెవరికోసం ఇంత ప్రయాసపడి వచ్చావో, అతడిక్కడలేదు.
విజయ : అవును లేదు. ఆ మాట నీవు చెప్పకముందే తెలిసింది. వచ్చిన తర్వాత చూద్దాంకా, నీ ధీరత్వం ఎంతసేపు ఉంటుందో? అయితే, ఎవర్ని చూసినా అతడే ననుకోవడమేనా, అంత మైమరపు పనికిరాదమ్మా నేను గనక సరే

సరిపోయింది. కర్మం చాలక ఏ వృద్ధకంచుకో అయినట్టయితే నీ కౌగిటలో ఉక్కిరి బిక్కిరయేవాడే.

అనంగ : నీ యందున్న స్నేహం చేత ఈ మాటలన్నీ అననిచ్చాను. ఇక మాట్లాడావంటే పరిచారికచేత బలవంతంగా బయటికి పంపించేస్తాను.

విజయ : ఎందుకూ అంత కోపం. నీవు వినగూడని మాటలేమన్నా చెప్పానా! తగినట్లు బహూకరించకుండా భయటికి నెట్టించేస్తావా! అదుగో చూస్తూనే ఉన్నాడు, పైనుంచి చంద్రుడు. పండువెన్నెల కాకనంతా భరిస్తున్నదే కాకుండా నన్ను తూలనాడికూడా ఎందుకు మరింత వేదనపడతావు. పాపం నీ మొఖమే చెప్తుతూంది. ఎంతకష్టపడుతున్నావో తల దిమ్మెత్తించే తుమ్మెదల మోత చెవులు చిల్లులు పడేసే కోవెల కూత, నిన్ను బ్రతకనీయవేమోనని నాకు చాలా భయము వేస్తూంది. సుకుమారివి, ఎంత శ్రమ పడుతున్నావమ్మా.

అనంగ : చాలు చాలు ఇక కట్టిపెట్టి బయటికి నడవవచ్చును– వకుళా!

విజయ : పిలు. ఒకర్ని కాదు. నీకున్న చెలికత్తెలందరిని పిలు. వాళ్ళు మాత్రం ఏం పాపం చేసుకొన్నారు? ప్రకృతంతాకూడా సంతోషముతో ఉడికిపోయేటట్టు చేయగల ఆ పేరు వినడానికి వాళ్ళు మాత్రము నోచుకోలేదా– పిలు. ఇప్పుడన్నా అందరిని రమ్మని పిలు.

అనంగ : ఏమిటీ పన్నాగమంతా. ఎవరమ్మా ఆ మహానుభావుడు–అంత గొప్ప పేరున్నవాడు?

విజయ : తలచుకునే ఈ మాదిరిగా పరవశురాలవవుతున్నావే. పేరువింటే సొమ్మసిల్లి పడిపోవూ?

అనంగ : అవన్నీ నీలాటివాళ్ళ వేషాలు, సుకుమారులమని లోకం అంతా తెలుసుకోవాలని అందరికన్నా ఎక్కువమార్లు మూర్ఛబోతుంటారు. నాకేమమ్మా. నీవు పేరు చెప్పడమూ– నేను మూర్ఛబోవడమున్నా.

విజయ : కృష్ణా!

అనంగ : కృష్ణుడా– ఆఁ–నాథా (నిశ్చేతనయై క్రింద పడిపోతుంది)

విజయ : ఎందుకొచ్చిన బింకాలు. అమాయకురాలు. నా దగ్గర తన కూరిమంతా దాస్తే ప్రయోజన మేముంది. నన్ను బెదిరించకుండా తానే వప్పుకున్నట్టయితే ఇంతవరకూ రాకపోయేదే. సరే చైతన్యాన్ని ఉడిగించిన క్రియే తిరిగి ఉద్ధరించేట్టు చేస్తాను.

(దగ్గరకు వెళ్ళి) ప్రియా!

అనంగ : (తత్తరపాటుతో) ప్రభూ! వచ్చావా?

విజయ : వస్తాడు. నీవు మనసు కుదుట పరచుకొని కూర్చోవమ్మా! ఆతడు వచ్చేటప్పటికి నీవీ విధముగా పడి ఉంటే, ఏమి లాభము.

అనంగ : అయ్యో! రాలేదా రాలేదా. ఎందుకూ నన్నిట్లా మోసంచేసి తిరిగి బ్రతికించావు. నా నాథుణ్ణి, నా జీవితేశ్వరుణ్ణి తలుచుకుంటూ సుఖముగా చచ్చిపోయేదాన్నే బ్రతికి ఈ యాతన పడలేను సింధు కన్యాపతీ!

విజయ : ఉన్మాదమా యేమి?

అనంగ : కాక ఏమిటి. అతడు నన్నిల్లా నమ్మరాని మోసముచేస్తే ఏమి చూచుకుని బ్రతకను? ఇంకా వస్తాడు, ఇంకా వస్తాడు అని ఎదురెదురు చూస్తూ నిమిష మొక యుగంగా ఏలాగో వేగిరించాను. నన్ను మరచిపోయి ఆతడెవతెతో సుఖిస్తున్నాడో తలుచుకున్నకొద్దీ తాళవశముగాకుండా ఉంది.

విజయ : నాధుడిక్కడికి వస్తానన్నాడా?

అనంగ : నీకు తెలియదూ. నీవుకూడా నన్ను కష్టపెట్టాలి ఆడపుట్టువైనా, ఎంత జాలిలేదమ్మా నీకు వస్తానని చెప్పలేదూ. నమ్మించి ఈ మాదిరిగా చేస్తాడా?

విజయ : ఇప్పుడు మాత్రం రాడని ఎందుకు అనుకోవాలి. ఇంకా మొదటి యామం అన్నా గడవలేదు. మహారాజుకు మేనల్లుడు గదా. అనుకున్నప్పుడు నగరు వెడలి రావడానికి వీలుంటుందా.

అనంగ : ఆ మాయలు నీకు తెలియవమ్మా. నగరి వెలుపలికి రాలేదని నమ్మగలిగితే చాలా సంతోషంగానే ఉండును. కాని ఎందరు కన్నెలు, ఎన్ని రకాల సందేశాలు, ఎన్ని ఆశలు, మహారసికుడు. ఆతడు ఇంత చక్కని వెన్నెలలో, ఊరక కూర్చుని ఉండగలడమ్మా ఏ మాయలాడి కౌగిటిలోనో (అర్ధోక్తిలో) హాఁ ఎంత మోసం చేశావూ.

విజయ : ఏమీ లేనిది ఈ వెర్రి భయాలన్నీ ఎందుకమ్మా. నీకు లోకంలో, అతన్ని వలచిన చెలులందరూ, నీలాగే అనుకుని ఆవేదన పడుతూండాలన్న మాట.

అనంగ : ఎందుకూ వాళ్ళకు అవసరమేమున్నది. వాళ్ళందరూ జాణల్సుమా నాధుణ్ణి కనుసన్నలతో మెదిలేటట్టు ఆజ్ఞ పెట్టగలరు. వారినే అనుసరించి తిరుగుతూ వారి వగలన్నీ నిజమని నమ్మి అతడు మోసపోతాడు.

విజయ : దయ అన్న మాట లేనివాడి అనురాగము కోసం ఆశపడితే ఏమి ప్రయోజన మమ్మా చక్కనివాడినని గర్వమూ– దేవుడట– ఈ మాత్రానికేనా–

అనంగ : నన్నెంత కష్టపెట్టినా ఆతన్ని తూలనాడటం విని సహించలేనమ్మా దేవుడే నిజముగా – సాగరుడు. కాళ్లు కడిగి కన్యాదానముచేసి కృతార్థుడై ఉప్పొంగలా, అనర్ఘమణితోకూడా, కుమారి తనుకూడా, ఎప్పుడూ కింద దించకుండా ప్రేమతో చూచుకొమ్మని అతన్ని బ్రతిమాలుకోలేదూ. ఎంత అదృష్టమమ్మా ఆ కమలది. నిమషమన్నా ఎడబాయకుండా, ఎప్పుడూ ఆతని సాన్నిధ్య మందుండడానికి నోచున్నది.

విజయ : సరేలే. అదంతా ఒక గాథ ఎవరుచెప్పారు నీకు. ఎప్పుడూ ఇద్దరూ ఒకచోట ఉంటారని: అయ్యో! వారి దాంపత్యం చెప్పనే అక్కరలేదు. పగలల్లా ఒకరికొకరు కనబడరు. లోకమాత భక్తులందరి యిళ్ళకీ వెళ్ళి రోజుకు ఒక మారన్నా ముఖం చూపించి రాకపోతే సమయం కనిపెట్టి ఆమె అప్పగారు అక్కడ ప్రవేశిస్తుంది. పెద్దది కదా అని ఆమెను తప్పు కోమనలేక, తానే ఇవతలకు రావలసి వస్తుంది. పగలల్లా ఆమె తిరుగుతూంటుంది. ఆయనగారు, ఎవరోపడితే లేవదీయడానికో, పనిలోసహాయం చేయడానికో భక్తుడితప్పులు మీద వేసుకొని ప్రహారా లందుకోడానికో బయలుదేరుతాడు. చంద్రుడు వచ్చి తోడ బుట్టిన ఆమెను, బావను రాత్రికి రాత్రి ఇంటికి తీసుకువెళ్ళుతాడు.

అప్పుడూ తీరిగ్గా కూర్చుని భార్యచేత కాళ్ళు పిసిగించుకోవడం, ఈలోగా ఏ నారదుడో-

అనంగ : ఏలాగైనా సముద్రుడు చాలా అదృష్టవంతుడమ్మా అంత మంచి అల్లుడు దొరకడానికి ఎంత పుణ్యము చేసుకున్నాడో.

విజయ : అంతకి ఎన్నో రెట్లు పుణ్యం చేసుకున్నాడు కాని పుణ్యం కొద్దీ దొరికిన అల్లుడమ్మా ఈయన చౌకలో వచ్చాడని-

అనంగ : పరిహాసోక్తులకేమిలే.

విజయ : నిజమేనమ్మా ఆయనా ఆలోచించాడు. శివకేశవులలో, శివుడు నచ్చినట్లు తోచింది ఆయన బుద్ధికి కాని, చిక్కు ఏమంటే ఇల్లు తెలుపు, ఒళ్ళు తెలుపు, అల్లుడుకూడా తెల్లనివాడైతే అందరూ ఆక్షేపిస్తారని విష్ణుమూర్తిని తీసుకువచ్చి, ఆయన కిచ్చాడు కూతుర్ని. ఇదంతా మనకి తెలిస్తే ఏమితంటో అని దేవరహస్యం అన్నారు.

అనంగ : పోనీ అప్పుడైనా లక్ష్మీదేవిది అదృష్టమంటావా కాదా, చెప్పుచేతల్లో మెలిగే భర్త దొరకడం?

విజయ : మొగవాణ్ణి వంచుకోగలిగిన తెలివి ఉంటేనీవూ ఆమె అంత అదృష్టవంతురాలవవుతావమ్మా!- ఎందుకుగాని ఈ వ్యర్థవాదనలన్నీ, నాధుడు వస్తానన్నాడా ఇక్కడికి?

అనంగ : వచ్చినా, రాకపోయినా, అది నా విషయం- నిన్నెవరు పిలిచారూ ఇక్కడికి రమ్మని?

విజయ : మళ్ళా మొదలుపెట్టావూ! ఇట్లా చిడిముడి. పడేదానవు నాధుణ్ణేవిధంగా మెప్పిస్తావు. ఇతరులెవరైనా అతని పేరు ఎత్తగానే అంతకోపం ఎందుకూ నీకు.

అనంగ : నీకు బదులు చెప్పడానికి చేతగాకుండా ఉంది. ఇకనైనా వెళ్ళిపోతే, చాలా సంతోషిస్తాను.

విజయ : వెళ్తాను. త్వరగానే వెళ్ళిపోతాను. నాధుడు రావడముతోడనే ఇక్కడకు ఎందుకు వచ్చావని బుగ్గలు మెలివేసి నా వెంట తీసుకుపోతాను.

అనంగ : ఓసి ! నిర్దయురాలా-

విజయ : తెలుస్తూనే ఉంది ఎవరు నిర్దయులో. పాపం పడకటింటిలో కట్టేసు కుంటావు కాబోలు నాధుణ్ణి తీసుకువెళ్ళి.

(ఒక స్త్రీ ప్రవేశిస్తుంది. ఇరువురిని చూచి అనుమానిస్తూ నిలుచుంటుంది.)

ఎవరక్కడ నిలుచున్నది?

స్త్రీ: ఒక మందభాగ్యురాలు.

అనంగ : ఇక్కడ ఏం పని అదృష్ట దేవత ఎక్కడ ఉందో వెతుక్కుంటూ వెళ్ళు.

స్త్రీ : ఇక్కడనే తారసిల్లుతుందని విని చాలా ఆతురతతో వచ్చాను.

విజయ: సోదరీ నీ వెవరవో తెలుసుకోవచ్చునా!

స్త్రీ : సుమబాలను.

అనంగ : దండనాధుడి కూతురివా?

సుమబాల: అవును.

అనంగ : నీవుకూడా యిక్కడకు వచ్చావెందుకూ.

విజయ : మనలాగానే.

అనంగ : నిన్నెవ్వరడిగారు? – ఏమమ్మా, మారు చెప్పవేం.

సుమబాల: అనంగసుందరీ! నేను మీలాగా తెలివిగలదాన్ని కాదు. ఖేదముతో సగమయి పోయినదాన్ని– నీ మాటలతో మరింత కష్టపెట్టకు అపరాధం... మహాపరాధం చేశాను. క్షమిస్తాడా?

విజయ : మాకన్న ఎక్కువ తప్పు చేశావా? నీవు అతన్ని వెదుక్కుంటూ యింతదూరం యిల్లువిడిచి వచ్చావు. మేము కాలు కదల్చకుండా యిక్కడ కూర్చుని అతడే మా దగ్గిరకి వస్తాడని ఎదురుచూస్తున్నాము.

అనంగ : ఎందుకీ అనవసర ప్రసంగమంతా! నీకు బొత్తిగా మతిపోయినట్టున్నదే. ఆమెతో నీ స్వవిషయమంతా చెప్పమని అడిగిందా!

విజయ : ఆమెకు కావలసిన సంగతేమో చెప్పాను. పరుని విషయమే – (సుమ బాలతో) నీవుకూడా – యిక్కడనే ఉండవచ్చును. అతడు తప్పక వస్తాడు.

సుమబాల: వస్తాడా – త్వరగా వస్తే ఎంతో బాగుంటుంది. నా కన్నీటితో అతన్ని అభిషేకిస్తాను.

విజయ : ఏం తప్పుచేశావు. అంతగా విచారిస్తున్నావు?

సుమబాల: తప్పా – ఎంత తప్పు చేశానని చెప్పనూ. దయామయుడు అతడు మన్నిస్తాడనే ధైర్యం లేకపోతే ఎన్నడో ప్రాణాలు విడిచేదాన్ని.

విజయ : ప్రేమిస్తున్నావు, ఏం అపచారము చేయగలవూ?

సుమబాల: బాల్య చాపల్యంచేత అతడు సామాన్యుడనుకుని, బెదిరిస్తూ ఉత్తరం వ్రాశాను. నా దాది చెప్పింది. కాని నా కప్పుడు తోచలేదమ్మా. ఎంతో నొచ్చుకుని మాత్రం, చేసిన తప్పు ఎట్లా మాపేయగలను. ఇంతలో–

అనంగ : నీ సంగతులెవరికీ అక్కర్లేదు. అతడెక్కడున్నాడో వెదుక్కుంటూ వెళ్ళు.

విజయ : ఇదివరకు చేసినదానికే అనుభవిస్తున్నాము. ఇంకా పాపం కట్టుకుంటా వెందుకు. నీ వీమెను ఈ విధంగా అన్నావని తెలిస్తే నీతో అసలు మాట్లాడుతాడా?

అనంగ : చూస్తావుగా మాట్లాడతాడో లేదో, నీవు కూడా నా కాళ్ళు పట్టుకు వేడుకోవూ అతన్ని ఒక్కమారు నీవైపు చూడనీయమని. నేనా నీలాటి వాళ్ళందరినీ చేరనిచ్చేది.

విజయ : నవలావణ్య నిధానానివి. నిన్ను చూడగానే మా మాటే ఎత్తడు ఆయన. పోనీలే, సతీపతులిద్దర్నీ దీవించి మా దోవన మేము వెళ్ళిపోతాము.

సుమబాల: నా ప్రభువును చూసి అతనితో మాటలాడడానికన్నా నోచుకోలేదూ? ఎంత అభాగ్యురాలిని.

విజయ : మరేమి తొందరలేదు. కొంచెంసేపు ఓపిక పట్టమ్మా. అతడు రావడంతోనే మనవెంట తీసుకు వెళ్ళిపోదాం.

అనంగ : నీ తరమా.

విజయ : కాక, అతన్ని ఆపివేసి నీ వాడినిగా చేసుకోవడం నీ తరమా – చూడు, ఆ పసిపాప ఎంత వేదనపడుతూందో, నాధుడు రాలేదు అని, ఆమెకన్న మనం చక్కని వాళ్ళమనీ, ఎక్కువ ప్రేమిస్తున్నామనీ, నీవనుకుంటూన్నావా! వజ్రం ఉండగా దాన్ని త్రోసివేసి కృత్రిమమణిని ఆదరిస్తాడా ఎంత తెలివిలేని వాడైనా?

అనంగ : నీవుకూడా ఆక్షేపించాలి, నీకొక నీమమున్నదా, ఏమన్నానా, గడియకొక్కరి పక్షము జేరుతుంటావు?

విజయ : నీ పక్షము మాత్రమెన్నటికీ జేరను.

అనంగ : ఎవరు చేరమన్నారూ? ఎవరు నిన్నిక్కడికి రమ్మన్నారు మీ యిద్దరూ వెళ్ళిపోండి– నాధా!

(యోగిని ప్రవేశిస్తుంది ఆమె చాలా భయపడుతూ విజయసేన చాటుకు వెళ్ళింది ఇరువురూ నమస్కరిస్తారు. అనంగసుందరి చూసి ఊరుకుంటుంది.)

యోగిని : ఎవరు, నాధా! అని ఆక్రోశించింది.

(ఎవరూ బదులు పలకలేదు.)

పొరబడ్డా కాబోలు. వెన్నెల రాత్రి ఉద్యానవనంలో తిరుగుతూన్న మిమ్మల్ని స్వరాన్నిబట్టి కృష్ణానురక్తలనుకొని, ఏమన్నా సహాయం చేద్దామని వచ్చాను.

సుమబాల: ఆతడెక్కడున్నాడు?

విజయ : ఎప్పు డిక్కడికి వస్తాడు?

యోగిని : అనంగసుందరిని తలుచుకొనినప్పుడు.

సుమబాల: తల్లీ! నీ తపః ప్రభావముచేత అతని దర్శనమయ్యేటట్టు చేయలేవూ?

విజయ : ఇక్కడికి రాకుండా ఉండేటట్టు చేయమని నా మనవి.

యోగిని : ఎందుచేత?

విజయ : అతనికి సంతోషం ఉండదు గనుక – సర్వజ్ఞవు. ఈ మాత్రము గ్రహించలేకనా, నా నోటివెంట చెప్పిద్దామని అనుకుంటూన్నావు.

సుమబాల: సంతోషం లేకపోతే, అత డిక్కడికి రాకుండా ఉంటేనే మంచిది. మనకోసం వచ్చింది కాకుండా కష్టపడాలికూడానా వద్దు. రానీయవద్దు. అతనిచె తలుచుకుంటూటేనే జీవితం అంతా గడపగలను నా హృదయంలో. అతని పెదవులమీది చిరునవ్వు చెరిగిపోతే ఏం చూచుకుని, ఏముందని, ఎవరికోసం బ్రతకాలి.

అనంగ : నీ చావు బ్రతుకులతో ఎవరి కేం పని.

యోగిని : గోపాలుడికి–

అనంగ : మాయను దాటుదామని, లోక నియమాల్ని అతిక్రమించిన, నీవుకూడా అక్కరలేని విషయాల్లో జోక్యం కలిగించుకుంటావెందుకు మా కృష్ణుడు– మాలో మేము మాట్లాడుకుంటాము. ఎవరిచ్చటి కాహ్వానించారు నిన్ను?

యోగిని : మా కృష్ణుడు– అనంగసుందరి తన్ను దండిస్తుంది చూడదానికి రమ్మంటే, అనుష్టానానికి వేళ ఐనా, మళ్ళా ఎన్నడు చూస్తామని వచ్చాను అతడీ పాటికి వస్తూ ఉంటాడు. పరికరాలన్నీ జాగ్రత్త చెయ్యి.

సుమబాల: అనంగసుందరీ! ఎంత కఠినురాలవమ్మా, పూవులతో పూజించవలసినదానికి

బదులు దండిస్తావా?- నన్ను నీ యిష్టం వచ్చినట్లుగా బాధించు. నా ప్రాణమన్నా యిస్తాను. అంతటితో తృప్తిపొంది ఆ కుసుమ సుకుమార శరీరుని వదలిపెట్టు.

విజయ : అమాయకురాలా, అవన్నీ - ప్రౌఢోక్తులమ్మా. నీవు భయపడనక్కరలేదు. దండిస్తుంది, అవును, అతడు రాగానే పెదవిమీద గంటు చూపించి బెదరిస్తుంది. కీల్జెడ వేటులతో చాలా గాసి బెడుతుంది. బాహులతికను అతని మెడకు పెనవేస్తుంది.

సుమబాల: అందుల కాతడేమీ అనడు కదా?

విజయ : నీవే చూదువుకాని ఆ మాదిరిగా వర్తించకపోతే నీమీద కోపం వస్తుంది అతనికి.

సుమబాల: ప్రసన్నుణ్ణిగా చేసుకుంటాను. కాళ్ళుపట్టుకు వేడుకుంటాను, బ్రతిమాలు కుంటాను. కాని అతన్ని అలా కష్టపెట్టలేను.

అనంగ : నీ మెప్పులు ఎవరాసిస్తారు. అప్పుడే అతడు నీకోసం వచ్చినట్లుగానే మాట్లాడుతున్నావే.

విజయ : ఇంకెవరికోసం వస్తాడు.

అనంగ : ఎవరిక్కడికి రమ్మని చెలిచేత వార్త బంపారో వారికోసం.

విజయ : ఎవరాతనికొరకు నిజంగా ఎదురుచూస్తున్నారో వారికోసం మనం పూబాన్పు దిగము నాధుడు మాత్రము మనకోసం రెక్కలు కట్టుకుని వచ్చి వ్రాలాలి. ఎంత ప్రేమ?

అనంగ : నేను ధన్యను

విజయ: నాకు చాలా సంతోషంగా ఉంది.

సుమబాల: అదృష్టం లేనిదాన్ని.

యోగిని : (సుమబాలతో) కుమారీ! నీవే ధన్యవు.

## (నాలుగవ రంగం)

(చవితి చంద్రుడు మబ్బు తెరలన్నీ తొలగించుకుంటూ బయట పడుతూన్నాడు.

చంద్రకాంత శిలలు చెమ్మగిలు తున్నాయి.

పూదేనె సొనలో తడిసి ముద్దయి తుమ్మెద రెక్కలు విదల్చుకుంటూ తిరగడానికి వీలులేక ఝుంకారము మానివేసి అణగి పడి ఉన్నది.

కలువ కన్నెలనోము ఫలించింది.

ప్రతిఫలించిన నక్షత్రాలను చూస్తూ పన్నీటి కాలువ మెట్లమీద మనోహరి నిలుచున్నది.

వృద్ధదాసి ఒకతె సమీపంలో కూర్చుని కునికిపాట్లు పడుతూంది.

కొంచెం దూరంలో ప్రతీహారిణి విచ్చుకత్తితో పహరా ఇస్తూంది)

మనో : ప్రొద్దుగుంకకముందే నిద్రకు సిద్ధమయే నిన్ను నమ్ముకుంటే బాగానే అవుతాయి పనులన్నీ కావలసినన్ని రోజులున్నాయి. తరువాత తీరుబడిగా నిద్రపోవచ్చు. నాధుడు వచ్చేదాకా మేలుకోవే.

వృద్ధదాసి : చాల్లేవమ్మా. నీకు నిద్రరాదు. ఇంకొకరిని కళ్ళు ముయ్యనియ్యవు. దొరికాదులే

ఏలాగైతే మహా దొడ్డ నాథుడు. నీకేం మహారాజు బిడ్డవు. అట్టే ఆయన్ని తలచుకుంటూ అన్నం, నీళ్ళూ లేకుండా ఎన్ని ప్రొద్దులన్నా కూర్చుంటావు ఈ పాళానన్నా కాస్తసేపు పడుకోకపోతే, రేపు రాణిగారితో ఏమని చెప్పేది.

మనో : నేనున్నానుకాదూ. నిన్నెవరూ ఏమీ అనకుండా నేనున్నాను. అమ్మతో చెప్పి నీవు రేపు నగరిలోకి రానవసరం లేకుండా ఉండేటట్టు చేస్తాను. ఇప్పుడు మాత్రం చెప్పినమాట విందూ.

వృద్ధదాసి : నీవుకూడా చెడిపోకుండా చెప్పినట్లుగా విందూ మా తల్లివిగాదూ. చిన్ననాటి నుంచి ఈ చేతుల్లో ఎత్తుకుని పెంచాను. పెరిగి పెద్దదానవయినావు మనసార కోరిన నాథుడు నిన్ను వెదుక్కుంటూ రానున్నాడు. నా మాట విని పెద్దదాన్ని, నీ మేలు కోరే చెబుతూన్నాను. పది కాలాలపాటు సుఖంగా వర్ధిల్లాలి – ఒక గడియసేపు నిద్రపోదూ, మురళీధ్వని విని మేలుకుందువుగాని.

మనో : ఇందుకా ఈ బోధన అంతా ఊరంతా మాటు మణిగిన తరువాత, వేణువు ఊదుకుంటూ వస్తాడా? అందరూ నిద్రలో ఉలికిపడి లేచి ఈ మార్గాన్నే పరుగెత్తుకురారూ! ఎబ్బే. మురళిదాచివేసి వస్తాడు. ఒకవేళ తీసుకువచ్చాడంటే, నేను దాచి వేస్తాను. మళ్ళాయియ్యను కాదూ!

వృద్ధదాసి : అవన్నీ మీ సరసాలు. వయస్సు చెల్లినదాన్ని నాకేం తెలుస్తాయమ్మా మురళి లాక్కున్నాసరే లేక సిగ్గులేకుండా–

మనో : ఊరుకో, అదుగో చూడు కాలి చప్పుడౌతూంది. వస్తున్నాడు, కనబడ్డం లేదూ. నెమలికన్ను తురాయి ఎట్లా మెరసి పోతుందో చూడు. ముత్యాలహారాల తళతళలు ఇప్పుడన్నా గుర్తించలేవూ, వచ్చాడు–

(ఉద్ధవుడితో కృష్ణుడు ప్రవేశిస్తున్నాడు. మనోహరి ఆగకుండా పరుగెత్తుకునిపోయి అతన్ని కౌగలించుకుంది. ఉద్ధవుడు చకితుడై వెనుకకు తగ్గాడు. వృద్ధదాసి ఈ సంభ్రమంలో మెళుకువ తెచ్చుకుని విసుగుకుంటూ లేవబోతూంది–)

మనో : వచ్చావూ – వచ్చావూ – అమ్మదొంగా, ఎన్నిమాయలున్నాయి నీ దగ్గర. ఎన్నాళ్ళనుంచి కూర్చున్నాను నీవు వస్తావని. నా దగ్గరా నీ తంత్రాలన్నీ సాగేది.

వృద్ధదాసి : వచ్చావు నాయనా– వెయ్యేళ్ళు సుఖంగా వృద్ధికాముడవై, గంపెడు బిడ్డలు కలిగి కాలక్షేపం చేయి. వచ్చావో రక్షించావో. ఇక్కడికి గడిచిన పూర్ణిమ నాటినుంచి కంటికరువు తీరేటట్టు నిద్రలేదు సూర్యుడు ఇంటికి చేరుకుని తెల్లవారి తిరిగి వస్తూండేవాడు. మేము మాత్రం నీకోసం ఇక్కడే కాచుకొని కూర్చుండేవాళ్ళం. ఆవిడ, అదిగో, అక్కడే ఆ పన్నీటి కాల్వ ఒడ్డున, ముసలి దాన్ని, నేనీ వేదిక నానుకుని ఈ మల్లెపొద దగ్గిరా – నీ తల్లి కడుపు చల్లగా వచ్చావు ఈనాటికైనా. (మనోహరితో) అవిగోనమ్మా ఆ అరుగుమీద ఉన్నాయి గంధమాల్యాలు, భోజ్య వస్తువులూన్ను – అలంకరించు, దగ్గిరకూర్చుని ఆరగించేటట్టు చేయి నేను వెళ్ళుతున్నాను. నా అవసరం తీరింది కాదూ (ఉద్ధవునితో) రావయ్యా! అలా మెదలకుండా చూస్తూ నిలుచున్నావేం. నీకేం భాగం లేదులే, ఆ పళ్ళు పాలల్లో అన్నీ ఎంగిలి చేసి పెట్టిందయ్యా–

అల్లో నోరూరేటట్టు చూస్తున్నా ప్రయోజనం ఏముంది. అయినా అభం శుభం తెలియని అమాయకుడవు. బాల పాపవు నీకేం తెలుస్తుంది. రా మనం వెళ్ళి పోదాం, రా బాగున్నాంలే ఇద్దరమున్నూ-రా-

(ఇద్దరూ వెళ్ళిపోతారు.)

మనో : మాటాడవేం. ఎందుకిన్నాళ్ళనుంచి రాలేదూ!

కృష్ణ: రాలేదూ.

మనో : అవును. నిజమే వచ్చావు ఎన్నిమార్లు చెలిని బంపినా రానివాడవు, నీకోసం ఎదురుచూస్తూ కన్ను మూయగానే కలలో ఎందుకు వచ్చేవాడివి?- ఇప్పటికన్నా దయరాలేదూ. ఇన్నాళ్ళకు ఇక్కడికి వచ్చికూడా, ఒక మాటన్న పలుకకుండా అలా నిలుచుంటావేం ముత్యాలు రాలుతాయా- అమృతం ఒలుకుతుందా?

కృష్ణ : కాదు ప్రేమ. ఇన్ని దినాలనుంచి యత్నించి చూచాను. ఇక్కడికి రాకుండా ఉందామని, నీమీద ధ్యానం మరలించుకొన్నాను. కాని సాధ్యంకానిదే. ఇంత అశక్తుణ్ణి చేశావుకదా! అని నిన్ను చూడగానే కోపం వచ్చేసింది. కాని నీవు అదిగో, అలాగే చూస్తుంటే ఎవరుమాత్రం ఎంతసేపు ఓర్చుకోగలరు- అమ్మా! అప్పుడే ఎంతదానవయినావు.

మనో : ఎన్ని నేర్చినా, నిన్ను రప్పించలేక పోయినాను కాదూ. నీ తెలివి ముందర నే నెందుకు?

కృష్ణ : పోనీలే. ఏదీ చక్కని పూలదండైనా లేదూ?

మనో : నీ వింకా పదిరోజులుండి వస్తే అన్నీ సిద్ధంగా ఉండేవే అప్పుడు మనోహరి నీకోసం ఈ మాదిరిగానే కాచుకుని కూర్చునే దనుకున్నావు కాబోలు - బ్రతికి ఉండేదాన్నా, మలయపవనుడిలోనూ, పువ్వుల పరిమళంలోనూ కలిసి పోయేదాన్ని కసిదీరా అడుగడుగుకూ చుట్టి వేసి నిన్ను పేరు పేరున పిలుస్తూ నా యిష్టము వచ్చినట్లు అనుభవించేదాన్ని- ఆనందించేదాన్ని- పూలదండలట- ఎలాగైతే నేం దారి తప్పి నేటికి వచ్చావుగదా అని, నాలాగే అవి గూడా మొండి ధైర్యంతో వాడిపోకుండా ఉంటాయా-

కృష్ణ: మరి ఏమీలేవూ - ఎందుకు వచ్చానూ ఇక్కడికి.

మనో : ఎందుకా తెలియదమ్మనీకు- కొంటివేషాలు కట్టిపెట్టి అలా కూర్చో తలలో ఆ నెమలికన్ను లేమిటి? గుచ్చుకోవూ- ఎక్కడో మీపల్లెలో ఆవుల్ని కాసేనాటి వేషంతోనేనా మహారాజు కూతుర్ని చూడ రావడం. తీసేయి, చక్కని పూలమాల లమరుస్తాను. కావలసినన్ని పళ్ళూ తీయని పాలూ ఉన్నాయి. కడుపునిండా మెక్కు. తరువాత మాట్లాడుదువుగాని- ఊహుఁ ఇప్పు డేమిచెప్పినా వినను. ఇదిగో ఈమారు మాటాడితే ఇక్కడ ఉండను-ముందు ఆకలి తీర్చుకో -

కృష్ణ : తరువాత తింటాను. ఏవీ ఆ దండలు. ఎంతచక్కగా కూర్చావు. ఇంతకు ముందులేవని అబద్ధం చెప్పావెందుకూ?

మనో : అవునూ! ఇవి ఈనాడు గుచ్చిన దండలు. నీకు చెప్పినది వెనుకటినాటి సంగతి. వాటి రేకులన్ని తుంపి గాలిలో వదిలివేశాను. ఎక్కడన్నా నీకు ఎదురుబడి

నా సంగతంతా చెప్పి నిన్నిక్కడకు లాక్కువస్తాయేమోనని. అవీ నా అంత అదృష్ట మంతురాండ్రే. తలకొక ద్రోవను పోయినాయి.

కృష్ణ : కండచక్కెర కబవా మీదేశంలో –

మనో : కాదూమరీ! మీలాటి రసికశిఖామణి దయచేస్తే.

కృష్ణ : ఈ పాలన్నీ ఎలా త్రాగడం?

మనో : ఆ మాత్రం తెలియదేం – ముందర త్రాగు. తరువాత తరువాత కండచక్కెరని తలుచుకో.

కృష్ణ : నీవే అన్నావుకాదూ– ఏమీ తెలియనివాణ్ణి – ముందర ఈయరాదూ!

మనో : నీ యిష్టమేనా –

కృష్ణ : మన యిష్ట మనుకుంటాను.

మనో : అలాగేం నాయిష్టం. నీ యిష్టమేముంది యిక్కడ. రాత్రివేళ, అంతపురోద్యానం ప్రవేశించిందే కాకుండా, ఇంకా నీ ఆటలన్నీ సాగాలేం పాపం. అదుగో చూడు ప్రతీహారిణి – పిలిచానా అంటే పరుగెత్తుకువస్తుంది.

కృష్ణ : పోనీ వెళ్ళిపోనా–

మనో : ఎంతధైర్యంగా మాట్లాడావు వెళ్ళుదువుగాని, ముందర నే నడిగే వాటన్నిటికి సమాధానం చెప్పకుండానే– కదులు చూస్తాను.

కృష్ణ : ఉంటానులే. అడుగు.

మనో : ఇన్ని దినాలనుంచి ఎందుకు రాలేదూ?

కృష్ణ : వీలులేక–

మనో : అవును. మరిగావు. వాళ్ళందర్నీ విడిచిపెట్టి వస్తావా–చిక్కావుకాదూ నీ పని పట్టిస్తానుండు.

కృష్ణ : వారందరూ నీవంటి వాళ్ళు కాదూ,

మనో : ఏదీ, ఇంకొక మారనూ–నావంటి వాళ్ళా?

కృష్ణ : అవునూ! ఏం భేదం ఉన్నది.ఎక్కడికి వచ్చినా ఈ మాదిరిగా కసరడం బెదిరింపులూ తప్పవుకాదూ!

మనో : నాథా! (అతని కౌగిలిలో చేరుతుంది)– అందరివలెనేకాదూ నేనుకూడా. నీకోసరం వాళ్ళందరూ నాలాగా ఎదురుచూస్తూ నిమిష మొక యుగంలాగా వేగిరించారా. కన్నులలో ప్రాణం పెట్టుకుని, రాకపోతే బ్రతకకూడదని, నీ ప్రేమనే పరమావధిగా ఎంచుకుంటూ ఉన్నారా! రాక రాక వచ్చావని, ఎంతో అలసిపోయినావని, నాలాగా ఉపచారం చేశారా! సంతోషించారా!

కృష్ణ : లేదని చెప్పమంటావా?

మనో : కాదు నిజ మేమిటో చెప్పమంటాను. నా ప్రేమను నిరసించ వద్దంటాను. నమ్మినవారిని ద్రోహం చేయవద్దంటాను. నా బ్రతుకు నలుగురిలో నగుబాటులయ్యేటట్టు చేయవద్దంటాను.

కృష్ణ : నీవొక తెవేనా నన్ను నిశ్చయముగా ప్రేమించేది?

మనో : కాదా?

కృష్ణ : మేనమామ కూతురివికదా? పరాయివాళ్ళలాగా, ఈ కబురులంపడ మేమిటి?

అంతఃపురాన్ని వదలిపెట్టి ఈ తోటలో కూర్చుని, నన్నింత కష్టపెట్టి రప్పించి, వింతగా మాట్లాడట మేమిటి?

మనో : నీ కలవాటివి మీ ఊరిలో ఈ విధంగానే తిరుగుతూంటావు కాదూ? అమ్మ చెప్పింది కాని నేను నిజమనుకోలేదు. ఆ రోజు భోజనశాలలోనుంచి వస్తుంటే పూల చెండుతో కొట్టాను జ్ఞాపకం లేదూ? పెళ్ళి కూతురిలాగా సిగ్గుపడి తల ఎత్తి అయినా చూడకుండా త్వరగా నడిచి వెళ్ళిపోయినావే! తరువాత ఎన్ని మారులు నిన్ను పలుకరించినాను. నీవు వచ్చేదారి అరికట్టి నిలుచున్నా ఆ సంగతి గ్రహించి మరొకవైపునుంచి వెళ్ళిపోయేవాడవే- తెలిసిందిలే మీ పల్లెటూరి నాగరికతతంతా! ఇంట్లో అయితే మాట్లాడేవాడవేనా? ఇక్కడ కొత్తలేదుకాదూ? అదుగో చంద్రుడు యమున ఒడ్డున పొదలమధ్యకు కూడా ఈలాగే కనబడతాడుకాదూ- పొరబాటే మరచిపోయినాను. అక్కడ తుమ్మెదల మోత కోవెల కూత వినబడును కాదూ- ఎక్కడ చూసినా గింగురుమంటూ ఈల కోడి గొంతు తప్ప- భయం వేస్తూందా, ఇక్కడ ఉంటే-

కృష్ణ : ఇందుకా రమ్మన్నది?

మనో : ఇక్కడికి వచ్చినప్పటినుంచీ ఎక్కడెక్కడకు వెళ్ళావో చెప్పు.

కృష్ణ : నీలాంటి కన్నెలు పిలువబంపితే-

మనో : తెలివితక్కువ పిల్లలు. ఇంతకన్నా మంచినాధుడు దొరకడనేనా-

కృష్ణ : నాధుడా! నాధులున్నారు కొందరికి.

మనో : మరి నిన్నెందుకూ కోరడం.

కృష్ణ : నాకూ తెలియదు. ఆ చిత్రం సృష్టికర్త చెప్పితేనేగాని తెలియదేమో? అయినా మనం చూడటం లేదూ ఇంద్రుడంత ప్రభువును ఉపేక్షించి ప్రాగంగన. చంద్రుణ్ణి వరించలేదూ -

మనో : చాలులే - నీయిష్టం- నాకు చెప్పవద్దులే, కాని ఎక్కడెక్కడికి వెళ్ళావో, ఎవరు నిన్ను -

కృష్ణ : అవన్నీ వివరించి చెప్పడానికి చాలాకాలం పడుతుంది. అప్పుడే ఎట్లా తెలిసిపోయిందో సంగతంతా మాధ్రేపల్లెలో కృష్ణ లీలలని చెప్పుకుంటున్నారుట, ఉన్నవీ లేనివీ కలిపి-

మనో : నిన్ను గురించి చెప్పుకునేదంతా నిజంగాదేం పాపం! నే నడిగింది చెప్పవూ-

కృష్ణ: ఒక అమ్మాయి పేరు చెప్పను. ఎంత బెదిరించిందనుకున్నావు ఎంతో తెలివిగలది. నేనే ఆశ్చర్యపడ్డాను.

మనో : ఏం చేసింది?

కృష్ణ : నేను చాలాసేపు మౌనంగా నుంచున్నాను అప్పుడు పెద్దగా గొంతుతో "చాల్లేపో, ఎందుకు వచ్చావూ, నిన్ను చూడ్డంతోనే కడుపు నిండిందనుకున్నావా? ఈలాటి నిర్జన స్థలాల్లో ఒంటిపాటున మనిద్దర్నీ మావాళ్ళు చూశారా అంటే బాగుండదు. చీకట్లో అంతదూరం ఎలా వెళ్ళనూ తోడన్నా ఎవరూ లేరే" అని కేకలు వేయడం మొదలుపెట్టింది. చూశావా ఎంత గడుసుదో-

మనో : అప్పుడు ఏం చేశావు?

కృష్ణ : నీకు తెలియదూ?

మనో : ఏముందీ గడగడ వణికి కాళ్ళకి నమస్కరించి ఇంటిదాకా తీసుకువెళ్ళి ఉంటావు.

కృష్ణ : అలాగే (మనోహరిని కౌగిలించుకొని) అనుకుంటారు. తెలిసినవాళ్ళూ తెలుసుకోలేని వాళ్ళూ కూడా అనుకుంటారు. కృష్ణుడు జారుడని అతన్ని వలచి సంసారాలు కూలద్రోసుకుని, మగలను లెక్కసేయకుండా, చక్కని పడుచులందరూ అడ్డులేకుండా తిరుగుతున్నారు అని– పొరబాటు– చాలా గొప్ప పొరబాటు– గోపాలుణ్ణి కాదూ–

మనో : కాదని ఎవరంటారు. మరచిపోయినాను నీ వేణువు తీసుకు రాలేదేం?

కృష్ణ : నా గాన మెవరాలకిస్తారు?

మనో : నీ పాటకోసం కాదు. దానిలో ఏదో దివ్య తేజస్సున్నదట కాదూ. ఏం చేయ గలదో చూద్దామని. రాక్షసులెవరన్నా అడ్డంవస్తే దానితో నెత్తిమీద ఒక్కటి కొడితే క్రిందపడి చచ్చిపోతారట నిజమేనా?

కృష్ణ : నాకు తెలియదు.

మనో : పోనీలే! తరువాత ఎప్పుడన్నా అడుగుతాను, దాన్ని గురించి. ఇప్పుడేదో చెబుతున్నావుకాదూ– అడ్డువచ్చాను.

కృష్ణ : గోవుల్ని కాస్తున్నాను. వాటిది ఎంత స్వచ్ఛ వర్ణమో చూడు. క్షీరం ఎంత స్వచ్ఛంగా, శుభ్రంగా ఉంటాయో చూశావు కాదూ?

మనో : ఆ మాత్రం తెలియదూ–

కృష్ణ : సరే అలాగే నన్ను ప్రేమించి, నాతో సంబంధం కల్పించుకునే వాళ్ళందరున్నూ ఎవరెన్ని మాటలు వాళ్ళనంటే మాత్రమేం, ఎన్ని చెడ్డ సిద్ధాంతాలు తల్లో ఎక్కిస్తేనేం, వాళ్ళ జన్మ స్వచ్ఛం– వాళ్ళ జీవనం స్వచ్ఛం. వాళ్ళ ఆలోచనలూ ఊహలూ అన్నీ స్వచ్ఛంగా నిర్మలంగా ఉంటాయి. లేకపోతే గోపాలుడనుమాట నాయం దే విధంగా సార్థకమౌతుంది.

మనో : నిన్ను నమ్మిన గోపిక లందరూ అంతేనా?

కృష్ణ : అందరూ! నీవు మాత్రం కాదూ–

మనో : అవును. తెలుసుకున్నాను. నేనుమాత్రం కానూ. నిన్ను ప్రేమించాను. నీ తోడిదే లోకమని నమ్మాను. చిన్ననాటినుండి నీ మీద తప్ప ఇతరులమీద మనసు ఎన్నడూ లేదు. ఇప్పుడూ, ఎప్పుడూ ఇక అంతే, నీవే ప్రభువు, దైవమూ, సర్వమూ నీవే. పతివి గతివి, నీవే– మనసా వాచా కర్మణా నిన్ను తప్ప కోరదగినది వేరొకటి లేదు. కాని, రూపమున్నది. సాటిలేని చక్కదనమున్నది. అంతులేని ఐశ్వర్యమున్నది. నీవుగూడా చక్కని వాడవే కాదూ అందుచేత నిన్ను భావించుకుంటూ కాలం గడుపుదామని యత్నించలేకపోయాను. ఇప్పుడు నా లోపాన్ని గ్రహించాను. మన్నించవూ

కృష్ణ : సర్వమూ తెలుసుకున్నావు. ఇంకా మన్నించేదేమిటి. ఎవరిని, ఎందుకూ నా శరీరంలో భాగాన్ని నేను క్షమించడం ఎలా–

(వృద్ధదాసి ప్రవేశించి)

తిట్టకండి – ఈ మధ్య ఈ ముసలి దెక్కడ దాపురించిందని తిట్టకండి నాయనా! ఒకరినొకరు చూచుకుంటూ కూర్చుంటే మీకు తెల్లవారింది. తెలియలేదు కాబోలు. మీ యెదుటికి రావడానికి సంకోచిస్తూ చాలాసేపటినుంచి సమీపంలో నిలుచున్నాను. చెవులు మూసుకున్నా వినబడ్డాయి మీ మాటలు. ఏం చేయనూ– త్వరగా నీవు వెళ్ళకపోతే మహారాజసభకు వెళ్ళే ఉద్యోగుల కంట బడతావు. ఇక ఒకరినొకరు ఎడబాసే అవసర ముండదులే! ఎంతసేపు కూర్చుంటాడు పాపం సూర్యుడు మాత్రం – మీ తిట్లన్నీ పడుతూ, ఆయనకాస్తా అటు దాటగానే మీ రాజు ఉదయిస్తాడుగా, అప్పుడు నేనూ యిక్కడికి రావద్దూ, మీ ఉపచారం చేయడానికి.

ఇంకా వెళ్ళవయ్యా! పాపం, ఉద్ధవుడు దిక్కులు చూస్తూ ఆ సురపొన్న చాటున నక్కి కూర్చున్నాడు.

గోపాలుడు వెళ్తున్నాడు. ఎంతసేపు చూస్తావమ్మా అతడు వెళ్ళిన దోవవంక. మీ అమ్మగారు నీవెక్కడ అని వెదుక్కుంటారు. అదుగో లలిత మనకోసం వస్తూంది–

రా– గోపీదేవి!

---

శ్రీ రూప గోస్వామీ, మధురదాసూ వ్రాసిన నాటకాలు చదివిన తర్వాత దీన్ని రచించాను. చైతన్య మతాను యాయులైన కొందరు మహాత్ముల రచనలుకూడా నా కాధారాలైనాయి.

ఈ రూపకం భక్తిపూర్వకంగా శ్రీ రూప గోస్వామికి అంకితం చేస్తున్నాను.

(గోపీదేవి : రచనాకాలం 1927)

---

చదవండి! చదివించండి!!

# బూదరాజు రాధాకృష్ణ రచనలు

| | | రూ. |
|---|---|---|
| 1. | సాహితీ వ్యాసాలు | 30/- |
| 2. | భాషా శాస్త్ర వ్యాసాలు | 50/- |
| 3. | వ్యావహారిక భాషా వికాసం | 50/- |
| 4. | జర్నలిజం పరిచయం | 60/- |
| 5. | మాటల మూటలు | 60/- |
| 6. | తెలుగు జాతీయాలు | 80/- |
| 7. | మాటల వాడుక-వాడుక మాటలు అనుభవాలు-న్యాయాలు | 110/- |
| 8. | మాటలూ-మార్పులూ | 100/- |

ప్రతులకు:

విశాలాంధ్ర బుక్ హౌసులు

మరియు

ప్రముఖ పుస్తక విక్రేతలు

# కేళీగోపాలమ్

(నమశ్శివాభ్యామ్... శంకరపార్వతీభ్యామ్। మంగళాచరణానంతరము, నాట్యాచార్యుడు సభవారిని ఉద్దేశించి పలికే వచనం)

వెన్న దిన్న చిన్నవాని కొలిచే వేడుకలో మైమరచు సరసుల మన్ననలే శిరసావహించు భాగవతులు ప్రదర్శించే కేళీగోపాలమనే యక్షగాన ప్రబంధమ్ము కనుకలి వినుకలి కలిమికి నోచిన వారికి విందయ్యేనని సవినయాన సాభినయాన విన్నవించేను – జయ హరి హర నాథ! యిందులకు పూర్వ కథాసందర్భం బేలాటిదనగా! లీలామానుష విగ్రహులైన గోపాలదేవుడు, ద్వారకానగరిలో, పుత్రపౌత్రాభివృద్ధిగా, నిత్యానందులై, సంసారసుఖాన, ఉన్నటువంటి వారుకాగా–

ఒకానొక తరుణాన సదరు శ్రీ కృష్ణపరమాత్మ మనుమడైనటువంటి అనిరుద్ధ కుమారుడు అనే సుందరాంగుణ్ణి, పార్వతి అమ్మవారి కటాక్షం పరిపూర్ణంగా లభించినటువంటి ఉషాబాల అని పేరొందిన బాణాసురుని ఏకైక పుత్రిక కలలో జూచి, వరించి, తనకు కూరిమి చెలికత్తెగా మెలగుతూ, మంత్ర తంత్రాదులలో బహు నిపుణురాలైన చిత్రలేఖ అనే చిన్నదానికి తాను మరులైన వైనం తేటతెల్లము సేయగా, ఆ జాణ శాంబరీ విద్యను ప్రయోగించినదై, ద్వారకానగరిలో సుఖ నిద్రలోవున్న ఆ సుకుమారుణ్ణి ఉషాబాల పడక టింట చేర్చినదాయెను:

ఆపై ఆ జగన్మాత అనుగ్రహాన వారిరువురూ గాంధర్వమాడి, యిష్టభోగాల దేలుతూ ఉండగా, యీ సల్లాపము బాణాసురుడికి తెలిసి, అనిరుద్ధ కుమారుణ్ణి నాగపాశం వేసి బంధించగా, ఆ చిన్నవాడు మరియాదకు అలా అక్కడ కట్టుబడి ఉండగా–

ఈ వర్తమానం ద్వారకలో వారికి నారదులవారివల్ల తెలిసింది. అంతట శ్రీకృష్ణులవారు హుటాహుటి శోణపురానికి తన బలగంతో తరలివచ్చారు.

వచ్చింది ఏ తీరున – వీరోచితమైన అట్టహాసంతోనా?

కాదు!

వియ్యమొందినవారు కయ్యమాడేరా?

మెత్తగా మందలించి, మేలవాడి, మాయజేసి, తన మనుమని మామను చరితార్థుని చేయవలెనని ఆ వేషధారి వేషం కట్టినాడు.

ద్వారకనుండి కదలినవారు యాదవులు,

శోణపురం జేరినవారు భాగవతులు!

తీరా, కోటగుమ్మంవద్ద కాపున్నదెవరు – ఆ యీశ్వరుడు! సర్వమూ తెలిసిన–వారి అనుమతి పొందినట్టివారై, యీ భాగవతులు బాణుని సభాభవనంలో పార్వతీ పరమేశ్వరుల సాక్షాత్ సన్నిధిలో గిరిజా కల్యాణం, నాట్యాభినయాల ప్రదర్శించనున్నారు జయహరగోవింద!

(సూత్రధారుడు చేసే ప్రార్థన)

(శంకరాభరణం)

వరదాభయ లీలామయ - లేలిహాన మణివలయా
ఆరిందమా ఉమామనా - కరుణా వరుణాలయా - సాహో పరమేశ్వరా!

(ఆనందభైరవి)

సుమలాలిత మలయానిల - లోల చూర్ణకుంతలా
పురసూదన వరవర్ణిని - బాహులేయ జననీ! - సాహో పరమేశ్వరీ!

(బహుపరాకులు)

(హంసధ్వని)

ఉమా మహేశ్వర ప్రసాద లబ్ధపూర్ణ జీవనా!...
చండ భుజామండల దోధూయమాన వైరిగణా! బహుపరాక్!
దిక్కరీంద్ర ఘీంకరణా బహు పరాక్! బహుపరాక్!
శోణపురీ మండనాయమాన బాణ సార్వభౌమ! బహుపరాక్!
వచనం :- అవధారుదేవా!

(మధ్యమావతి)

మిము దీవించి మీ వీట నిలచి
సేవలందుకొను దేవీ దేవర
పావన సన్నిధిలోఁ- జయ్ మహాదేవ!
ఈశుని మ్రోల హిమగిరి బాల
కన్నెతనము ధన్యమైనగాథ? జయ జయ, హో

తన తాపముతో మారుని రూపము బాపీ,- ఆ కోపీ
కాకలుదీరి,- కనుదెరచీ తను దెలసీ- తన
లలనను పరిణయమైన ప్రబంధము-
ఒంధుర నవరసగీతుల నటనల రీతుల
రూపక రూపమునా...
అభినయించ మిమ్మను కరించ మ
మ్మను మతించరో,- జయ జయ, హో

వచనం : - యీ ప్రకారంబుగా యిష్టదేవతా వందనంబు గావించీ, ఎదుటనున్న ఏలికను సంభావించీ, సభలోనున్న పిన్నలను పెద్దలను మన్ననజేసి యితివృత్తంబు సూక్ష్మంబుగా విన్నవించి ఆదిమూర్తుల ముగుదలనంది, యింక అనంతర కరణీయం బాచరించేమయా!

(తాళ - రవళి) యిదిగో, యీ హిమగిరి సానువుల నిత్యోత్సవ విహారముల మెలగే చెలికత్తెలు నగరాజకుమారిని ఎటువలె ఆహ్వానించె రనగాను-

(కాంభోజి)

రావో, లోల లోల లోలం బాలక
రాజస లోచన రాజాననా!
లోకోత్తర మహోన్నతుని తనయా - మేనాకుమారి! రావో!

వచనం: తము చేరవచ్చిన ఉమాబాలతో చెలిమికత్తెలు చెలిమిబలిమిని ఆ మీన లోచని భావమెరుంగ పలుకాడే తీరు ఎట్టిదనగాను-

(ఆఠాణా!)

చెలువారు మోమున లే లేత నగవూల
కలహంస గమనాన కలికీ ఎక్కడికే?
మానస సరసీని మణిపద్మదళముల
రాణించు అల రాజహంస సన్నిధికే!
వావిలి పూవూల మాలలు గైసేసి
వయ్యారి నడలా బాలా ఎక్కడికే?
కన్నార నన్నేల కైలాస నిలయాన
కొలువైన అల దేవ దేవు సన్నిధికే!

వచనం :- అప్పుడా నెచ్చెలులు ఉమాబాలను సాగనంపే రెట్లనగాను-

(కేదారగౌళ)

పోయిరా శిరీష కోమలా, బాలా లలామ
పోయిరా మరాళగామినీ,
బెదురులేక బిడియపడక - చేరబోయి సేవలుజేసి
వకుళ దామమున స్వామిని వశంవదునిగా జేకొన
పోయిరా అరాళ కుంతలా
ఐదువరాల-పోయిరా!
మన్మధుని దరవు - వసంత
తగదిది - తగదిది - తగదిది!
ధరణీధర వరసుకుమారీ - తగదిది!
అండగా మదనుడుండగా, మన
విరిశరముల పదనుండగా
నినుబోలిన కులపావని తానై
వరుననరయగ బోవలెనా?- ॥
కోరిన వాడెవడైనా ఎంతటి ఘనుడైనా
కోలనేయనా, సరసను కూలనేయనా!
కనుగొనల ననమొనల
గాసి జేసి నీదాసు జేయనా!

వచనం :- అప్పుడు పార్వతి పలికే ప్రతివచనము ఎలాగంటేను-

(రీతిగౌళ)

ఈశుని దాసుని జేతువ అపసద!
అపచారము గాదా!
కోలల కూలెడి అలసుడు కాడూ
ఆదిదేవు డతడూ!
సేవలుజేసి ప్రసన్నుని జేయ

నాస్వామి నన్నేలు నోయీ!-
నీసాయమె వలదోయీ!

(దురితం-శహన)

కాని పని మదనా!
అహంకరింతువ హరుని జయింతువ
అది నీ చేతకాని పని మదనా!

వచనం : మన్మధుడు అంతటితోనైనా యింగితములేక మరల హుంకరించగా చెలికత్తెలు హితము చెప్పేతీరు-

(సరస్వతి)

చిలుక తత్తడి రౌత ఎందుకీ హుంకరింత?
వినకపోతివా, యింతటితో నీ విరిశరముల పనిసరి
సింగిణిపని సరి తేజీపని సరి
చిగురుకు నీ పని సరి మదనా!

వచనం : ఉమాబాల ధ్యాన నిష్ఠలో ఉన్న సదాశివుని సేవించే విధమెలాటి దనగాను!

(హిందోళ)

సామగ సాగమ సాధారా!- శారద నీరద సాకార!
దీనాధీనా ధీసార!

యివె కై మోడ్పులు-యివె సరి జోతలు
వినతులివే అరవిందోజ్జ్వలా
యిదె వకుళాంజలి మహనీయా
యిదె హృదయాంజలి ఈశ మహేశ!

వచనం :- ఉమాబాల వకుళమాలను స్వామివారి హస్తముల నుంచగా, పొంచివున్న మన్మధుడు బాణము వేయగా, వారు ఉగ్రులై, మన్మధుణ్ణి రూపుమాపి వేసినవారు కాగా, రతీదేవి స్వామిని వేడుకొనే విధమెలా గంటేను-

(నాదనామ క్రియ)

పతిభిక్ష ప్రభూ!

విరుల న్నిను పూజసేయగా
విధిగా నిన్నొక గేస్తు జేయగా
దొరకన్న రసావతారు చి
చ్చుర కంటన్ పరిమార్తువా ప్రభూ!

(కన్నడ)

కరుణన్ గిరిరాజ కన్యకన్ – సతిగా దాము పరిగ్రహింపగా
మరుదేపున రూపున వర్ధిలుగా-రతిమాంగల్యము రక్షసేయవా!

వచనం:- ఉమాబాల విన్నపము

(సామ)

అంబా! అని అసమ శరుదు నను బిలిచెను వినవో
జనకుడవై ఆదరణగ తనయునిగా జేకొనలేవో!

మనమే నీ మననమై, తనువే నీ ధ్యానమై
నీ భావన లీనమైన గిరిబాల నేలవో!
శరణం భవ శరణం భవ శరణం భవ స్వామిన్!
పరిపాలయ పరిపాలయ పరిపాలయ మాం స్వామిన్

వచనం : – లోక సంగ్రహార్థము యీ తీరున లీలావినోదులైన ఆదిదేవులు తన యిల్లాలిని తాను చేపట్టగా–

(సౌరాష్ట్ర)

బిడియపడి భీష్మించి పెండ్లి కొడు కాయెనూ
మా తండ్రి మేలు మేలు!
విరులచే వరునిచే కరము చేకొన జేసె
మా తల్లి మేలు మేలు!

నాట్యాచారుని వచనం: ఆది దంపతుల పరిణయ గాథను ప్రదర్శించ నోచిన ఆనంద పారవశ్యములో భాగవతులుగా వచ్చిన గోపాలు రందరూ జయ ద్వారకావాసా। అని ఎలుగెత్తగా, అప్పటికి బాణుడు నడిచిన నాటక మిదియా అని గుర్తించి, కృష్ణునితో పోరుకు దిగి, పరాభూతుడై బహుమానితుడై ఐహికానందము పరిపూర్ణము అనుభవించిన కథా విధానము లోక విదితమేకదా! యీ నాట్య ప్రబంధము కన్నవారిదే కలిమి, విన్నవారిదే భాగ్యము! జయలీలావినోద!

# బాల

## పాత్రలు

| | | |
|---|---|---|
| శంకరం | --- | అల్లుడు |
| పున్నమ్మ | --- | అత్త |
| శర్మ | --- | మామ |
| రత్తయ్య | --- | బావమరిది |
| బాల | --- | కూతురు |

# బాల

శంకరం - అల్లుడు; పున్నమ్మ - అత్త; శర్మ - మామ; రత్తయ్య - బావమరిది: బాల - కూతురు.

(పూర్వకాలపు భవంతి. గుమ్మానికి రెండుపక్కలా, సమపాళం ఎత్తున విశాలమైన గచ్చు అరుగులు, ఎడమ అరుగుమీద చిరిచాప, కుడి అరుగుమీద కేన్వాస్ పడకకుర్చీ, ఒక చిన్న స్టూల్ ఉంటవి.

మెట్లకు అంటి గుమ్మం ఎడమవైపున కిటికీ.

శంకరం, రత్తయ్య-

శంకరం- టెన్నిస్ ఆటకు పోయే మదరాసీ కుర్రవాడి వేషంలో ఉంటాడు.

రత్తయ్య - 20 సం.ల శాస్త్ర విద్యార్థి.

రత్తయ్య ముందు దోవతీస్తూ ఉంటాడు. శంకరం ఒక అడుగు వేసి, ఆగి, యింటివంక పరకాయించి చూసి, పేంట్ జేబులోనుంచి కర్చీఫ్ తీసుకుని - అంటీ అంటనట్టుగా ముఖం తుడుచుకుంటాడు.)

రత్తయ్య : (పక్కవాలుగా) దయచేయండి... సందేహిస్తారేం?

శంకరం : (మెట్లు ఎక్కి కుర్చీ అరుగువేపు ఓ మారు చూసి), రుమాలతో చాప దులుపుతాడు.।

రత్తయ్య : (గుమ్మంలో అడుగు వేసిన వాడలా ఆగి ఆదుర్దాగా) ఆఁ... ఆఁ... అదేమిటి? అక్కడ కూర్చుంటున్నారేం? రండి లోపలికి.

శంకరం : ఫరవాలేదు. యిక్కడ చాలా బాగున్నది.

రత్తయ్య : అలాకాదు. జామాత విష్ణుసముడని శాస్త్రం

శంకరం : అయితే - పూజా పునస్కారాలు మొదలు పెడుతావా ఏం? చెప్పు - ఏ మాట! ఉడాయించేస్తాను.

రత్తయ్య : ఎంతమాట - ఎంతమాటా! (ఆగి) నా మనవి వినరూ?

శంకరం : ఏమిటోయ్? ఊరికే సతాయించమోక. ఎక్కడ కూర్చుంటేనేం?

రత్తయ్య : కాదు... మమ్మల్ని అనుగ్రహించాలి ఇవి కాళ్ళు కాదు... చేతులు. (తొందరలో ఒకటికి ఒకటి అనేసి, చేతులు పట్టుకుంటాడు.)

శంకరం : (వింత మృగాన్ని చూసినట్టూ చూసి, ఎకసక్కెంగా నవ్వుతూ) ఎలాగైనా, పండితుడవాయెను - మహా గొప్ప విషయం కనుక్కున్నావు! ఇదివరకు నాకూ అనుమానంగానే ఉంది, ఇవి కాళ్ళా, చేతులా అని

రత్తయ్య : పొరబాటు. ఇదిగో, కాళ్ళే పట్టుకుంటున్నాను.

శంకరం : సైఁ

రత్తయ్య : (తెల్లబోతాడు)

శంకరం : పట్టుకో చూదాం అయినా, నీతర మౌతుందేమో (రత్తయ్య వంగి, బూడ్సు పట్టుకుంటాడు.)

శంకరం : "చరణములే - రామ - నీదు చరణములే గతియని నమ్మినవాడను రా" ఊ... పాడవేమోయ్, అందిచ్చినా! ఓహోఁ- మరచిపోయినా, మీ వేదపాఠశాలలో సంగీతము నేర్పరు కాబోలు! సరేకాని, కాలని అధమం మోకాలన్నా కాకుండా బూట్ పట్టుకుంటావేం?

రత్తయ్య : (అమాయికంగా లేదండీ - పొరబాటు - సంగీతం రాదండీ!

శంకరం : నా మాట విని, ఇకనుంచైనా నేర్చుకో, ఇలాటప్పుడు అక్కరకు వస్తుందా మరి: అధమం నాలుగు తలుపుదగ్గర పాటలన్నా రాకపోతే పేచీ వస్తుంది చూడు: ఇప్పుడు ఇబ్బంది లేదనుకో-సమయానికి నేను ఆదుకున్నాను గనుక సరిపోయింది.

రత్తయ్య : బావగారు - పరిహాసం చేస్తున్నారు!

శంకరం : మీసాలు లేని సనాతనిష్టతో పరిహాసం ఏమిటి? కావాలంటే అట్టహాసం చేస్తాను: (కుడికాలు జాపి, బూటు విప్పు. చూస్తావేం, విప్పు ముందర (రత్తయ్య విప్పుతాడు. ఎడమకాలుకూడా అయిన తరువాత) సాక్సు తీసేయి. జరఫ్గా పని చేయకుండా అలా దిక్కులు చూస్తావేం? ఊఁ... ఏ కాలిది ఆ బూట్‌లోపెట్టి, ఆ మూల జాగ్రత్తగా ఉంచు బస్. ఇలా రా, ఎదురుగుండా కూర్చో! అరె అదేమిటోయ్? బాసిపెట్టు వేసి, కొంచెం ధనాయించు. అదీ, రైట్! (కొంచెం ఉండి) ప్రతీది నేనే అందియ్యాలా? ఓ ఆశీర్వచనం పనస విసురూ!

రత్తయ్య : నాకు రావండి! కావాలంటే, శాకుంతలంలో శ్లోకాలు వినిపిస్తాను. చూశారూ, శకుంతలను అత్తవారింటికి పంపించబోతూ మహర్షి సెలవిస్తున్నాడు: (రాగం తీసి) శుశూషస్వ...

శంకరం : (పతాకహస్తంతో) స్టాప్. ఆ భాగోతమంతా మనకి తెలుసునుకాని- జావళీలు ఏమన్నా వచ్చునా ఇంతకూ?

రత్తయ్య : సానిదా న్ననుకున్నారా ఏం?

శంకరం : చాలాదాకా ఉండే శాస్త్రుల్లగారికి! పోనీ- సరసుడవైనా ఫరవాలేదు.

రత్తయ్య : (లేచి నిలుచుని) లోపలికి వెళ్ళి మా వాళ్ళతో చెప్పి వస్తాను (వెళ్ళబోతాడు)

శంకరం : ఉండు. (కోటు విప్పుతూ) ఇది అలా ఆ కుర్చీమీద విప్పివేయి. (రత్తయ్య అలా చేస్తాడు) చూడు - ఇంతకూ, నీ పంతం నీదేకాని - రాక రాక, ఎన్నడూ లేనిది, మన గృహం పావనం చేయబోతున్నాడు కదా, బావగారు, నోరు విడిచి అడిగాడుకూడాను, అతని మాట ఎందుకు తీసివేయాలి అనే అభిమానం, బంధుప్రేమ లేదేమోయ్ నీకు?.

రత్తయ్య : (ఆదుర్దాగా) ఏం- ఏం కావాలి చెప్పండి? అజ్ఞానంవల్ల, చిన్నతనంచేత, ఏమైనా అపరాధం చేసినట్టయితే మన్నించండి.

శంకరం : అయితే - కాని,

రత్తయ్య : ఏమిటి?

శంకరం : మళ్ళా మొదలా?- పనస.

రత్తయ్య : ఎబ్బే! ఒట్టండీ! నాకు రాదు. మాకు ఆ ప్రసక్తేలేదు చూడండి.

శంకరం : ఏమో. నాకు నమ్మకం లేదు.

రత్తయ్య : నిజమేనండీ. పోనీ, శాంతిపన్నం చదవనా?

శంకరం : ఓ, నిరభ్యంతరంగా.

రత్తయ్య : ఓ...అ–శన్నో అస్తు ద్విపదే–శం చతుష్పదే... (నవ్వుతాడు).

శంకరం : బలే. బాగుందోయ్! నన్ను కాకుండా నిన్ను కూడా కలుపుకున్నావేం? శహబాష్!

రత్తయ్య : (లేస్తూ) మీరు బస్తీవారు, ఇంగ్లీషు చదువూ– మీకు జవాబు చెప్పగలమా? కానీ, లోపలికి రాకపోతే మానె, ఆ కుర్చీలోనైనా విశ్రమించండి. అమ్మనూ, నాన్ననూ పిలుచుకువస్తాను.

శంకరం: అంతేనా?

రత్తయ్య : ఏం?

శంకరం : ఇంకా ఇంట్లో జనాభా ఎవరూ లేరూ?

రత్తయ్య : అంతే... మీ మేనత్త శ్రీశైలం వెళ్ళింది.

శంకరం : బ్రతికింది! ఐనా జ్ఞాపకం తెచ్చుకో.

రత్తయ్య : ఎవరూ లేరండీ!

శంకరం : నిజం?

రత్తయ్య : ఆహాఁ.

శంకరం : (చివాలున లేచి) అయితే నేను వెళుతున్నాను.

రత్తయ్య : ఆఁ... ఆఁ... అదేమిటి?

శంకరం : ఇంట్లో మీ అమ్మా నాన్న మాత్రమే ఉంటే నేను వెళుతున్నానన్నమాట.

రత్తయ్య : మా చెల్లెలు కూడా ఉంది.

శంకరం : ఆ మాట ముందర చెప్పవేం మరి? మీ అమ్మా నాన్నా లేక ఎక్కడికి వెళ్తారు? ఆమె వంటయింట్లో– ఆయన దేవతార్చన దగ్గరా! నాకు తెలుసులే. మరే– మీ చెల్లెలిని కొంచెం కాఫీచేసి తీసుకురమ్మను. అన్నట్టు... మీరు ఎవరూ కాఫీ త్రాగరు కాదూ?

రత్తయ్య : మా చెల్లెలు త్రాగుతుంది. నాన్న అలవాటు చేసుకోమన్నాడు. ఏలాగు మీ యింటికి వస్తే తాగాలి కదా అని–

శంకరం : ఏలాగైనా – ముసలివాళ్ళు – వీళ్ళ తస్సాదియ్యా... అసాధ్యులోయ్!

రత్తయ్య : ఓ క్షణంలో పట్టుకు వస్తాను.

శంకరం : నీ వెందుకు – బ్రహ్మచారివి– ఒంటి బ్రాహ్మడవు? మా గృహిణిని దయచేయమను. ఘోషా ఏం లేదుగా? (రత్తయ్య లోపలికి వెళుతాడు. శంకరం సిగరెట్ ముట్టించి, ఒక నిమిషం కాల్చిన తరువాత–)

(బాల ప్రవేశిస్తుంది. కుడివైపునించి, సినిమా వేషం– వయ్యారంతో– అరుగుదగ్గరకు వచ్చి గొడుగు ముడిచి శంకరం ఉండటంవల్ల ముందు అడుగు వేయడానికి సందేహించి, చిరు దగ్గుతుంది. తరువాత, గొడుగు మడిమెతో నేలమీద టకటకమనిపిస్తుంది)

శంకరం : (అంతవరకూ పరధ్యానంలో ఈమె రాక గమనించనందువల్ల, సందడికి ఉలికిపడి, లేచి నిలుచుని) ఆఁ... ఆఁ...

బాల: కొంచెం తప్పుకుంటారా?

శంకరం : ఓ, దయచెయ్యండి: మా మామ అఁ... ఇంట్లో వారందరూ మడిగట్టుకుని లోపల ఉన్నారనుకుంటాను. కూర్చోండి. అలా, ఆ కుర్చీలో కూర్చోండి. నేను వెళ్ళి. మీరు వచ్చారని... క్షమించాలి... మీరు ఎవరో, నేను గుర్తుపట్టలేకుండా ఉన్నాను. మీ పరిచయభాగ్యం-

బాల : నన్ను ఎరిగి ఉండ రనుకుంటాను మీరు. మిమ్మల్ని కూడా-

శంకరం : నేను వీరి అల్లుణ్ని.

బాల : ఓహోఁ! అలాగా? అయితే మీరు మాకు చాలా సన్నిహితులు-

శంకరం : అలాగా? ఇవాళ నిజంగా సుదినం.

బాల : అవును. ఆరు సంవత్సరములాయే వివాహమై-అంతే కాదూ? నాటికి నేడు మీకు అత్తవారి యిల్లంటూ కనబడ్డది. మీరు ఎంత ఎమ్మేలు చదివినా-

శంకరం : మీలాటి చక్కని చుక్కలు వరుసలాడటం మహా భాగ్యం. కాని, బంధుత్వం తెలుసుకోందీ-

బాల : సరదాగా కుశల ప్రశ్నలు చేసుకునేందుకు బంధుత్వం కావాలా?- బావగారూ?

శంకరం : (గ్రహించినట్లుగా) ఏమిటీ, మీరు - మా పినమామగారి-

బాల : కుమార్తెను అనుకుంటున్నారా?- కాదు

శంకరం : అయితే.

బాల : మీ బాల;- మీ హిందువులలో భార్య పేరు పలుకరు కాబోలును - మీ గృహిణి నావద్ద చదువుకుంటూన్నది.

శంకరం : మీరు--

బాల : ఊఁ- నేను మీ భార్యకు ఇంగ్లీషు చెపుతున్నాను.

శంకరం : చాలా సంతోషం. శుభవార్త!

బాల : ఏం శుభవార్త! మీరు ఏమనుకున్నా సరే - మనసు విడిచి చెప్పుతున్నాను: బొత్తిగా అభం శుభం తెలియకుండా ఏం పెంపకమండీ, మీ అత్తమామలది?

శంకరం : ఏమీ.

బాల : ఇన్ని సంవత్సరాలనుంచి - నేను ఈ ఊరువచ్చి మూడేళ్ళయింది, ఇన్నాళ్ళనుంచీ- తులసిపూజ మానిపించలేకపోయినాను.

శంకరం : పోనీయండి, పూర్వాచారాలుకూడా ఆచరించవలసిందే!

బాల : నేను కాదనను కాని, నా బాధ్యతకూడా, చూడండి మరి, మీరు... ఏ గొప్ప హోదాలోనో పట్నంలో ఉంటే- మీ యిల్లు దిద్దడానికి తగిపోయేటట్టు తయారు కావాలా, వద్దా? ఈ తులసి పూజలు అక్కరకు వస్తాయా?

శంకరం : అవును.

బాల : ఇంగ్లీషుపాఠం చదవమంటే తలాయిస్తుంది కాని... పూజలు, కల్పాలు బట్టీ పెట్టమంటే విసుగూ విరామం లేదు. నేనూ చూస్తున్నాను. ఇంకా నాలుగు రోజులు పోయిన తరువాత, నావల్ల కాదని చెప్పేస్తాను.

శంకరం : అలాకాదు - నాకోసమని మీరు కొంచెం ఓర్పుతో ఉండండి. ఏమీ అంటక పోతే, ఆ అమ్మాయి దురదృష్టం.

బాల : లాభం లేదు.

శంకరం : అయితే నాకూ లాభంలేదు.

బాల : అదేమిటి?

శంకరం : ఈ పల్లెటూరి బైతును తీసుకువెళ్ళి నేను ఏం చేసుకోను?

బాల : ఏం చేస్తారు? పువ్వుల్లో పెట్టి పూజించుకోండి?

శంకరం : పూజిస్తాను! (తటాలున ఆమె చేతులు పట్టుకుని) నన్ను అనుగ్రహిస్తే-

బాల : ఊఁ వదలండి. విదిలించుకొని) ఇదా మీ మర్యాద! పెద్ద మనుష్యులు కదా, మా శిష్యురాలి పెనిమిటి కదా అని-

శంకరం : దాని మాట ఇక ఎత్తవద్దు.

బాల : మీ మాటలు విచిత్రంగా ఉన్నాయి ఎవరన్నా వింటే-

శంకరం : విననీయండి, నాకేమీ భయంలేదు. మిమ్మల్ని ప్రేమిస్తున్నానని-

బాల : బలే! పదినిమిషాలముందు నే నెవరో తెలియదు. ఇప్పుడు మాత్రం... పోనీ, పేరైనా అడిగారు కాదేం?

శంకరం : ట్రూలవ్‌కు ఊరూ పేరూ, కులం గోత్రం-

బాల : అక్కరలేదే? మీరు ప్రేమించే పిల్లకు పెళ్ళి ఇదివరకే అయి ఉంటే?

శంకరం : ఏమిటీ? ఆ మాట ముందుగానే చెప్పారు కారేం?

బాల : మీరు వినిపించుకోందే ఏం చేయనూ? నన్ను మాటాడనిస్తేనా?

శంకరం : అయినా, నాకు అభ్యంతరం లేదు.

బాల : బాగుంది!

శంకరం : డార్లింగ్!

బాల : (సిగ్గును అభినయిస్తుంది)

శంకరం : మైడియర్...! (కౌగలించుకోబోతాడు)

బాల : వద్దు వద్దు, ఎవరన్నా చూస్తారు.

శంకరం : ఇంకా భయం ఎందుకూ?

బాల : ఏమన్నా ఉందా! నడివీధిలో-పట్టపగలు-

శంకరం : అయితేనేం?

బాల : ఏమీ లేదు. నాకు టైం అయిపోతూంది, ఇంటిదగ్గర కనిపెట్టుకుని ఉంటారు.

శంకరం : ఎవరు?

బాల : ఎవరున్నారు! ఇంటాయనా, పిల్లలూ.

శంకరం : (ఆశ్చర్యంతో) పిల్లలా?

బాల : అవును. ఎందుకంత ఆశ్చర్యం?... ఒక ఆడపిల్ల ఒక మొగపిల్లవాడూ.

శంకరం : (విభ్రమంతో) కాదు - కాదు. అంతా అబద్ధం.

బాల : (సమీపించి) అరవంలో కాదు అంటే (అతని చెవి పట్టుకు) ప్రేమించినందుకు ప్రెజెంట్ (చెంపమీద అలా అంటుంది)

శంకరం : హాఁ... ఏమిటి ఈ-

బాల : ఏమిటి ఈ ఆగడం?... ప్రేమంటే మరేమిటి?... అందులో పెళ్ళైన పిల్లను - పిల్లల తల్లిని... ప్రేమకు అడ్డులేదు కాదూ? అందుచేత మీ నోటికి కొంచెం

అడ్డువేశాను. శంకరం దిగాలుపడి చూస్తుంటాడు. (ప్రేమించారు కాదూ పాపం!-అబ్బ! ధన్యోస్మి- నాకు మనసు నిలవడంలేదు. ఈ శుభవార్త మీ అత్తమామలకూ, మీ భార్యకూ చెప్పివేయనా? తరువాత మనమిద్దరం- 'మల్లెపూల తెప్పమీద తేలిపోదాం' (పాడుతూ పరుగెత్తుకు పోతుంది)

శంకరం : చచ్చానురా భగవంతుడా!
(లేచి కోటు తీసుకుని భుజంమీద వేసుకుని, గబగబ సాక్సు తొడుక్కునే ప్రయత్నంలో ఉండగా పున్నమ్మ ప్రవేశిస్తుంది.)

పున్నమ్మ : ఏం నాయనా, అందరూ క్షేమమా?

శంకరం : ఆఁ.

పున్నమ్మ : సెలవులు యిచ్చారా, కాలేజీకి?

శంకరం : ఊఁ

పున్నమ్మ : మా పుణ్యం బాగున్నది. ఏం పాపం చేశాం చెప్పు బాబూ- పెళ్లైననాటినుంచీ మా గడప తొక్కావు కాదు? మళ్లా తిరిగన్నా చూడలేదు?

శంకరం : తీరుబడి లేదండీ.

పున్నమ్మ : అవునులే! ఇంతకూ... పిల్లనిచ్చుకున్న తరువాత నీవు ఏమి చేసినా చెల్లుతుంది.

(శర్మ ప్రవేశం)

శర్మ : ఏమోయ్-

శంకరం : (లేచి నమస్కరిస్తాడు)

శర్మ : సూర్య నమస్కారాలు చేసుకుంటున్నాను, అప్పుడే మొదలుపెట్టాను ఇంతలో అబ్బిగాడు వచ్చి చెప్పాడు. ఇవాళ సుదినం నాయనా. కూర్చో, అదేమిటి, నుంచుంటావెందుకు?

శంకరం : క్షమించాలి: యింటిదగ్గిర తొందరపని ఉన్నది. మరచిపోయి వచ్చాను. వెళ్ళి మళ్ళా ఒకటి రెండు రోజులలో-

శర్మ : సరే నీ యిష్టం.

పున్నమ్మ : అదేమిటండీ, పండగపూటా- వచ్చిన ఆతణ్ణి వెళ్ళమంటారు? బాగుండి- పోయిందిలెండి!... అంతమించిపోయే పనేమొచ్చింది? ఉత్తరం వ్రాసి వెయ్యి.

శంకరం : వీలు లేదండి. వెళ్ళి తీరాలి.

శర్మ : సరే, భోజనం చేసిన తరువాత సంగతి చూసుకుందాము. ఇప్పుడు బస్ ఏలాగూ దొరకదు.

శంకరం : పోనీ, నడిచిపోతాను.

శర్మ : ఇరవై మైళ్ళు!

శంకరం : అయితేనేం? వెళ్ళక తప్పదు.

(రత్తయ్య వస్తాడు)

రత్తయ్య : ఎక్కడికండీ?

శర్మ : మీ బావ వెళ్ళిపోవా లంటున్నాడు.

రత్తయ్య : మహా బాగున్నది! వచ్చినంతసేపుపట్టలేదు! మీరు ఎప్పుడు వస్తారా అని మేము కళ్లు కాయలు కాచేట్టు ఎదురు చూస్తున్నాం ఇన్నాళ్ళనుంచీ. మా వల్ల

ఏ అపరాధం వచ్చింది, చెప్పండి?

శంకరం : లేదు, నాదే అపరాధం.

శర్మ : అదేమిటోయ్?

శంకరం : అవును, బుద్ధి తెలియకముందు పెళ్ళి చేసుకోవడం.

పున్నమ్మ : ఆఁ ఆఁ!

శంకరం : ప్రేమించని పిల్లతో జీవితమంతా గడపడం.

పున్నమ్మ : ఊరుకో నాయనా! ఎండపడివచ్చినట్టున్నావు, పైత్యించింది. (పెనిమిటితో) కాస్త అల్లం రసం తీయిస్తే?

శర్మ : తీసుకురా. (పున్నమ్మ వెళ్ళిపోతుంది) కొంచెంసేపు పడుకుంటావా ఏమిటి?

రత్తయ్య : కాఫీ చల్లారిపోతూన్నదేమో?

శంకరం : ఆత్రుతతో ఏదీ?

రత్తయ్య : లోపలికి రండి. నేను తెస్తే పనికి రాదన్నారు కాదూ

శంకరం : నేను రాను, నీవే తీసుకురా.

రత్తయ్య : పోనీ, అమ్మాయినే ఇక్కడకు పట్టుకు రమ్మంటాను.

శంకరం : వద్దు. (లేచి నిలుచుని) మామగారూ – ఊహుఁ – మిమ్మల్ని అలా సంబోధించడానికి వీలులేదు. శర్మగారూ నేను చెప్పే విషయం అపార్థం చేసుకోకుండా వినాలి.

శర్మ : అంతా వింతగా ఉంది నీ వాలకం!

శంకరం : ఉండవచ్చును. కాని, మీ అమ్మాయిమీద నాకు ప్రేమలేదు.

శర్మ : ఎన్నాళ్ళనుంచి!

రత్తయ్య : ఇంతకు ముందుకూడా బాగానే మాట్లాడారండీ నాన్నగారూ! కాఫీ కావాలన్నారు. నేను లోపలికి వెళ్ళి వచ్చే అంతలో ఏదో మునిగింది.

శంకరం : నేను నేను మరో అమ్మాయిని ప్రేమిస్తున్నాను.

శర్మ : ఎక్కడ? (శంకరం ఊరుకుంటాడు) ఏ ఊళ్ళో ఆ అమ్మాయి పేరేమిటి?

శంకరం : అవన్నీ మీకు  ఎందుకూ?

శర్మ : విని సంతోషిద్దామని, అల్లుడు యింత ఘనకార్యం చేస్తున్నప్పుడు–

శంకరం : క్షమించండి. నేను మీ అమ్మాయికి అన్యాయం చేయడం లేదు. ఆమె కూడా మరొకరిని వివాహమాడి–

శర్మ : (ధూకుడుగా) ఏమన్నావు ఒళ్ళు దగ్గర పెట్టుకునే మాట్లాడుతున్నావా? అల్లుడవు కనుక ఏమన్నా చెల్లుతుందని యీ పుంధాకోర్ వేషం వేస్తున్నావేం? ఓహో! ఇదా నీ యింగ్లీషు చదువు? ఛా! సహస్రగాయిత్రి చేసుకుంటేనేకాని నిన్ను చూసిన పాపం పోదు. (వెళ్ళిపోతాడు)

రత్తయ్య : ఏం బావగారూ, ఏమిటి ఈ నాటకం?

శంకరం : నీకు అర్థం కాదోయ్.

పున్నమ్మ : (అల్లపురసం పట్టుకు దగ్గరకువచ్చి) ఇదనాయనా– కళ్ళుమూసుకు ఒక్క గుక్క వేయి.

రత్తయ్య : అక్కడ పెట్టి వెళ్ళవమ్మా నీవు.

పున్నమ్మ : పోనీ ఆచార్యులుగారినైనా పిలుచుకు రారా అబ్బాయి.

రత్తయ్య : వెళ్ళవమ్మా బాబూ

పున్నమ్మ : సంగతేమో కనుక్కోకుండా నన్ను వెళ్ళమంటావేమిటిరా? ఏ మందో మాకో

రత్తయ్య : ముందు వెళ్ళవమ్మా

పున్నమ్మ : సరే, నాకెందుకు నాయనా, మీ మీ యిష్టం. (వెళుతుంది)

రత్తయ్య : ఏం బావగారూ, అరుగుమీద కూర్చుని అల్లపురసం తాగుతారా, లోపలికి వచ్చి–

(లోపలనుంచి బాల)

అన్నయ్యా! కాఫీ చల్లారిపోతున్నది.

రత్తయ్య : ఇంకేం, అదుగో పిలుపుకూడా వచ్చింది. ఇక లేవండి. ఇప్పటి ఆడపిల్లలకు సిగ్గూ బిడియం లేదు బొత్తిగాను.

శంకరం : ఎవ రా పిలిచింది?

రత్తయ్య : ఎవరో చెప్పుకోండి లోపల మా అమ్మా, నాన్న, చెల్లెలు ఉన్నారు. వీరిలో ఎవరికి అన్నయ్యను నేను?

శంకరం : ఇంకా ఎవరూ లేరూ?

రత్తయ్య : ఎవరు కావాలి?

శంకరం : అది కాదోయ్ – మరి, మీ చెల్లెలు యింగ్లీషు చదువుకుంటున్నదా?

రత్తయ్య : తప్పుతుందా బాబూ. మీ అజ్ఞ? యింగ్లీషేమిటి, పేలగొట్టేస్తూంటేను!

శంకరం : ఎవరు చెపుతున్నారు?

రత్తయ్య : అన్నీ కొత్తే మీకు. మొదటినుంచీ ఆ మిషనరీ దొరసానే చెపుతూంది. ఏం?

శంకరం : ఏమీ లేదులే. ఇంకో కొత్త మేష్టరుని పెట్టారేమోనని అడిగాను. దొరసానంటే–

రత్తయ్య : దొరసానంటే తెల్లదొరసాని–

శంకరం : నిజం!

రత్తయ్య : వాళ్ళ యిల్లు బంగారంగానూ! తెల్లవాళ్ళు మహా తెలివైనవాళ్ళండీ! మా అమ్మాయి ఎంత మారిపోయిందనుకున్నారు? ఆ మాటలు, ఆ నడకలు, ఆ కట్టూ, మీరు పట్నంనుంచి పంపిన – అదేమిటీ, పీలికలు, ఆఁ– రిబ్బన్లు – సినిమాలో వేషం లాగా ఉందండీ. అయినా తినబోతూ భక్ష్యాల రుచి అడిగినట్లు మీ భార్య చక్కదనాన్ని నేను అభివర్ణించాలా? మాఘుడు చెప్పినట్లు –

శంకరం : ఉండవోయ్ గొడవ! అయితే, దొరసాని యిక్కడికి వచ్చి చెపుతుందా–

రత్తయ్య : ఇంకా నయం! అమ్మా, నాన్నా మ్లేచ్ఛుల్ని యింట్లోకి రానిస్తారా? అమ్మాయే వెళ్ళి చదువుకుని వస్తుంది.

(లోపలనించి మళ్ళా) అన్నయ్యా?

శంకరం : ఎవరోయ్?

రత్తయ్య : (నవ్వుతూ) చెప్పుకోండి.

శంకరం : ఇప్పుడు లోపలికి వెళ్ళిన ఆమె గొంతు మాదిరిగా ఉందే!

రత్తయ్య : ఎప్పుడు?

శంకరం : ఇంతకుముందు.

రత్తయ్య : ఇంతకుముందు ఎవరు వచ్చారు? ఆహా, అవును, (నవ్వుతూ) నిజమే.
శంకరం : నిజమే?
రత్తయ్య : ఆఁ
శంకరం : అయితే, మీ చెల్లెలు అంటావేం?
రత్తయ్య : పోనీ, కాదులెండి, మీ గృహిణి.
శంకరం : అబద్ధం.
రత్తయ్య : నమ్మకపోతే మానిరి. ముందు కాఫీ తీసుకోరూ. ఈపాటికి చప్పగా చల్లారిపోయి ఉంటుంది.
శంకరం : కాఫీ వద్దు, గీఫీ వద్దు! అంతా గొడవగా ఉన్నది.
రత్తయ్య : ఏమీలేదు. (లోపలికి చూసి) అమ్మాయి, కాఫీ యిక్కడికే తీసుకురా అమ్మా! బావగారు కూర్చున్న చోటనుంచి కదలడం లేదు. రా అమ్మా! ఫరవాలేదు. (తాను నిలుచుంటాడు)

(బాల ప్రవేశిస్తుంది)

శంకరం : (అదిరిపడి) నీవా?
రత్తయ్య : చూసి ఆరేళ్ళయినా చప్పున గుర్తుపట్టేశారే బావగారు : ఎంత చెడ్డా, యింగ్లీషు చదువుకున్న వాళ్లాయెను?
శంకరం : ఊరుకో, వెర్రి వాగుడు వాగక! ఆరేళ్ళేమిటి నీ మొగం –
బాల : (నెమ్మదిగా) ఆరు నిమిషాలు కాలేదు.
రత్తయ్య : ఆరు నిమిషాలా? దంపతు లిద్దరికీ మతిపోయినట్టుందే?
శంకరం : నీ బ్రహ్మచారి చేష్టలు–
రత్తయ్య : నా కెందుకు బాబూ – పుణ్యమా పురుషార్థమా, మిమ్మల్ని కనిపెట్టుకు కూర్చుంటే – 'దంపత్యోర్మధ్య ఏవచ' అన్నారు. పోయి, మధ్యాహ్నికం చేసుకుంటాను.

(నిష్క్రమణం)

శంకరం : దయచేయండి పంతులమ్మగారూ, యింగ్లీషు చదివినవారికి మొగమాటం ఎందుకూ? మీ పిల్లలు కులాసాగా ఉన్నారా?
బాల : ఉన్నారు.
శంకరం : ఏం చేస్తున్నారు?
బాల : (నవ్వుతూ) మొగపిల్లవాడు వేదపారాయణ చేసుకుంటున్నాడు. ఆడపిల్ల (విరగబడుతూ) పులుసులో తిరగబోత వేస్తూన్నది...
శంకరం : యూ సిల్లి డార్లింగ్!
బాల : పంతులమ్మను పిలుస్తాను. (రెండు అడుగులు వెనక్కు వేస్తుంది)
పున్నమ్మ : (గుమ్మంలోనుంచి) ఏమే అమ్మాయ్ – కాఫీ... (తొంగిచూసి) సరి సరి. మీ యిల్లు బంగారంగానూ!

(లోపలికి పోతుంది)

శంకరం : (బాలను చేయి పట్టుకు లాగుతాడు)
బాల : ఊఁ మోటదనం–

(శంకరం కౌగలించుకుని ఉండగా శర్మ బయటికి వస్తాడు. చూసి తలుపు పెఢేలున వేసుకుంటాడు.)

బాల : అమ్మో! నాన్న చూశాడు బాబోయ్! (విదిలించుకుని, పక్కకు పరుగెత్తుతుంది)

రత్తయ్య : (ప్రవేశించి) కాఫీ త్రాగినట్లు లేదే (అందిస్తూ) తీసుకోండి; అరె! చప్పగా చల్లారిపోయింది, మంచినీళ్లులాగా.

శంకరం : వద్దు లేస్తూ.

రత్తయ్య : అవును– కడుపునిండిన బేరం.

శంకరం : (కొట్టబోతూ) శతమర్కటః అనిపిస్తున్నావు!

రత్తయ్య : (తప్పించుకుని) మీరు చివరకు యిచ్చేవి యివే కాదూ, బహుమతీలు! నాన్న కనిపెట్టుకుని ఉన్నాడు. రండి లోపలికి.

(తెర)

# అఇడఉణ్

## పాత్రలు

పిచ్చివాడు

పిచ్చిగొంతు

1వ దొంగ

2వ దొంగ

బసివి

1వ పోలీసు

2వ పోలీసు

# అ ఇ ఉ ణ్

(చీకటి గుయ్యారంగా ఉంది: ఎక్కడనుంచో గడియారం గంటలు మ్రోగింది. చివరి గంట రంగ్‌కన్న ఈసడింపు శ్రుతిలో కుక్క మూలుగు : పై – నిశ్శబ్దం :)

పిచ్చవాడు: శంభో : –

(కుక్క మరింత గట్టిగా మొరుగుతుంది)

పి : అహంభో: హరహర మహాదేవ:

(దెబ్బతిన్న గొంతులో కుక్క మూలుగు)

(చీకటి, కరువున పోసినట్టు, – మూర్తిగా పేరుకుంటుంది)

పిచ్చగొంతు : ఏది ధ్వని? – ఏది ప్రతి ధ్వని? –

(పెద్దనీడముందు రెండు చిన్ననీడలు)

1.వ దొం: ఎవరిది? –

2.వ దొం: ఎవడో వెర్రివాడు – ఎప్పుడూ అల్లాగే గాలితో పోట్లాడుతూంటాడు: –

(చెకుముకి దెబ్బ : రవ్వ ఎగిరి, దీపకాంతి ప్రసరించుతుంది: ఆ యిద్దరూ వీణ్ణి సమీపిస్తారు)

పి : ఎక్కడిదీ వెలుగు? –

(పెద్ద జటాజూటం – వెలుగురేక) ఓ! – నాలో వెలుగే! – నాయన్నా – నా మొగం వెలుతురులో నీ దివ్వెను కంటున్నావా? –

దించు, తగ్గించు! –

బరువుకు, చేయి పడిపోయేను! –

అదెందుకయ్యా! – అద్దమల్లే నా మొగముండగా, అందులో చూచి పోల్చుకోలేవూ? –

1 దొం: రారా. వింటూవుంటే మనకూ ఎత్తుతుంది?

పి : ఆగవోయ్, అయిఉణ్!

అప్పుడే మొగం మొత్తిందీ! –

అయితే బైఠాయించు, – వినేదేమో ఆసనశుద్ధిగా అంటాను! –

నీచేతగాకపోతే, – కాళ్లను బ్రతిమాలుకో! చెప్పినమాట వింటాయ్! –

(కూర్చుంటాడు.)

2 దొం : కూచుందాంరా! – ఇంకా, మాటుమణగ లేదుగా! –

(కూర్చున్నారు. పిచ్చవాడు ఓ! అని ఎగిరిగెంతాడు)

1 దొం :. ఆరివీడి వెర్రికూలా : మనం కూచోగానే – వీడిలా ఎగిరి గంతేశాడేం? –

పి : ఆఁ! – అదే మన సంబంధం! – నీవు ఒదిగావ్! మేము ఎదిగాము – ఇదిగో నీ మీద నక్షత్రాన్ని – నా మీదకు జరుపు.

2 దొం : అలాగే లే! –

పి : అలాగేం? – అది నీ మాట వింటుందా, – జరిగేది ఇది – ఒదిగేది అది! –

1 పో : మాట్లాడవేం? – (ధప్పుమని దెబ్బ)

(బసివి కెవ్వు : పిచ్చు నవ్వు)

(పిచ్చవాడు, – దాపురించి)

పి : తంతే ఓంకారం!

మాటసడలితే మాట!... నోటికితాళం నీదేనా?

(చిన్న దీపస్తంభాలమీదికి భారీనీడ వస్తుంది)

1 పో : వీడెవడురా – పట్టుకో!–

పి : ఏయ్ – పట్టుకున్నా!– ఓయ్ కట్టేసుకున్నాలే,– నన్ను నిన్నే– చేతికి చేయి అందితేనే పది అవుతుంది. మూడు పదులు ముప్పై:

ఉహుం? – నీకు మిగిలేవి, – ఒకటి – రెండు!–

ఏదో గొంతు – ఏమిటవి?

పిచ్చగొంతు – పళ్ళు! పాలపళ్ళు! – పాల బుగ్గల్లో నీళ్లు కలిపితే, పళ్లు చిక్కపడేవి:–

1 పో : ఎవడో పిచ్చవాడు: –

ఏయ్! – నీ దోవను నీవుపో :– (ఒక వెలుగు నీడమీదపడి బ్రతిమాలుతుంది)

పి : నా దోవను–నీదోవ పోతానంటూందా? – తన్ను! – బసివి పెనుగులాట – నన్నొదలండి – నేనే పాపం ఎరుగను బాబో!–

1 పో : ఆడదానివి – చీకటిలో నీకేం పని!

బ: బసివిని బాబూ – ఏ అయ్యకన్నా ఒళ్ళిచ్చుకుందామని–

2. పో : ఛీ! – సిగ్గులేదూ? (తాపు)

బ : (గావుగొంతు) – లేదు!–సిగ్గులేదు! – కొట్టకు బాబూ!– కడుపులో అగ్గవుతూంది– బసివిని – ఎలా బ్రతికేదయ్యా!–

(రాగమాలికవంటి రోదనం)

(స్పందన మంద్రంలో – నిశ్శబ్దం)

1 దొం : ఏయ్ – వెర్రోడా!– వెర్రోడా!– ఏడీ!

2 దొం : అలా అంటే వాడికి మరీ రిమ్మ ఎత్తదురా!

(మెరుపు మెరిసినట్లు చీకటిమీద – మొరుగులు) మొరుగుతున్నాయ్! – అక్కడున్నాడేమో!

పి : మొరిగేది మనమే. ⁄⁄ అక్కడున్నవి నోరులేని మనుష్యులు!–

1 దొం: ఓ !– దొరికావ్ బాబూ!–

(చీకటి తొక్కిసలాడుతుంది)

2. దొం : ఆ మూల అలికిడౌతుందిరా! ఉc! వీడు వాళ్ళ మనిషేమో:

(కొండల్లే – పిచ్చనీడ)

1 దొం : పగలేయరా : – (గొర్రె తలకాయలు సాలీడు గూడున: డీ కొంటున్నట్టు – చీకటి బొమ్మ)

పి : హుc! – రాత్రైతే – పగలేయ్యమంటావ్!

(గూడులో, పొటేళ్ల కొమ్ములు చిక్కుకున్నాయ్)

1 దొ : విడు!-

2 దొ : విడు!

(చీకటి గజిబిజిగా పెనగులాడి,- కుప్పకూలుతుంది: నగలమూట ఘల్లుమని పడుతుంది)

దూరంగా బసివి కేక - అదుగో - వాళ్లే! - దొంగలు వాళ్లే!-

(చీకటి అలలల్లే ఉన్నచోటనే సుడి చుడుతూంది)

పి: వాళ్ళే దొంగలు - వాళ్ళే-

(చీకటి చేయి - ఉవ్వెత్తున గలగలలాడిస్తుంది)

1 దొ : చీకటిలోకి ఉరకరా!- (నీడలు కత్తియుద్ధమల్లే పడుగుపేకలౌతాయి - చిన్న వెలుగు ముందు దూకగా)

1 పో: ఏరీ ఎటుపోయినారు-

బసివి : పారిపోతున్నారు! - తరమండి:

(చీకటిలో చుక్కలద్దుకున్న తళుకు)

పి : ఇవిగో దొంగలు ! - సొమ్ము పరుగెత్తింది - దొంగ చిక్కింది - పట్టుకో:

2. పో : సొత్తుతో దొరికితే - శిక్షపడేది-

1 పో : తే - ఇలా తే! - (తళుకుతో, దీపకాంతి, గుంజాటన!)

పి : ఉహుం - ఇది. నీదా? - మేరుపర్వతమంత వెలుగు - చీకటిలో రాలే, - ఒక చుక్క-

2. పో : వాళ్ళదారికాపుకు - యీ నాటకమా? రా, స్టేషనుకు రా, మా వెంట!-

(చిక్కని వెలుగులో,- ఇద్దరు ఆరెకులు - ఓ జడలమాతంగి)

పి : నీ వెంట - నువ్వే వెళుదూ?

(ఒక్క అడుగులో డొంక తిరుగుళ్లు తిరుగుతాడు. మూడు జతలకాళ్లు ఉన్న చోటునే ఉక్కిరి బిక్కిరౌతాయి)

1 పో : ఏయ్! - (నాలుగు చేతులు పైపైన శివతాండవం చేస్తాయి - బసివి దేగల్లే వ్రాలుతుంది)

బ : ఎవరో పిచ్చిమారాజు. ఆగ్రహం వద్దు బాబూ! (ఆకాశమంత మొగం - కనురెప్ప-పెదవల్లే కదులుతుంది) అయ్యా: - నీకు ఆ బరువు ఎందుకూ,- వారి కిచ్చేయ్:-

పి : నా కెందుకైతే - నీకు ఇందుకూ!- ఆ మొగానకొట్టు- (సంచులు బసివిమీదకు ఘళ్‌మనిపిస్తాడు)

1 పో : అన్నంత పనీ చేస్తాడు - తప్పుకోరా!-

(వెలుగు మూట చీకటిలో మిడిసిపడుతుంది. కాళ్లు పరిగెత్తుకు పోతున్నాయి)

పి : ఒళ్లు ఎత్తుకు వీళ్లు పారిపోతారేం?-

నగలు నడవలేవ్:-

(చుక్కలు వాగల్లే చీకటిలో కలిసిపోతాయ్)

బ : నీవు వెర్రివాడవు కావు - తండ్రీ జంగమయ్య :- కరుణించవయ్యా :-

(శివలింగమంత చీకటిమట్టాన వెలుగుతీగ అల్లుకుంటుంది)

పి: ఏయ్! వదులు– వదులు– కాళ్లు కౌగలించుకుంటావేం : కంఠం బిగిసి పోతూంది!–

(చీకటి వలల్లే దాళ్లుపడి – కరిగిపోతుంది)

బసివికేక – స్వామీ :–

(పైనుంచి వెలుతురు కురుస్తుంది – చీకటి వెనుక తెరల్లే – పొంగిపైకి లేస్తుంది– గాలిలో గంధర్వకన్నె బసివి – వెలుగు ప్రవాహంలో, చీకటి ఆరూపు చిక్కబట్టుతూంది – శంఖానాదం – బసివి శబలించి – ఓంకారమౌతుంది! చీకటి 'ఓం' గా స్పందిస్తుంది) – – (ఒంటి గంట)

('ఆంధ్రజ్యోతి' మాసపత్రిక)

# సేఫ్టీ రేజర్

## పాత్రలు

శిష్యుడు

విశ్వామిత్రుడు

మేనక

శకుంతల

అనసూయ

దూర్వాసుడు

నారదుడు

చేటి

ప్రతీహారి

దుష్యంతుడు

సోమరాతుడు

శార్ఙ్గరవుడు

కణ్వుడు

అప్సర

పురోహితుడు

2 మునికుమారులు

# సేఫ్టీరేజర్

(మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి కవిమిత్రుల్లో 'హుణా వాణికి మనసు నచ్చిన జాణ' వెంపటి నాగభూషణంగారు ప్రముఖులు. వీరిది జన్మంతర మైత్రీ అనుబంధం.

సేఫ్టీరేజర్ సూత్రధారి ఒకరే ఐనా, కొత్త పోకడలకు ఆహ్వానం పలుకుతూ తాము యిద్దరూ ఒక్క రూపంగా రంగ ప్రవేశం చేస్తారు మిత్రద్వయం; యీ నాటికలో.

1937 ప్రాంతంలో:

వినోదినిలో మల్లాది వారి పేరిట మాదరన్ ప్రస్తావన– ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వెంపటివారి పేరిట నాటిక వెలువడినాయి).

## మాదరన్ ప్రస్తావన

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశిస్తాడు. వేషం:– పాకం ముదిరిన కవికుమారుడిలాగా అనవసరపు అర్ధనారీశ్వరాకృతి–దాన్ని పొటకరింప జేసే – ఆహార్య సౌభాగ్యం.

–రెండడుగులు ముందుకు వేసి, కొంచెం ఆగి। తనలో తాను ఏదో ఆలోచించుకుని, చివరకు తేల్చుకున్నట్లు తల పంకించి నిలువబడి, సైడ్‌వింగ్‌లోకి చూస్తూ, ఈలతో, ఇంగ్లీషు డాన్సుట్యూన్స్ పలికిస్తాడు...

తరువాత,

సభ్యులవైపు తిరిగి, రెండు చేతులతోనూ, లాల్చీ జేబులలోంచి సిగరెట్లు తీసి, సవ్యసాచి పోజుతో విరజల్లుతాడు. రెండు మూడు నిమిషముల వరకూ, హాలంతా గంద్రగోళంగా ఉంటుంది, వడ్డన కలియని విందుభోజనం పంక్తుల హడావడితో – తరు వాత కొంచెం సద్దుమణుగుతుంది.

కాని, ప్రస్తావన భాగమంతా, మధ్య మధ్య సోడాలు మోగుతూ, కృపీయోని పేటికాత్ బలాదాకృష్టకాష్ఠ లేశాలు...... వెలుగుతూ ఉంటవి.

తాను సావకాశంగా... ప్రక్కనుంచి అందిపుచ్చుకున్న కొత్తటిన్ ఊడదీసి, సిగరెట్ తీసుకుని ముట్టిస్తాడు...

సావకాశంగా, అప్యాయంగా, రెండు దమ్ములు లాగి...) సూత్రధారుడు:

సద్రసికులైన భావుకులతో, కవి, యీలా మనవి చేయమంటున్నాడు...

గడ్డ మేనాడు మాయని కారణాన

కావ్యకన్యక నేనన్న కాంక్షసేయు...ట, చేత, మా వలపుతాలూకు తొలిఫలాన్ని రుచిచూసిధన్యులుకండి'... అని

కొంచెం వెనుకకు నడచి ఎడమవింగ్‌లోకి చూస్తూ...అందరికీ, । స్వగతమని స్పష్టమయే ధోరణిలో)

ఏమీ...నాప్రియురా లింకా జాగు చేస్తున్న దెందువల్లనో?– కారణం ఏమై ఉంటుందో? (అని, సభ్యులవైపు ప్రకాశంగా)

చెలీ :  నీవు అలంకరించుకోవడం పూర్తి ఐతే... (అని, అర్థోక్తిలో...)

(ఇక, నవ్వాపుకోలేక, విరగబడుతూ)

అందరూ క్షమించాలి, లాంఛనంకోసం, ఈలా సంభాషణ నడుపుదామను కున్నాను అలంకరించుకునే చెలి కాని, అసలు ఏ చెలీకాని, లోపలలేదని, మీకూ, నాకూ, కూడా విదితమే!

టూకీగా ఈ కాండ జరిపేద్దామనే, కవి పేరూ, నాటకం పేరూ, కూడా ఎత్తు కోంది... ఐనా, నాటకం ఏమిటో తెలియకుండా వచ్చారు గనుకనా, మీరందరూనూ?

ఆగంతుకంగా... ఇప్పుడే రైలుదిగి, బుకింగ్ దగ్గరన్నా కనుక్కోకుండా, యకా యకిని, మామీది అభిమానం కొద్దీ, దయచేసిన నూతన మిత్రులు... ఎవరైనా ఉంటే,... పక్క వాళ్ళని అడగండి.

ఇవిగో. సిగరెట్లు... పుష్కలంగా, అందరికీ అందుబాటులో ఉండేటట్టు ఏర్పాటు చేశాను. మరేమీ మొగమాట పడకుండా, నాటకాంతంవరకూ, గ్రహిస్తూంటారు కదూ, యధాశక్తి? మా నాటకానికి వచ్చి, మా చేయు సపర్య లందుకుంటూ – మా సిగరెట్లు కాల్చాలికాని, ఏమరుపాటున ఐనా, జేబులో చేయి పెట్టారా... చెడ్డ ఒట్టు!

...ఇక, నాటకం చివరదాకా, కనబడను. మధ్య తీరికగా ఉన్నప్పుడు, తొంగి చూస్తుంటాను, మీకేం కావాలో కనుక్కోవడానికి:

మరీ ప్రొద్దుపోక బోతే... భరతవాక్యం చదవడం నావంతు: ఇక ఏ వేషంలో వస్తానో, చెప్పలేను. తొందరగా వేసుకోవడంవల్ల వేషం మాటున నన్ను గుర్తించగలిగినా, అలా అనుకుని, మీ రసముద్రను విడగొట్టుకోకుండా అలాగే భావించి ఆనందించి, తన్మ యులు కావడానికి ప్రయత్నించండి.

–పోనీ ఆఖరికి ఋతువర్ణనమైనా చేయిద్దామని, నిన్ననే వచ్చిన కొత్త రికార్డులు తెప్పించాను. కాని, ఇంతలో మేమందరమూ, తలో పనిమీద ఉండగా కిశోరనటు డొకడు సౌండ్ బాక్సును మరమ్మతు చేశాడు. అందుచేత అదీ ఒనగూడలేదు:... కనుక, అన్నీ సలక్షణంగా జరిగినట్లుగానే ఎంచుకుంటారు కదూ!

–ఇక వెళ్ళనా, లోపలికి రావడం లేదేమని, మా సామాజికు లందరూ – బిగ్గరగా కేకవేసి, పిలవడానికి వీలులేదు కాదూ,– ఆంగికంగా బీభత్సాభినయం చేస్తూ, విండ్సును కుమ్మేస్తున్నారు... ఓహో! తెరకూడా ఎత్తుతున్నారే...

(తెరను క్రిందకిలాగ ప్రయత్నిస్తూ హడావడిగా నిష్క్రమిస్తాడు)

# సేఫ్టీరేజర్

## అంకితం

కొత్త పోకడలు అంటే భయంలేనివాళ్లకు.
టెక్ట్స్ ఆఫ్ మోడరన్ ప్రస్తావన ఫ్రం కేళీగోపాలం

** *** **

అప్సర

శ్రీమేనాకమనా
సుమనోదయ కోమల రమణా
కోరకహీరమణీ రదనా
భారవి కరపులకిత కుముదా
ధారా జయ వసంత మాధవ-
విజయీా భవ.

(ఓ మూలనుంచి విలాసంతో, రెండో ప్రక్కకు నడిచిపోతుంది. తెర ఎత్తగా)

## ఒకటో రంగం

(ఆశ్రమ ప్రాంత పుణ్యభూమి : విశాలమైన మఱ్ఱిచెట్టు మొదట వేదికమీద పలచని లేడి చర్మపు రజాయి జారుగా పరచి ఉంటుంది: ఒక చివరగా, అజంతా బొమ్మల్లో చూసే మధుకలశము, పానపాత్రమూ ఉంటవి: వాటి ప్రక్కన హుక్కా :

కొంచెం దూరంలో జాలువారుతూన్న సెలయేటి అంచున, అప్పుడప్పుడే అంకురిస్తూన్న బాలతృణాల్ని మునిపంట నొక్కుతూ, తిరుగుతూన్న ఆడలేడిని అనుసరించి బాల కురంగం చెంగున గెంతుతూంది. విశ్వామిత్రుడు వేదికకు మరో అంచున ఠీవిగా కూర్చుని, ఆవంక చూస్తూంటాడు.

శిష్యుడు ప్రవేశిస్తాడు : కొంచెం బెదురుతూ దూరంగా నిలబడి, ముందుకు రెండడుగులు వేసి, మళ్లా తటపటాయిస్తూ)

శిష్యుడు :-జయము, జయము గురుపాదులకు!

విశ్వా :- (ఒక నిమిషం ఊరకుండి, తరువాత రవంత శిష్యుడి వైపుకు తిరిగి, చూసీ చూడనట్లుగా కొంచెం తల ఊపుతాడు రాజు దర్జాతో.)

శిష్యు:- తమకోసం దూర్వాసమునీంద్రుడు-

విశ్వా:- (పరధ్యానంగానే, చికాకుతో) ఇప్పుడు వీలులేదు. మరోమారు రమ్మను.

శిష్యు:- మరి వారు ఇప్పుడే-

విశ్వా:- పోఁ.

(శిష్యుడు జంకుతూ వెనక్కి వెళ్లిపోతాడు. లోపల గలభా వినపడుతుంది. - దూర్వాసుడు ముందుకు రాబోతూంటే, శిష్యుడు అడ్డుపడి వారిస్తున్నట్లు :క్రమంగా కేకలు దూరమౌతవి. తరువాత నిశ్శబ్దం.)

ఆc, చింత చచ్చినా పులుసు చావనంటూన్నదే? దేవతలందరూ నాకు జడిసి బ్రాహ్మణున్ని చేశారా? కాని, మళ్లా ఎంతలో మారిపోయినానూ? (లేచి అటూ, ఇటూ పచారు చేసివచ్చి మధువును సేవిస్తాడు: నిలుచునే హుక్కాగొట్టం అందు కుంటాడు.)

అవును, మారిపోయాను. మారిపోగలను. నా యథేచ్ఛా విహారం....లీల...(నవ్వి) నన్ను నేనే దిద్దుకుంటాను-మేనకకోసం.

(మేనక ప్రవేశిస్తుంది. పదహారేళ్ల బాలెంతరాలు. మిసమిస లాడుతూంది. కొంచెం వెనుకగా ఒక అప్సర పొత్తిళ్లలో పిల్లను ఉంచుకు వస్తుంది.
మేనకను చూసి అమితావేశంతో)

వచ్చావూ?

మేనక: (చిరునవ్వుతో సమీపించి, అతని భుజాలమీద చేతులువేసి, కళ్లల్లోకి చూస్తూ) ఆహాc.

విశ్వా: - ఐతే-తెచ్చావా?

మేనక:- (అర్థం కానట్లుగా) ఏమిటీ?

విశ్వా:- ఏమిటా? అంత వళ్లు మరచిపోయినావేం? చూశావా ఎలా పెరిగిందో?(అని వారంరోజుల మాపు కనబడుతున్న గడ్డం నిమురుకుంటాడు.)

మేనక:- (తలవంచుకుని, నెమ్మదిగా) లేదు.

విశ్వా:- (ఉరుముతూ) ఎందుచేత ?

మేనక:- మరే-

విశ్వా:- మరీలేదు-గిరీలేదు. నారదుడిచేత కబురు పంపాను కూడా కాదూ? ఆ వెధవ చెప్పలా? ఇంత మై మరపా ?

మేనక:- (మోకలించి) కోప్పడవద్దు : నేను మరచిపోలేదు. లేక-పట్టుకు రాలేదు.

విశ్వా:- ఏం?

మేనక:- అబ్బ! అలా కసరకుండా వినండి. మొన్ననే సోమయాజులు గార్లందరూ అప్సరలను వరించవచ్చని 'లా' అమలులో పెట్టారు: మీకు తెలియదూ?

విశ్వా: అలాగేం : నేను సనాతన సభాసభ్యుణ్ణి కానులే: అందుచేత నాకు సర్క్యులర్ రాలేదు: ఐతే?

మేనక:- ఏమీలేదు. వచ్చేవారందరికీ ఇచ్చేటప్పటికి అన్ని బ్లేడ్‌లూ అయిపోయినవి. తిరిగి చేయడానికి- విశ్వకర్మకు ఒంట్లో బాగుండక అతడు పనిలోకి రావడం లేదు.

విశ్వా:- పోనీ, ఇంద్రుణ్ణి అడిగి అతనిదగ్గర ఏమైనా ఉన్నదేమో అడిగి తీసుకు రాలేకపోయినావా?

మేనక:- బాగుంటుందా చెప్పండి, మీరే. ఆయనకు అక్కర్లేదూ?

విశ్వా:- 'అభిలాప్సరోంగనావిటుడు' కనుక అతనికి గడ్డం మాయకూడదు. నాలాటి ఏకపత్నీ......

మేనక:- (అపవారించి) అది కాదండీ.

విశ్వా:- అవును: అలాటివాడు నాకు రేజర్ ఎందుకు ఇచ్చాడు మొదలు. నీవు నన్ను

గెడ్డం తీసేసుకోమని ఎందుకు బ్రతిమాలావు? ఇది వరకు నాకు దాని ప్రసక్తి ఏమైనా ఉన్నదా? నీవు వచ్చేటప్పటికి గెడ్డం పెంచుకు కూచోనా? కబురు అందగానే పంపిస్తావనుకున్నాను. పోనీ, ఆలస్యమైనా నీవు వచ్చేటప్పుడైనా తీసుకు వస్తావనుకున్నాను. అవును, నీకేం?

మేనక:- ఎందుకూ- ఎదుటపడగానే అలా కసురుతారు? (సమీపించి, సవిలాసంగా) మీరు, ఏలా ఉన్నా నాకు బాగానే ఉంటారు.

విశ్వా:- చాల్లే, నీ మాయవేషాలు కట్టిపెట్టు.

మేనక:- (మారు మాటాడకుండా దూరంగాపోయి నిలుచుంటుంది.)

విశ్వా :- ఏం మాట్లాడవేం?

మేనక :- (క్రిందికి చూస్తూ, అలాగే ఉండిపోతుంది.)

విశ్వా :- ఈలా రా: కదలవేం? ఊం, రా ఇక్కడికి.

మేనక :- (సమీపిస్తుంది.)

విశ్వా :- కనుక, నీవూ వాడూ ఆలోచించుకుని చేసిన పని అన్నమాటా, ఇది?

మేనక :- ...............

విశ్వా :- నా తపస్సు విఘ్నం చేయడానికి, నా బవిరిగెడ్డం, నా దీర్ఘ జటాజూటం పోయేందుకు, నీవూ ఇంద్రుడూ పన్నిన పన్నాగమా ఇది? మీ అక్కర తీరింది కనుక- నేనిక ఏలా పోతే మీకేం? నా గెడ్డం మాసి, చేసుకునేందుకు బ్లేడులేక, నేను ఎంత అవస్థ పడుతూంటే మాత్రం నీకేం? అమ్మా, ఎంతవాళ్లు అప్సరలు! మానవాంగనకుండే కుత్సితాలన్నీ మీకూ ఉన్నాయే! (ఏమన్నా మేనక కిక్కురుమనకపోవడం చూసి) కానీ, మీ పని చెప్తాను... శిష్యా!

శిష్యుడు :-(వింగ్‌లోంచి తొంగి చూసి, తల ఊగిస్తాడు.)

విశ్వా :- ఓరి, శంభయ్యా! అలా దిక్కులు చూస్తావేం: ముందుకురా: (శిష్యుడు సమీపిస్తాడు) ఆశ్రమంలోకి వెళ్లి తైత్తిరీయం రెండో కట్టచాటున రేజరున్నూ, సామసంహితలో పాత బ్లేడున్నూ ఉన్నాయి, పట్టుకురా. (శిష్యుడు వెడతాడు.) ఎంతో అనుకున్నా : నీవు అమ్మాయివి, చిట్టితల్లిని ఎత్తుకు వచ్చేటప్పటికి, చక్కగా షేవ్ చేసుకుని అందంగా ఉండాలని. కానీ, ఇంతచేసిన తరువాత - నీవు నాకు అక్కరలేదు. నామీద మనసు తీరగానే నన్ను ఇలా పరాభవిస్తావేం? సరేలే: నీ రేజరు నీవు పట్టుకెళ్ళు: ఇంద్రుడి మొఖాన కొట్టానని చెప్పు: ఎవడిక్కావాలి: మళ్లా ఏ ఋషి నన్నా చెరపడానికి బయలుదేరేటప్పుడు ఉపకరిస్తాయి.

మేనక :- (కంగారుపడుతూ లోపలికి సైగ చేస్తుంది. దాది పసిపాపతో ప్రవేశించగా, తాను అందుకుని, అతన్ని సమీపించి) నన్ను మన్నించండి. నేను చేయాలని చేయలేదు. మీకు గెడ్డం పెరగడం నాకు మట్టుకు ముచ్చటా? పోనీ, నా మీద కోపమైతే ఈ పసికందును, మన ప్రేమాంకురాన్ని చూసి ఐనా ఊరుకోండి. చూడండి, ఏలా చేతులుజాస్తూ ఎత్తుకోమంటూందో, బంగారుతల్లి. తీసుకోరూ? - ఆ నున్నని పాలబుగ్గలమీద, నవ్వితే, ఏలా సొట్టపడుతూందో! చూడమ్మా! మరేం, నాన్నకే కోపం వచ్చింది కాని......

(పసిపాపను అతనికి అందీయబోయింది.)

విశ్వా :- (రవివర్మ బొమ్మలో పోజుతో ఓ చేయి నెత్తిమీదకు ఎగజాపి వారిస్తాడు.)

మేనక :- (కొంచెం వెనుకకు తగ్గి) ఎంత కఠినులండి.

విశ్వా :- కఠినుణ్ణా?

మేనక :- ఆఁ...... తపస్సు కఠినం: ఆచరణ కఠినం: చివరకు...... మనస్సుకూడా,

విశ్వా :- అవును: కఠినమైతే – నీ మెర మెచ్చులకు కరిగిపోకుండా. ఉండేదే. (శిష్యుడు వచ్చి రేజరూ, బ్లేడ్లూ అందిస్తాడు భయపడుతూ) దౌర్భాగ్యుడా ఎక్కడకు వెళితే అక్కడే పాతుకుని పోతావేం? (మేనకవైపు రేజరు విసిరివేసి) తీసుకుపో, వెళ్ళు.

మేనక : - ఇది తగునా?

విశ్వా :- భేషుగ్గా.

మేనక :- అవును. మనసు మారిపోయినప్పుడు...... నెపం నా మీదనే వేసి తప్పించు కోవాలని మీ పన్నాగం: నాకు తెలుసులెండి. వెళ్ళిపోతాను.

విశ్వా :- శీఘ్రంగా

మేనక :- ఉండనులెండి. మీ పాపను మీరు తీసుకోండి.

విశ్వా :- మీ పాప-మాపాప! ఇష్టం లేకపోతే పారవెయ్యి.

మేనక : అలాగే: లేకపోతే, మనకు పిల్లలు ఎందుకూ!

విశ్వామిత్రుడు:- ఎందుకూ! నీవు చేసిన పనే, పెద్దదై అదీ చేయడానికి. కానీ ఇది వృధాగా పోదులే. రేజర్‌వల్ల నీకూ నాకూ ఎడబావులైనవికదా. నీ సంతానానికీ అదే- శాపం! రేజరే!

ఛీ! మాయలోపడి ఎంత తపఃఫలం వ్యర్థం చేసుకున్నానూ!

(వెళ్ళిపోతాడు. మేనక, అప్సర అలా నిలవబడి, కదలక ఉంటారు.)

## రెండోరంగం

(కులపతి కణ్వుని తపోవనం. అవతలగా ఆశ్రమకుటీరములు కనబడుతూ ఉన్నవి. మాధవీ నికుంజము దగ్గర శకుంతల నిలుచుని ఉంటుంది)

శకు :- (చేతిలో ఉన్న రేజర్ కనబడేటట్టు పట్టుకుని చూస్తూ)

బేజరూరు వగలేనా
మోజు తీరిపోయెనా
రేజరా
గడ్డమంటి చెప్పి వలపు
కాని పిలువనంప మనవే.
బ్లేడు కరుకు పూములుకుల
వాడి అబ్బ! సైపలేనే!

ఎన్ని మాయలు, ఎన్ని నమ్మికలు, అన్నీ మరచిపోయినాడా! అంతఃపురాంగనల వెంటపడి నన్ను అన్యాయం చేయడం..

(అనసూయవచ్చి (సమీపించి)

అన :- ఏమి....... చేయడం?

శకు :- ..........

అన :- కదులు. ముహూర్తం దాటిపోతుంది. కులపతి, బ్రహ్మలోకానికి వెళుతున్నారు. నిన్ను శార్‌ఙ్గరవుని తోడు తీసుకోమన్నారు.

శకు :- (కోపంగా) నేను వెళ్లను. నగరు చేరుకోగానే పిలిపించుకుంటానని చెప్పి ఇలా వంచన చేస్తాడా? పోనీ, తన పేరే తలుచుకుంటూ బ్రహ్మచారిణిగా ఆశ్రమంలోనే ఉండిపోతాను. ఆయనకు అంత బెట్టా?

అన :- కాదమ్మా! రాచకార్యాలు-

శకు: - రాచకార్యాలు!! అవే నాకన్న ఎక్కువైతే నే నెందుకేం? తేరగా దొరికానని, ఏమీ తెలియనిదాననని అంత చులకనగా చూస్తాడా? (వ్రేలితో బెదరిస్తూ) అ మాట నా వద్ద ఎత్తావంటే-

అన : - వినవూ?...... నీ మాటల కేమిలే, నేను చూడటం లేదూ, ఎప్పుడెప్పుడని కాచుకొని కూర్చోడం? కొంచెం అలికిడి అయితే సైన్యం వస్తూన్నదని ఎదురు చూపికలికిపోవడం (రేజరును చూపించి)-అదిగో, వెళ్ళేటప్పుడు నీ దగ్గర వదిలేయలేదూ జ్ఞాపకానికి? దాన్ని ఒక్క క్షణమైనా ఎడబాస్తున్నావా? మునుపటిలాగా నీతీవలను కన్నతల్లిలాగా పెంచుకుంటున్నావా? హరిణ బాలలకు నవ తృణాంకూర ప్రాశనను చేస్తున్నావా? నిదుర లేచినది మొదలు రేజరును మెరుగుపెట్టడం, తలచుకుని మురియడం, ఎన్ని నేర్చుకున్నావమ్మా!

శకు :- (రేజరును దూరంగా విసిరి) నన్ను మోసం చేసినవాళ్ళు- ఇంతే!

అన :- (తీసి అందీయబోతుంది.)

శకు :- అక్కర్లేదు. నీవు నాతో మాటాడవద్దు.

అన :- మాటాడను లే. ఇక మీ ఊరికిపోయి మహరాణివైన తరువాత సరే, ఇప్పటినుంచే ఇంత అధికార గర్వమా? కానిలే-

శకు :- నాతో మాటాడవద్దు. ఇక్కడనుంచి వెళ్లిపోతావా, నేను వెళ్లనా?

అన :- మెదలకుండా ఉంటానులే. నా కెందుకు, అయినా, మీ దంపతుల సంగతి? మీలో మీకు ఏమేం ఉన్నాయో, ఏం?

శకు :- ....................

అన :- కూర్చో.

శకు :- ఉహుఁ.

అన :- పోనీ, నవ్వు.

శకు : ఉహుఁ. కూర్చోను, నవ్వను- నీతో-

అన :- మాటాడవు. అయితే ఏం చేస్తావు?

(దూర్వాసుడు వస్తాడు. శకుంతల, అనసూయ ఎడపెడగా తిరిగి నిలుచుని ఉంటారు.)

దుర్వా:- ఓం శన్నో ఆస్తు...... ద్విపదే
శం చతుష్పది.

(విని, అటు చూడకుండా నవ్వుతారు. దూర్వాసుడు కొంచెం సకిలిస్తాడు:

ప్రయోజనంలేక, రాచుకునేట్టుగా సమీపించి)

నేను వచ్చానర్రా: (కొంచెం తటపటాయించి వెళ్లి, మావిగున్న మొదల వేదిక మీద కూర్చుని)

దూర్వా :- అతిథిపూజ–

(శకుంతల, అనసూయ వినరు)

అర్ఘ్యం, పాద్యం–

(వాళ్ళు వెనుకటిలాగానే ఉంటారు: ఆయన ధూకుడుగా వాళ్ల మీదకు వెళ్లి) తెస్తారా లేదా పూజాద్రవ్యాలు? (వాళ్లు చలించరు) శపించనా ఇక తిరుగకుండా! కాచుకోండి (కొంచెం తమాయించి) చిత్ర ప్రతిమలలాగా కదలరేం? మీకు మతిపోయిందా? దివ్యఋషి–దర్శనం అనుగ్రహించాను. పూజించండి–తరించండి! ఇప్పటికీ చెప్తున్నాను. చెడిపోకుండా– (ఊరుకుని నిదానంగా) ఏమిటీ వింత? (దివ్యదృష్టి సారించి) హుం. పడుచుదనం పొగరు! శకుంతలా ఈ ' 'జ్ఞకు ఫలం అనుభవించు. రాజును తలచుకునే కళ్లతో నన్ను చూడలేవేం? అతనిమీఁ కోపం నామీద చలాయిద్దామనుకున్నావేం? చూసుకో–(శాపోదకం, అభిమంత్రితం, విడుస్తూ) నిన్ను దుష్యంతుడు మరచిపోతాడు. (అంగలో దాటిపోతాడు.)

అన :- చండకోపి–శాపం–అమోఘం.

శకు :- కానీ, ఎన్ని కష్టాలు వస్తాయో రానీ. నా విధి వ్రాత! (దుఃఖిస్తుంది.)

అన :- రా. పోయి బ్రతిమాలుకుని ప్రసన్నుని చేసుకుందాం.

(శకుంతలను బలవంతంగా లాక్కుని వెళుతుంది. స్టేజి ఒక నిమిషం ఖాళీ. అంతలో ఇద్దరూ తిరిగి వస్తారు.)

శకు :- మాయమైనాడు.

అన :- (తల ఊగిస్తుంది.)

శకు :- ఏం చేయను? ఎవరిని వేడుకోను? ప్రభూ! నీవు కనికరించనందున కదా ఈ దాసికి ఇన్ని అగచాట్లు! ఏలా బ్రతుకను? ఎందుకు– (కూలబడుతుంది.)

అన :- సఖీ! ధైర్యం తెచ్చుకో. అలా విచారించకూడదమ్మా! అన్నిటికీ గౌరీ మహాదేవి ఉన్నది. ఆమెకు దయరాదా! (కళ్లనీళ్లు పెట్టుకుంటుంది.)

(నారదుడు ప్రవేశం. వెంట గానం)

నార :- లోకైక సుందరాననా–దురా

లోకశ్మశ్రురహితా

నాకనామలోచనా మ

నా కమలాసహితా.

(శకుంతలస్థితి చూస్తాడు: మహతిని తీసి) ఎప్పుడూ ఒకటే మ్రోతా! (క్రిందపె ట్టి) కిక్కురుమనకుండా ఊరుకో, వేళాపాళా లేదూ (బిగ్గరగా) నారాయణ, నారాయణ!

శకు :- (లేచి నిలుచుని) నమస్కారం. దయచేయండి.

నార :- కల్యాణి! భర్తృసహవాససిద్ధిరస్తు!

అన :- నవ్వుతూ అయితే పెద్ద పేచీ వస్తుంది!

నార :- (ఉలికిపడి) ఏం?

అన :- ఇప్పుడే-దూర్వాసమౌని శాపం యిచ్చి వెళ్లారు!

నార :- ఎందుకూ?

అన :- ఎందుకేమిటి-శాపానికి? ఆయనకు అలవాటే కదూ? ఇవాళ మేం కనబడ్డాం!

నార : అయితే మాత్రం?

అన : కాలినిబడ్డ పాము కరవక మానుతుందా? ఊరికేవచ్చి, ఒక్క శాపమైనా ఇయ్యకుండా వెళితే పరువు తక్కువకాదూ? అయినా, తెలియక అడుగుతాను, మీలో మీరు కూడబలుక్కోరా, ఏం కర్మం? ఒకరు శాపం, వారి వెనుక మరొ కరు వరం! పేచీలు ఎందుకు పెట్టుతుంటారు? పోనీ, పెద్దవాడు, ఆయనమాట గౌరవిద్దాం, మీ ఆశీర్వచనం ఉపసంహరించుకోండి.

నార :- ఏమిటి! ఉపసంహరించుకోవడమే!- బ్రహ్మవాక్కు!

అన :- మరి, దూర్వాసమౌనీంద్రునిది?

నార :- ఆ సంగతి తరువాత ఆలోచించుకోవచ్చును. అసలు జరిగిన కథ ఏమిటో.

అన :- ఆఁ. పాడిందే పాట! నేను చెప్పలేను. మీరు యోగదృష్టితో-

నార :- ఉహుఁ. తెలిసింది. మహామంచి పట్టులో చిక్కాడులే: ముసలాడు మరచిపోతా డనుకున్నాడు కదూ. అవును బ్రహ్మచారికేం తెలుసును? కమండలం, జలం ఉన్నాయికదా అని అవక తవకలు చేయడమే! కానీ, తెలిసివస్తుంది. నేనే గెలుస్తాను.

అమ్మాయీ! తిరిగీ ఆశీర్వదిస్తున్నాను. భర్తృసమాగమ......

శకు :- అనసూయా! చూడు, ఆ లేడిపిల్ల తుంటరితనం. తల్లిదగ్గరనుంచి పారిపోతూ న్నది. పట్టుకుంటాను. (తొందరగా వెళుతుంది.)

అన :- అప్పుడే ఎందుకమ్మా అంత సిగ్గు! (నారదునితో) పిచ్చితల్లి! సంబరం దాచేసుకోవాలని వెళ్లిపోయింది. రేజరు వెదుకుతూ ఇక్కడే పడవేసింది- ఈ పొదలో- అరే! ఏమైందీ? కాస్త మీరు కూడా వెదకండి.

నార :- ఏం రేజరు?

అన :- ముందు వెదకండి.

నార :- కాదు చెప్పాలి! ఆఁ...... అక్కర్లేదులే- నా దివ్యదృష్టి ఉన్నదిగా తెలుసుకుని ఓహోఁ ఇంకేం? సాధించాను! శకుంతలను మరచిపోయినా, రేజరు చూడగానే దుష్యంతుడు యిల్లాలిని ఏలుకుంటాడు!- చూడు జాగ్రత్తగా. (ఇద్దరూ వెదుకుతారు).

అన :- పోయింది.

నార :- ఊఁ. ఇంతలో ఏమవుతుంది?- శకుంతల పట్టుకు వెళ్లిందేమో?

అన :- లేదు. మనం చూస్తూనే ఉన్నాం కాదూ? ఇదంతా శాపమే! ఏళ్లా మహాసముద్రంలో-

నార :- ఫరవాలేదు, నేను ఉన్నాను కదూ.

అన :- ఏమై పోయిందంటారు?

నార :- అదే చెప్పడానికి వీలు లేకుండా ఉన్నది: విచారిస్తాను. దివ్యదృష్టి ఒక-

విషయంలో రెండుసార్లకన్న పనిచేయదు. లేకపోతేనా-

అన :- మీరే రక్షించాలి. ఇప్పుడు పెద్ద దిక్కు ఎవరూ లేరు.

నార :- మరేం భయంలేదు. శకుంతలను అత్తవారింటికి పంపించి వేయవచ్చును. తరువాత భారం నాది.

అన :- అలాగే.

నార :- వెళ్లి వస్తాను. (నిష్క్రమిస్తాడు.)

అన :- ఇదిగో- ఏమండోయ్ (పిలుస్తూ వింగ్‌దాకా వెళుతుంది. నారదుడు వస్తాడు.)

నార :- ఇప్పుడు వేళలేదు...... తిరిగి మళ్లా......

అన :- అందుకు కాదు, పిలిచింది! మీ-మహతిని వదిలివేసి వెళుతున్నారేం ఇందండి.

నార :- (అందుకుంటూ, ఆలస్యంచేసి, అవలోకిస్తూ) మహతిని కాదు, మనసే మరచిపోయినాను. ఇంకా కొంచెం దగ్గరకు జరుగుతాడు.)

అన :- కొంటెతనం- (నారదుని చెక్కిలిమీద చేయి అలా అని) శకుంతలను ప్రయాణం చేయాలి. కన్ను ఎగురవేసి నవ్వుతూ పారిపోతుంది.)

(గానం)

మాలతీలలామదామ
భరణా, సురమోహనా
లోకైక సుందరాననా

నార :- ఊరుకో: సంగీతం పాడినట్టుగానే ఉన్నది మన పని! (గానం ఆగిపోతుంది.)

(నడచిపోతాడు)

## మూడో రంగం

(రాచనగరిలో. విహారమందిరం. సన్నజాజుల దండను పదిలముగా పుచ్చుకొని చేటి)

చేటి:- (పరిక్రమించి) ఏరీ, ఇక్కడ ఎవరూ లేరేం? ప్రభువు ఈవైపు వచ్చినారని కంచుకి చెప్పాడే? ముసలితాతకు దృష్టిదోషం రెచ్చిపోతూన్నది. కంటికి కనబడ్డ వారందరూ మహరాజులే.

(ప్రతీహారి ప్రవేశించి, చేటినిచూసి)

ప్రతీ :- మహారాజులే! నీ స్వయంవరానికి నేను చాలనూ!

చేటి :- (తిరిగిచూసి) నీవు ఉన్నావు బాబూ, ఇక్కడ-

ప్రతీ :- నీతోడు నీడను. నిన్ను చూడకుండా నిమిషం ఉండగలనా? సుదినం! పూలమాల కూడా ఉన్నది కదా- అన్నీ కలసివచ్చినాయని స్వయం వరమన్నాను- సై (సమీపించి) ఎంత అందంగా ఉన్నావు?- నిన్ను...... ఇహ......వదలిపెట్టలేను! జాజులు... రేకలు విచ్చినట్టుగా నీ చిన్నారి పెదవులతో- ఏదీ...... చిరునవ్వు

చేటి : (నవ్వుతూ) జాజులందమా-రవల
గాజులందమా-బావా

ప్రతీ :- చందమామ వెలుగు నీడ
సరసమందమా

చేటి :- ఒరుల కందరాని మోవి తేనె
విందులందమా.........

ప్రతీ :- అందాలరాశివి- ఏ అందమైనా సరే! స్వయంవరందాకా అగలేను!- గాంధర్వం- (పట్టుకోబోతాడు)

చేటి:- (చిక్కకుండా తప్పించుకుని) ఉండు, ఎవరన్నా చూస్తారు!- మహరాజు (దూరంగా వెళ్లి నిలుచుంటుంది.)

(దుష్యంతుడు వస్తాడు: కుడిపక్కగా ఉన్న ఆసనంమీద కూర్చుని ఆలోచనతో)

దుష్య :- కుడి, ఎడమ కన్నులు వంతులు వేసుకొని అదురుతూన్నవి. ధర్మనిర్వహణంలో ఏమైనా లోపం చేశానా? మనసు కూడా కలవరపడుతూన్నదే! (ప్రతీహారిని చూసి) పురోహితులు సోమరాతులవారిని పిలుచుకునిరా.

(ప్రతీహారి వంగి, నమస్కరించి వెళుతాడు.)

చేటి :- (ముందుకువచ్చి) దేవా! మారాణి వసుమతిదేవి పంపిన ప్రేమోపహారము.

దుష్య :- (దండను మెడలో వేయించుకుంటూ) దేవితో, కానుకను కనులకు అద్దుకొన్నానని చెప్పు.

చేటి :- (చేతులు జోడించి, వినయంగా) తమ దర్శన భాగ్యాన్ని కలుగచేయమని మనవి చేసి రమ్మన్నది దేవేరి.

దుష్య :- మంచిది, అలాగే.

(చేటి నిష్క్రమిస్తూండగా, సోమరాతుడు ఎదురు అవుతాడు: ఆయనకు నమస్కరించి, వైదొలగిపోతుంది. పురోహితునికి కొంత వెనుక ఒకరిద్దరు మునికుమారులు, శార్‌ఙ్గర వుడు- శకుంతల మేలి ముసుగుతో.)

వీరిని చూసి దుష్యంతుడు లేచి నిలుచుంటాడు. సోమరాతుడు ముందుకు రెండడుగులు వేస్తాడు. మహారాజు నమస్కరిస్తాడు.)

సోమ :- వత్స! ఆయుష్మాన్‌భవ! (వచ్చినవారిని చూపిస్తూ) వీరు కులపతి కణ్వుని దగ్గరనుంచి శుభ సందేశము తీసుకుని వచ్చారు. శ్రౌతవిధిచేత, ఉచిత సత్కారములు చేసి, వెంటబెట్టుకుని వచ్చాను.

దుష్య :- కణ్వ సందేశమా? తపోధనులకు నమస్కారములు. ఇలా దయచేయండి.

(ముని కుమారులు కూర్చుంటారు. శార్‌ఙ్గరవుడు. ఆతని వెనుక శకుంతల నిలుచునే ఉండిపోతారు.)

పూజ్యులైన కణ్వులకు కుశలమా? మీ తపస్సు నిర్విఘ్నంగా సాగుతూన్నదా?

శార్ :- ధర్మ రక్షకులైన మీరు ఉండగా మాకు కొరత ఏమిటి? గురుపాదులు కుశల పూర్వకంగా ఇలా కబురు పంపినారు...

దుష్య :- ధన్యుడను. వారి అజ్ఞ ఏమిటి?

శార :- "నాయనా! గాంధర్వాన నా కూతురిని వరించడం తెలిసికొని సంతోషించాను. నెల మసలిన ఈమెను నీ చెంతనే ఉంచుకోడం మంచిది" అని చెప్పమన్నారు.

దుష్య :- ఇవి ఏం మాటలు?...... (చిరునవ్వుతో) సాత్త్వికమూర్తులు- పరిహాస కుశలులేనని తెలియ చెప్పడమా?

శార్ :- పరిహాసమా?

దుష్య :- కాదా, మరి? అయినా, కానీయండి. మీరు పూజ్యులు! (శకుంతలను చూపించి) ఈ గర్భవతియేనా కణ్వులు నాకు పంపిన భార్య?

శార్ :- ఈమెనే నీవు వరించినది.

దుష్య :- అబద్ధము!

శార్ :- ఆఁ శాపాయుధులమని మరచిపోతూన్నారు.

దుష్య :- లేదు: మహా ప్రసాదము:కాని కడుపుతో ఉన్న పిల్లను భార్యగా వరించవలసినదనే ఆదేశము- శిరసావహించాలా, శాపానికి బడిన?

శార్ :- ఈలా, అమాయకురాలిని వంచనచేయడం కూడా రాజధర్మాలలోదేమో? అరణ్యాలలో ఉండే మాకు ఏం తెలుస్తుందీ? మా పని మేము చేశాం. ఇక నీ యిష్టం. ఏలుకున్నాసరే, లేక-

(శకుంతలతో) ఏమమ్మా! చూశావా, ఈయన వాలకం! పోనీ, చూసి అయినా పోల్చుకుంటాడేమో, ముసుగుతీయి: ఇప్పుడు సిగ్గుపడితే ఏలా? (ముఖం చూపిస్తుంది.)

(మహారాజుతో) చూడండి, ఈమె ఎవరో...

దుష్య :- ఈమె ఎవరు?

శకు :- నాథా!

దుష్య :- నాథా!- ఇంత విపరీతమా? అమ్మాయీ నీవు పసిదానవులాగా ఉన్నావు. అప్పుడే ఇన్ని మాయలు ఏలా నేర్చుకున్నావమ్మా?

శకు :- మాయలా! ఎవరివి?

దుష్య :- తెలియడంలేదూ?

శకు :- మళ్లా అనండి, ఆ మాట.

దుష్య :- అంటాను, నాకేమి భయం?

శకు : అవును: ఇంత దుర్మార్గానికి, మోసానికి ఒడిగట్టిన మీకు (దగ్గరకు వెళ్ళి) కోపమా నామీద? మీరు ఎప్పుడు రమ్మంటారా అని కాచుకుని ఉండి ఉండి, స్వతంత్రించి వచ్చేసినందుకు మన్నించండి.

దుష్య :- నాకేమీ అర్థం కావడంలేదు.

శకు :- అల్లాగా? ఏమి తెలియనివారు నన్ను మాయచేసి, ఏలా వరించి, నమ్మిక లిచ్చి......

దుష్య :- ఊఁ కథ అల్లు-

........................................................................................

........................................................................................

........................................................................................

దాన్నికదా? అప్పుడు మీ నున్నని చెక్కిళ్లు ఎంత ముద్దొచ్చేవి? తోటి చెలికత్తెలు నన్ను చూసి ఎంత అసూయపడేవారు? జ్ఞాపకం లేదూ, మొదటిసారి మీరు రేజరు పట్టుకోవడం చేతగాక, గంట్లు పడితే, నేను మందార రేకులు తీసుకువచ్చి అద్దలేదూ? ఏం, చూడండి, మీరే షేవ్ చేసుకుని అక్కడ పడవేసిపోతే తీసి దాచేసి, అల్లరిచేస్తే 'రేజర్ ఒక యెత్తూ, నేను ఒక ఎత్తూ'

అని మీరు నన్ను ఎంత బ్రతిమాలుకుని, అనితర జన లభ్యమైన ఆ దేవప్రసాదాన్ని నేను నవ్వుతూ యివ్వగా, కళ్ల నద్దుకుని, మీ భాగ్యదేవతనని కౌగలించుకోలేదూ? ముద్దు పెట్టుకుంటామని మీరు ఎంత ఉబలాటపడినా, మూడు రోజులూ గెడ్డము పెరిగి గరుకుగా ఉన్నదని నేను తప్పించుకుంటే, నా మీది మక్కువతో మీరు, సాయంకాలమైనప్పటికీ, ఎవరూ చూడకుండా అప్పుడప్పుడు గెడ్డం చేసుకుని, కలకలలాడుతూ ఉంటే, నిలువలేక నేనే మీ కౌగిలిలో వాలి పోయినాను కదూ? చివరకు, మీరు ఇక్కడకు వచ్చేస్తూ, రేజరు వెంట పట్టుకువెళతానంటే, మీ నున్నని గడ్డం చూసి ఎవరైనా మాయచేసి వలలో వేసుకుంటారని, నేను ఇయ్యకుండా ఉట్టి చేతులతోనే పంపాను కాదూ? చూసుకోండి, ఎంత పెరిగిపోయిందో! అచ్చంగా కిరీటం పెట్టుకుని, వేషం వేసుకున్న ముని కుమారుడులాగా ఉన్నారు. (దుష్యంతుడు ఉలికిపడి గడ్డం తడుము కుంటాడు) ఏం, గడ్డముంటే అయినా నేను జ్ఞాపకం వచ్చానా? (మీద చేయి వేస్తుంది)

దుష్య :- (సంభ్రమంతో) రేజరు! ఏదీ రేజరు?

శకు :- (దీనంగా) లేదు, పోయింది!

దుష్య :- అవును, అలాగే పోతుంది. ఎంత మోసం!

శకు : నమ్మరూ, ఇంకా ఇప్పటికీ నమ్మరూ? – నిజంగానే పోయిందండీ.

దుష్య :- ఇక చాలించు– నీ వేషాలు వచ్చిన త్రోవను నడు.

శకు :- ఎక్కడికి పోను?– మీ భార్యను–

దుష్య :- ఆ మాట అంటే ఊరుకోను. భార్యవా?

శకు :- కానా?

దుష్య :- నీవు ఎవరో నాకు తెలియదు. వెళుతావా, లేదా?

శార్ :- (ముందుకువచ్చి) ఏమిటయ్యా నీ ఆగడం? మీలో మీరు రాజీ పడరా? ప్రణయ కలహమేమోనని ఊరుకున్నాను చూస్తూ. పొగరుబోతుతనం మాని ఏలు కుంటావా సజావుగా, శపించనా? (చేయి జాస్తాడు.)

శకు :- వద్దు, వద్దు నా నాధుని ఏమీ చేయవద్దు. నన్ను జూసి అయినా–

శార్ :- ఉహుఁ. వీల్లేదు. ఎత్తిన చెయ్యి ఊరికే క్రిందకు దించకూడదు. శపించి తీరాలి! ఏం, రాజా?

(నారదుడు, కణ్వుడు ప్రవేశిస్తారు.)

నార :- (శార్ఙ్గరవునితో) ఏం, పిట్ట కొంచెమైనా కూత ఘనంగానే ఉన్నదే? చదువంతా అయిపోయి, శాపప్రయోగాలదాకా వచ్చావూ?

(దుష్యంతునితో) ఏం. రాజా, క్షేమమా?

దుష్య :- (మాటాడకుండా ఉభయులకూ నమస్కరిస్తాడు.)

శకు :- నాన్నగారూ (కణ్వుని కౌగలించుకుంటుంది.)

నార :- (కణ్వునితో) ఏమండీ, ఊరుకుంటారేం? చేసిన ఘనకార్యం బయట పెట్టండి, ముందు మీ అల్లుణ్ణి పలకరించండి.

కణ్వుడు:- (శకుంతలతో) ఊరుకో తల్లీ! నీకేం భయం లేదు. అంతా నా పొరబాటు.

దుష్య :- పెద్దలు- నిలుచునే ఉండటం భావ్యంకాదు. దయచేసి ఇలా-

కణ్వుడు:- నాయనా! పెద్దల అభావ్యపు పనులే ఇంతవరకూ తెచ్చినవి. నా తప్పు ఒప్పుకుని మీరందరూ క్షమిస్తేనే కాని కూర్చోను.

దుష్య :- దైవసములు-మీరు తప్పుచేయడం-

కణ్వుడు :-విధి విధానం బాబూ! ఆకలములతో జీవనం చేస్తూ, అడవిలో పడి ఉండటం మాకు తగిందికాని తగుదుమని నాగరికవేషం వేస్తే ఊరికే పోతుందా?

దుష్య :- మీ మాటలు వింతగా ఉన్నవి.

నార :- వినండీ! ఇంకా ఉన్నవి విశేషాలు.

కణ్వుడు:- మహాపరాధం-

సోమ :- మీరు మాటి మాటికీ అలా నిందించుకోవడం మహారాజుకు చిన్నతనంగా ఉన్నది.

కణ్వుడు:- (శకుంతలతో) అమ్మా, నన్ను మన్నించవూ?

శకు :- (ఆశ్చర్యంతో) అదేమిటండీ?

కణ్వుడు:- కాదుతల్లీ! నీకు యిన్ని కష్టాలు వచ్చింది నా తెలివితక్కువతనం వల్లనే.

నార :- ఉపోద్ఘాతం తెగ పెరిగిపోతూంది. ఇకనైనా ఉపక్రమిస్తారా, లేదా, అసలు విషయం? మళ్లా మనం... (సైగతో ఏదో జ్ఞాపకం చేసి) వెళ్లవద్దూ-

కణ్వుడు:- (నవ్వుతూ) చాల్లేవోయ్- ఇక......

నార :- ఉండండి, (జనాంతికంగా) ముందు చూపించవద్దూ? శాపమైకం పోయి జ్ఞాపకం రానిదే మీ మాటలు ఏలా నమ్ముతాడు?

కణ్వుడు:- అవును. (రేజరుతీసి సభ అందరికీ చూపించి, నిదానంగా మహారాజు సమీపంలో బల్లమీద పెడుతాడు.)

దుష్య : (నిద్ర మేల్కొనినవాడిలాగా సంభ్రమంతో) రేజరు, రేజరు! (కలయజూసి) శకుంతల, నా శకుంతల!

(నారదుడు, కణ్వుడు ఒకరినొకరు చూసి నవ్వుకుంటారు)

శకు :- నాథా! కౌగిలించుకుంటారు ఉభయులూ.)

నార :- (కొంచెంసేపు ఊరుకుండి) ఇక, అందరం కూర్చుందామా?

(మహారాజు కూర్చుంటాడు. ఆయన సరసను శకుంతల- నిల్చుని. మిగిలిన వారందరు ఎదురుగా కూర్చుంటారు. కణ్వుడు-కమండలం, దర్భాసనం శకుంతలకు అందిచ్చి, నిలుచునే)

కణ్వుడు:- రేజరు నేను తీశాను!

శకు :- మీరా?

కణ్వుడు:- అవును!

నార :- ఎందుకో అడగరేం ఎవరూను?

కణ్వుడు:- నేనే చెబుతున్నాను కదూ! బ్రహ్మలోకానికి యజసంభావన తీసుకునేందుకు వెళుతూ మా శకుంతలను చూద్దామని, ఇక ఇక్కడకు వచ్చేస్తున్నది కదా ఆమె, ముని కుమారికలతో కలిసి పూలు కోసుకుంటూన్నదని ఆ వైపు వెళ్లి కనబడకపోతే, ఎటు వెళ్ళిందో అని అటూ, ఇటూ అక్కడే తిరుగుతూండగా,

పచ్చికలో తళతళలాడుతూ ఈ రేజరు కనబడ్డది!

శకు :- నేను విసిరివేశాను, కోపంలో. (దుష్యంతుడు ప్రశ్నిస్తూ చూస్తాడు. ఆమె అతని చెంపలు నిమురుతుంది లాలిస్తూ.)

కణ్వుడు:- చూడగానే మరచిపోయిందేమో తీసుకువెళ్లి యిద్దామని తీశాను. కాని, అంతలో ఒక పిచ్చి అలోచన పోయింది. వెళుతూన్నది బ్రహ్మలోకంలో సభకు. అక్కడకు రంభాది దేవ గాయనులు అభినయ ప్రదర్శనానికి వస్తారు కదా, చక్కగా గెడ్డం తీసేసుకుంటే బాగుంటుందని-

నార :- ఓహోఁ!... మీ రూపం తలచుకుంటే నేటికీ నవ్వు వస్తూన్నది.

కణ్వుడు:- రేజరును తీసుకు వెళ్లిపోయినాను, వెనుకనుంచి ఎవరి చేతనైనా పంపించ వచ్చును కదా అని.

నార :- ఇంకా నయం. నేను కనబడకపోతే అలా చేసేవారనుకుంటూ? కోతిమూక, మీ శిష్యులు మిమ్మల్ని బ్రతుకనిచ్చేవారేనా?
(శార్జ్గరవునితో) నిన్నుకాదు లేవోయ్! నీవు చాలా యోగ్యుడవు, నెమ్మదైన వాడవు! నేను ఎరుగనా ఏమిటి?

కణ్వుడు:- తీరా, అక్కడ ఏవో ఆట పాటలని వాణీధవుడు కదులనిచ్చాడుకాదు. ఏలాగూ అలస్యమైందికదా, శకుంతలను చూసిపోదామని వస్తూండగా నారదుడు- సంగతి అంతా చెప్పేటప్పటికి-

నార :- మా యింటిదగ్గర మిమ్మల్ని చూసేటప్పటికే అర్థమయిందా నాకు: మా అమ్మ అడిగింది కూడాను, మీరు అలా తయారైనారేమని. నేను, తరువాత చెపుతానని తప్పించుకున్నాను.

కణ్వుడు:- నాయనా, నీ ఋణం ఎలా తీర్చుకోగలను?

నార :- తిరిగీ గెడ్డం పెరగనీయండి: తాపసులకు అందులో ఉన్నంత అందం (అందరూ నవ్వుతారు.) పోనీ, భార్య గర్భవతి గనుక, ఈ నవమాసాలూ మీ అల్లుడికి దానితో అవసరం లేదు గనుక, వాడి చూస్తానంటారా? ఉహుఁ, అమ్మో! వద్దులెండి. అది కనబడకపోతే అమ్మాయిని మళ్లా మరచిపోతాడేమో? సరే, సమస్త సమంగళాని భవంతు! నేను వెళ్లి ఈ పట్టున దూర్వాసుడికి చెవులు ఎక్కదీయాలి. ఎవరు గెలిచారో!

దుష్య :- మా పూజలు అందుకుని-

నార :- ఇప్పుడు వీల్లేదు. భారసాలకు ఎలాగూ వస్తాను కాదూ? ఊర్వశి నాట్యం చూడటానికి వెళ్లాలి. మీ మామగారు ఉంటారుగా, నా వంతుగూడా ఆయనకే. మంచిది, వెళ్లి వస్తాను.
(అందరూ లేచి నిలుచుంటారు. నారదుడు వెళిపోతూండగా-జవనిక).